# యుగధర్మం

## ప్రజాస్వామ్యం

ధర్మో రక్షతి రక్షితః



ఈశ్వరప్రగడ హరిబాబు
LL.B., F.C.A
CHARTERED ACCOUNTANT



ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక ప్రచురణ

# యుగధర్మం

## ప్రజాస్వామ్యం


రచన

**ఈశ్వరప్రగడ హరిబాబు** LL.B., F.C.A.

Chartered Accountant



ప్రచురణ



**'దర్శనమ్'**

**ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక**



# యుగధర్మం
## ప్రజాస్వామ్యం...

**ఈశ్వరప్రగడ హరిబాబు**


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | : | 2 జూన్, 2018 |
| వెల | : | 150/- (నూటా యాభై రూపాయలు) |
| ప్రతులు | : | వేయి |
| అక్షరాలకూర్పు | : | **కొమరబత్తిన నాగరాజు** |
| బుక్ సెట్టింగ్ | : | **ఆరవేటి వెంకటసుబ్బయ్య**<br>98492 42028 |
| టైటిల్ కవర్ డిజైన్ | : | **శ్రీరామోజు గణేశ్** |
| ముద్రణ | : | **సాయితిరుమల ప్రింటింగ్ ప్రెస్**<br>చిక్కడపల్లి, హైదరాబాద్ |


**ప్రాప్తిస్థానములు**


**మరుమాముల వెంకటరమణశర్మ**
సంపాదకులు
**'దర్శనమ్'** ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక
29-105/1/1, న్యూ విద్యానగర్,
నేరేడ్‌మెట్, సికిందరాబాద్ - 56.
మొబైల్ : 94410 15469
7013093123

**ఈశ్వరప్రగడ హరిబాబు**
10-5-64/1,
మామిళ్ళగూడెం,
ఖమ్మం పట్టణం - 507 001.

# నివేదన

శ్రీ ఈశ్వరప్రగడ హరిబాబు నాకు చిరపరిచితులు. వారు ఆడిటర్‌గా, వ్యాపారవేత్తగా మాత్రమే పరిచయం. ఒక రచయితగా నేనూహించలేదు. ఈ పుస్తకం **'యుగధర్మం – ప్రజాస్వామ్యం'** తెచ్చి నాకిచ్చినపుడు చదివి ఆశ్చర్యపోయాను.

ఈ పుస్తకంలో నేడు సమాజం ఎదుర్కొంటున్న సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయాలనన్నింటినీ ప్రస్తావించి, వాటికి పరిష్కారం కూడా చూపించారు. కులమతాలు తెచ్చిపెట్టుకున్నవేనని చెప్పడంద్వారా చక్కటి సందేశమిచ్చారు. అలాగే ఎస్సీ, ఎస్టీ, బిసి కులాలన్నీ ఒకనాటి పాలకులేననీ, అందువల్ల ఒక కులం ఎక్కువ, ఒక కులం తక్కువ అన్న భావన తప్పు అని స్పష్టం చేశారు. భారతీయుల జీవనవిధానం, దైవీభావన, సౌందర్యమయం అని వివరించారు. బ్రాహ్మణులు కులం కాదనీ, జీవనవిధానమనీ గత 5500 సంవత్సరాలుగా బ్రాహ్మణకులం కొనసాగుతున్నదనీ, వారు మిగిలిన అన్ని కులాలతో కలిసి సామాజిక అంగీకృతిని సాధించాలని ప్రభుత్వం అనుమతించిన అన్ని ఉద్యోగ, వ్యాపారాలలోనికి ప్రవేశించి, ఆర్థికంగా బలోపేతం కావాలని సూచించారు. మత విశ్వాసాలు రాజ్యాంగ హక్కులనీ, వాటిపై అవహేళనగా మాట్లాడటం చట్టపరంగా నేరమనీ స్పష్టం చేశారు. కోమట్లు పిరికివాళ్ళు, సామాజిక స్మగ్లర్లు కాదనీ, ఆ కులంలో మహాత్మాగాంధీ, పొట్టిశ్రీరాములు వంటి మహానుభావులు జన్మించారనీ చెప్పడం ద్వారా అన్ని కులాలు ఒకనాటి పాలకులేననీ, రాజ్యాలు కోల్పోవడం ద్వారా అధికారం కోల్పోయి, ఆస్తులు కోల్పోయి, అవమానాలు పడి వెనుక పడవేయబడ్డవారేననీ, సామాజిక సత్యం తెలియజేశారు.

భారతదేశంపై జైన, బౌద్ధ, ఇస్లాం, క్రిస్టియన్ వంటి మతాల ఆవిర్భావం, వాటి ప్రభావం విశ్లేషించారు. మనువాదం, గోవధ వంటి సున్నితమైన విషయాలను సున్నితంగా చర్చించారు. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సంప్రదాయాల మౌలిక భావన ఒకటేననీ, పూజ, విధివిధానాలలో మాత్రమే వ్యత్యాసముందని వివరించారు.

అలాగే అన్ని రంగాలలోనూ మార్పు సహజమనీ, అనివార్యమనీ వివరించారు. ఇందులో భాగంగా వివాహ బాంధవ్యాలు, స్త్రీల రక్షణ చట్టాలు, రాజకీయాలలో

వచ్చే మార్పులు, సంస్కృతీ, సంప్రదాయాలలో వచ్చే మార్పులు, చివరగా ప్రతి వ్యక్తి జీవితంలోనూ జరిగే మార్పులనన్నింటినీ చర్చించడం జరిగింది. మార్పులను సమదృష్టితో స్వీకరించాలనీ, సమాజంలోని లోటుపాట్లకు ప్రభుత్వాలనే బాధ్యులను చేయాలి తప్ప ప్రజలు పరస్పరం కలహించుకోవడం తగదని హితవు పలికారు.

సంస్కృతి విషయంలో సనాతనధర్మం విలువైనదనీ, దానిని వదలుకోవడం విజ్ఞత కాదని సూచిస్తూ, విగ్రహారాధనను, వాస్తు, జ్యోతిషాలను, ప్రకృతిలో జరిగే అద్భుతాలను, జన్మ, పునర్జన్మలను సమర్థిస్తూ తమదైన వాదన వినిపించారు.

ప్రస్తుత సమాజాన్ని పట్టి పీడిస్తున్న రైతుల ఆత్మహత్యలపై, లైంగిక నేరాలపైన, సమాజంలో నెలకొన్న అవినీతిపైన, రాజకీయ పార్టీల ధోరణిపైన నిష్కర్షగా విశ్లేషణ చేశారు. యుగధర్మం ప్రజాస్వామ్యమనీ, దానిని మనం రక్షిస్తేనే అది మనలను రక్షిస్తుందనీ, కానీ ప్రస్తుతం భారతదేశంలో ప్రజాస్వామ్య రక్షణ జరగట్లేదనీ, అందువల్ల ప్రజాస్వామ్య ధర్మం ఈ దేశాన్ని రక్షించదని ఘంటాపథంగా చెప్పారు. దేశంలో వున్న రాజకీయ గందరగోళానికి ప్రాంతీయ పార్టీల పుట్టుక, పెరుగుదలే కారణమని అభిప్రాయపడ్డారు. రాజకీయ పార్టీలను ప్రాంతీయ, జాతీయ పార్టీలుగా విభజించే అధికారం ఎన్నికల కమిషన్‌కు లేదని, అందువల్ల రాజకీయ పార్టీల గుర్తుల కేటాయింపు ఆర్డర్-1968 చెల్లనేరదని చెప్పడం నిజంగా సాహసోపేతమైన పని.

సమాజ నిర్మాణంలో మేధావుల పాత్ర ముఖ్యమైనదనీ, వారు బాధ్యతతో వ్యవహరించాలని అభిప్రాయపడ్డారు. సమాజ సంస్కరణ బాధ్యత ప్రజలదేననీ, ఆ పనిని రాజకీయ నాయకులు చేయరనీ వివరించడం ఆలోచింపచేసింది. భారతీయత, వైదికత ఈ రెంటినీ మతంతో ముడిపెట్టి విస్మరించరాదని, ఆ రెండూ భారతీయులు గర్వించదగ్గ వారసత్వ సంపదలని చెప్పడం వారికి భారతీయతపై ఉన్న అభిమానాన్ని సూచిస్తుంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర పోరాటం గొప్పతనాన్ని, అందులో కేసీఆర్ మహోన్నత పాత్రను వివరించడం ద్వారా వారి తెలంగాణ అభిమానం సూచితమౌతున్నది.

చివరగా పాలకుల్లారా! తస్మాత్ జాగ్రత్త!! పాలకుల అనైక్యత, అవినీతి, అసమర్థత, అహంకారమే గతంలో భారతదేశం స్వాతంత్ర్యం కోల్పోవడానికి కారణమయ్యాయి. ఇప్పుడూ అవే లక్షణాలు, అంతకుమించిన మోతాదులో కనిపిస్తున్నాయి. కనుక స్వాతంత్ర్యం కోల్పోవడానికి ప్రమాదఘంటికని చెప్పడం ద్వారా ముందస్తు హెచ్చరిక చేసినట్లుగా ఉంది.

ఏది ఏమైనా ఈ పుస్తకంలో భూగోళము, ఖగోళము, విశ్వాసము, కుల, మత, రాజకీయ, ఆర్థిక, సామాజికమైన అన్ని విశ్లేషణలూ వుండడంవల్ల ఈ పుస్తకంలో లేనిది ఇంకేమీ లేదని నా అభిప్రాయం. ఈ పుస్తకం పఠించిన పాఠకులు గతం కంటే మంచి పౌరులు అవుతారన్న రచయిత అభిప్రాయం అభినందనీయం. సమకాలీన సమాజానికి ఈ పుస్తకం భిన్నపార్శ్వాల్లో ఆలోచింపచేయడానికి కొత్తమార్గాలను అన్వేషింప చేయడానికి ఉపయుక్తంగా ఉండగలదని భావిస్తున్నాను.

ఈ పుస్తక రచన ఆరంభించిన మొదట్లో హరిబాబుగారు ఆత్మీయంగా నా అభిప్రాయం కోరినప్పుడు వారు స్పృశించిన అనేక విషయాలపై నాకు అత్యంత ఆసక్తి కలిగి ఈ పుస్తక ప్రచురణకు నాకు అవకాశం కల్పించమని అడగ్గా, వారు వెంటనే సమ్మతించారు. అందుకు **శ్రీ ఈశ్వరబాబు** గారికి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు. అలాగే ఈ పుస్తక ప్రచురణకు సహకరించి, భావాలకు అక్షరరూపమిచ్చిన వారి సహాయకులు **కొమరబత్తిన నాగరాజు** గారికి, పుస్తకానికి చక్కని రూపాన్నిచ్చిన నా ఆత్మీయులు **ఆరవేటి వెంకటసుబ్బయ్య** గారికి, పుస్తక వస్తువుకు తగినవిధంగా అందమైన ముఖచిత్రాన్ని అందించిన **శ్రీ రామోజు గణేశ్** గారికి, సకాలంలో పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీ సాయితిరుమల ప్రింటింగ్ ప్రెస్ యజమాని **లక్ష్మీనర్సు** గారలకు కృతజ్ఞతలు.....

నేను, శ్రీహరిబాబుగారు అభ్యర్థించిన వెంటనే తమ అభిప్రాయాలను అందించిన సహృదయ సాహితీ దిగ్గజం **ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి** గురువుగారికి, పెద్దలు, లలిత కవి **హరి వేంకట లక్ష్మీప్రసాదు** గారికి కృతజ్ఞతలు....

ఇట్లు

ప్రచురణకర్త

**మరుమాముల వెంకటరమణశర్మ**

సంపాదకులు

**'దర్శనమ్'** ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక



# ముందుమాట

శ్రీ ఈశ్వరప్రగడ హరిబాబు, ఈ పేరు చాలా మందికి తెలిసినది. ఛార్టర్డ్ అకౌంటెంట్‌గా, ప్రఖ్యాత వాణిజ్య వ్యాపారవేత్తగా న్యాయ, ఆర్థిక శాస్త్ర కోవిదునిగా వీరిని ఎరుగని వాళ్ళు బహుశః ఖమ్మం, ఖమ్మం పరిసర జిల్లాలలో లేరనటం అతిశయోక్తికాదు. వారిలో ఉన్న మరో రెండు కోణాలు రాజకీయ అనుభవం, సామాజిక సేవాభిలాష. వెరసి నా దృష్టిలో హరిబాబు గారు షడాననుడు.

నేడు అగ్రవర్ణము అన్న పేరుతో అపహాస్యానికి గురౌతున్న బ్రాహ్మణ సమాజానికి పెద్ద దిక్కుగా నిలువబడి, మాటలు చెప్పడం ద్వారా కాక చేతల ద్వారా (క్రియా రూపంగా) తన శక్తికి తగినట్లు, కొన్ని సందర్భాలలో శక్తికి మించి తోడ్పాటునందించే విషయంలో శ్రీ హరిబాబు గారు వెనుకంజ వేసినట్లు ఏనాడూ నేను వినలేదు.

'భారతీయులు' అనే పదాన్ని చక్కగా నిర్వచించడంతో పాటు, ఈనాడు వివిధ ముస్లిం దేశాలలో 'భారతీయ ముస్లింలు', క్రైస్తవ దేశాలలో 'భారతీయ క్రైస్తవులు' ఆయా దేశాలు అవలంభించే మతానికి చెందిన వారే అయినా ఏ విధంగా చిన్న చూపు చూడబడుతున్నారో చెప్పే సందర్భంలో హరిబాబు గారు భారతీయతా పరిరక్షణ గురించి ఎంత ఆవేదన చెందుతున్నారో పాఠకునికి అవగాహనమవుతుంది.

నియమబద్ధమైన జీవన విధానాన్ని నిర్దేశించిన వేద, ఇతిహాస, పురాణములను గురించి అవగాహన ఉన్న శ్రీ హరిబాబు గారు ఆవేదనతో "అయ్యా! భారతీయ విజ్ఞాన సంపదను విమర్శించే ముందు, వాటిని సంపూర్ణంగా అర్థం చేసుకోండి. అవి చెప్పే విషయాన్ని ఆనాటి కాల మాన పరిస్థితులతో మాత్రమే పోల్చిచూడండి. నేటితో పోల్చకండి. నాడు వేరు – నేడు వేరు. పాతను గౌరవించండి, క్రొత్తను స్వాగతించండి" అని చెప్పడానికి ఈ పుస్తకంలో చేసిన ప్రయత్నం బహుదా ప్రశంసనీయం.

గీతాచార్యుడు చెప్పిన చాతుర్వర్ణ వ్యవస్థ, నేడు పాటించబడుతున్న వర్ణ వ్యవస్థ ఒకటి కాదని సోదాహరణంగా చెప్పే సందర్భంలో రచయిత ఒక ప్రశ్న స్పష్టంగా వేశారు. "ఇప్పుడున్న వ్యవస్థను నిర్మించిన వాడు శ్రీ కృష్ణుడే అయితే.... ఆయన చాతుర్వర్ణం మయా సృష్టం.... అని మాత్రమే కదా అన్నది.... అది కూడా గుణకర్మ విభాజశః.... మిగిలిన కులాలన్ని ఎలా పుట్టాయి?" సమాధానం కూడా తానే చెప్పారు "ఇందురు కారణం పాలకులు".

ఒక విచిత్రం ఏమిటంటే ఈ పుస్తకంలో ప్రస్తావించబడిన ప్రతి అంశము శ్రీ హరిబాబు గారి ఆలోచనలకు గోచరించినదే.... కనుక తన ఆలోచనాశక్తితో ప్రతి సమస్యకు పరిష్కారం కూడా వారే చెప్పారు. ఈ గ్రంథం చదివిన పాఠకులకు ముందుగా ప్రశ్నలు కనిపిస్తాయి, కాస్త ఆలోచించండి... ముందుకు సాగండి... సూచించిన సమాధానం నచ్చితే స్వీకరించండి... లేదంటే వివాదమే లేదు.

ఎన్నో విషయాలను సోదాహరణంగా చర్చించి, ఆయా అంశాలలో ఉన్న లోపాలను ఎత్తి చూపుతూ అందుకు కారణాలను విశ్లేషిస్తూ, పాఠకులను ఆలోచించమని కోరుతూ వాంఛనీయమైన – ఔపయోగికమైన మార్పును కాంక్షిస్తూ హరిబాబు గారు పడుతున్న తపనను అందరు అభినందిస్తారని ఆశిస్తున్నాను.

క్రీ॥పూ॥. 7వ శతాబ్దం నుండి నేటి వరకు సామాజిక గమనాన్ని ఈ చిన్న పుస్తకంలో కొద్దిమాటలతో విశ్లేషించిన తీరు పాఠకులను ఆలోచింపజేయడమే గాక ప్రతీ రాజకీయ పార్టీ వారు కూడా కాదనలేని విధంగా ఉంది.

గత ఇరవై సంవత్సరాల నుండి శ్రీ హరిబాబు గురించి తెలుసు కాని పెద్దగా సాన్నిహిత్యం లేదు. ఈ పుస్తకంలో ఆయన అత్యంత పారదర్శకంగా తను కష్టించి నేర్చిన విద్య గురించి చెప్పిన తీరు గాని, అంచెలంచెలుగా ఎదిగి తాను నేడు ఈ స్థాయికి ఎదిగిన విధానం చెప్పడంలో గాని, కుటుంబ విషయాలు వివరించడంలో గాని, రాజకీయ ప్రవేశం గురించి (అందులో చేతులు కాల్చుకోవడం) చెప్పడంలో గాని, వారు తన జీవితం తెరిచిన పుస్తకం అని ప్రకటిస్తూ, అత్యంత క్లిష్ట దశ నుండి ఉన్నతోన్నత దశకు ఒక వ్యక్తి ఏ విధంగా చేరుకోవచ్చునో దిశానిర్దేశం చేసిన తీరు చూసిన తర్వాత ఇంతటి ఔన్నత్యం గల వారి స్నేహం ఇన్నాళ్ళుగా కోల్పోయానే అనే బాధ కలిగింది నాకు.

జన్మతః ఎవ్వరూ బ్రాహ్మణులు కారు, ద్విజత్వం ఒక్కరి సొత్తు కాదు అని వక్కాణిస్తూ, ఎవ్వరైనా బ్రాహ్మణత్వాన్ని పొందగలరన్న రచయిత అభిప్రాయాలను నిజం చేసే ప్రయత్నం పాఠకులు చేస్తే, నేడు సమాజంలోని కుల వ్యవస్థ, పాలకుల పాపచింతనా ఫలితమని నమ్మి అసమానతలు తొలగించే దిశగా సమాజం ప్రయత్నిస్తే ఈ గ్రంథం రచయిత ఆశించిన ఫలితాన్ని పొందగలుగుతుంది.

ఈనాటి బ్రాహ్మణులు కూడా సమాజ హితకాంక్షతో ప్రవర్తించాలనే సందేశం కూడా ఈ పుస్తకం ద్వారా రచయిత చెప్పకనే చెప్పారనే విషయం మనం గమనించాలి. బ్రాహ్మణుడు తాను ఎదుగుతూ తన ఇరుగుపొరుగు వారి ఎదుగుదలకు తనవంతు సహకారాన్ని అందిస్తూ "సర్వేజనా సుఖినోభవంతు" "లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" అనే ఆకాంక్షతో జీవించాలనే సందేశాన్ని ఆచరించి చూపే హరిబాబు గారికి అభినందనలు. భవిష్యత్తులో వారి కలం నుండి సామాజికోపయుక్త గ్రంథాలు పెక్కు వెలువడాలని ఆకాంక్షిస్తూ.....

లలిత కవి

**హరివేంకట లక్ష్మీ ప్రసాదు బాబు**

M.A., M.Phil., M.Ed.

ఖమ్మం.



# భారతాభ్యుదయానికి ఓ మంచి గ్రంథం

శ్రీ ఈశ్వరప్రగడ హరిబాబుగారి **"యుగధర్మం – ప్రజాస్వామ్యం"** అనే ఈ గ్రంథంలో 18 అంశాలున్నాయి. అన్ని శీర్షికలన్నమాట.

సామాజిక – ఆర్థిక – రాజకీయ జీవితాలలో కులప్రస్తావన మొదటిది; పాలకుల్లారా! తస్మాత్ జాగ్రత్త.... అనేది చివరిది. ఈ మధ్యలో మనమూ, మన దేశం, మన ప్రభుత్వాలు, మన సాహిత్యం, మన సంస్కృతి, మన ధర్మం, మన ఆచార సంప్రదాయాలు, మన మతం, మన పాలకులు, మన రాజకీయాలు.... ఇలా ఎన్నో విషయాలున్నాయి. ఇలా ఉన్న ఇవన్నీ ఓ వ్యాసాలుగా సాగవు. ఇందులో రచయిత శ్రీ హరిబాబుగారు మధ్య మధ్య కనిపిస్తారు. తమ అనుభవంతో దీనినీవిధంగా వ్యాఖ్యానం చేస్తున్నామంటారు.

ఓ ఐదు అంశాలు చెప్పింతర్వాత 6వ శీర్షిక **"ఈ పుస్తకం ఎందుకు వ్రాస్తున్నాను? అందుకు నాకున్న అర్హతేంటి?"** అని ఆత్మనివేదన వ్రాశారు. అందులోని మొదటి పేరా వాక్యాలివి.

**"ఏది ఏమైనా విభిన్న వ్యక్తులు, విభిన్న కారణాలతో ఇతర కులాలను తీవ్రపదజాలంతో విమర్శలు జరపడం చూసి మనస్తాపం చెంది, ఈ సమస్యకు సామరస్య పరిష్కారం కోసం, సమాజంలో ప్రాకిపోతున్న దుష్ప్రచారాలకు అడ్డుకట్ట వేయాలనే ఉద్దేశంతో నా అనుభవాలు – ఆలోచనలు సవినయంగా సమాజ దేవాలయానికి ఉడుతాభక్తిగా, వారధికొక రేణువుగా సమర్పించు కొంటున్నాను. సామరస్య హృదయంతో పఠించండి. ఆలోచించండి, తప్పులుంటే మన్నించండి, అవకాశం చేసుకొని సామరస్యంగా స్పందించండి! పాఠకులెవరైన నా అభిప్రాయాలతో విభేదిస్తే, నా భావనలు నాకు తప్పనిపిస్తే తప్పనిసరిగా సరిదిద్దుకుంటాను. ప్రపంచమే పాఠశాల, అనుభవాలే గురువులని నేను నమ్ముతాను. నా అరువది సంవత్సరాల జీవితానుభవంతో సమాజానికి**

**ఏదైనా మేలు చేయాలనే ఉద్దేశంతోనే ఈ పుస్తకం వ్రాయటం జరుగుతున్నది. ఈ పుస్తకం వ్రాయడానికి నాకున్న అర్హతేమిటనుకుంటారేమో, నా గురించి కూడా కొంత విన్నవించుకుంటాను".**

సామాజిక – ఆర్థిక – రాజకీయ జీవితాలలో కులప్రస్తావన, ఈనాటి ఎస్సీ, ఎస్టీ, బీసీ కులాలు, కోయవారు, అంబేద్కర్, రిజర్వేషన్లు, వైశ్యులు, బ్రాహ్మణులు, కులమతాలపై విశ్వాసాలు, హిందుత్వ నాస్తిక సెక్యులరిజాలు, కోమటోళ్ళు స్మగ్లర్లా! తిట్లపురాణం వ్రాయటం భావప్రకటన స్వేచ్ఛా? కులము– జాతి, వృత్తులను బట్టి అన్ని కులాలు ఏర్పడ్డాయన్న ప్రచారం పచ్చి అబద్ధం.... లాంటి వ్యాసాలు వ్రాసిన తర్వాత రచయిత శ్రీ ఈశ్వరప్రగడ హరిబాబుగారు పైవిధంగా మొదలుపెట్టి, ఆత్మనివేదన వంటి తమ అనుభవాలను వివరించారు. ఈ గ్రంథరచనకు తమకు పూర్తి అర్హతలున్నాయన్నది స్పష్టంగా చెప్పారు.

ఈ దేశంలో 8500 కులాలున్నాయని, ప్రతి కులం ఏదో ఒకనాడు ఈ దేశంలో పాలనాబాధ్యతలు చేపట్టినదే అని నిరూపించారు.

అంబేద్కర్ మార్గం అనుసరణీయమన్నారు. కాని చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకోవడం తగదన్నారు. పాలకులు ఓట్ల నిమిత్తం కులాలకు తాయిలాలు (సంక్షేమ పథకాలు) పంచి పోషిస్తుంటే ఇక ఏకాత్మభావన సాధించేదెలా అని ప్రశ్నించారు.

కోమట్ల విషయంలో అవాకులు, చెవాకులు వ్రాసిన ఒక రచయిత తిట్లపురాణాన్ని సాధికారికంగా బదాబదలు చేశారు. కులము – జాతి రెండూ వేర్వేరని నిరూపించారు. వృత్తులను బట్టి అన్ని కులాలు ఏర్పడ్డాయన్న ప్రచారం పచ్చి అబద్ధమన్నారు. **జన్మాని జాయతే శూద్రః** అన్నది సత్యమని, గుణశీలాలతో ప్రతి వ్యక్తి వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణులుగా ఎదుగవచ్చునన్నదే దార్శనికుల ఆలోచన అనీ, ద్విజ శబ్దానికున్న అర్థం కూడా అదే అని ప్రస్తావించారు. 'చాతుర్వర్ణం మయాసృష్టం' అన్న గీతాచార్యుల వాక్యాన్ని విశ్లేషించి సత్యమేదో విచారించారు. బ్రాహ్మణులు – ఆచారాలు – వృత్తి ధర్మాలు – భారతీయత ఆది విషయాలలో అనేకుల అవాకులు, చెవాకులు, వక్రభాష్యాలు సోపపత్తికంగా విశ్లేషించారు.

వేదాలు హిందువులకే కాదు, అన్ని మతాలకు మూలాధారాలన్నారు. మనువాదం పేరిట కువ్యాఖ్యానాలు చేసేవారి అంతరంగాల్ని ఎండగట్టారు. హిందుత్వం నుండి ఇతర మతాలలోకి ఎవరు, ఎప్పుడు, ఎందుకు వలసపోయారు – పోతున్నారు – ఇంకా పోతారు – వాళ్ళు అలా పోరాదంటే యేం చేయాలి అంటూ ద్వైత – అద్వైత – విశిష్టాద్వైతాల ఆవిర్భావ వికాసాలను వివరిస్తూ, ఆ ఆచార్యుల నుండి ఇప్పుడు మనం గ్రహించాల్సింది ఇదంటూ ఇలా వివరించారు.

**“.... ఈనాటికీ అనునిత్యం వేలమంది అన్యధర్మాలలోకి వెళుతున్నారు. అటునుంచి ఇటు వచ్చేవారెవరూ లేరు. ఇప్పటికైనా పద్ధతులు మార్చుకోకపోతే కష్టమే. ఇప్పటికీ మతాచార్యులు మానవులలో ఒకరుగా కాక అతి మానవ వ్యక్తులుగానే మిగిలిపోతున్నారు. ఎస్సీ, ఎస్టీ, బీసీలతో, మైనారిటీలతో మమేకం కాలేకపోతున్నారు. వారి కాలనీలకు వెళ్లాలి. వారి గృహాలు సందర్శించాలి. వారితో కలసి భోజనం చేయాలి. వారి చేతి భోజనం చేయాలి. వారి భాషలో మాట్లాడాలి. ఎందుకంటే వారే దేవుళ్లు, ప్రజలకు మించి దేవుడెక్కడుంటాడు...”**

శ్రీ ఈశ్వరప్రగడవారి అంతరంగమిది. అంతేగాక ఈ దేశంలో మరొక కొత్తమతం ఆవిర్భవించనుందా అని విశ్లేషిస్తూ, ఏదో ఒక మానవరూపాన్ని గాక సర్వమానవ సమాజసేవే భగవత్సేవ అని తెలియజెప్పే మతం... రావాలని ఆకాంక్షించారు.

గోవును గురించి చెబుతూ ‘ఆవుకు తల్లి స్థానం కల్పించటం భారతీయ సంస్కారానికి ప్రతీక’ అన్నారు. అనేక కారణాలు చెబుతూ ఆవును రక్షించుకోవడం మనను మనం రక్షించుకోవడమే అన్నారు.

సర్వాంగసుందరమైన హైందవ జీవనాన్ని ఓ వ్యాసంలో వర్ణించారు. సమాజంలో ఒకప్పుడు బ్రాహ్మణాధిపత్యం, ఇప్పుడు ఎస్సీ, ఎస్టీల ఆధికత్యత కనిపించడం ఆయా కాలాల నాటి పాలకుల వల్లనే జరిగిందని ఒక సత్యాన్ని విశ్లేషించారు. రాజ్యామోదం లేనిదే ఏదీ జరగదని గుర్తించాలన్నారు. ప్రతీ రంగంలోనూ మార్పు సహజం కాబట్టి ఆహ్వానించాల్సిందే అన్నారు. స్వీయ సంస్కృతీ సంప్రదాయాలను కాపాడుకోవటం ప్రతి ఒక్కరి బాధ్యత అన్నారు.

ఈవిధంగా ప్రతి వ్యాసం ఉదహరించుకునేంత ప్రామాణికంగా శ్రీహరిబాబు గారు ఈ గ్రంథాన్ని వినిర్మించారు. ఈ **"యుగధర్మం - ప్రజాస్వామ్యం"** అంటూ ప్రజాస్వామ్యబద్ధంగా ప్రవర్తించండి. తెరిచిన మనసుతోనే విషయాల నధ్యయనం చేయండి. సంకుచిత స్వభావాలు వీడి భారతీయతకు - జాతీయతకు పట్టం కట్టండి అంటూ చివరలో అందరికీ మార్గదర్శనం చేశారు. దేశహిత చింతనంతో రచింపబడ్డ ఈ గ్రంథాన్ని మాలిన్యం లేని మనసుతో చదువుదాం! భారతాభ్యుదయంలో భాగస్వాములమవుదాం!

భాగ్యనగర్

తేది: 27.05.2018

**ఆచార్య కసిరెడ్డి**

అఖిలభారతీయ సాహిత్య పరిషత్

జాతీయ అధ్యక్షులు



# నా మాట

ఈ పుస్తకానికి ముందు మాట వ్రాయడానికి ఎవరూ అంగీకరించరేమోనని సందేహించాను. ముందుమాట వ్రాయమని భాషా పండితులనడుగుదామా అంటే నాకు బిడియం. ఎన్ని తప్పులు పడతారో ఏమో అని. ఎందుకంటే నేను భాషా పండితుడను కాను. విద్యా పరంగా చూస్తే వాణిజ్యం, లెక్కలు, ఆడిటింగ్, చట్టాలు, అర్థశాస్త్రము వంటి విభాగాలుండే సి.ఏ., యల్.యల్.బి. చదువుకున్న వాడిని. భక్త, కవి, పండితులను అడుగుదామా అంటే ఈ గ్రంథంలోని కొన్ని అంశాలు భగవద్భావనను, భగవంతుని అవతార సిద్ధాంతాన్ని ప్రశ్నించినట్లు భావిస్తారేమో! ఆధునిక భావజాలం కలిగిన వారిని కలుద్దామా అంటే ఈ పుస్తకంలో విగ్రహారాధనను, జ్యోతిష్యాన్ని, వేదాలను సాంప్రదాయాలను సమర్థించడాన్ని తప్పు పడతారేమో. రాజాశ్రయాలు పొందిన మేధావుల నడుగుదామా అంటే వారికి ఆశ్రయం కల్పించగలిగిన ప్రభువుల గురించి నిష్కర్షగా వ్రాసిన విషయాలు వారికంగీకారం కాకపోవచ్చు. బంధువులను ఆత్మీయులనడుగుదామంటే వారసలు ఈ పుస్తక ప్రచురణకే అంగీకరించరేమో నన్న భయం కూడా ఉంది. ఎందుకంటే, నీకెందుకు ఈ వివాదాస్పద విషయాలపై వ్యాసాలు వ్రాయడం. ప్రపంచం ఎటు పోవాలో అటే పోతుంది. నీ కెందుకు? అనే అవకాశమూ ఉంది. అదీ నిజమే కానీ మనసాగదు గదా! ఏ చెట్టుకు ఏ పువ్వు, ఏ ఫలం ఎప్పుడు కలగాలో అప్పుడు కలగక మానదు గదా! అందుకే ఈ భావోద్భవం ఈ కాలానికి జరిగిందనుకుంటా. ఈ ఫలం కొందరికి మధుర ఖాద్యం కావచ్చు. కొందరికి మింగుడు పడని చేదు గుళిక కావచ్చు లేదా గొంతులో పడ్డ పచ్చి వెలక్కాయ కావచ్చు. ఏది ఏమైనా ఇది నిజం. ఇదే నిజం. పచ్చి నిజం.

సందేహిస్తూనే అడిగినప్పటికి వెంటనే అంగీకరించి ముందుమాట నందించిన వదాన్యులు **శ్రీ హరివెంకట లక్ష్మీ ప్రసాద్‌బాబు** గారికి కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని చూచి తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చమని పెద్దలు **ఆచార్య కసిరెడ్డి** గారిని కోరగానే వారు 'భారతాభ్యుదయానికి ఓ మంచి గ్రంథం' అనే శీర్షికన తమ అమూల్యమైన సందేశాన్నిచ్చారు. వారికి కృతజ్ఞతలు.

వచ్చిన ఆలోచనలన్నీ చెబుతుంటే మా స్టెనోగ్రాఫర్ కొమరబత్తిన నాగరాజు తెలుగులో టైపు చేశాడు. దానినే యధాతథంగా మీ ముందుంచాను. భక్తి గ్రంధాలను, ఫిక్షన్ వ్రాతలను, చారిత్రక గ్రంధాలను అంతగా విమర్శించడానికి ఏమీ ఉండదు. అందులోని వర్ణనలను, భావాలను, భాషా విన్యాసాలను, రచయిత యొక్క గొప్పతనాన్ని పొగడటమే ఉంటుంది. మార్పు సహజం. మార్పే సహజం, శాశ్వతం, నిరంతరం. ఇదం శరీరం పరిణామ పేశలం అన్నారు. శరీరమంటే మానవ శరీరం మాత్రమే కాదు. ఈ విశ్వమంతా విరాట్పురుషుని శరీరమే. అందువల్ల ఈ విశ్వమంతా పరిణామ గతమే. ఈ విశ్వంలోను, మానవ సమాజంలోను జరుగుతున్న, జరగబోతున్న మార్పుల విశ్లేషణే ఈ పుస్తకం.

ఈ యుగధర్మం ప్రజాస్వామ్యం. ప్రజల కొరకు ప్రజల చేత పరిపాలింపబడే ధర్మం. ప్రజలు ఏది కోరుకుంటే ప్రభుత్వాలు దానినే చేస్తాయి. కోరుకోవడానికి ప్రజలకు విషయ పరిజ్ఞానం కావాలి. అప్పుడే మంచి నిర్ణయాలు చేయగలుగుతారు. ప్రభువుల ప్రథమ ప్రాధాన్యత అధికారమే అయినా ప్రజాస్వామ్య వ్యవస్థలో అందుకు ప్రజామోదం కావాలి. ప్రభువులు మంచితనంతోనో, వంచనతోనో ప్రజలను తమవైపు తిప్పుకునే ప్రయత్నం చేస్తారు. మంచిని, వంచనను అర్థం చేసుకోవడానికి ప్రజలకు పనికి వచ్చే విషయాల విశ్లేషణే ఈ పుస్తకం. అందులో భాగంగానే సామాజిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రక, న్యాయ, వైజ్ఞానిక విషయ విశ్లేషణ చేయడం జరిగింది. కులం, మతం, హేతువాదం, ప్రాంతీయ పార్టీల రాజ్యాంగ బద్ధత, భారతదేశంలో ప్రజాస్వామ్య ధర్మం ఎలా అమలవుతున్నది? ప్రభువుల ప్రవర్తన ఎలా ఉండాలి? ప్రజల అవగాహన ఎలా ఉండాలి? వంటి సున్నితమైన విషయాలను చర్చించడం జరిగింది. ఈ పుస్తకం పఠించిన వారు అంతకుముందు కంటె మంచి పౌరులుగా మారతారని నా నమ్మకం. మారాలని నా ఆకాంక్ష.

ప్రజలు అన్ని విషయాలు తెలుసుకుంటేనే దేశ దశ, దిశ సరిగా నిర్ణయం చేయగలుగుతారు. భారత రాజకీయ చరిత్రను, ప్రస్తుత తీరు తెన్నులను ప్రజలు తెలుసుకోవలసిన అవుసరం ఉంది. ప్రకృతిలోని మార్పులను పరిశీలించవలసి ఉంది. కుల మతాలు ఎప్పుడు, ఎలా ప్రారంభమైనాయి, ఎందుకు, ఎలా కొనసాగుతున్నాయనే విశ్లేషణ చేయవలసిన అవుసరం ఉంది. సమాజంలో నెలకొన్న వివిధ సామాజిక ఆచార వ్యవహారాల గురించి కూడా ఆలోచించవలసిన అవసరం ఉంది. ఎందుకంటే సమాజంలోని ప్రతి ఒక్కరూ కుల, మత, ఆచార వ్యవహారల వల్ల, రాజకీయ పరిపాలన వల్ల ప్రభావితమౌతున్న వారే.

ఈ పుస్తకం ఒక అతుకుల బొంత. తెల్లవి, నల్లవి, ఎర్రవి, పచ్చవి రంగు రంగుల పాతగుడ్డలు అతికించి బొంతనేసినట్లే ఈ పుస్తకంలోని అన్ని అంశాలు కూడా పాతవే. గత కాలంలో ఎప్పుడో ఒకప్పుడు సమాజంకోరి కొని తెచ్చుకుని చుట్టుకున్నవే. నా మనసు మాత్రం సప్త వర్ణాల మిశ్రమంలా ధవళమే. అలాగే అనేక రంగులలాగానే సమాజంలోని అన్ని వర్ణాలను సామాజిక, ఆర్థిక, రాజకీయ సాహిత్య వైజ్ఞానిక విషయాలను ఏర్చి కూర్చి నేను నేర్చిన విధంగా నేసి ప్రజల ముందుంచుతున్నాను. ఈ యుగధర్మం ప్రజాస్వామ్యం. ప్రజల విషయ పరిజ్ఞానం పెరిగితేనే నాణ్యమైన నాయకులనెంచుకోవడం ద్వారా తమ దేశాన్ని తీర్చిదిద్దగలుగుతారు. లేకుంటే రాబందులూ, వాటి బంధువులే రాజ్యం చేస్తాయి. అభివృద్ధి ఫలాల నాస్వాదించవలసిన వారు, స్వాతంత్ర్యాన్ననుభవించవలసిన వారు ప్రజలే. అలాగే స్వాతంత్ర్యం కోల్పోతే బానిస బ్రతుకులు బ్రతకవలసిన వారూ, అభివృద్ధి జరగకపోతే పేదరికంలో మ్రగ్గవలసినవారు ప్రజలే. ప్రజల అవగాహనను పెంచే ప్రయత్నమే ఈ పుస్తకం. ఈ అతుకుల బొంతనే భావి భారత బాల బాలికలకు పట్టు పరుపులా పరిణమించాలని నా ప్రగాఢ వాంఛ.

ఈ పుస్తక ముద్రణకు ముందుకొచ్చిన 'దర్శనమ్' ఆధ్యాత్మిక వార్తా మాసపత్రిక సంపాదకులు **శ్రీ మరుమాముల వెంకటరమణశర్మ** గారికి ధన్యవాదాలు. అలాగే ఈ పుస్తక అక్షరాలకూర్పులో పాలుపంచుకొన్న **కొమరబత్తిన నాగరాజు, ఆరవేటి వెంకటసుబ్బయ్యలకు** మరియు పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన **సాయి తిరుమల ప్రింటింగ్ ప్రెస్** యాజమాన్యం వారికి కృతజ్ఞతలు.

చివరగా, ఇలాంటి సమకాలీన సామాజిక, ఆర్థిక, రాజకీయ విశ్లేషణలతో కూడిన రచనలపై భిన్న భావాలు వినిపించడం సహజం. వాటన్నిటికి నేనే బాధ్యుడను. పాఠకులే నిర్ణేతలు.

**ఈశ్వరప్రగడ హరిబాబు**
LL.B., F.C.A.
Chartered Accountant



# విషయానుక్రమణిక





# 1. సామాజిక, ఆర్థిక, రాజకీయ జీవితాలలో కుల ప్రస్తావన

ఈ మధ్యకాలంలో సామాజిక, ఆర్థిక, రాజకీయ జీవితాలలో కుల, మతాల ప్రస్తావన అధికమైంది. కులాభిమానాలే కాక కుల దురాభిమానాలు కూడా వ్యక్తమవుతున్నాయి. పరోక్షంగా మత ప్రచారంగానో, రాజకీయ ప్రచారంగానో కుల దురాభిమానాలను ప్రదర్శిస్తున్నారు. కొన్ని కులాలను విమర్శించడం ద్వారా ఇతర కులాల మెప్పు పొందే ప్రయత్నం చేస్తున్నారు కొందరు. ఆ ప్రయత్నంలో దొంగలు, దొంగలు అని అరుస్తూ దొంగలే పారిపోతున్నట్లుగా ఉన్నది. కులాలు, ముఖ్యంగా అధిక జనాభా గలిగిన అన్ని కులాలు ఘన చరిత్ర కలిగినవే. ఏదో ఒక కాలంలో ఏదో ఒక ప్రాంతంపై రాజ్యపాలన చేసినవే. కులాల గోడలు కూలిపోవడం కోరుకోవాల్సిందె. అందుకు ఏ కులమూ వ్యతిరేకం కాదు. ఎవరి కులాన్ని వారు ప్రత్యేకంగా ఆదరించుకుంటే తప్పులేదు. చిక్కంతా ఇతర కులాలను బదనాం చేసే ప్రయత్నం చేయటంలోనే ఉంది.

కుహనామేధావులు కొందరు, రాజకీయ లబ్ది కోసం కొందరు, స్వీయ గుర్తింపు కోసం కొందరు  సామాజిక సమస్యలన్నింటికి ఇతర కులాలను నిందిస్తూ సమాజ క్షీరసాగరంలో హాలాహలం పుట్టిస్తూ ఉంటారు. ఇలాంటి వ్యక్తులు తమ స్వంత కులానికి ఏ రకమైన మేలు కూడా చేయరు. సాటి మనుషులకు గాని, బంధు మిత్రులకు గాని ఏరకమైన సాయం చేయరు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇలాంటివారి వలన సమాజానికి ఏ రకమైన ఉపయోగం కూడా ఉండదు. సమాజంలో కొండెగాడి పాత్ర పోషిస్తూ ఉంటారు. సమాజం సజావుగా ముందుకు  సాగడానికి ఆనాటి పరిస్థితులకు సరిపడ పెద్దలు సమాజ కట్టుబాట్లు సదుద్దేశంతోనే నిర్మిస్తారు. మారిన నేటి పరిస్థితులలో నాటి సమాజ పెద్దలు కొండెగాళ్ళ చేతుల్లో ద్రోహులుగా చిత్రీకరించ బడతారు.

కులాలు ఏదో ఒక కాలంలో కోరి తెచ్చుకున్నవే. ప్రస్తుతం కులాలు మనిషి పుట్టుకతోటే అంటగట్ట బడుతున్నాయి. ఈ లోపంలో ప్రధాన పాత్ర ప్రభుత్వానిదే. ప్రజా జీవితంలో సామాజిక, ఆర్థిక, రాజకీయ ప్రభావాలన్నింటికి ప్రభుత్వాలదే బాధ్యత. భారతదేశం స్వాతంత్ర్యం కోల్పోటానికి, ప్రజలు విదేశీ పాలకుల పాదాల చెంత బానిస బ్రతుకులు బ్రతకవలసి రావటానికి ఆనాటి పాలకుల అనైక్యత, అవినీతి, అసమర్థత కారణం తప్ప అందుకు కారణం ఏ ఒక్క కులం కాని, మతం కాని కానే కాదు. అందుకు నిందించవలసింది ఆనాటి పాలకులనే. దీనినర్థం చేసుకునే బదులు ప్రజలు కులాలుగా విడివడి వారిని వారు విమర్శించుకోవడమంటే ఇరుకు లారీలలో కబేళాకు తరలించబడుతున్న పశువులు స్థలం కోసం ఒకదానినొకటి పొడుచుకోవటం వంటిదే.

ఒక తండ్రి ఆస్తి పాస్తులు కూడబెట్టి అవకాశమున్నంత న్యాయంగా ఇద్దరు కుమారులకు పంపకాలు చేశాడనుకోండి. ఇద్దరు కుమారులూ ఎంతో కొంత బాహాటంగానో, లోలోనో అసంతృప్తిగా ఉంటారు. ఇక్కడే ఒక కొండెగాడు తయారవుతాడు. పెద్దకొడుకు వద్దకు చేరతాడు. నువ్వు పెద్దవాడివి కాబట్టి మీ తమ్ముడి కన్నా ఎక్కువ కాలం కుటుంబం కోసం పని చేసుంటావు. పైగా నీ పిల్లలు పై చదువులకు, వివాహాలకు సిద్ధంగా ఉన్నారు. ఇది గుర్తించి నీకేమైనా అదనంగా ఇచ్చారా? అగ్ర భాగమంటూ ఏదైనా ఇచ్చారా? అంటూ చిచ్చు బెడతాడు. లేదా చిన్న కొడుకు దగ్గర చేరి మీ అన్న నీ కన్నా పెద్దవాడు. నీ కన్నా ఎక్కువ కాలం జాయింటు ఆస్తిని అనుభవించాడు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో ఎంతో కొంత అనుభవం గడించాడు. ఆయన పిల్లల కార్యక్రమాలు కూడా జాయింటు ఆస్తి నుంచే జరిపించారు. ఆ విషయాన్ని గుర్తించి నీకేమైనా అదనంగా ఇచ్చారా అంటూ చిచ్చు బెడతాడు. పిల్లల భవిష్యత్తు కోసం అహర్నిశం కష్టించిన తల్లిదండ్రుల కన్నా, తోబుట్టువుకన్నా ఈ కొండెగాడు శ్రేయోభిలాషిలాగ కనబడుతాడు. ఫలితం కుటుంబ కలహాలు, కోర్టు వ్యాజ్యాలు.

సమాజంలో నెలకొని ఉన్న నమ్మకాలను, పరిస్థితులను ఉపయోగించుకొని రాజ్యాధికారం సాధించే ప్రయత్నం ప్రజాస్వామ్య వ్యవస్థలో జరగడం సహజం. ప్రజా మద్దతు కూడగట్టడానికి రెండు విధానాలున్నాయి. సమాజం ఎలాగూ

కుల, మత, ప్రాంతాల ప్రాతిపదికన, ఆర్థిక అసమానతల కారణంగానూ సమూహాలుగా విడివడి ఉన్నది. ఒక సమూహాన్ని సంతృప్తి పరచడానికి ఉన్న రెండు విధానాలలో ఒకటి ఆ సమూహానికి మేలు చేయడం. రెండవ విధానం ఒక సమూహానికి విరుద్ధమైన మరొక సమూహానికి హాని చేయడం లేదా విమర్శ చేయడం. దేశ పాలనలో నెలకొన్న అవినీతి, అసమర్థత, అనైక్యత, అహంకారం కారణంగా కనుమరుగైన క్రమశిక్షణ, ఆర్థిక అభివృద్ధి వల్ల ఉత్పన్నమైన పేదరికం కారణంగా సమాజంలో ఘర్షణ వాతావరణం, ఆర్థిక అసమానతలు ఏర్పడతాయి. సమస్యల నాధారంగా సమాజాన్ని విడగొట్టి రాజకీయ నాయకులు రాజకీయ క్రీడ సలపడం ప్రారంభిస్తారు. దీనినే మనం పరవస్తు చిన్నయ సూరి రచించిన పంచతంత్రంలోని మిత్రలాభం, మిత్రభేదంగా పరిగణించవచ్చు.

ప్రస్తుత బహుళ పార్టీ ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజకీయ నాయకులు అంతకంటే చేయగలిగింది కూడా లేదు. కారణమేమిటంటే ప్రస్తుత పరిస్థితిని సవరించడం ఈ వ్యవస్థలో సాధ్యం కాదు. భారతదేశంలో వ్యక్తిగతంగా గొప్ప రాజకీయ నాయకులు చాలా మందే ఉన్నారు కాని వారు కూడా వ్యవస్థకు బందీలే కదా. ముందుగా వ్యవస్థనే మార్చవలసిన అవసరముంది. అటువంటి మార్చవలసిన వ్యవస్థాగత మార్పులేమిటో ముందు ముందు పరిశీలిద్దాం. అటువంటి కుల, మత, ఆర్థిక, రాజకీయ, చారిత్రక విశ్లేషణే ఈ పుస్తక ధ్యేయం.

రాజకీయాలలో కుల ప్రస్తావన అత్యంత ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. రాజకీయమే కదా ప్రజల తలరాతను మార్చగలిగేది! ఎవరు అధికారంలో ఉన్నప్పుడు వారి కులాన్ని ఆర్థికంగా బలోపేతం చేసుకునే ప్రయత్నాల్లో ఉన్నారు. ఆ రాజకీయ స్పృహ తెలుగు రాష్ట్రాల్లో ముఖ్యంగా రెండు కులాలకే ఉంది. అందుకే ఆ రెండు కులాలే ఒకరి తర్వాత ఒకరు ఆంధ్ర రాష్ట్రంలో రాజ్యం చేయగలిగారు. ఇతర కులాల వారు ఎప్పుడైన రాజ్యం చేయగలిగారంటే అది జాతీయ పార్టీల నేతృత్వంలోనే. ప్రాంతీయ పార్టీలలో అలాంటి అవకాశమే లేదు. ఇతర కులాల వారు అధిక సంఖ్యలో ఉన్నప్పటికీ వారిలో రాజ్య కాంక్ష లేదు. ఐకమత్యం లేదు. నాయకత్వమూ లేదు. ఆర్థిక శక్తి కూడా తక్కువ మందికే ఉంది. రాజ్యాధికారం సాధించిన కులానికి అన్ని వనరులు, గౌరవాలు

కూడా దక్కుతాయి. యస్.సి., యస్.టి., బీ.సి., కులాలు అధిక సంఖ్యాకులై యుండి కూడా నాయకత్వం లేకపోవడం వల్లనే రాజ్యాధికారానికి పోటీ పడలేక, ఇచ్చిన కాడికి పుచ్చుకుని సంతృప్తి పడుతున్నారు.

పోటీకి రాగల ఇతర కులాలను అణగద్రొక్కటం కూడా రాజ్యసాధన తంత్రంలో భాగమే. ఇందులో ఎంతమాత్రం చిత్రం లేదు. ఇది సహజం. అధికార సాధన తంత్రంలో ఎవరు అడ్డుగా ఉన్నా కూల్చివేయడం సహజం. ఇతిహాసకాలంలో చూచినా ఇంద్ర పదవి కోరి తపస్సు చేసిన విశ్వామిత్రుడిని దేవ వేశ్య అయిన మేనకను పంపి ఇంద్రుడు ఎలా భ్రష్టుడిని చేశాడో భారతంలో మనం చూడవచ్చు. పదవుల కొట్లాటలో అప్పుడైనా ఇప్పుడైనా అది సహజం. మగువ, డబ్బు లేదా కేసుల్లో ఇరికించి భ్రష్టులను చేయడం నేటి స్టైల్.

సింహంగాని ఇతర వేటాడే జంతువులు కానీ ఆహారం కోసం తమతో పోటీపడే ఇతర వేటాడే జంతువులను దొరికితే కొరికి చంపేస్తాయి. అవి కొంత ప్రాంతాన్ని తమ రాజ్యంగా పరిగణిస్తాయి. దాని సరిహద్దులను గుర్తించి కాపాడుకుంటూ ఉంటాయి. ఆ ప్రాంతంలోకి ఇతర వేటాడే జంతువులు ప్రవేశిస్తే చంపి పారేస్తాయి. అలాగే రాజ్యాభిలాషులైన క్షత్రియ వృత్తిలో ఉన్న వారు వారి రాజ్యాన్ని ఆశించగల వారిని ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయంగా అణగద్రొక్కడానికి ప్రయత్నిస్తారు. రాజ్యం వీరభోజ్యం. బలవంతులదే రాజ్యం. బలహీనులు తలవంచక తప్పదు. "కాసులు కలవాడే రాజు గదరా సుమతీ" అని బద్దెన గారు ఆరు వందల సంవత్సరాల క్రితమే సుమతీ శతకంలో వ్రాశారు. ఆ సూక్తి నాటికీ నేటికి అక్షర సత్యమే.

సామాజిక పరిస్థితి మీకు తెలుసు. వివాహ బాంధవ్యాలు ఏ కులం వారు ఆ కులంతోనే నెరుపుకుంటారు. కులాంతర ప్రేమ వ్యవహారాలను సమర్థించరు. కొందరైతే తమ కుటుంబ స్త్రీ ఇతర కులస్తుడిని వివాహం చేసుకుంటే అమ్మాయినో, అబ్బాయినో చంపి పరువు హత్యలకు పాల్పడుతున్నారు. ఒకే కులంలో సంబధ బాంధవ్యాలు నెరపడం వల్ల జెనెటిక్ లోపాలు కూడా సంభవిస్తున్నాయని శాస్త్రజ్ఞులు తెలియజేస్తున్నారు. ఈ సమస్య ముఖ్యంగా రెడ్డి, కోమటి కులాల్లో ఎక్కువగా ఉందని గుర్తించారు. చాలా మందికి తెలిసే ఉంటుంది. కోమటి కులం వారికి కొన్ని మందులు పడవు. ముందు ముందు

వధూవరుల ఎంపికలో కులం ప్రాధాన్యత పోతుంది. అందం, ఆరోగ్యం, ఆర్థిక పరిస్థితి ఆధారంగానే ఎంపిక జరపవలసి వస్తుంది. ఇది మానవుని తప్పిదాలకు ప్రకృతి కరెక్షన్.

ఆర్థిక రంగంలో కూడా కులం తన వంతు పాత్ర పోషిస్తున్నది. ఒక కులం వారు పెట్టుకున్న వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలకు ఆ కులం వారు వెన్నుదన్నుగా ఉండటం చూస్తుంటాం. ఒక ఫాక్టరీ గాని, వ్యాపారం గాని పెట్టుకున్న వాడు వాడి దగ్గర ఉద్యోగాలకు, సబ్ కాంట్రాక్టులకు తమ కులం వాడినే ముఖ్యంగా ఎంచుకుంటారు. డబ్బు విషయం కాబట్టి ఈ రంగంలో కులం ప్రాధాన్యత ఉంటుంది కాని కొంత వరకు మాత్రమే.

ఈనాటి యస్.సి., యస్.టి., బీ.సి., కులాలన్ని ఒకనాటి పాలకులే. ధర్మరాజు రాజసూయ యాగం చేసే సందర్భంలో తన నలుగురు తమ్ములను ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమర నాలుగు దిక్కులకు దిగ్విజయం చేసి రమ్మని పంపించాడట. అందులో అర్జునుడు దక్షిణ దిక్కుకు ప్రయాణించి ఆంధ్ర గౌడ రాజులను జయించాడని భారతంలో రాయబడింది. మహాపద్మనందుడు స్థాపించిన నంద వంశపు రాజులు మంగలివాళ్ళు. శ్రీనాధ మహాకవి మెడలో భూమి శిస్తు కట్టనందుకు గుదిబండ వేసిన రాయలసీమను పరిపాలించిన వారు ఓఢ్ర లేక వడ్డెర రాజులు. శ్రీకృష్ణుని వంశజులు యాదవులు, కౌరవ పాండవులు ముదిరాజులు లేక బెస్త వారు. ఆ వంశపు వారే చాళుక్యులు. రాజమహేంద్రవరమును క్రీ॥శ॥11వ శతాబ్దంలో పరిపాలించిన చాళుక్య వంశస్తుడైన రాజరాజ నరేంద్రుడు ఆదికవి నన్నయ్యచే భారతాన్ని తెలుగులో రచింపజేశాడు. క్రమమున వంశకర్తలనగా మహినొప్పిన అస్మదీయ వంశమున ప్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్ర వినడం నాకు ఎప్పటికీ ఇష్టం. మా తాత ముత్తాతలైన పాండవుల చరిత్ర వినవలెనని కోరికగా ఉన్నది కావున వారి చరిత్రయైన భారతమును తెనుగించమని కోరినట్లు నన్నయ్య రచించిన ఆంధ్ర మహాభారతంలో ఉంది.

భోజ, అంధక, వృష్ణి, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, మద్ర, సాళ్వ, ఇత్యాది భారతకాలం నాటి ముప్పది రెండు రాజవంశాలు,

చాళుక్యులు, ఇక్ష్వాకులు, చోళులు, విష్ణు కుండినులు, బోయవారైన కాకతీయులు, పల్లవులు, గౌడులు, శాలివాహనులు, శ్రీ కృష్ణదేవరాయల వంశపు వారు, వీర వనితలై దైవత్వం పొందిన సమ్మక్క, సారలమ్మ, పగిడిద్ద రాజు ఇత్యాది రాజులందరు నేటి యస్.సి., యస్.టి., బీ.సి., కులాల వారే. దివిసీమను పరిపాలించిన జాయప సేనాని బోయవాడు. ఇతని చెల్లెళ్ళను కాకతీయ చక్రవర్తి గణపతి దేవుడు వివాహమాడినందున కాకతీయులు బోయవారనే భావన వుంది. కాకతీయులు పుళింద అనే తెగకు చెందిన వారు. ఆదిలాబాద్ నుండి మధ్య ప్రదేశ్ వరకు విస్తరించి ఉన్న ఆదివాసీలు గోండ్లు సువిశాల సామ్రాజ్యాలు పరిపాలించిన వారే. తెలంగాణ ప్రాంతంలోని కోయ తెగ వారు తాము దొరల చట్టపు వారమని చెప్పుకుంటారు. అందుకే పేరు చివరన "దొర" అని కూడ పెట్టుకుంటారు. అలాగే అటవీ ప్రాంతాలలో కోయవారితో పాటు నాయకులు అనే కులం వారు కూడ ఉంటారు. వారు తమది పాండవుల కులం అని చెప్పుకుంటారు.

దక్షిణ భారతదేశంలోని అన్ని దేవాలయాలు నిర్మించిన వారు కాని, కవులను, పండితులను పోషించిన వారు కాని, కళలను, సాహిత్యాన్ని పోషించిన వారు కాని అందరూ ప్రస్తుతం మనం వెనుక బడిన కులాలుగా పిలుస్తున్నవారే. తెలుగు వారు కలియుగ వైకుంఠంగా భావించే తిరుమల తిరుపతి దేవాలయాలను క్రీ॥శ॥ 1200 ప్రాంతంలో నిర్మించిన వారు యాదవ రాజులు. వాస్తవానికి భారతీయ సనాతన సంస్కృతికి, వాఙ్మయానికి, వారసత్వానికి యస్.సి., యస్.టి., బీ.సి., కులాల వారే ఆద్యులు, ఆరాధ్యులు. భారతదేశంలోని అన్ని ముఖ్య దేవాలయాలు నిర్మించినవారు, భారతీయ కళలను, గ్రంధ రచనలను, బ్రాహ్మణులను ప్రోత్సహించి మణులు, మాన్యాలు ఇచ్చిన వారు ముఖ్యంగా వారే. సంస్కృత భాషను సృష్టించి ఆ భాషలో భారత భాగవతేతిహాసాలను, అష్టాదశ పురాణాలను రచించడమే కాక వేదాలను నాలుగు భాగాలుగా విభాజన చేసిన మహానుభావుడు వ్యాసుడు బ్రాహ్మణుడైన పరాశర మునికి, బెస్త కన్య అయిన సత్యవతికి జన్మించిన వాడే. విశ్వామిత్రాది మహా ఋషులు, వాల్మీకి మొదలైన ఇతిహాస గ్రంధ రచయితలు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, ఆంజనేయుడు, జాంబవంతుడు ఇత్యాది దేవతలు అందరూ ఈనాటి యస్.సి., యస్.టి.,

బీ.సి., కులాలు లేదా ఆనాటి క్షత్రియ వంశాలలో జన్మించారే తప్ప బ్రాహ్మణ కులంలో కాదు. బ్రాహ్మణులు మననం చేసుకునే గాయత్రీ మంత్ర ద్రష్ట విశ్వామిత్రుడు కూడా క్షత్రియుడే తప్ప బ్రాహ్మణుడు కాదు.

15వ శతాబ్దంలో దక్షిణాపథాన్ని పరిపాలించిన శ్రీకృష్ణ దేవరాయలు తన ఆస్థానం భువనవిజయంలో అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, పింగళి సూరన, ధూర్జటి, రామరాజ భూషణుడు, తెనాలి రామలింగడు ఇత్యాది అష్టదిగ్గజ కవులను పోషించాడు. స్వయంగా వైష్ణవుడైనా శైవులను కూడా ఆదరించాడు. తాను స్వయంగా కవి. ఆముక్తమాల్యద అనే గ్రంథం రచించాడు. ఆయన కాలంలో సంగీత, సాహిత్యాలు వెల్లివిరిసాయి. అనేక గ్రంథ రచనలు వెలువడ్డాయి. శైవ, వైష్ణవ మతాలు పరస్పరాలింగనంతో పరమత సహనం పరిఢవిల్లిన కాలమది. అంగళ్ళలో రతనాలు రాశులు పోసి అమ్మేడి వారట. ఆయన కాలంలో నిర్మించబడ్డ గుడులకు, గోపురాలకు అంతే లేదు. బ్రాహ్మణులు అత్యంత ఆదరణకు నోచుకున్నారు. బ్రాహ్మణులు దర్భ బెట్టిడి వేళ్ళకు మాణిక్యాంగుళీయకాలు ధరించారట. మనుచరిత్రంబందుకొను వేళ పల్లకి తనకేల ఎత్తెనట. అల్లసాని పెద్దన గారు ఎదురైతే శ్రీకృష్ణ దేవరాయలు తన మద కరీంద్రము దిగి చేయూతనిచ్చి ఎక్కించుకున్నారట. బిరుదైన కవి గండ పెండేరానికి నీవే తగుదువంటూ స్వయంగా తాను పెద్దనగారి పాదానికి తొడిగాడట. ఈయన కులమేది? యాదవుడని నా అభిప్రాయం. తిరుమల విమానమండపం గోడపైనున్న యాదవ రాయలు అనే పేరు చూచినా, మైసూరు మహారాజుల చరిత్ర చూసినా ఇదే వాస్తవమనిపిస్తున్నది. ఈ మహారాజు కవితా ప్రీతి, పరమత సహనము మన ఊహలకందనిది.

14వ శతాబ్దంలో శ్రీనాధ మహాకవి రెడ్డిరాజుల ఆస్థానంలో అత్యంత వైభోగాన్ననుభవించి కవి సార్వభౌముడిగా పేరు గాంచాడు. రెడ్డి రాజుల రాజ్యం పోయి ఓఢ్రరాజుల పరిపాలనలో ఈయన కవిత్వాన్ని ఆదరించినవారు లేరు. కవులు రాజాదరణకు నోచుకోలేదు. సంసార పోషణకై మూడెకరాల పొలం ప్రభుత్వం వద్ద కౌలుకు తీసుకొని వ్యవసాయం చేయించాడు. పొలం పండలేదు. శిస్తు కట్టలేక పోయాడు. ఫలితంగా మెడలో గుదిబండ వేశారు. *“వివాద ప్రౌఢి గౌడ డిండిమభట్టు కంచు ఢక్క పగుల గొట్టించితి, తెలుగు కళామతల్లిని*

*దీనార టంకాల తీర్థమాడించితిని దయ లేదా నేను శ్రీనాధుడన్"* అని వాపోయినా పట్టించుకొనే నాధుడు లేకపోయే. ఈ పద్యం లోని గౌడ డిండిమ భట్టు గౌడ కులం వాడా? లేక గౌడులు పరిపాలించిన ఆంధ్రదేశం నుండి వచ్చిన వాడా? తెలియవలసి ఉన్నది. ఈ సంఘటన ద్వారా తెలిసే విషయమేమిటంటే కవులైనా, కావ్యాలైనా, కళలైనా రాజులు పోషిస్తేనే పరిఢవిల్లేది.

ఈయన కాలం వాడే ఆంధ్ర మహా భాగవతాన్ని రచించిన పోతన. ఆయన కూడా *"బాల రసాల సాల నవ పల్లవ కోమల కావ్యకన్యకన్ కూళులకిచ్చి అప్పడుపు కూడు భుజించుట కంటే సత్కవుల్ హాలికులైననేమి? గహనాంతర సీమల కందమూల కౌద్దాలికులైననేమి? నిజదార సుతోదర పోషణార్థమై"* అంటూ వ్యవసాయాన్నాశ్రయించాడు. అంటే కవిత్వం కొంతవరకు పక్కన బెట్టినట్లే. ఏ కళలైనా రాజాదరణ ఉంటేనే కదా వృద్ధి చెందేది. ఈయన వ్యవసాయం ఏ మాత్రం పండిందో అది మాత్రం నాకు తెలియదు. బ్రతుకు మాత్రం పేదరికంలోనే వెళ్ళదీశాడు. ఇప్పటికీ బ్రాహ్మణ వ్యవసాయంపై ఛలోక్తులు ఉండనే ఉన్నాయి.

అలాగే వరంగల్ నుండి శ్రీకాకుళం వరకు ఉన్న శివాలయాలన్నీ కాకతీయుల కాలంలో నిర్మించినవే. వారు జన్మతః పుళింద తెగకు చెందిన వారు లేదా బోయవారు. వారి వంశస్థుల పేర్లన్ని యస్.టి జాతుల వారి పేర్లే. ఉదాహరణకు వీరి మొట్టమొదటి రాజుల పేర్లు గిరియ, వెన్న, గుండయ, ప్రోలయ్య. ఇవన్నీ బోయలలోను, పుళిందులలోను కనిపించే పేర్లు. ఇవేవి సంస్కృత నామధేయాలు కావు. వారు బ్రాహ్మణ మతావలంబకులుగా మారిన తర్వాతనే హిందూ దేవుళ్ళ పేర్లు ధరించారు. ఉదాహరణకు గణపతి దేవుడు, రుద్రమ దేవి మొదలగునవి.

నేటి అగ్ర కులాల పరిపాలనలు ప్రారంభమై సుమారు వేయి సంవత్సరముల లోపే. గతంలో రాజ్యపాలన చేసి ఆ తదుపరి స్వదేశీ, విదేశీ దండయాత్రలలో రాజ్యాలు కోల్పోయి, ఆస్తులు కోల్పోయి, అవమానాలు పడి, వందల సంవత్సరాలు ఏదో ఒక్క చిన్న వృత్తిని ఎంచుకొని పేదరికంలోను, అవమానంలోను జీవనం కొనసాగిస్తూ వెనుకబడి పోయినవారే నేటి యస్.సి.,

యస్.టి., బీ.సి., కులాలు. ఈ పరిస్థితిని ఈనాటి ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థలో కూడా మనం చూడవచ్చు. అధికారం చేజిక్కించుకున్న కులాల వారి చేతుల్లోనే అధికార పదవులు, వృత్తులు, వ్యాపారాలు, కాంట్రాక్టులు, వనరులు అధికంగా కేంద్రీకృతం అవ్వడం మనం గమనించవచ్చు. అలాగే గౌరవ మర్యాదలు, డబ్బు, హోదా కూడా వారే అధికంగా పొందుతారు. అందుకేనేమో *"కులములోన ఒకడు గుణవంతుడుండెనా కులము వెలయు వాని గుణము చేత"* అన్నారు.

కోయ వారి జీవన విధానం విలక్షణం. వీరి ముఖ్య ఆహారం జొన్న, మొక్కజొన్న సజ్జ, కొర్రలు, రాగులు, చామలు. వరి బియ్యం తినడం బహు అరుదు. వీరు నివసించే గ్రామాలను గూడేలు అంటారు. గూడెంలో అన్నీ గుడిసెలే. దాదాపుగా అడవులలో ఐక్యమయే ఉంటాయి. పప్పుధాన్యాలుగా అనుములు, చిక్కుళ్ళు, ఉలవలు, బొబ్బర్లు, అలచందలు పండిస్తారు. ఎక్కువగా పోడు వ్యవసాయం చేస్తారు. ఏ పంటైనా పూర్తిగా వర్షాధారమే. అరుదుగా అక్కడక్కడ కుంటల క్రింద వరిసాగు చేస్తారు. ఏడాదిలో సగటున ఎనిమిది నెలలు ఆహారం దొరుకుతుంది. నాలుగు నెలలు పస్తులే. పస్తులంటే కొద్ది ఆహారధాన్యాల పిండితోనో, నూకలతోనో జావ కాచుకుని త్రాగి రోజు గడుపుతారు. మజ్జిగ, పాలు వాడకం బహు అరుదు. ప్రతి ఇంటికి ఒక కుక్క ఉంటుంది. అందువల్ల రాత్రులందు కానీ పగలు గానీ కొత్తవారు గూడెల్లో తిరగడం సాధ్యం కాదు. ప్రతి శుకనం దాని పరిధి వరకే అది కాపలా కాస్తుంది.

వర్షం పడిందంటే చాలు కోయవాళ్ళు విల్లంబులు, బాణాలు, గొడ్డలి, గడ్డపలుగు లేదా పోట కత్తి తీసుకుని ఆనపకాయ బుర్రలో నీళ్ళు నింపుకుని కుక్కలను వెంటబెట్టుకొని వేటకోసం అడవి బాట పడతారు. తొలకరి వర్షాలు పడగానే ఉబ్బుకు ఉడుములు పుట్టల నుండి, చెట్టు తొర్రలనుండి బయటకు వస్తాయి. పక్షులను కొట్టుకుని తింటారు. ఉసిళ్ళు అనే రెక్కల పురుగులను వేయించుకొని తింటారు. అడవిలో నిలువు దుంపలు, వెలేరు దుంపలు, తెల్ల జన్న గడ్డలు, నల్ల జన్న గడ్డలు తింటారు. చింత గింజలను వేయించి పప్పు చేసి ఉడక బెట్టుకొని తింటారు. వీరి కుక్కలు ఉడుములు, కుందేళ్ళను వేటాడటంలో మంచి నైపుణ్యం కలిగి ఉంటాయి. వీటి నోటికి అందకపోతే

ఉడుములు, కుందేళ్ళు చెట్టు తొర్రలలోనో, పుట్టలలోనో దూరి దాక్కుంటాయి. ఈ కుక్కలు పెద్దగా మొరిగి పరుగులో వెనుకబడ్డ యజమానులకు వాటి తావు నెరిగిస్తాయి. పుట్టలు త్రవ్వడంలో మట్టి దీస్తూ సాయం కూడా చేస్తాయి. ఇవన్నీ నేను ప్రత్యక్షంగా చూచాను. నా బాల్యమంతా ఎక్కువ కోయగూడేలలోనే గడిచింది. వారితో ఒకరిగానే బ్రతికేవాళ్ళం. ఉడుములు, కుందేళ్ళు తినడం తప్ప.

అడవే వీళ్ళ ముఖ్య జీవనాధారం. గుంజలు, పెండెలతో అలవలు కట్టుకొంటారు. దూలాలు, మొకరాలతో ఇల్లు నిర్మించి చీపురుగడ్డితో కప్పు వేసుకుంటారు. వెదురు లేదా బొంత పెండెలను చీల్చి ఇంటి గదులు నిర్మించి మట్టితోను, పేడతోను మెత్తుతారు. ఇంటిని సంరక్షించేవి తడికెలు, కుక్కలే. తాళాలంటే వీరికి తెలియదు. తడ, బిల్లుడు కర్రలతోనే నాగళ్ళు, గొడ్డలి కర్రలు తయారు చేసుకుంటారు. ఆరె నార, వేపెనారతో తాళ్ళు పేనుకుంటారు. గోగు, జనపనార వీరికి పెద్దగా లభ్యంకాదు. అలవలు అంటే గుంజలకు పెండెలను కట్టడానికి గూడపాల తీగెలను, చిలక దుద్దు మండలను చీల్చి ఉపయోగిస్తారు. బండి చక్రాలకు మధ్యలో ఉండే అడ్డ కుండలకు ముఖ్యంగా వేపె కర్రను వాడతారు. పోలుగర్రకు, కమ్మలకు, చట్రాలకు టేకును ఉపయోగిస్తారు. అడవి నుంచి తునికాకు, తేనె, పారిటాకులు, బంక సేకరిస్తారు. ఈ బంక ముఖ్యంగా తబిసి చెట్లనుంచి వస్తుంది. అవి వ్యాపారులకు అమ్మినప్పుడే వారు నగదు చూసినా, బియ్యం కొనుక్కున్నా. మిగతా అన్ని సమయాల్లో వస్తు మార్పిడి విధానమే. కిరాణా దుకాణంలో సరుకులు కొనాలన్నా, కమ్మరికైనా, కుమ్మరికైనా నిర్ణీత మొత్తంలో వారివద్ద ఆ సీజన్లో ఉండే ధాన్యమే ఇస్తారు. పొగాకును తునికి ఆకులలో చుట్టి పొగ త్రాగుతారు.

విప్ప పూవులు తెల్లగా పెద్ద పూసలలాగా ఉంటాయి. తెల్లవారేసరికి చెట్టు క్రింద పరచినట్లుగా రాలి ఉంటాయి. వీటిని తినడానికి ఎలుగుబంట్లు వస్తాయి. తియ్యగా ఉంటాయి. వాటిని ఎండబెట్టి సారా కాచుకోవడానికి ఉపయోగిస్తారు. విప్పకాయల పప్పుతోను, కానుగ పప్పుతోను నూనె తయారు చేసి దీపాలకు వాడుకునేవారు. వంటలకు, నీళ్ళకు అన్ని మట్టిదాకలు, మూకుళ్ళు, కుండలే. వీరు మిత భాషులు. పెద్దగా ఉద్వేగాలకు, ఆవేశకావేశాలకు లోను కారు.

తొంభైశాతం మంది పట్టణాల ముఖం చూడని వారే. వీరికి భాష ఉంది కానీ లిపి లేదు. ఆ భాషలో నాకు కొంత ప్రవేశముంది. బెగ్గంజి వాసనిన్ పేకా అంటే ఎక్కడ నుంచి వస్తున్నవు పిలగా అని అర్థం. నీ పేదేర్ బాత్తద అంటే నీ పేరేమిటి? అని అర్థం. అబద్ధం చెప్పడం వీరికి చేతగాని పని. చాలామంది మగవాళ్ళు బెత్తెడు గోచితోనే తిరుగుతూ ఉంటారు. మంచి దానగుణం కలిగి ఉంటారు. వారి మొక్కజొన్న చేను విరిచిన రోజు వచ్చి వరుసలో నిలబడ్డ వారందరికి ఎన్నో కొన్ని పొత్తులు దానంగా ఇస్తారు.

ప్రేమ వివాహాలు, రాక్షస వివాహాలే ఎక్కువ. అమ్మాయిని పట్టడం అంటారు. అమ్మాయి ఒంటరిగా దొరికినప్పుడు అబ్బాయి లాక్కుపోతాడు. కులం వారు వెతికి పట్టుకొని తప్పేస్తారు. తప్పేయడమంటే నాలుగైదు వందలు లేదా ఇంత కల్లు, సారా, మేకలు లేదా పందులు కుల పెద్దలకివ్వాలి. ముత్యాలమ్మ, పెద్దమ్మతల్లి, పోతురాజులు ఇత్యాది దేవతలను కొలుస్తారు. ఆ గూడెంలలో ఆధునిక దేవాలయాలు అత్యంత అరుదు. బ్రాహ్మణులు కూడా ఎక్కడా కనిపించరు. ఏ పండుగకైనా అలంకారం వేప మండల తోరణాలే. జాతరలు నిర్వహిస్తారు. కోళ్ళు, మేకలు బలిస్తారు. ఎటు పోవాలన్నా కాలిబాటలు, అరుదుగా బండ్లగాళ్ళు. రోడ్లనేవి ఉండేవి కావు. మంచినీటికి బావులు, దగ్గరలోనున్న వాగుల్లోని ఊట చెలిమలే ఆధారం. వేసవి వెన్నెల రాత్రులందు ఉప్పు బెర్రలు, కబడ్డీ వంటి ఆటలు ఆడతారు. 'రేలా రేలాయో రేలా' అంటూ ఆడా మగా కలసి ఆడిపాడతారు. మాయామర్మం, కలి కల్మషం లేని అడవి బిడ్డలు. వారితో కలిసి కోయగూడేలలో, అడవుల్లో గడిపిన రోజులు గుర్తొస్తే నాకు అద్భుతమైన అనుభూతి కలుగుతుంది. అవసరం లేకున్నా కారులో పాల్వంచ నుండి మాధారం, ములకలపల్లి, జగన్నాథపురం, గంగారం, అంకంపాలెం, పట్వారి గూడేల మీదుగా దమ్మపేట వెళుతుంటా. రోడ్డు సౌకర్యం కూడా లేని రోజుల్లో 1970 దశకంలో ఈ దారిన కాలినడకన అనేక డజన్ల సార్లు వెళ్ళి వచ్చే వాడిని. ఆ నేల, ఆ అడవి, కొండలు, వాగులు చూస్తుంటే ఎంతో అనుబంధం గుర్తుకొస్తూ ఉంటుంది. దారిలో చిన్నప్పుడు నేను సేదదీరిన చెట్లు కొన్ని ఇప్పటికీ అలాగే ఉన్నాయి. వాటి క్రింద పదినిమిషాలు కూర్చుని వెళుతుంటాను. అక్కడి కుక్కలను, మనుషులను, గొడ్లను అడవులను చూస్తుంటే

ఆప్యాయత పొంగిపొర్లుతుంది. మేమూ కుక్కలను పెంచేవాళ్ళం. వాటికి సరిపడ అన్నం పెట్టలేక పోయేవాళ్ళం. గంజి పోసేవాళ్ళం. ఆ బాధతోనే ఇప్పటికీ అవే పేర్లతో కుక్కలను ప్రేమతో పెంచుతుంటాం.

నేను అరణ్య మార్గంలో కమలాపురం నుంచి ములకలపల్లి పాఠశాలకు ఏడు కిలోమీటర్లు కాలిబాటన వెళ్ళివస్తుంటే నక్సలైట్లు కలిసేవారు. కొంతసేపు కూర్చోబెట్టుకుని మాట్లాడించేవారు. ఇప్పుడు ఆ గ్రూపులు లేవనుకుంట. అనేక గ్రూపులుగా విడిపోయారనుకుంటా. ఆ ప్రభావంతోనే ఆ రోజుల్లోనే నేను చిన్న గేయం వ్రాశాను. *"బూటకపు ప్రజాస్వామ్యంలో ఎన్నికల మాయా జూదంలో గెలుపెప్పుడూ కౌరవులదే. పరిష్కారమొక్కటే మా అన్నల కురుక్షేత్రం. చట్టం తెలిసిన దగాకోర్లకి పట్టాకత్తే సమాధానమని, తుపాకి గుండే తగిన మందని చాటండ్రా"* అని ఆ తరువాత ఆ పంథా సరియైనది కాదని, ఈ యుగధర్మం ప్రజాస్వామ్యమని గుర్తించడం వల్లనే ఈ పుస్తకం వ్రాయగల్గుతున్నాను. దేశంలో అరాచకాలు జరుగుతున్నాయంటే ప్రజలను చంపవద్దు. ప్రభువులనూ చంపవద్దు. ప్రభుత్వాలను అంతమొందించాలి. అదే నిజమైన మహా తిరుగుబాటు. అదే నిజమైన మహా పోరాటం. నిజమైన మహా సంస్కరణ. అడవిలో అన్నలు ఆయుధాలు వదిలేసి ప్రజా ఉద్యమాలలోకి రాదలచుకుంటే నా జీవితాన్ని అందుకు అంకితమిచ్చి వారితో కలిసి పోరాడతా. అదే నా పుట్టుకకు పరమార్థమనుకుంటా.

అంబేద్కర్ మహాశయుడు రాజ్యాధికారానికి దగ్గరగా లేని కులాలు అంతరించి పోతాయని అన్నాడు. అందుకే బడుగు బలహీన వర్గాలు ఆర్థికంగా బలపడి రాజ్యాధికారం సాధించాలని అభిలషించాడు. అంబేద్కర్ గొప్పమేధావి. బహు భాషాకోవిదుడు. న్యాయశాస్త్ర నిపుణుడు. రాజ్యాంగ నిర్మాత. అతని పట్టుదల, సాధన, క్రమశిక్షణ ఈనాటి యువతకు ఆదర్శం. ఆయన భారతీయ ధర్మం పట్ల విశ్వాసమున్న వ్యక్తి. పుట్టుక దళిత కుటుంబంలోనైనా ఆయన జీవితం తీర్చిదిద్దుకున్నది బ్రాహ్మణుల సహాయ సహకారాలు, ప్రేరణతోనే. ఆయన పాఠశాల విద్యాభ్యాస సమయంలో ఒక లెక్కను బ్లాక్‌బోర్డుపై చేయమని ఆహ్వానించినవాడు ఒక బ్రాహ్మణ ఉపాధ్యాయుడే. కొందరు విద్యార్థులు అందుకు అభ్యంతరం చెప్పారట. అభ్యంతరం చెప్పిన విద్యార్థులు బ్రాహ్మణులు

కాదు. బ్రాహ్మణ విద్యార్థులైతే బ్రాహ్మణ ఉపాధ్యాయుడికి వ్యతిరేకంగా ఉద్యమించరు గదా. విద్యార్థులైనా ఎందుకు అభ్యంతరం చెప్పారో సరియైన కారణం తెలియదు. అంబేద్కర్ అన్న పేరు బ్రాహ్మణ కుటుంబం ప్రతిపాదించినదే.

ఆయన జీవితంలో అత్యధిక భాగం హిందువుగానే జీవించారు. 56వ ఏట రెండవ భార్యగా శారదా కబీర్ అనే బ్రాహ్మణ స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఆ తర్వాతనే బౌద్ధ మతం స్వీకరించారు. ఆపై ఎక్కువ కాలం జీవించలేదు. బౌద్ధమతం స్వీకరించేటప్పుడు కూడా బౌద్ధం భారతీయతలో భాగమని, భారతీయ ధర్మానికి అత్యంత తక్కువ వ్యతిరేకమైనది కాబట్టే బౌద్ధం స్వీకరిస్తున్నట్లు వివరించారు. ఈ సంఘటన ద్వారా వారికి భారతీయ ధర్మం పట్ల ఉన్న అభిమానాన్ని గ్రహించవచ్చు. వారు ఇస్లామో, క్రిస్టియానిటినో స్వీకరించ లేదు. వారు బౌద్ధం స్వీకరించే సమయానికి ఈ రెండు మతాలు భారతదేశంలో బలంగా ఉన్నాయి. బౌద్ధం నామ మాత్రావశిష్టంగానే ఉంది. ఐనా వారు బౌద్ధాన్నే స్వీకరించారంటే, పైగా భారతీయతకు అత్యంత తక్కువ హాని చేసే మతంగా బౌద్ధాన్ని భావించారంటే భారతీయ ధర్మం పట్ల వారికి గౌరవ భావమున్నదని అర్థమవుతున్నది. బౌద్ధం కూడా భారతీయతకు ఎంతో కొంత హాని చేస్తుందని కూడా వారు భావించినట్లే. మరి అంబేద్కర్‌ను ఆరాధించేవారు ఏ దిశగా ప్రయాణిస్తున్నారో ఆలోచించుకోవాలి.

అంబేద్కర్ పేరును భారతీయత పైన, బ్రాహ్మణీకం పైన వ్యతిరేకతకు పర్యాయపదంగా ప్రచారం చేయడం దుష్ట రాజకీయ తంత్రంలో భాగమే. హిందూమతంలో ఉన్న అంటరానితనం వంటి దురాచారాలను వారు వ్యతిరేకించారే తప్ప బ్రాహ్మణులను గాని, భారతీయతనుగాని వ్యతిరేకించలేదు. సమాజంలో దళితులపై వివక్షను, వెనుకబాటుతనాన్ని రూపుమాపే ప్రయత్నం చేశారు తప్ప కులమత విద్వేషాలకు పిలుపు నివ్వలేదు. సాంఘిక దురాచారాలపై పోరాడినవారు కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు, రాజా రామ్మోహన్ రాయ్, బాలగంగాధర తిలక్ వంటి బ్రాహ్మణులు కూడా వున్నారు. అంబేద్కర్‌ను ఒక సంఘ సంస్కర్తగా చూడాలే తప్ప సంకుచిత భావనల ప్రచారానికుపయోగించి వారి కీర్తిని తక్కువ చేడయం సరికాదు.

ఆయన ఈ రోజు ముఖ్యంగా తెలుగు రాష్ట్రాలలో జీవించి ఉంటే బ్రాహ్మణుల కోసం కూడా సామాజిక ఉద్యమం నిర్వహించేవారు. అటువంటి వ్యక్తి మరొకసారి ముఖ్యంగా తెలుగు రాష్ట్రాల్లో, ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాలని మరసారా కోరుకుంటున్నాను. అంబేడ్కర్ రచించిన భారత రాజ్యాంగాన్ని ఆమోదించిననాడు పార్లమెంటులో కూర్చున్న సభ్యులలో మెజారిటీ వారు బ్రాహ్మణులేనన్న విషయం కూడా విస్మరించరానిది. అంబేడ్కర్ మహాశయుడు బడుగు, బలహీన వర్గాలకు రిజర్వేషన్లు పది సంవత్సరాలకు మాత్రమే పొందుపరిచాడు. ఆ తర్వాత ఈనాటి వరకు వాటిని పొడిగించుకుంటూ వచ్చినవారు ఇతర కులాల వారేనని కూడా విస్మరించరాదు. అంబేడ్కర్ అణగారిన వర్గాల గురించి ఆలోచన చేశాడు తప్ప తమ కులంవారని కులాభిమానంతో చేసింది కాదు. అలా అనిపిస్తే ఇతర రాజ్యాంగ నిర్మాణ సభ్యులు, పార్లమెంటు సభ్యులు తప్పని సరిగా వ్యతిరేకించి ఉండేవారు.

పడినవారు తిరిగి ప్రయత్నపూర్వకంగా పైకి లేవాలి. యస్.సి., యస్.టి., బీ.సి., కులాలు, బ్రాహ్మణులు, కోమటి కులాలు వంటలు, వైదికం మరియు ఉద్యోగాలను, కూలి పనులను, అతి నిమ్న వృత్తులను మాత్రమే నమ్ముకోవడం కాక వ్యవసాయం, వ్యాపారం, వృత్తులు, కళలు, సేవలు, ప్రభుత్వం అనుమతించిన అన్ని రంగాలలో కూడా ప్రవేశించి ఆర్థిక స్థితిగతులను ముందుగా పెంపొందించుకోవాలి. అదే అంబేడ్కర్‌కు నిజమైన నివాళి. ముఖ్యంగా ప్రతి కులం సంఘటితంగా ఉండటం నేర్చుకోవాలి.

ప్రస్తుత పరిస్థితుల్లో వనరులు కొన్ని వర్గాల వద్ద విపరీతంగా పేరుకు పోతున్నాయి. వారే వనరులను, విద్యను, రాజకీయాలను అత్యంత ఖరీదైనవిగా మార్చి ఇతరులు తమకు పోటీ రాని విధంగా జాగ్రత్త పడుతున్నారు. ఈ పరిస్థితిని అర్థశాస్త్రంలో ఆలిగోపోలితో పోల్చవచ్చు. ఆలిగోపోలి అంటే కొన్ని రంగాలలో ప్రవేశించాలంటే ఇతరులు అందుకోలేనంత ఎత్తైన నిబంధనలనే అడ్డు గోడలను నిర్మిస్తారు. తద్వారా ఇతరులు ఆయా రంగాలలో ప్రవేశించలేరు. ఉదాహరణకు కొన్నిరకాల పరిశ్రమలు మరియు వ్యాపారాలు ప్రారంభించాలంటే ప్రభుత్వ అనుమతులు తప్పనిసరి. అట్టి పరిశ్రమలు స్థాపించే నిబంధనలు

కఠినతరంగా ఉంటాయి. అంటే పాలకులు అంగీకరిస్తేనే పర్మిషన్లన్నమాట. ప్రాథమిక పెట్టుబడి, సాంకేతిక పరిమితులు ఇంత ఉన్నతంగా ఉంచుతారు కదా అంటే సామాన్యులకెవ్వరికి అందుబాటులో ఉండవు. తద్వారా ఆయా రంగాలలో వారికి ఇతరుల నుంచి పోటీ లేకుండా పోతుంది. రాజకీయాలలో ఎన్నికలు, పదవులు ఆ కోవకు చెందుతాయి.

నిజానికి వెనుకబడిన అగ్రవర్ణాలు ఉద్యోగాలలోగాని, రాజకీయాలలోగాని నష్టపోతున్నది దళిత, బహుజన, బడుగు, బలహీన వర్గాలకు రిజర్వేషన్లు కల్పించడం వల్ల కాదు. పాలక వర్గాల మాయా రాజకీయం వల్ల. విద్యా, ఉద్యోగ, వనరులను పేదవాడికందనంతగా వాణిజ్యీకరించడమే కారణం. వీధిదీపాల క్రింద చదువుకొని డిగ్రీలు సంపాదించే రోజులు పోయాయి. లక్షలు ఖర్చుపెట్టి దీర్ఘకాలిక శిక్షణలు పొందిన వారికే అది సాధ్యం. అంతకూ దిగజారి ప్రశ్నాపత్రాలను ముందుగానే కోట్ల రూపాయలకు కొని లక్షల రూపాలయలకు విద్యార్థులకు అమ్ముకొనే విద్యా సంస్థలు తయారయ్యాయి. ఇలాంటి సందర్భంలో కష్టపడి చదివిన పేద విద్యార్థుల శ్రమ బూడిదలో పోసిన పన్నీరే. ఈ పాపాలు పాలకులవు కావా?

ఉదాహరణకు ఉస్మానియా యూనివర్సిటీలో మెడిసిన్‌లో మొదటి సంవత్సరంలో 100 సీట్లున్నాయి. అందులో 50 రిజర్వ్‌డ్, 50 ఓపెన్. 50 ఓపెన్‌లో బ్రాహ్మణులకు గానీ, వైశ్యులకు గాని చెరి ఒకటి కంటే ఎక్కువ వచ్చిన దాఖలాలు బహు అరుదు. ఓపెన్ కేటగిరీలో 90 శాతం పాలక, ధనిక వర్గాలకే సంక్రమిస్తున్నాయి. అంటే, రిజర్వేషన్ లేకుండా కూడా బ్రాహ్మణులకు, వైశ్యులకు మరొక చెరి ఒకటి లేదా రెండు వస్తాయి. మిగిలినవన్నీ ధనిక పాలక వర్గాలకే. ఇప్పుడు పరిస్థితి ఇలా ఉంటే అప్పటి పరిస్థితి ఊహించుకోవచ్చు. సర్వం తామే అయి అన్ని మిగిలిన జాతులను సంపూర్ణంగా అణగద్రొక్కే వారు. ఓ.సి.కి ఉన్న 50% అవకాశాలు ముఖ్యంగా రెండు కులాలే అనుభవిస్తున్నాయి.

ఓ.సికి ఉన్న 50% అసెంబ్లీ స్థానాల్లో బ్రాహ్మణ, వైశ్య, మైనార్టీలకు ఎన్ని వస్తున్నాయో చూస్తే విషయం అర్థమౌతుంది. ఇక ఉద్యోగ విషయాల్లో కూడా

మిగిలిన ఓ.సి.లు వ్రాత పరీక్ష ఎంత బాగా వ్రాస్తే ఏం లాభం? ఇంటర్వ్యూ బోర్డులో కూర్చునేదెవరు? ఓ.సి.లో వున్న కాపు, ముస్లిం వంటి వారిని బి.సి.లో చేర్చి రిజర్వేషన్ ఇస్తామనడం కూడా సరికాదు. దీనివల్ల ఓ.సి.లోని మిగిలిన సీట్లను కూడా డామినేటింగ్ ఓ.సి.లే అనుభవిస్తారు. అది డామినేటింగ్ ఓ.సి.లకు లాభం చేకూర్చే చర్య. అలాగే మంది ఎక్కువైతే మజ్జిగ పలుచన అయినట్లు వాస్తవ బి.సి.లకు అన్యాయమే జరుగుతుంది. ఓ.సి.లోని కొందరిని బి.సి.లో చేర్చి రిజర్వేషను ఇచ్చే బదులు వారిని ఓ.సి.లోనే ఉంచి ఓ.సి వర్గీకరణ చేయవచ్చు. వాస్తవానికి యస్.సి., యస్.టి., బి.సి., ఓసి వర్గీకరణ కూడా జరగాలి. అప్పుడే సరియైన సామాజిక న్యాయం జరుగుతుంది.

సమాజం ఒకే వైపు మొగ్గు ఉండి, గుత్తాధిపత్యం లేకుండా ఉండాలంటే వారికి పోటీగా అధిక సంఖ్యాకులయిన దళిత, బహుజన, బడుగు, బలహీన వర్గాలు బలోపేతం కావలసి ఉంది. జనాభా ప్రాతిపదికన అతికొద్ది సీట్లు ఒక్కొక్క బడుగు బలహీన వర్గాల వారికి కేటాయించి, అత్యంత అల్ప జనాభా గల తమ సామాజిక వర్గానికి మాత్రం మిగిలిన అన్ని సీట్లు కేటాయించుకుంటారు. ఇది ఎంత వరకు సమంజసం? జనాభా ప్రాతిపదికన తాము తీసుకుని మిగిలినవి జన బాహుళ్యానికి ఇవ్వవచ్చుకదా? అలా చేయరు. కొన్ని సీట్లకు రిజర్వేషన్లు ఇవ్వడం ద్వారా దళిత, బహుజన, బడుగు, బలహీన వర్గాల వారిని సైనికులుగా మాత్రమే వాడుకుంటూ తాము మాత్రం పార్టీ అధినేతలుగా, రారాజులుగా అవకాశమొస్తే ముఖ్యమంత్రులుగా, ప్రధానమంత్రులుగా అధికారం చెలాయిస్తూ ఉంటారు. ఈ ప్రజాస్వామ్య రాజకీయ క్రీడలో పాలకులు తప్ప అందరూ బాధితులే.

నా వద్దకు ఈ మధ్య ఒకాయన వచ్చి రిజర్వేషన్ల వల్ల ఓ.సి.లు నష్టపోతున్నారు. రిజర్వేషన్ల వ్యతిరేక సంఘం పెట్టాం. బ్రాహ్మణ కులం నుంచి మీరు సభ్యులుగా ఉండాలని ప్రతిపాదించారు. ఇప్పటికే ఓ.సి. కేటగిరిలో వున్న అవకాశాలలో ఎక్కువ భాగం మీరే అనుభవిస్తున్నారు. ఇంకా చాలలేదా అని తిట్టి పంపించాను.

చర్చలు ప్రజాస్వామ్య యుతంగా, పరస్పర గౌరవాదరాలతో, తెరిచిన మనసుతో ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో జరగాలి. ముఖ్యంగా మత విశ్వాసాలు రాజ్యాంగ హక్కులు. వాటిని విమర్శించే వారు తప్పనిసరిగా చట్టం దృష్టిలో నేరస్తులే. కావున విశ్వాసాలపై చర్చలు అత్యంత వినమ్రంగా చేయాలి. ఎదుటి వ్యక్తిని వినటం నేర్చుకోవాలి. సనాతనమైనవన్ని తప్పు లేదా ఒప్పు అన్న భావనతో ఉండకూడదు. అలాగే ఆధునిక విజ్ఞానమైనా. విజ్ఞానం పాతదా, క్రొత్తదా అన్న భేదం లేదు. నువ్వు నమ్మిన సిద్ధాంతాన్ని నువ్వు ఆచరించుకో. మరొకడి నమ్మకాన్ని తప్పు పట్టాలన్న తాపత్రయం నీకెందుకు?

ఈ పుస్తకంలో చర్చించబోయే విషయాలలో ఎక్కువ తార్కికాలే. వాస్తవాలు మరో విధంగా కూడ ఉండి ఉండవచ్చు. పరిశీలించేవారు అలాంటి దృష్టితోనే పఠించాలని మనవి. వాస్తవాన్వేషణ దృష్టితో బ్రతకాలి. తెలిసిన వాస్తవాలు నలుగురితో పంచుకోవాలి. *ఎరుక గలవారి చరితలు గరచుచు ఎరిగిన దానిని మరువక అనుష్ఠించునది సమంజస బుద్ధి* అంటాడు విదురుడు. ఏమీ తెలియనప్పుడు అన్నీ తెలుసని విర్రవీగాను. ఇప్పుడు ఉద్దండ పండితుల చెంతనుండటంతో *ఇంచుక బోధశాలినై గతమయ్యె నితాంత గర్వమున్* అంటాడు భర్తృహరి. మనకు తెలిసింది మాత్రమే వాస్తవమని నమ్మటమే మూఢనమ్మకమంటె.

తెలుగు జాతిలో ఆది క్షత్రియులు, ఆది భూమి పుత్రులు ముఖ్యంగా మాల, మాదిగ కులస్తులు మరియు ఇతర యస్.సి., యస్.టి.,బీ.సి. జాతుల వారే. మొదటగా పరిపాలించినవారు లేక మొదటగా రాజ్యాలు పోగొట్టుకున్నది కూడా వారే. ఆ తర్వాతి కాలంలో మహ్మదీయులు, మహ్మదీయుల నుంచి బ్రిటీషు వారు భారతదేశాన్ని హస్తగతం చేసుకొన్నారు. పరిపాలనకు ఆవసరమైన క్లుప్తమైన శిలా శాసనాలు తప్ప క్రీ॥పూ॥ 1000 సంవత్సరాలకు ముందు వ్రాయబడ్డ చారిత్రక గ్రంధాలు మనకు అందుబాటులో లేవు. ఏ విప్లవ కవి అయినా సంఘ సంస్కరణాభిలాషి అయినా సిద్ధాంతీకరించేది ఈ 3000 సంవత్సరాల చారిత్రక కొద్ది పరిజ్ఞానంతోనే. అందుకే సంస్కరణలు సూత్రప్రాయంగా చర్చించాలే తప్ప తీవ్ర పదజాలం వాడటం, తీవ్ర పరిణామాలకు దారితీయడం, ఇతరుల మనోభావాలను నొప్పించడం,

కులాలను విమర్శించడం, సంస్కరణాభిలాషులు చేయకూడదు. నాకు ఒక్కడికే తెలుసని భ్రమించడం, నేను చెప్పిందే సరియైనదని పిడివాదం చేయడం, నా వాదానికి విరుద్ధమైన వ్యక్తులను చంపుతాననడం సంస్కరణ అనే భావానికే విరుద్ధం. నిజంగా మనకేం తెలుసు? ఇరవై వేల సంవత్సరాల క్రితం ఏమేం జరిగాయో. కాకుంటే మానవ మేధస్సుతో ఊహించవచ్చు. ఏదైనా అది ఊహ మాత్రమే. మానవుడు ఈ భూగోళంపై జీవించడం ప్రారంభించి ఎన్ని లక్షల సంవత్సరాలైనా అయి ఉండవచ్చు.

ఈ మధ్య హేతువాదం అని ఒక పేరు వినబడుతున్నది. గతంలో ఆచార్య రజనీష్, చలం వంటి వారు బూతు వాద ప్రచారం కూడా చేశారు. ఈ హేతువాదం, బూతువాదం వాదులాడుకోవడానికి పనికి వచ్చేవే. అంతకుమించి వాటిలో ఏ ప్రత్యేకతా లేదు. హేతువాదం, బూతువాదం రెండూ క్రిమి కీటకాదులు, జంతువులు, మానవులతో సహా జీవన గమనంలో అనునిత్యం అనుసరిస్తున్నవే. *ఆహార, నిద్రా, భయ, మైధునాని ఏతత్సమానం పశుభిర్నరాణాం* అన్నది శాస్త్రోక్తి. భయం నుంచి, మైధునం నుంచి పుట్టినవే ఈ హేతువాదం, బూతువాదం. హేతువు లేకుండా ఏ జంతువు కానీ, మనిషికానీ ప్రవర్తించదు. అలా ఎవరైనా ప్రవర్తిస్తే వారు తప్పనిసరిగా పిచ్చివారే.

సురతం వల్ల సౌఖ్యం కలుగుతుందనీ, స్త్రీ, పురుషులు తమకు నచ్చిన వారిని కోరుకుంటారని చెప్పడానికి బూతువాదం అనే పేరు పెట్టి వివరించవలసిన అవసరం లేదు. అది ప్రతి జీవికీ అనుభవంలోని విషయమే. అలాంటి విషయాలను సమాజ హితం ఆలోచించకుండా నిస్సిగ్గుగా ప్రచారం చేయడం వ్యక్తి గొప్పదనానికి నిదర్శనం మాత్రం కాదు. అలాగే హేతువాదం. ఏడంతస్తుల మేడపైనుంచి భగవంతుడిపై భారం వేసి క్రిందకు దూకే భగవద్భక్తుడెవడైనా ఉన్నాడా? తప్పని సరిగా స్వయంకృషితో మెట్లు దిగే వస్తాడు. అలాగే జబ్బు చేస్తే డబ్బుండీ, చికిత్స చేయించుకునే అవకాశముండి కూడా భగవంతుడిపై భారం వేసి చికిత్స చేయించుకోకుండా ఉండే భక్తుడెవరైనా వుంటాడా? డబ్బు లేక, చికిత్స అందుబాటులో లేక, జబ్బు తగ్గదని, చనిపోవడం ఖాయమని తెలిసిన సందర్భంలోనే భగవంతుడిపైన మాత్రమే భారం వేసి వేడుకుంటాడు. అంతకన్నా ఆ పరిస్థితులలో చేయగలిగింది కూడా ఏమీ లేదు.

ప్రయత్నం చేయగలిగినంత సేపు ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. తన ప్రయత్నాలు విజయవంతం కావాలని మాత్రమే కోరుకుంటాడు. ఆ సందర్భంలో కూడా మానసిక సాంత్వన పొందగూడదంటే ఎలా? అలాంటి నిస్సహాయ స్థితిలో వున్న వారి ప్రవర్తనను ఏదో ఒక వాదం పేరు పెట్టి అవహేళన చేయడం అమానుషం. భక్తులైన వారికి కార్యకారణ సిద్ధాంతం తెలియదా? *షడ్భాగంతు మనుష్యాణాం, సప్తమం దైవ చింతనం* అన్న సూక్తి తెలియదా? తప్పని సరిగా తెలుసు.

ఎవరైనా అమాయక ప్రజలను మోసం చేసి డబ్బు సంపాదిస్తున్నాడంటారా! అది తప్పనిసరిగా మోసమే. ఐ.పి.సి సెక్షను 420 క్రింద కేసులు పెట్టవలసిన అంశమే. అలాంటి కొన్ని సందర్భాలనుటంకించి చెబుతూ వాటికి మత విశ్వాసాలను జోడించి విమర్శించడం తప్పని సరిగా నేరమే. అలా అమాయక ప్రజలను మోసం చేసి బ్రతికే వారు చాలా మందినే ఉన్నారు. న్యాయబద్ధమైన అనేక వృత్తి ఉద్యోగ, వ్యాపారాలలోని వారూ అన్యాయాత్మకంగా లక్షలు, కోట్లు అమాయక ప్రజల నుంచి దండుకుంటూనే ఉన్నారు. ఇది కూడా అలాంటిదే. దీనికి మాత్రం కులం పేరుతో బ్రాహ్మణులను ఎవరైనా నిందిస్తున్నారంటే అలా చేసేవారు తప్పనిసరిగా కులగజ్జిరోగం అంటినవారేనని నా భావన. ఒక కులాన్ని కులంగా అతిగా అభిమానించినా, వేరొక కులాన్ని కులంగా అతిగా దురభిమానంతో దూషించినా రెండూ కుల గజ్జి వ్యాధి లక్షణాలే. తప్పును తప్పుగాను, వ్యక్తి తప్పుచేస్తే వ్యక్తి తప్పుగాను విమర్శించాలి. కులాలను నిందించకూడదుగదా!

వాస్తవానికి భక్తి వ్యవహారంలో బ్రాహ్మణులు కార్మికులు మాత్రమే. యజమానులు ప్రభుత్వాలు, ప్రజా సంఘాలే. భక్తి వ్యవహారంలో మూడు సమూహాలుంటాయి. భక్తికి ఆలవాలమైన దేవాలయాలను, ధార్మిక సంస్థలను నిర్మించి నిర్వహించేవారు, దేవాలయాలను సందర్శించి మొక్కులు తీర్చుకొనే భక్తసమూహాలు, దేవాలయాలలో, గృహాలలో పూజాదికాలు నిర్వహించి జీవనయానం చేసే బ్రాహ్మణులు. భక్తితత్వాన్ని విమర్శించదలుచుకున్నవారు పై మూడు సమూహాలను, ముఖ్యంగా దేవాలయాల నిర్వాహకులను, భక్తులను, పూజారులను లేదా వైదిక వృత్తిని అవలంబించే వారిని కలిపి విమర్శించాలి.

బ్రాహ్మణులందరు పూజారులు, వైదికులు మాత్రమే కాదు. అన్ని రంగాలలోను సమాజంతో కలిసి జీవిస్తున్నారు. గుడులు బ్రాహ్మణులు నిర్మించుకున్నవి కాదు. క్షత్రియులు నిర్మించారు లేదా సమాజాలు నిర్మించాయి. గుడులలోని ఆదాయం పూర్తిగా బ్రాహ్మణులకు చెందదు. భక్తిని, భగవంతుడిని విమర్శించేవారు భక్తి నిర్మాతలను ప్రశ్నించరు. భక్తులనూ విమర్శించరు. బ్రాహ్మణులను కులం పేరుతో విమర్శిస్తారు. ఇది కుల గజ్జి ప్రవర్తన కాక మరేమిటి? భగవంతుడికి కోటి రూపాయల విలువ చేసే వజ్ర కిరీటం బహూకరించిన భక్తుడు బ్రాహ్మణునికి లక్షరూపాయలు ఇస్తాడా ఏంటి? భక్తి కలిగిన భక్తుడు కోటి రూపాయలతో తన ఇష్టదైవానికి గుడి కట్టిస్తాడు. వెతికి పట్టి తెచ్చి ఒక బ్రాహ్మణుడిని అర్చకుడిగా నియమించి ఎంతో కొంత జీతం ఇస్తాడు. గుడి అభివృద్ధి చెంది లాభసాటిగా ఉంటే ప్రభుత్వ ఎండోమెంటు వారు స్వాధీనం చేసుకుంటారు. జీతాలు దొరకక, దొరికినవి చాలక అర్చక సంఘాలు రోడ్డున బడతాయి. ఇదీ ఇండియాలో భక్తి కథ.

భక్తి భావనకు పరాకాష్ట భాగవత గ్రంధము. మానవుడు దైవత్వానికి చేరుకునే దారి చూపే భక్తిమార్గ సముల్లేఖనమే భాగవతం. అలాంటి భాగవతంలో భక్తులు భగవంతునిపై ఎప్పుడు ఆధారపడాలి? ఎలా ఆధారపడాలి? అనే విషయం గజేంద్రమోక్షం ఘట్టం మనకు తెలియజేస్తుంది. దాహార్తుడైన గజేంద్రుడు నీరు త్రావడానికి చెరువులోకి దిగుతాడు. పెద్దమొసలి ఒకటి గజేంద్రుని కాలు పట్టుకుంటుంది. గజేంద్రుడు ముందుగా ముకుందుని ప్రార్థించలేదు. అనేక పగలు రాత్రులు గజేంద్రునికీ, గ్రాహకానికి మధ్య ఘోర పోరాటం జరిగింది. చివరకు గజేంద్రుని శక్తి నశించి నీరసించింది. ఇక స్వీయ శక్తి సరిపోదని గ్రహించింది. ఏమీ చేయలేని నిస్సహాయ స్థితికి చేరుకుంది. అప్పుడు అచ్యుతుడిని ఈ విధంగా ప్రార్థించింది. *“లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె, ప్రాణం బులున్ ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్, నీవేతప్పనితః పరంబెరుగ, మన్నింపందగున్ దీనునిన్, రావే ఈశ్వర! కావవే వరద, సంరక్షింపు భద్రాత్మకా!”* తను చేయగలిగిన ప్రయత్నమంతా సంపూర్ణంగా చేసి ఇక తాను చేయగలిగిందేమీ లేని సందర్భంలోనే పరమాత్ముడిని ప్రార్థించింది. ఇదే

షడ్భాగంతు మనుష్యాణాం, సప్తమం దైచింతనం అంటే. దీని నుంచి ప్రతి ఒక్కరు నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది. *బాబా బ్లాక్ షీప్ హేవ్ యు ఎనీ ఊల్ అని, రెయిన్ రెయిన్ గో ఎవే* అని జంతువులను, ప్రకృతిని ఉద్దేశించి సంభాషించే ఆంగ్ల పాఠాలను సగర్వంగా పిల్లలకు భోధించే ఆధునిక మేధావులు ఏనుగు భగవంతుడిని ప్రార్థించడమేమిటండీ అని ప్రశ్నించినా వారికి సమాధానం చెప్పటం వృథా. వ్యాసుల వారు భక్తితత్వాన్ని, భగవంతుని ఆర్తత్రాణ పరాయణత్వాన్ని వివరించడానికి వాడుకున్న సంఘటనగా భాగవతంలోని గజేంద్ర మోక్ష ఘట్టాన్ని అర్థం చేసుకోవాలి.

ఏ ఆలోచనైనా, ఏ వాదమైన ప్రస్తుత పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని ప్రజాస్వామ్య బద్ధంగా, శాంతియుతంగా సాటి మానవుల పట్ల ప్రేమానురాగాలే పరమావధిగా ప్రజల అవగాహనను, జీవన విధానాన్ని మెరుగు పరచడమే పరమావధిగా సాగాలి. మరే ఇతర రకంగా చర్చ కొనసాగినా అందులో స్వార్థం, మూర్ఖత్వం నిండి ఉంటాయనడంలో సందేహం లేదు. ఇక రెండవ రకం వ్యక్తులు వారు ప్రచారం చేస్తున్న విషయాలు వాస్తవాలని తెలియకపోయినా, అవాస్తవాలని తెలిసినా ఏదో ఒక దురుద్దేశముతో వాదనలు కొనసాగిస్తారు. ఈ రెండు రకాల వ్యక్తుల వల్ల సమాజంలో సమతౌల్యం లోపించి అశాంతికి దారి తీస్తుంది. ఎలాంటి మాట మాట్లాడాలి అనే విషయంలో శాస్త్రం రెండు విషయాలు తెలియజేస్తుంది. ఒకటి అసత్యమాడ రాదని, రెండవది *సత్యం భూతహితం ప్రోక్తం* అని. అనగా భూతహితమైన సత్యాన్ని మాత్రమే చెప్పాలి. హితం కాని విషయం సత్యమైనా చెప్పకూడదు. నేను ఉన్నదున్నట్లు మాట్లాడతానని కొందరు ప్రగల్భాలు పలుకుతూ ఉంటారు. వారి కుటుంబ రహస్యాలను వారలాగే పదుగురిలో చర్చిస్తారా? తమ శరీరం ఉన్నదున్నట్టు చూపిస్తారా? అలా చూపిస్తే అదే ఆటవికం. శరీరానికి బట్టలు కట్టి చూపడమే నాగరికత. వాస్తవాలను మర్యాదగా అవసరమైనంత వరకే సౌమ్యమైన భాషతో సున్నితంగా చెప్పటమే సంస్కారం.

ప్రజలు కొంత వరకు చైతన్యవంతులౌతూనే ఉన్నారు. అందుకే ప్రజలకు నా మనవి ఏమిటంటే *వినదగునెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్.* మేధావి అని ఎవరైనా ముసుగు వేసుకొని వచ్చి ఏదైనా చర్చ

పెట్టాడనుకోండి. ముందుగా విచారించండి. అతని కులమేంటి? అతని మతమేంటి? అతను ఏ రాజకీయ పార్టీకి ప్రత్యక్ష, లేదా పరోక్ష అనుబంధం కలిగినవాడు లేదా మద్దతుదారు? ఏ కులాన్ని లేదా ఏ మతాన్ని, టార్గెటు చేస్తున్నాడు? ఎందుకు చేస్తున్నాడు? అతని కులం అత్యంత నిజాయితీతో కూడుకున్నదా? కాకుంటే దానినెందుకు టార్గెట్ చేయట్లేదు. ఇత్యాది విషయాలనన్నీ విచారించిన తర్వాతనే అతని మాటలకు విలువనివ్వాలి. అతని కులాన్నెందుకు విచారించమంటున్నానంటే అతను టార్గెటు చేస్తున్నది కూడా మరో కులాన్నే కదా!

ఏ కులమైనా సామాజిక వ్యవహారాలలో కులాభిమానంతో ప్రవర్తించినా పెద్దగా ప్రమాదమేమీలేదు. అంటే వివాహాది ఆచార వ్యవహారాలు ఎవరివి వారు ఆచరించుకుంటే ప్రమాదం లేదు. ముఖ్యంగా వెనుకబడిన కులాలు ఐక్యంగా కదలడం కూడా ఆహ్వానించదగ్గ విషయమే. ఎవరైనా తమతమ కులమతాచారాలు యధేచ్ఛగా పాటించుకోవచ్చు. ఇందువల్ల దేశానికొచ్చిన నష్టంలేదు. బ్రాహ్మణులు తమ కులాచారాలను పాటించుకోవడం వారి హక్కు. అందువల్ల కూడా దేశానికి నష్టం ఉండదు. అవి పౌరుల ప్రాథమిక రాజ్యాంగ హక్కులు. సంభావనలు, ఫీజులు అధికంగా తీసుకుని మహా కోటీశ్వరు లవుతున్నారా! లేదు కదా!

ఒక్కొక్క న్యాయ పరమైన వివాదంలో న్యాయవాది ఫీజు వందకోట్ల రూపాయలు కూడా ఉంటుంది. అలాగే వైద్యుల ఫీజులు, ఆడిటర్ల, ఇంజనీర్ల ఫీజులు. కళాకారులు, క్రీడాకారుల ఫీజులైతే చెప్పేపనే లేదు. ఐనప్పటికీ మూడు నుంచి పది రూపాయల వడ్డీ గుంజే వారికన్నా, కల్తీమద్యం, కల్తీపాలు అమ్మేవారికన్నా, ఇసుకపాలు ఎక్కువ కలిపి సిమెంటు బదులు బూడిదె కలిపి నాసిరకం నిర్మాణాలు చేసి ప్రభుత్వ ఖజానాకు కన్నం వేసే కాంట్రాక్టర్ల కన్నా, భూకబ్జాలు చేసే గుండాలకన్నా, కంచే చేను మేసిన విధంగా దేశ వనరులను పంచుకునే పాలకుల కన్నా కుల వృత్తులు పెద్ద దోపిడీలా? **ప్రజలు అవినీతిపరులైనా ఫర్వాలేదు. ప్రభుత్వం అవినీతిమయం కావడానికి వీలు లేదు. కులానికి కులం రంగు, మతానికి మతం రంగు అంటినా ఫర్వాలేదు.**

**దేశ, రాష్ట్ర పాలనలకు కులం, మతం రంగులు అంటకుండా చూసుకోవలసిన అవసరం ఉంది. అవే అన్నిటికన్నా ప్రమాదం.**

సామాజిక విషయంలో కాంగ్రెస్ పార్టీ ఎంచుకున్న విధానం సెక్యూలరిజం. నాటి జనసంఘ్ ఎంచుకున్న విధానం హిందుత్వ. వామపక్షాలు ఎంచుకున్న విధానం నాస్తికత్వం, సాంప్రదాయ వ్యతిరేకత. అన్నీ రాజకీయ వ్యూహాలే. స్వాతంత్రం సిద్ధించగానే జరిగిన ఎన్నికలలో కొన్ని రాజకీయ పార్టీలు భారత సనాతన సాంప్రదాయతను వ్యతిరేకించడమే ముఖ్య అజెండాగా పెట్టుకున్నాయి. ఇందుకు ముఖ్యకారణం గాంధీ, నెహ్రూలను సనాతన వాదులుగా భావించడమే. కాని వీరిద్దరు వ్యక్తిగతంగా హిందువులే అయినప్పటికి దేశాన్ని మాత్రం కుల, మత ప్రసక్తి లేని లౌకిక రాజ్యంగా నిర్మించాలని భావించారు తప్ప భారత దేశాన్ని హిందూ రాజ్యంగా నిర్మించాలని అనుకోలేదు, ప్రయత్నించనూ లేదు. అందుకు కారణం ఆ కాలంలో రాజకీయ శక్తిగా ఎదగగల్గిన, హిందుత్వ అజెండా కల్గిన బలమైన మరో వర్గం ఏర్పడి ఉండటమే.

హిందుత్వ వాదనకు వ్యతిరేకంగా ఉంటూనే హిందువుల మరియు ఇతర మతాల వారి ఓట్లను కోల్పోకుండా ఉండాలని భావించి దర్శించిన రాజకీయ వ్యూహమే సెక్యూలరిజం. అన్ని మతాలను గౌరవిస్తాం, అన్ని మతాలను సమానంగా చూస్తాం అన్న సెక్యూలరిజం విధానం వల్ల ఏ మతం వారి మనో భావాలను దెబ్బ తీయకుండా, వారి నుంచి వ్యతిరేకత పొందకుండా కాంగ్రెస్ పార్టీ హిందుత్వ భావజాలం కల్గిన ఆర్.యస్.యస్., నాస్తికులు, సాంప్రదాయ వ్యతిరేక పార్టీలైన వామపక్షాలను సులువుగా ఎదుర్కోగల్గింది. అత్యధిక ప్రజల మనోభావాలను గౌరవించడం ప్రజాస్వామ్య ప్రక్రియలో ముఖ్య ధర్మం.

ఈ మధ్య ఒక వ్యక్తి కోమటోళ్ళు సామాజిక స్మగ్లర్లు అని పేరు పెట్టి పుస్తకం వ్రాశాడు. వివాదం రేపటం కోసం కాకపోతే అలా ఒక కులం పేరు పెట్టి నింద వేయవచ్చా. కోమట్ల కులంలో గోయంకాలను, అంబానీలను ఇతర ఉత్తర భారత వ్యాపార వర్గాలను చేర్చి మరీ నిందించాడు. కానీ వారు కోమట్లు కాదు కదా. ఇతనికి వ్యాపారస్తులను నిందించడం ఒక పద్ధతి. ఒక కులాన్ని నిందించడం తప్పు కదా. కోమట్లందరు వ్యాపారస్తులు కారు.

వ్యాపారస్తులందరు కోమట్లూ కారు. అందువల్ల అతను చేసింది అర్థంలేని దురుద్దేశపూరిత విమర్శ. దానిపై కోమట్లు, బ్రాహ్మణులు, హిందూ మతాచార్యులు కూడా తీవ్ర ఆవేదనకు గురైనారు. విమర్శలు, ప్రతి విమర్శలు మీడియా నిండా రావడం చూచాను.

ఒక వైశ్య మిత్రుడిని అడిగి ఆ పుస్తకం తెప్పించుకుని చూశాను. అది ఒక పుస్తకం గాదు, పాడుగాదు. 18 పేజీల వ్యాసం. పదో తరగతి పిల్లవాడు వ్రాసే పరీక్షా పత్రమంత సైజు. ఇదొక పుస్తకమా, దీని మీద ఇంత వివాదమా అని పావు గంటలో చదివి పడేశాను. ఆ పుస్తకంలో నాలుగే అంశాలున్నాయి. ఒకటి, బ్రాహ్మణులు రాజకీయ దోపిడికి అవకాశం కల్పించారు. రెండు, కొమటోళ్ళు సామాజిక స్మగ్లర్లు. మూడు, హిందూ మతం లోపభూయిష్టం. నాలుగు, క్రిస్టియానిటి మంచి నైతికత కలిగిన మతం. ఆ పుస్తక ధ్యేయం నా కనిపించింది మాత్రం హిందూ మతాన్ని దెబ్బతీయడం, క్రిస్టియన్ మతాన్ని పొగడటం. ఆ రచయితకు తను పుట్టిన కులం మీద గౌరవం లేదు. మాతృదేశం పట్ల గౌరవం లేదు. స్వీయ మతం పట్ల గౌరవం లేదు, సాటి మానవ సమాజం పట్ల గౌరవం లేదు. స్వీయ భాష పట్ల గౌరవం లేదు. ఇలాంటి వారి వల్ల ఎవరికీ ప్రయోజనం ఉండదు, ప్రమాదం తప్ప. కోమటోళ్ళు సామాజిక స్మగ్లర్లు, బ్రాహ్మణులు స్వేదం చిందించలేదు అంటూ మతి భ్రమించో, ఏదో ఒక స్వార్థానికో ఆశపడి చేసే వ్యాఖ్యలకి అత్యంత ప్రాధాన్యమివ్వవలసిన పనిలేదు.

వైశ్యులు శాఖాహారులు, శాంతికాముకులు. జనజీవనం సజావుగా సాగడానికి స్వేదం చిందించే పనులు మాత్రమే సరిపోవు. మేధస్సును కరిగించే సేవలు కూడా అవసరం. రాజులు రక్తం చిందిస్తారే తప్ప స్వేదం చిందించరు. అందువల్ల రాచరిక వ్యవస్థ అవసరం లేదందామా? రాచరిక వ్యవస్థ లేకపోతే అరాచకం రాజ్యమేలదా?  రక్తం ఒక చోట పేరుకుపోతే అక్కడ శరీర భాగం కుళ్ళిపోతుంది. వినియోగ వస్తువులు, ఆర్థిక సంపత్తి ఒకే చోట పేరుకుపోతే సమాజ పరిస్థితి కూడా అంతే. అలా వస్తు సేవల ప్రవాహానికవసరమైనవే వర్తక, వాణిజ్య, వ్యాపారాలు.

ఒక రైలు నడవాలంటే స్వేదం చిందించి గనులలో గునపాలతో ఇనుప ఖనిజం త్రవ్వితే సరిపోతుందా? గనుల త్రవ్వకంలో ఇంజనీరింగ్ పరిజ్ఞానం, యంత్ర పరికరాల అవసరం లేదా? ముడి ఇనుము నుంచి దుక్క ఇనుము, ఉక్కు, తుప్పు పట్టని ఉక్కు తయారు చేసే పరిజ్ఞానం మేథో ప్రయోజనం కాదా? దాని నుంచి విడిభాగాలు, పరికరాలు, యంత్రాలు రూపొందించడానికి సాంకేతిక పరిజ్ఞానం అవసరం లేదా? అంతటితో కూడా సరిపోదు. రైలు మార్గాలు నిర్మించడం, రైళ్ళ రాకపోకలను నియంత్రించడం, టికెటింగ్ వంటి నియంత్రణ, నిర్వహణ వ్యవస్థలు అవసరం. ముసలితనంలో మతి భ్రమంచి మాట్లాడే వారికి అర్థం కాకపోవచ్చు కాని సమాజం మొత్తానికి మేధస్సు ప్రాముఖ్యత తెలుసు.

నిరుద్యోగం నిండి వున్న ఈ తరుణంలో ప్రభుత్వంపై ఉద్యోగాల కొరకు ఆధారపడకుండా స్వంత పెట్టుబడితో, స్వంత రిస్కుతో వ్యాపారాలు నిర్వహించడం, పది మందికి ఉద్యోగ వసతి కల్పించడం సామాజిక అవసరం కాదా? అలాంటి వ్యాపార వ్యవస్థ లేకపోతే ఉద్యోగాల కోసం ప్రభుత్వాలపై ఒత్తిడి పెరగదా? ప్రభుత్వ ఉద్యోగులకున్నట్లు వ్యాపారస్తులకు హక్కులు వుండవు. సమయాసమయాలూ ఉండవు. ఇరవైనాలుగు గంటలు ఇంటిల్లిపాది అందరూ అదే ధ్యాసలోనే ఉంటారు. నష్ట భయమూ ఉంటుంది. లాభాలే వస్తాయన్న గ్యారంటీ లేదు. నెల పూర్తవగానే జీతం రాదుగదా. స్వేదం చిందించే వారికన్నా మేధస్సును కరగించేవారు, మనోవేదన అనుభవించే వారే ఎక్కువగా అలసిపోతారు. మేధస్సు ఉన్నవారికెవరికైనా ఈ విషయం తెలుస్తుంది.

స్వేచ్ఛా వాణిజ్యానికి పితామహుడైన రాబిన్‌సన్ అనే ఆర్థికవేత్త ఒక సిద్ధాంతం ప్రతిపాదించాడు. 'నాట్ బికాజ్ ఆఫ్ ది బెనెవలెన్స్ ఆఫ్‌ది బుచ్చర్ ఆర్ ది బ్రూవర్ దట్ వుయ్ గెట్ అవర్ సప్పర్' అన్నాడు. అంటే మద్యం తయారీదారు దయ వల్లగాని, మాంసం సిద్ధం చేసే వాడి దయవల్ల గాని కాదు మనం రాత్రికి (పార్టీ) చేసుకునేది అని అర్థం. అంటే వారి వారి లాభాపేక్ష గురించే ఆయా సేవలనందిస్తున్నారని భావం. లాభం లేని పని ఎవరూ చేయరు గదా! ఉద్యోగస్తుడు కూడా జీతం ఇవ్వకుంటే పనిచేయడు గదా!

ఈ రోజు రాకపోకల వసతులు లేని కుగ్రామాలనేకమున్నాయి. ఆ గ్రామాలలో ప్రభుత్వమందించవలసిన విద్యుత్తు లేకపోవచ్చు. రవాణా సౌకర్యం లేక పోవచ్చు. పాఠశాల, పోలీస్ స్టేషన్ లేకపోవచ్చు. ఏ ఇతర పౌర సౌకర్యాలు కూడా లేకపోవచ్చు కానీ అక్కడ ఒక కిరాణా దుకాణముంటుంది. కాలి నడకన వాగులు, వంకలు దాటైనా అక్కడ ఒక వ్యాపారస్తుడు దుకాణం నిర్వహిస్తాడు. ఎందుకంటే అదే అతని బ్రతుకుదెరువు. లాభాపేక్ష లేకుండా ఈ సేవ ఉచితంగా ఎవరైనా చేస్తారా? సమాజంలో వైద్యుడు, వకీలు, ఉద్యోగస్తుడు, వ్యవసాయ కూలీ వంటి వారెవరైనా ఉచిత సేవలందిస్తారా? విషయ పరిజ్ఞానంలేని వాదనలతో పేదల పట్ల మొసలి కన్నీరు కారుస్తూ తప్పుదోవ పట్టించే వారు ఎక్కువయ్యారు. వైశ్యులు వారి ధనాన్ని నిరుపయోగంగా భూ నిక్షిప్తాలు చేసే వారని మరొక ఆరోపణ చేశాడు. ఆనాడు నేల మాళిగలలో ధనాగారాలనుంచింది, ఈనాడు స్విస్ బ్యాంకుల్లో దాస్తున్నదీ పాలకులే తప్ప వైశ్యులు కాదు. భారతదేశంలో లక్షల కోట్లు కుంభకోణాల ఆరోపణల నెదుర్కొంటూ, కోర్టుల చుట్టూ దిరుక్కుంటూ, జైలు గోడల మధ్య జీవితాలు గడుపుతున్న వారు ముఖ్యంగా రాజకీయనాయకులే తప్ప తెలుగు వైశ్యులు కారు.

ఆంధ్ర రాష్ట్ర సాధన కొరకు ఆమరణ నిరాహార దీక్ష చేసి అసువులు బాసిన అమరజీవి పొట్టి శ్రీరాములు వైశ్యుడు కాడా? నిర్భయంగా మృత్యువు నాహ్వానించిన ఈయన పిరికివాడా? వ్యాపారస్తుడా? భారతదేశ స్వాతంత్ర్యం కోసం సత్యాన్ని, సత్యాగ్రహాన్ని, నిజాన్ని, నిర్భయత్వాన్ని ఆయుధాలుగా మలచుకొని పోరాటం చేసినవాడు, అహింసతోనే అన్యాయాన్నెదిరించిన మహాత్మగాంధీ పిరికివాడా? వ్యాపారస్తుడా? శాంతి ప్రయోక్తగా ప్రపంచానికే మార్గదర్శకుడు. ఈనాడు ప్రపంచానికి ముఖ్యంగా అవసరమైనదే శాంతి మార్గము. ప్రపంచం హింసా ప్రవృత్తులతో ఎంత అల్లకల్లోలంగా ఉందో మనకు తెలుసు. అది చాలదన్నట్లు విద్వేషాగ్నులు రగల్చడానికి ప్రయత్నిస్తున్నారు కొందరు కుహనా మేధావులు. భారత దేశానికి స్వాతంత్రం సాధించడం గాంధీ గారి జీవితాశయాలలో చాలా చిన్న భాగం. వారికి భారతదేశం మీద ప్రేమ ఉంది కానీ అంతకన్నా ఎక్కువ ప్రేమ మానవత్వం మీద, మానవ సమానత్వం

మీద ఉంది. ఒక జాతి మరొక జాతిని అణగద్రొక్కడానికి వ్యతిరేకంగా వారు ఉద్యమించారు. అందుకే వారు బ్రిటిషు వలస వాదానికి వ్యతిరేకంగా భారతదేశంలోనే కాక దక్షిణాఫ్రికాలో సైతం ఉద్యమం నడిపించారు. ఆయనకు బ్రిటిషు ప్రజల పట్ల గాని, బ్రిటీష్ పాలకుల పట్లగాని వ్యతిరేకత లేదు. ఆంగ్లేయులు భారతీయులపై పెత్తనం చేయడాన్ని మాత్రమే వారు వ్యతిరేకించారు. ముస్లింలపై కూడా వారికంతే ప్రేమ. దళితులపైనా అదే ప్రేమ. అలాంటి వ్యక్తి మానవ జీవిత చరిత్రలో మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు.

ప్రపంచ దేశాలన్నీ గాంధీ సిద్ధాంతాన్ని స్మరిస్తుంటే దురదృష్టవశాత్తు మన దేశంలోనే వారిని విమర్శించే వారుండటం విచారకరం. వారిని వైశ్యుడిగా, భారతీయుడుగా, హిందువుగా మాత్రమే చూడటం దృష్టి లోపమే తప్ప మరొకటి కాదు. వారిని విశ్వమానవ సమానత్వానికి, శాంతి, సహనాలకు, నిజానికి, నిర్భయత్వానికి, నిస్వార్థ జీవనానికి, అన్యాయాన్ని, అణచివేతను ఎదిరించడానికి, పోరాట పటిమకు, ప్రతీకగా ఒక యోగిగా చూడాలే తప్ప సామాన్య మానవుడిగా చూడటం తగదు. మహాభారత యుద్ధం మధ్యలో నిలబడి అర్జునుడికి భగవద్గీత బోధించినవాడు శ్రీ కృష్ణభగవానుడు. అస్త్ర సన్యాసం చేసిన అర్జునుడితో మహాహవం చేయించాడు. ఇంతకు మించిన మార్గదర్శకులు ప్రపంచంలో మరొకరు ఉండరు. అలాగే ఆంగ్లేయుల మర ఫిరంగుల ముందు నిలబడి శాంతి గీత బోధించి ఆచరించిన మరో మహానుభావుడు మహాత్మాగాంధీ. అరణ్యంలో చెట్టు క్రింద కూర్చుని మౌనంగా శాంతిని పాటించడం వేరు. యుద్ధరంగంలో ముందు వరసలో నిలబడి శాంతి పాటించడం వేరు. అందుకు అంతులేని ధైర్యం కావాలి.

అలాగే పాలకులు చరిత్రను ఎలా తప్పుదోవ పట్టిస్తారో, ఇతరుల ప్రాధాన్యాన్ని తగ్గించి తమ ప్రాధాన్యతను ఎలా ప్రజలపై రుద్దుతారో తెలుసుకోవడానికి కూడా పొట్టి శ్రీరాములుగారి చరిత్ర ఒక ఉదాహరణ. 56 రోజులు నిరాహార దీక్ష చేసి మరణించే వరకు స్పందించిన నాయకులు లేరు. వారికి ప్రత్యేక రాష్ట్రాన్ని పొంది పరిపాలించుకోవాలన్న తహతహ తప్ప పొట్టి

శ్రీరాములు గారు చనిపోతారేమోనన్న ధ్యాస లేదు. అదే ఈ రోజులలో చూడండి, ఏ నాయకుడైనా పట్టుమని మూడు రోజులైనా నిరాహార దీక్ష చేయకముందే అరెస్టులు, దవాఖానాలకు తరలించుడు, బలవంతపు వైద్య సేవలు చేసుడు. తీరా వారి బలిదానంతో మద్రాసు రాష్ట్రం నుండి విడివడి కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్ర మొచ్చింది. రాజకీయ నాయకులకు పొట్టి శ్రీరాములు గారి జన్మదినం గుర్తులేదు. వర్ధంతి గుర్తులేదు. వారి బలిదానం కారణంగా ఆంధ్రరాష్ట్రం అవతరించిన రోజు గుర్తు లేదు. ఆంధ్ర, తెలంగాణ గలిపి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు చేసిన నవంబరు ఒకటిన పొట్టి శ్రీరాములు గారికి మొక్కుబడిగా మెడలో ఒక దండ వేస్తారు. ఇది నిజంగా వారిని అవమానం జేయడమే. అలాగే మాజీ భారత ప్రధాని పి.వి.నరసింహారావు గారి ఖ్యాతిని తగ్గించే ప్రయత్నం కొన్ని శక్తులు ఎలా చేస్తున్నాయో మనకు తెలుసు. చంపి ఫోటోకు దండ వేయడం రాజకీయాలకు కొత్తగాదు గదా.

వైశ్యులంటే దొంగ తూనికలు, కొలతలతో కల్తీ సరుకులమ్మే వారు గాను, పిరికివారుగాను చిత్రీకరించారు. వాస్తవానికి వైశ్యులు కూడా తరతరాల మార్పులో తీవ్రంగా నష్టపోయారు. వైశ్యులను వ్యాపారస్తులుగా చిత్రీకరిస్తూనే చిన్న చిన్న వ్యాపారాలను మాత్రమే వారికి మిగిల్చి, కాంట్రాక్టులు, మద్యం, సినిమా, పేపరు, ఫైనాన్స్, పరిశ్రమలు, మైనింగ్, రియల్ ఎస్టేట్ మరియు ఇంకా అత్యధిక లాభసాటి అయిన వ్యాపారాలు, ప్రభుత్వ వనరులతో అధికారాన్ని అడ్డం పెట్టుకొని అడ్డంగా సంపాదించగలిగిన వ్యాపారాలన్నీ పాలక వర్గాలవారే చేతుల్లోకి తీసుకొన్నారు. వైశ్యులు వ్యాపారాల నుంచి మెల్ల మెల్లగా ప్రక్కకు నెట్టి వేయబడుతున్నారు.

వైశ్యులు కూడా కొంతకాలం రాజ్యపాలన చేసిన వారే. సముద్రగుప్తుడు భారతదేశపు నెపోలియన్ అనే బిరుదు పొందాడు. గుప్తుల కాలాన్ని భారతదేశపు స్వర్ణయుగంగా వర్ణిస్తారు. అలాగే బ్రాహ్మణులను మేధావులని పొగుడుతూనే ప్రజల నుంచి వేరుచేసి వారి జీవనోపాధులన్నీ లాగి పారవేశారు. రాజ్యం చేసింది క్షత్రియులు. మంచికైనా, చెడుకైనా వారే బాధ్యత వహించాలి. ఈ రెండు వర్గాలు ఈ రాజకీయాన్ని గమనించి దళిత, బహుజన బడుగు, బలహీన

వర్గాలకు దగ్గరవుతూ తమ సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితిని మెరుగుపరచుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

ఎవరికి నచ్చిన సిద్ధాంతాన్ని వారు ఆచరించుకోవటం, ప్రచారం చేసుకోవటం భారత రాజ్యాంగం పౌరులకు ప్రసాదించిన ప్రాథమిక హక్కు. అలాగే భావ వ్యక్తీకరణలో భాగంగా గ్రంథ రచనలు కూడా గావించుకోవచ్చు. ఇది కూడా ప్రాథమిక హక్కే. గ్రంథ రచనా ప్రక్రియపై రాజ్యాంగం ప్రకారం ఏ న్యాయస్థానమూ నిషేధం విధించదు. ఒక నిర్దిష్ట పుస్తకాన్ని నిషేధించడం భావ ప్రకటన స్వేచ్ఛకు భంగంగా భావించరాదు. ఒక వ్యక్తి రచనా ప్రక్రియను లేదా దేశంలో రచనా ప్రక్రియను నిషేధిస్తేనే భావ ప్రకటన స్వేచ్ఛకు భంగం కలిగినట్లు భావించాలి.

ఇతరుల మనోభావాలను కించపరచడం, ఇతరులను నిందించడం వంటి వ్రాతలపై ఐ.పి.సి. సెక్షన్ 499 మరియు సెక్షన్ 500 క్రింద క్రిమినల్ డెఫిమేషన్ దాఖలు చేసే అవకాశం ఉంది కదా? దేశ రక్షణ రహస్యాలు వెల్లడించడం, దేశ సమైక్యతకు, సార్వభౌమత్వానికి భంగం కలిగించడం వంటి విషయాలు కలిగిన వ్రాతలను పోలీసులు స్వాధీనం చేసుకోవడం లేదా? ఉదాహరణకు తీవ్రవాద సాహిత్యం. అలాంటి వారిపై కేసులు పెట్టడం లేదా? అశ్లీల, అభ్యంతరకర సన్నివేశాలను కలిగిన చలన చిత్రాలను విడుదల నిలిపి వేయడం లేదా? వాటిని ప్రదర్శించిన వారిపై శిక్షలు విధించడం లేదా? చలన చిత్రాలను, టి.వి. ప్రసారాలను పరిశీలించి నియంత్రించే వ్యవస్థ లాంటి వ్యవస్థ పుస్తక ప్రచురణలపై ఉండవలసిన అవసరం లేదా?

కుల మత ప్రస్తావనలతో వేదికలపై ఉపన్యసించిన నాయకులపై కోర్టులు కేసులు నమోదు చేసిన సంఘటనలు కోకొల్లలు. ఇటువంటి కుల, మత ద్వేషాలను రెచ్చగొట్టే వ్రాతల వల్ల ప్రభావితమైన వ్యక్తులు కోమట్లపై, బ్రాహ్మణులపై దాడులు చేసి నరమేధం సృష్టించే అవకాశం లేదా? బ్రాహ్మణులు స్వేదం చిందించలేదు, కోమటోళ్ళు సామాజిక స్మగ్లర్లు అంటూ నిందించడం ఈ కోవ క్రిందకు రాదా? సుప్రీంకోర్టులో వాదులు తమ వాదనలను సరిగా వినిపించలేదేమో ననిపిస్తోంది. అందువల్లనే సుప్రీంకోర్టు ఆ పుస్తకాన్ని

నిషేధించడానికి నిరాకరించిందని నా అభిప్రాయం. ప్రస్తుతం అతను చేస్తున్న ఉద్యోగం కూడా స్వేదం చిందించే ఉద్యోగం కాదు కదా. పుస్తకాలు రచించే స్వేచ్ఛ ఉన్నప్పటికీ అందులో నేరారోపణ చేయగల అంశాలుంటే రచయితపై, పబ్లిషర్లపై సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకునే అధికారం తప్పనిసరిగా వుంటుంది.

ప్రస్తుతం ఏదో ఒక కులాన్ని నిందించడం లేదా పొగడటం రాజకీయ ఎత్తుగడలలో భాగమైపోయింది. ఎన్నికల్లో ప్రచారమే మార్గం. కొత్తగా ఏర్పడ్డ స్వతంత్ర దేశంలో అవే ప్రాథమిక అజెండాగా మారాయి. ఆ తర్వాత జరిగిన ఎన్నికలలో మాత్రమే అవినీతి, అభివృద్ధి అజెండాలుగా మారాయి. ప్రజాస్వామ్య బద్ధంగా అనేక పార్టీలు అధికారం చేపట్టిన తర్వాత రాజకీయ పార్టీలు ఒకరినొకరు అవినీతిపైన, అభివృద్ధిపైన సవాళ్ళు వేసుకోసాగారు. ఓట్లు సంపాదించడానికి వక్రమార్గాలు, సక్రమ మార్గాలు అన్వేషణలో పడ్డారు రాజకీయ పార్టీల వారు. కొందరు కుబుద్ధులు, మందబుద్దులు మాత్రం రాజకీయ వివేకశూన్యులై ఇప్పటికీ ఏదో ఒక కులాన్ని విమర్శించడం, సాంప్రదాయాలను, సాంప్రదాయ వాదులను విమర్శించడమే ఆధునిక వాదమని, ఆదర్శ వాదమని, తద్వారా రాజకీయ లబ్ది పొందవచ్చన్న భ్రమలో బ్రతుకుతున్నారు. ఇలాంటి వారి వల్ల సమాజానికి చాలా ప్రమాదం. సమాజంలో సామరస్యాన్ని దెబ్బతీయగలరు. సమాజంలోను, రాజకీయాలలోను వస్తున్న మార్పులు వీరు గమనించలేకపోతున్నారు. తమ చుట్టూ జరుగుతున్న మార్పులను గమనిస్తూ ఆ మార్పులకు అనుగుణంగా తమని తాము మార్చుకొనేవారే మనుగడ సాగించగలుగుతారు. లేనివారు అర్ధాంతరంగా కనుమరుగైపోతారు. వ్యక్తులైనా, వ్యవస్థలైనా అంతే.



# ౨. మానవ సాంఘిక, ఆర్థిక రాజకీయ ప్రస్థానం ఇలా జరిగింది

మానవ సాంఘిక, ఆర్థిక, నాగరికతా, విజ్ఞాన ప్రస్థానం సంచార జీవనం నుండి ప్రారంభమై నేటి సంక్లిష్ట ఆధునిక సమాజం వరకు జరిగింది. ఆటవిక సమూహాల నుండి ఆధునిక రాజ్యాల స్థాపన వరకు రాజకీయ ప్రస్థానం జరిగింది. స్వంత గ్రామాల పాలన నుండి ఆధునిక రాజ్యాలు, దేశాలు, రాష్ట్రాలు ఏర్పాటయ్యే వరకు సాగిన రాజ్యసాధన తంత్రాలు, కుతంత్రాలలో రాజ్యాలు కోల్పోయి, అధికారం, ఆస్తులు, ఉపాధులు కోల్పోయి, అవమానాలకు గురై వెనుకబడవేయబడ్డ వారే యస్.సి., యస్.టి., బీ.సి., కులాలు. సువిశాల సామ్రాజ్యాలు ఏర్పడక ముందు ప్రతి సమూహానికి ఎవరో ఒక నాయకుడు లేదా నాయకురాలు ఉండి ఉండవచ్చని ఊహించడం సమంజసం. మానవ జాతిలోనే కాదు జంతు సమూహాలలో కూడా ప్రతి సమూహానికి ఆ సమూహంలో బలమైన జంతువు నాయకత్వం వహిస్తుంది. ఆ తరువాత మానవ సమూహాలు స్థిర నివాసాలు, గ్రామాలు, వ్యవసాయ వనరులు ఏర్పరచుకున్నాక ఆ గ్రామంలో బలమైన నాయకుడు ఆ గ్రామాన్ని పరిపాలించుకున్నాడని ఊహించడం కూడా సమంజసమే. అప్పటి వరకు ఆ సమూహాలు ఒకే జాతికి చెంది వుంటాయని ఊహించడం కూడా సమంజసమే. ఆ తరువాతనే వనరులకై జరిగిన పోరాటాలు, సమూహాల మధ్య జరిగిన పోరాటాల ఫలితంగా చిన్నచిన్న రాజ్యాల నుండి మహా సామ్రాజ్యాల వరకు పరిణామం చెంది ఉంటాయని ఊహించడం తేలిక. ఈ క్రమంలో జాతులు, రాజ్యాలు అనేక వేల సార్లు కలిసి, విడిపోయి, తిరిగి కలిసి లక్షల సంవత్సరాల పరిణామ క్రమంలో అన్ని జాతులు, కులాలు, మతాలు, సమూహాలు కలిసి, విడిపోయి, తిరిగి కలిసి మళ్లీ విడిపోయి ప్రస్తుత సమాజంగా రూపుదిద్దుకొని ఉండటం సహజం.

అందువల్ల ఈనాటి కులాలన్ని ఈ మధ్య కాలంలో తెచ్చి పెట్టుకున్నవే తప్ప మొదటి నుంచి లేవు. ఎవరి సమూహాన్ని వారు, ఎవరి గ్రామాన్ని వారు, ఎవరి రాజ్యాన్ని వారు పరిపాలించుకున్నంత వరకు వారిని మరొక కులం అవమానించే అవకాశమే లేదు. ఎందుకంటే ఆ ప్రాంతానికి వారే రాజులు. కులము అంటేనే మొత్తము అని అర్థము. అనగా ఆ సమూహంలోని అందరు వ్యక్తులని అర్థం. అన్ని కులాలూ అనేక జాతుల మిశ్రమాలే.

ఒక గ్రామాన్ని మరొక గ్రామం, ఒక సమూహాన్ని మరొక సమూహం లేదా ఒక రాజ్యాన్ని మరొక రాజ్యం జయించినప్పుడు వారి అధికారాన్ని, వనరులను లాక్కొని బానిసలుగా వాడుకోవడం, అవమానం చేయడం, చంపడం సర్వ సహజం. యుద్ధం ముగియగానే గెలిచిన రాజ్య సైనికులు ఓడిపోయిన సమాజంపై విరుచుకుపడి దౌర్జన్య భీభత్సం సృష్టిస్తారు. ఆ క్రమంలో హత్యలు, మానభంగాలు యధేచ్ఛగా నిర్వహిస్తారు. డబ్బు, వెండి, బంగారం వంటి వాటిని లాక్కొంటారు. ఓడిపోయిన సమాజపు వృత్తి, ఉద్యోగ, వ్యాపార, వ్యవసాయ వనరులను కూడా ఆక్రమిస్తారు. ఈనాటికి కూడా యుద్ధాలలో ఓడిపోయిన దేశ ప్రజల పరిస్థితులు అలాగే ఉన్నాయి. ఓడిపోయిన సమూహం అవమాన భారంతో ఆకలితో ఏదో ఒక సేవా వృత్తినవలంబించి జీవనం కొనసాగించ వలసి వస్తుంది. ఓడిన జాతి చెల్లాచెదరై పోతుంది. ఈ విషయం రాజ్యాధికార పోరాట చరిత్ర ఏ మాత్రం అవగాహన ఉన్న ఎవ్వరికైనా అర్థమవుతుంది. మహ్మదీయులు, బ్రిటీషువారు భారతీయులను గెలిచినప్పుడు జంతువులుగా, బానిసలుగా ఎలా చూచారో మనకు తెలుసు.

అందువల్లనే క్షత్రియ వృత్తిలో ఉన్న కులాలు, ముఖ్యంగా ఓడిపోయి రాజ్యాలు పోగొట్టుకున్న వారు నేడు వెనుకబడిన జాతులుగా మారిపోయారు. బ్రిటీష్ వారి చేతిలో భారతీయులకు అదే జరిగింది. నిన్న మొన్న అమెరికా చేతిలో ఓడిపోయిన ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ వంటి దేశాలలో కూడా ఏం జరుగుతున్నదో మనం గమనించవచ్చు. అలాగే ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ దేశాలలో మిగిలిపోయిన హిందువులు కాని, హిందూ దేవాలయాలు కాని ఎలాంటి ఆదరణకు నోచుకుంటున్నాయో మనకు తెలుసు. అరబ్బుల దండయాత్రలలో

భారత ప్రజల నుండి, రాజుల నుండి మాత్రమే కాక సోమనాధ్ వంటి దేవాలయాలను సైతం లూటి చేసి వెండి బంగారాలను, వజ్ర వైఢూర్యాలను ఒంటెలపై మోసుకెళ్లారని చరిత్ర చెబుతున్నది. అలాగే భారతదేశం నుండి వందల కొద్ది బానిసలను కాలినడకన నడిపించి వారి దేశాలకు తీసుకెళ్లేవారు. బానిసల అవసరమున్న ఆ దేశ ప్రజలు అందుకు ఎదురుచూస్తూ ఉండేవారట. ఈ కుల మతాల ప్రస్తావన ఎలా ప్రారంభమై ఎలా పరివర్తన చెందిందో ఎలాంటి పరిణామాలను అందిస్తున్నదో విశ్లేషిద్దాం.

హిందువులలో కొన్ని కులాలకు నిమ్న వృత్తులను కేటాయించిన వారుకూడా అన్య మతాలవారే. ఎందుకంటే గత 2700ల సంవత్సరాలుగా భారతదేశం మీద పెత్తనం సాగించిన వారు వారే. అన్య మతస్తులు తాము నిమ్న వృత్తులు నిర్వహించి భారతీయులకు ఉత్తమ వృత్తులివ్వరు గదా. భారతీయులందరు ఏకమైతే విదేశీ పాలనకు ప్రమాదంగా పరిణమించగలరు. అందుకే భారతదేశాన్ని పరిపాలించిన విదేశీయులు కూడా భారతదేశంలో కుల మతాలను పెంచి పోషించి భారత జాతి ఏకం కాకుండా చూశారు. ఐనప్పటికీ విదేశీయుల నెదిరించటం ఏ ఒక్క క్షత్రియ కులం వల్ల సాధ్యం కాని పరిస్థితులలో జన సామాన్యంలోని ఇతర భారతీయ కులాలు ఏకమై కాకతీయులు, పల్లవులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, రాష్ట్ర కూటులు ఇత్యాది రాజకీయ ఫ్రంటులుగా ఏర్పడ్డాయనిపిస్తుంది. ఇలాంటి కులాల కూటములు యుద్ధాలలో ఓడిపోయి, వారు పరిపాలించిన రాజ్యాలు మహమ్మదీయ, బ్రిటిషు పరిపాలనలోకి పోగానే ఇలాంటి కులాల కూటములు విచ్ఛిన్నమై తిరిగి కులాలుగా సమాజం విడిపోయింది. ఉదాహరణకు మహమ్మదీయులు కాకతీయ సామ్రాజ్యాన్ని జయించి ఆక్రమించుకున్నారనుకుందాం. కాకతీయ సామ్రాజ్యంలోని ప్రజలెవరైనా కాకతీయులమని చెప్పుకుంటారా? చెప్పుకుంటే తలకాయలు నిలుస్తాయా. ఎవరి అసలు కులం పేరు వారు చెప్పుకోవడం ప్రారంభిస్తారు. పాలకులు కూడా అదే కోరుకుంటారు. కాకతీయులు అనే కూటమి బలంగా ఉండటం మహమ్మదీయులు అనుమతిస్తారా? ఇప్పుడు కూడా గతించిన పార్టీలను, కూటములను నామరూపాలు లేకుండా చేసే ప్రయత్నాలు జరగడం లేదా?

బహుశా మానవులందరు ఆదిమ జాతులుగా అడవుల్లో సంచార జీవులుగా బ్రతుకుతూ ఉండి ఉండవచ్చు. ఆ తర్వాత తమకవసరమైన పాడి పంటలను అనువైన చోట అభివృద్ధిపరచుకోవడం నేర్చుకొని అక్కడే స్థిరనివాసముండటం ప్రారంభించి ఉండవచ్చు. జంతువులను మచ్చిక చేసుకొని పెంచి పనులకు, మాంసానికి వాడి ఉండవచ్చు. నిప్పుతో వంటచేసుకోవడం, వేడికోసం, వెలుతురుకోసం వాడుకోవడం నేర్చి ఉండవచ్చు. కర్ర, రాయి వంటి వస్తువులను ఆయుధాలుగా ఉపయోగించడం నేర్చి ఉండవచ్చు. ఆపై లోహాలను కనుగొనడం నుంచి నేటి నవయుగ నాగరికత సంతరించుకొనే వరకు అనేక లక్షల సంవత్సరాలు పట్టి ఉండవచ్చు. ఆనాటి ఆదిమజాతులలో నేటి కులాలు ఉండి వుండకపోవచ్చు. అందరూ మాంసాహారులే.

తెలుగు రాష్ట్రాలలో యస్.సి., యస్.టి., బీ.సి.లే అధిక సంఖ్యాకులు కాబట్టి మొదటగా వారి గ్రామాలను వారే, వారి రాజ్యాలను వారే పరిపాలించుకుంటూ ఉండే వారని ఊహించడంలో తప్పు లేదనుకుంటా. వారిని ఓడించి వారి రాజ్యాలు లాక్కొనబడ్డాయని కూడా ఊహించవచ్చు. వనరులు ఉన్నచోట ఒకే చోట అనేక కుటుంబాలు నివాసాలు ప్రారంభించిన తర్వాత అక్కడ సహజంగా కొన్ని సామాజిక అవసరాలు, సామాజిక కట్టుబాట్లు అవసరమవుతాయి. ఎవరో ఒకరి పెత్తనం కూడా అవసరమవుతుంది. కాల క్రమేణ కొన్ని గ్రామాలకు కలిపి ఒకే పెద్ద ఉండి ఉండవచ్చు. అక్కడే పెత్తనం కోసం, వనరుల కోసం ఒక సమూహంపై మరొక సమూహం దాడిచేసుకోవడం ప్రారంభం అయి ఉండవచ్చు.

జాతి పుట్టుకతో వచ్చేది. “జ” అంటేనే పుట్టుట అని అర్థం. కులం అంటే గుంపు లేక మొత్తము అని అర్థం. మొత్తం అనడం ద్వారా అందులో అనేక జాతులు, వృత్తుల వారు కలిసి ఉంటారని అర్థం. జాతి అంటే ఒకే ప్రాంతంలో అనేక వందల సంవత్సరాల పాటు ఇతర ప్రాంతాల వారితో వివాహాది క్రతువులతో సంకరణం కాకుండా ఉన్న మానవ సమూహం. వీరి అవయవ నిర్మాణం, ఆచార వ్యవహారాలు ఒకేలా వుంటాయి. వీరిని చూడగానే ఫలాన జాతి వారని గుర్తించవచ్చు. ఉదాహరణకు కోయ, లంబాడి జాతులు,

మంగోలియన్‌లు, ఆఫ్రికన్‌లు వంటి కొన్ని జాతులు. కులాల, మతాల విషయం అలా కాదు. అనేక జాతుల మిశ్రమాలే కులాలు, మతాలు. ఉదాహరణకు బ్రాహ్మణులు గాని, కమ్మ, రెడ్లు గాని మరే ఇతర కులాలు గాని, హిందూ, క్రిస్టియన్, ముస్లీం లేదా మరే ఇతర మతాల వారినైనా సరే సమావేశ పరిచి పోల్చి చూసినట్లయితే వారి భాష, వస్త్రాలంకరణలు, వారు అలవర్చుకున్న జీవన విధానాలు  ఒకేరకంగా ఉండవచ్చు కాని, వారి సహజ సిద్ధమైన ఆకారాలు, రంగులు, ముఖకవళికలు ఒకేలా ఉండవు. వ్యక్తిని చూసి అతను ఏ జాతి వాడో చెప్పవచ్చు. కాని ఏ కులం వాడో చెప్పడం అసాధ్యం. ఎందుకంటే మౌలికంగా జన్మతః వారంతా ఒక్క జాతి వారు కాదు. ఈ ఆధునిక కాలంలో కూడా కుల, మతాల పేరుతో సమాజంలో చిచ్చు పెట్టే కార్యాచరణలు ఉండటం  శోచనీయం.

కులము, జాతి, తెగ ఇవన్నీ జన సమూహాల పేర్లే. ఈ సువిశాల ప్రపంచంలో అనేక ప్రాంతాలలో అనేక జాతులు, సమూహాలు నివసించి అనేక నాగరికతలు, ఆచార వ్యవహారాలు, భాషలు అభివృద్ధి చెంది ఉండవచ్చు. జాతిని బట్టి, పుట్టి పెరిగిన ప్రాంతాల వాతావరణాన్ని బట్టి, ఆహార, అహార్య, ఆచార, వ్యవహారాలను బట్టి ఉచ్చరించే భాషను బట్టి ఇప్పటికీ కొన్ని జాతులను తేలికగా గుర్తించవచ్చు. కోయవారి ముక్కు, మూతి, కనులు, నొసలు, గడ్డం ఒకలా ఉంటాయి. అలాగే లంబాడీలను,  తమిళ వాళ్ళని, అస్సాం, ఆ తర్వాత పర్వత ప్రాంత ప్రజలు అంటే హిమాచల ప్రదేశ్ ప్రజలను తేలికగా గుర్తించవచ్చు. హిమాచల్ ప్రదేశ్, అరుణాచల్ ప్రదేశ్ వాళ్ళు మంగోలియన్ జాతికి దగ్గరగా కన్పిస్తారు. అలాగే గూర్ఖాలు. కాకుంటే వందల వేల సార్లు అనేక జాతులు యుద్ధాలలో ఓడి, గెలిచి వందల వేల సార్లు రాజ్యాల ఎల్లలు చెరిగిపోయి సువిశాల సామ్రాజ్యాలుగా ఏర్పడటం ఇతరదేశాల మరియు ఇతర మతాల పరిపాలనల క్రిందకు వెళ్ళడం వల్ల, కులాంతర వివాహాల వల్ల జాతి, కుల, మతాల ఎల్లలు చెరిగిపోయి జాతుల లక్షణాలు కలిసి పోతున్నాయి. ఇప్పుడున్నవి ఎక్కువగా మిశ్రమ జాతులే. రాజ్యాధికార సాధన కోసం కులాలను వాడుకోవడం జాతుల కలయికకు అడ్డుగా మారింది. అభం శుభం తెలియని పసి పిల్లవాడికి

స్కూలులో చేర్పించే నాటికే వాడి కులం ఏమిటో తెలియజేస్తున్న ప్రభుత్వ విధానం మారాలి.

ఒక కులం మరొక కులంపై రాజ్యం కోసం దాడి చేసే క్రమంలో నేటి రాజకీయ పార్టీల పేర్ల లాగానే అనేక కులాలు కలిసి రాజకీయ కూటములుగా అవతరించినట్లు కనిపిస్తున్నది. ఉదాహరణకు కాకతీయులు, పల్లవులు, ఇక్ష్వాకులు, శాతవాహనులు, విష్ణుకుండినులు ఇత్యాది పేర్లు. ఇవి కులాల పేర్లో, వంశాల పేర్లో అయితే నేటికి కూడా మిగిలి ఉండేవి. ప్రస్తుతానికి ఇలాంటి కులాలెక్కడా మనకు కనిపించవు. అవి కూటములు కాబట్టే నేటి రద్దయిన రాజకీయ పార్టీల లాగానే కనుమరుగై పోయాయని భావించవచ్చు. రాజ్యాధికార పోటీకి పోని కులాలు కాబట్టి బ్రాహ్మణ, వైశ్య కులాలు గత 5500 సంవత్సరాలుగా అంతంత మాత్రంగా నిలబడి అగ్రవర్ణాలుగా పిలవబడుతున్నారు. యుద్ధాలలో ఓడిపోయిన మిగిలిన శూద్రరాజులు, వారి కులాలు ఘోరంగా పరాభవించబడి నేటికి వెనుకబడిన కులాలు, జాతులుగా పిలవబడుతున్నారు. లేకుంటే రాజ్య పాలన చేసిన యాదవులు, ముదిరాజులు, మంగలివారు, ఒడ్డెర, కాపు, మాల, మాదిగ, కోయ, మహమ్మదీయ జాతులవారు ఎలా వెనుకబడిన జాతులుగా మారతారు?

వృత్తులను బట్టి కులాలు ఉద్భవించాయనేది పచ్చి అబద్ధం. రాజ్యాధికార సాధన తంత్రాలలో భాగంగా ఒక వర్గం వారిని మరొక వర్గం మీదకు ఉసిగొల్పే దుష్ట తంత్రంలో భాగమే ఆ వాదన. వృత్తి పరంగా ఉద్భవించే కులాలు అతి కొద్ది మాత్రమే ఉంటాయి. ఉదాహరణకు చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి మొదలైనవి. భారతదేశంలో సుమారు 8500 కులాలు వున్నాయి. అన్ని వృత్తుల పేర్లు ఎవరైనా చెప్పగలరా? అన్నింటికన్నా పెద్ద వృత్తి వ్యవసాయం. దానిని ఆచరించే ప్రత్యేక కులం అంటూ ఏదీ లేదు. అలాగే వేటాడటం ఆదిమానవుల ప్రథమ వృత్తి. ఆ వృత్తి ఎవరిది? ఏదో ఒక్క కులమే ఆ వృత్తిని చేపడితే మిగతా కులాలు అడుక్కు తిని బ్రతికాయా? ఈ రోజు లేదా సమీప గతంలో ఒక కులం వారు ఒక వృత్తిని ఆచరించారు కాబట్టి ఆ కులం పేరుతో ఆ వృత్తి సూచితమవుతున్నదని భావించడం పొరపాటు. ఆయా వర్గాలు ఒకనాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక కారణాల వల్ల ఒక వృత్తిని ఆశ్రయించి వుండవచ్చు.

మీరు గమనిస్తే ఈ రోజు కూడా ఒక కులం వారు అందరూ ఒకే వృత్తిని చేయడం లేదు. అందువల్ల అన్ని కులాలు వృత్తులను బట్టి మాత్రమే ఏర్పడ్డాయన్న ప్రచారం పూర్తిగా సత్యదూరం. ఉదాహరణకు కమ్మ, రెడ్డి, వెలమ, వడ్డెర, తెలగ, మాల, మాదిగ అనే పేర్లలో ఏ వృత్తి సూచిత మవుతున్నదో ఎవరైనా చెప్పగలరా? అలాగే వ్యవసాయము, కళలు, రచనలు, నటన, విద్యాబోధన ఇలా అనేక వృత్తుల పేర్లు కలిగిన కులాలేమైనా ఉన్నాయా?

కులాల పేర్లు జాతుల నుండి, వారు తరతరాలుగా నివసించిన ప్రాంతాన్ని బట్టి, వారు పరిపాలించిన సందర్భంలో తమకంటూ ప్రత్యేకంగా వారే ఏర్పాటు చేసుకున్న సామూహిక నామధేయాల వల్ల ఆచరణలోనికి వచ్చాయని భావించడం సమంజసం. అందువల్ల ఒక కులం ఎక్కువ మరొక కులం తక్కువ అన్న భావన తప్పు. అన్ని కులాలు ఏదో ఒక కాలంలో ఎంతో కొంత ప్రాంతంపై పరిపాలన సాగించి ఆ తదుపరి శత్రు రాజుల రాజ్య సాధన తంత్రాలు, కుతంత్రాలకు తలవొగ్గి, గెలిచిన సమూహాలు అనుమతించిన నిమ్న వృత్తులను ఆశ్రయించి జీవనం వెళ్ళబుచ్చాయని భావించడం కూడా సమంజసం.

మాల, మాదిగ అనే పేర్లలో చెప్పులు కుట్టుట అనే అర్థం ఎక్కడ సూచిత మవుతున్నది? లేనే లేదు. ఆంధ్ర రాష్ట్రంలో నివసించిన ప్రజలలో 90 శాతం మంది శూద్రులే అయి ఉండవచ్చని నాకు తోస్తుంది. అందులో నుండి అధికారంలోకి వచ్చిన ప్రతి ఒక్కరు తనకు అండగా కొంతమందిని ఒక ప్రత్యేక పేరు కలిగిన కులంగా ఏర్పాటు చేసుకొని ఉండి ఉండవచ్చు. ఉదాహరణకు జనాభాలో దాదాపు 20 శాతం ఉన్న మాల, మాదిగలు చెప్పులు కుట్టడం తమ వృత్తిగా ఎందుకు ఎంచుకుంటారు? అది లాభసాటి వృత్తియా? అంతగా ఉపాధి అవకాశాలు ఉన్న రంగమా? ఎంత మాత్రం కాదు. వాస్తవానికి అన్ని కులాల పేర్లకన్న వీరి కులాల పేర్లే అందంగా ఉన్నాయి. అలాగే రెండు కులాల పేర్లు 'మా' అనే అక్షరంతో రావడం వల్ల ఇద్దరూ గత కాలంలో ఒకే కాలానికి, జాతికి, భాషా సంస్కృతులకు చెంది ఉంటారని నా అభిప్రాయం. రాజ్యాధికార పోరాటం వల్ల కాక ఇతర కారణాలవల్ల రెండు అధిక సంఖ్యాక కుల వర్గాల మధ్య విభేదం వచ్చే అవకాశమే లేదు. అంతకంటే ఎక్కువగా అవసరమున్న

చాకలి, మంగలి, దర్జీ వృత్తుల నాశ్రయించిన కులస్తులు అంతమంది లేరేం? అంటే యుద్ధాలలో వీరోచితంగా కడవరకు పోరాడి ఘోరపరాజయాలు పొంది సర్వస్వం కోల్పోయి అవమానించబడ్డ, అణగద్రొక్కబడ్డ జాతులే యస్.సి., యస్.టి., బీ.సి.,లు. వీరి తండ్రులు, తాతల పేర్లు రామయ్య, కృష్ణయ్య, స్త్రీల పేర్లు లక్ష్మమ్మ, సీతమ్మ ఉండడాన్ని బట్టి చూస్తే వీరు ముఖ్యంగా వైష్ణవ సాంప్రదాయాన్ని పాటించిన వారనిపిస్తున్నది.

ప్రతి సమాజంలోను చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి వంటి వృత్తుల వారుంటారు. కాలక్రమేణ అవే వారి కులంగా ముద్రపడి ఉండవచ్చు. పోరాటాలలో గెలిచిన సమూహం ఓడిన వారితో ఇలాంటి పనులే చేయించుకుంటుంది. ఇలాంటి జాతులు 10 నుండి 15 వరకు ఉండవచ్చు. ఏకంగా 8500 ఉండే అవకాశమే లేదు. కృష్ణుడు నాలుగు కులాలు సృష్టించింది సుమారు 5500 సంవత్సరాలు క్రితం మాత్రమే. ఇప్పటికీ అవే కులాల పేర్లతో చలామణి అవుతున్న వారు వైశ్యులు మరియు బ్రాహ్మణులే. మిగిలిన కులాలు ఎవరు రాజ్యాధికారంలోకి వచ్చినప్పుడు వారికంటూ ఒక కులాన్ని ఏర్పాటు చేసుకొని దాన్ని బలోపేతం చేసుకుని ఉండవచ్చు. అంతేకాని వృత్తుల ద్వారా కులాలు ఏర్పడవు.

భారత యుద్ధంలో కౌరవ సైన్యం 11 అక్షౌహిణులు. కాగా పాండవుల పక్షాన పాల్గొన్న వారు ఏడు అక్షౌహిణులు. అంటే షుమారు పద్దెనిమిది లక్షల మందన్నమాట. వీరు కాక అర్జునుడు తొమ్మిది కోట్లమంది శంశప్తకులను సంహరించాడని భారతంలో ఉంది. ఎవరీ శంశప్తకులు? కౌరవుల పక్షాన పాల్గొన్న పదకొండు అక్షౌహిణులలోని వారు కాదు. భారత కాలంనాటి ముప్పది రెండు రాజవంశాలకు చెందిన వారు కాదు. కానీ అధిక పరాక్రమ సంపన్నులు. అర్జునునికి బద్ధ విరోధులు. అర్జునుని చంపుడో లేక చచ్చుడో అంటూ యుద్ధం చేశారు. అంటే భారత కాలం నాటికన్నా ముందు రాజ్య పాలన చేసి అర్జునుడి ద్వారా ఓడించబడిన రాజవంశాల వారని నా అభిప్రాయం. రాజవంశాల వారు కాకపోతే వారికంతటి పౌరుషం, పరాక్రమం అబ్బి వుండేవి కావు. అర్జునుడినెదిరించి యుద్ధం చేసి ఉండేవారు కాదు.

వారు తొమ్మిది కోట్లుగా అధిక సంఖ్యాకులై యుండడాన్ని బట్టి చూస్తే పూర్తి చతుస్సాగర పర్యంతం వ్యాపించియున్న రాజ్యాన్ని పరిపాలించిన రాజవంశాల వారై యుంటారని నా అభిప్రాయం. జంబూద్వీపమే చతుస్సాగర పర్యంతం వ్యాప్తి చెందియున్న రాజ్యం. ద్వీపమంటే చుట్టూ నీరున్న ప్రాంతమేకదా! అందులో భారత వర్షం ఒక భాగం. అందులో ఒక భాగం భారత ఖండం. ఈనాడు కూడా అధికారానికి నోచుకోని అత్యధిక జనసంఖ్య గలిగిన వారు దళితులు కాబట్టి నాటి శంశప్తకులు వారేనని నా అభిప్రాయం. వీరిలో కొందరు జాంబవతులు అని పిలవబడటం ద్వారా కూడాను వీరే జంబూద్వీప వాసులని, పాలకులని నా అభిప్రాయం.



# 3. చాతుర్వర్ణం మయాసృష్టం

శ్రీకృష్ణుని విభాజన ప్రకారం కులం పుట్టుకతో వచ్చేది కాదు. గుణ గణాలతోటి, చేసే వృత్తితోటి సంక్రమించేది. అదే విధానం ఈనాటికి కొనసాగి ఉంటే ఏ రకమైన సామాజిక సమస్యలూ ఉండేవి కావు. రాజ్యం ఉన్నవాడు క్షత్రియుడు. వ్యాపారం చేసే వాడు వైశ్యుడు. వైదిక జీవన విధానం అవలంబించిన వాడు బ్రాహ్మణుడు. స్వంత వ్యాపారం, వ్యవసాయం లేక కూలి చేసుకొనే వాడు శూద్రుడు. కౌరవ చక్రవర్తి అయిన విచిత్ర వీర్యుడు సంతానం పొందకుండానే మరణించాడు. ఆయన భార్యలు కాశీరాజు కుమార్తెలయిన అంబ, అంబాలిక. విచిత్ర వీర్యుని తల్లి సత్యవతి వ్యాసునికి కూడా తల్లి. ఆమె కోరిక మేరకు కౌరవ వంశాన్ని నిలబెట్టే ఉద్దేశంతో అంబ, అంబాలిక, వారి పరిచారికలు బ్రాహ్మణుడైన వ్యాసుని ద్వారా ధృతరాష్ట్రునికి, పాండురాజుకి, విదురునికి జన్మనిచ్చారు. వారు పుట్టుక చేత బ్రాహ్మణ కుమారులైనా వారి క్షత్రియ ధర్మాచరణ వల్ల క్షత్రియులయ్యారు. అలాగే బ్రాహ్మణుడైన పరాశరుని ద్వారా బెస్త కన్య అయిన సత్యవతి ద్వారా జన్మించిన వ్యాసుడు బ్రాహ్మణుడయ్యాడు. ఈ రెండు సందర్భాలలోను బ్రాహ్మణుడు తండ్రి. తల్లి క్షత్రియ స్త్రీ. కాని జన్మించిన వ్యాసుడు ధర్మాచరణ ద్వారా బ్రాహ్మణుడైతే, ధృతరాష్ట్ర పాండురాజులు ధర్మాచరణ ద్వారా క్షత్రియులయ్యారు. ఈ ఉదంతం ద్వారా ఆ కాలంలో వర్ణ ధర్మం ఎలా ఆచరించబడిందో గమనించవచ్చు.

తన శక్తి యుక్తులను బట్టి ఏ వర్ణం వాడైనా ఏ వర్ణంలోనైనా ప్రవేశించవచ్చు. “చాతుర్వర్ణం మయాసృష్టం” అన్న ఆయనే గుణకర్మ విభాజశః అని, మరియు “జన్మనా జాయతే శూద్రః సంస్కారోస్తు ద్విజః” అని కూడా చెప్పాడు. అంటే పుట్టుకచేత అందరూ శూద్రులు కాగా సంస్కారాలని బట్టి వర్ణం సంతరించుకుంటారు అని అర్థం. ద్విజుడు అంటే బ్రాహ్మణుడు మాత్రమే కాదు. మొదటి పుట్టుక శూద్రుడు కాగా అతను ప్రయత్నపూర్వకంగా

బ్రాహ్మణుడుగా, క్షత్రియుడుగా లేదా వైశ్యుడుగా ద్విజత్వం అనగా రెండవ పుటక పొందవచ్చని అర్థం. నిజానికి ఇది ఏ చిక్కూ లేని విభజన.

కౌరవ, పాండవ రాకుమారుల మధ్య విలువిద్యా పాటవ పరీక్ష జరిగే సందర్భంలో కుంతీదేవి మొదటి కుమారుడు కర్ణుడు పాల్గొనే ప్రయత్నం చేస్తాడు. అక్కడి సభాసదులందరూ అందుకు సమ్మతించరు. ఇది రాకుమారులు పాల్గొనే పరీక్ష తప్ప శూద్రులకు ప్రవేశం లేదంటారు. దుర్యోధనునికి కర్ణుడు ఆప్త మిత్రుడు. క్షత్రియ, శూద్ర కులాలు మిత్రత్వానికి అడ్డు కాలేదు. దుర్యోధనుడు తక్షణమే కర్ణునికి అంగ రాజ్య పట్టాభిషేకం చేస్తాడు. అప్పుడు కర్ణుని క్షత్రియునిగా గుర్తించి విలువిద్యా పాటవ పరీక్షలో పాల్గొనే అవకాశం కల్పిస్తారు. మహా భారతంలోని ఈ ఉదంతాన్ని గమనిస్తే ఆ కాలంలో రాజ్యం ఉన్నవాడు క్షత్రియుడు, లేనివాడు శూద్రుడు అని అర్థం అవుతుంది. దీనిని బట్టి మనం అర్థం చేసుకోవలసింది ఏమిటంటే మొట్టమొదట కుల వర్గీకరణలో అర్హతను బట్టి కులాలు నిర్ణయించబడ్డాయి తప్ప పుట్టుకను బట్టి కాదని. పుట్టుకతోనే కులాన్ని ఆపాదించడం, లక్షల కోట్లు గడించినా, దేశాధికారి అయినా వెనుకబడిన కులంగానే పరిగణించబడే దౌర్భాగ్యం ప్రస్తుతం మాత్రమే నెలకొని ఉంది.

స్వాతంత్ర్యం రాగానే భారత రాజకీయాలలో బ్రాహ్మణ కులస్తులు ముందు వరుసలో ఉన్నారు. తెలుగు రాష్ట్రాల్లో కూడా ఆంధ్రలో టంగుటూరి ప్రకాశం పంతులు, తెలంగాణలో బూర్గుల రామకృష్ణారావు ముఖ్య మంత్రులయ్యారు. కేంద్రంలోను, అనేక రాష్ట్రాలలోనూ అదే పరిస్థితి. బ్రాహ్మణుల నుంచి రాజకీయ పెత్తనం ప్రజాస్వామ్య బద్ధంగా లాక్కోవాలంటే వారిని పొగిడితే కుదరదు. వారిని, వారు అనుసరిస్తున్న సాంప్రదాయాలను, వారి రాజకీయ విధానాలను విమర్శించడం విపక్షాలకు తప్పనిసరి. ఆ ప్రయత్నంలో బ్రాహ్మణులను, బ్రాహ్మణీకాన్ని కావలసినంత అభాసుపాలు చేశారు. సమాజంలోని చెడుకంతటికీ బ్రాహ్మణులనే నిందించారు. ఇది రాజకీయ కోణం. సామాజికంగా మాత్రం బ్రాహ్మణులు వ్యక్తిగత గౌరవాలు ఆనాటికీ, ఈనాటికీ పొందుతూనే ఉన్నారు.

సనాతన సాంప్రదాయాలు, సంగీత, సాహిత్యాలు, వేద వాఙ్మయం, పురాణేతిహాసాలు నేటికీ ఇంకా కొంత మిగిలి ఉన్నాయంటే బ్రాహ్మణులు వాటిని అంటి పెట్టుకొని ఉండడమే అనడంలో సందేహం లేదు. రాజ్యకాంక్షతో రాజ్యాధికార సాధన తంత్రంలో భాగంగా యుద్ధాలలో లక్షలాది సైనికులను సంహరించే క్రమంలో చూస్తే ప్రజాస్వామ్య పోరాటాలలో బ్రాహ్మణులను బదనాం చేసిన విషయం గొప్పది కాదు. రాజకీయాల్లో సర్వసహజం, చాలా చిన్నది కూడా. రాజ్య సాధన తంత్రంలో భాగంగానే అలా చేస్తున్నామని రాజనీతిజ్ఞులకు తెలుసు. వారికి వ్యక్తిగతంగా బ్రాహ్మణులపై అంత ద్వేషం లేదు. అవే భావాలు జీర్ణించుకొని నేటికీ అదే భావజాలంతో బ్రాహ్మణ వ్యతిరేకతతో బ్రతుకుతున్న వారు గొప్ప రాజనీతి కోవిదులుగారు. వీరు సమాజంలో ఉన్న దురాచారాలన్నింటికి బ్రాహ్మణులనే నిందిస్తారు. స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి ప్రధాన మంత్రులుగా బ్రాహ్మణులే కదా పాలన సాగించిందంటారు కానీ, సాంఘిక దురాచారాలు స్వాతంత్ర్యానంతరం ప్రారంభమైనవి కావు.

బ్రాహ్మణులు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు కాబట్టి స్వాతంత్ర్యం రాగానే కొంత కాలం పాటు నాయకులుగా కొనసాగడం సర్వ సహజం. ఆ తర్వాత భారత రాజకీయ పెత్తనం ఇతర కులాల చేతుల్లోనే ఉంది. అలాగే ఉత్తర భారతంలో బ్రాహ్మణుల పరిస్థితి వేరు. తెలుగు రాష్ట్రాల్లో పరిస్థితి వేరు. ఇక్కడి సామాజిక సమీకరణాలు వేరు. బ్రాహ్మణులు మంత్రులు, సలహాదారులుగా ఉండి రాజ్యం నడిపించారు కాబట్టి సాంఘిక అసమానతలకు, దురాచారాలకు వారే బాధ్యత వహించాలని కొందరు వాదించడం విన్నాను. క్రీ॥పూ॥ 7వ శతాబ్దం నుండి ఈనాటి దాకా జైన, బౌద్ధ, మహమ్మదీయ, బ్రిటిషు పాలననే 2700 సంవత్సరాలుగా కొనసాగింది. వారి మంత్రులుగా బ్రాహ్మణులు ఎలా ఉంటారు? వారు మంత్రులుగా పనిచేసింది అక్కడక్కడ రాజ్యం చేసిన హిందూ బి.సి రాజుల వద్దనే. ఐనా భర్తృహరి సుభాషితంలో చెప్పినట్లు *"ప్రబల గర్వ విదూషితుల్ ప్రభువు లెన్న, కాన భావమున జీర్ణమయ్యె సుభాషితంబు"* అన్నట్లు రాజులు ఎవరి మాటా వినరు. హిట్లరుకు, ఇది అమీన్‌కు ఇత్యాది అనేకమంది నియంతలకు ఏ బ్రాహ్మణుడు మంత్రి? దుర్యోధనుడు విదురుని మాట విన్నాడా? ఏ రాజైనా అంతే.

బ్రాహ్మణులకు విధించిన జీవన విధానం ప్రకారం వారికి రాజ్యకాంక్ష కూడదు. స్త్రీ కాంక్ష కూడదు. ధనకాంక్ష కూడదు. ఆవేశకావేశాలుండడానికి వీలు లేదు. అందుకు వీరు ముప్పొద్దుల స్నానం చేసి, సంధ్య వార్చుకొని నా హృదయంలో జ్ఞానజ్యోతిని వెలిగించమంటూ గాయత్రీ మంత్రాన్ని మననం చేసుకోవాలి. భగవంతుడి పూజలు నిర్వహించి పాదోదకం పావనం అంటూ వారి నెత్తిన జల్లుకొని ప్రజలనెత్తిన జల్లాలి. ప్రజలకు పాపపుణ్యాల స్పృహ కలిగించి నీతి, నియమాలను బోధించాలి. రాజును దేవుని ప్రతినిధిగా వర్ణించాలి. తద్వారా క్షత్రియుల పరిపాలన సుగమమౌతుంది. కోరికలు లేకుండా సాత్వికమైన ప్రవర్తన కలిగి ఉండటం కోసం సాత్వికాహారం తినాలి. మద్యమాంసాల జోలికి వెళ్ళకూడదు. బ్రాహ్మడి వృత్తి భిక్షాటన. ఆ భిక్షాటన ఏ రోజుకారోజు చేసుకోవాలి. మరుసటి రోజు కొరకు చేయకూడదు. ఆ భిక్షాన్నం నుంచి ఎవరైనా అడిగితే దానంగా ఇచ్చివేయాలి. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన ప్రతి పిల్లవానికి 7 సంవత్సరాల వయసు వచ్చే సరికి ఉపనయనం చేసి భవతి 'భిక్షాం దేహి' అంటూ భిక్షాటన చేయడం నేర్పించాలి. సాత్వికాహారాలతోను, సాధనలతోను బ్రాహ్మణుల కోర్కెలు చాలా వరకు నియంత్రించబడతాయి. ఇంకా కావాలంటే తడిబట్టలతో మడి గట్టుకోవడం, ఉపవాస వ్రతాలు చేస్తే ఆ వున్నవి కూడా పోతాయి. ఆపై బ్రహ్మచర్యం, సన్యాసం ఇంకా ఉత్తమం. ఆ పై తపస్సు, కందమూలాల భక్షణ ఉత్తమోత్తమం. వారికింకా మిగిలే కోర్కెలేమీ ఉండవు మోక్షం తప్ప.

ఇలా బ్రతుకుతున్న బ్రాహ్మణులపై పరాయి స్త్రీలు కన్నేస్తే ఎలా? అందుకే బ్రాహ్మణులు గుండు గీయించుకుని పిలక పెట్టుకుని, కొల్లాయి గుడ్డలు కట్టుకొని వంటి నిండా విబూది బొట్లు పెట్టుకోవాలి. ఇదీ బ్రాహ్మణ జీవన విధానం. ఈ జీవన విధానం వల్ల పరాయి స్త్రీలేమోగాని బ్రాహ్మణ స్త్రీలు కూడా వీరిని వివాహం చేసుకోవడానికి ముందుకు రావడం లేదు. షాపుల్లో గుమాస్తాలుగా పనిచేస్తూ నెలకు 7, 8 వేల రూపాయలు సంసాదించేవారిని చేసుకోవడానికైనా సిద్ధంగా ఉన్నారు గాని నెలకు 30, 40 వేల రూపాయలు సంపాదిస్తున్న అర్చక, పురోహిత బ్రాహ్మణులను వివాహం చేసుకోవడానికి బ్రాహ్మణ యువతులు ముందుకు రావడం లేదు. 40 సంవత్సరాల వయసు దాటినా

అర్చక పురోహితులనేక మంది వివాహం కాకుండా మిగిలిపోతున్నారు. బ్రాహ్మణ పెద్దలు ఈ విషయంపై దృష్టి పెట్టాలి. ఇందుకు కారణాలేమిటని లోతుగా విచారించాలి. నా దృష్టిలో ఆహారం, ఆహార్యం మరియు జీవన విధానాలే కారణమనిపిస్తున్నది. స్వచ్ఛమైన కూరగాయలు, పప్పు, నెయ్యి, పెరుగు దొరకడం లేదు. జన్యు మార్పిడికి లోనైన పంటలను రసాయన ఎరువులతో పండించి, రసాయన పురుగుమందులతో సంరక్షించి, రసాయనాలు కలిపి నిలువ వుంచిన కూరగాయలు, కల్తీ పాలు, కార్బైడ్‌తో పండించిన పండ్లు తినడం వల్ల ఆరోగ్యం దెబ్బతింటున్నది. తెల్లవారు ఝాముననే లేచి ఆచరించే అనుష్ఠానాల వల్ల శారీరక వ్యాయామాలకు సమయమే దొరకదు. అందువల్ల అందం, ఆరోగ్యం, శరీర సౌష్ఠవం దెబ్బతింటున్నది. ఉపవాసాల వల్ల శరీరం ఇంకా బలహీనమౌతున్నది. తద్వారా వారి మానసిక పరిస్థితే ఒకలా తయారవుతుంది. శారీరక శ్రమనోర్చుకోలేరు. మానసికంగా పౌరుషం ప్రదర్శించరు. అంతా భగవంతుడే చూస్తాడనే నిర్వేదం నింపుకుంటారు. అందువల్ల ఆర్థికంగా ఎదగరు. ఆర్థికంగా, శారీరకంగా బలంగా లేని వానికి ధైర్యం, మానసిక బలం ఎక్కడ నుంచి వస్తాయి.

ఇక వస్త్రధారణ విషయానికొస్తే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, వ్యాసుడు జన్మించిన, వేద, ఇతిహాసాదులుద్భవించిన ఉత్తర భారతదేశంలోని బ్రాహ్మణులు సిల్కు లాల్చి, పైజామాలు ధరించి, నుదుటిన చిన్న బొట్టు, నెత్తిన చిన్న పిలక పెట్టుకుంటారు. దక్షిణ భారతంలో కూడా పండితులు అలా అంగీకరిస్తారేమో ప్రయత్నించాలి. అలాగే బ్రాహ్మణులు మాంసాహారులు గారు కాబట్టి మాంసకృత్తుల నందించే పప్పునధికంగా వినియోగించాలి. అన్నాలు, పచ్చళ్ళు, కారాలు తినడం కొంత తగ్గించాలి. సమయం తీసుకుని తప్పని సరిగా నడక, వ్యాయామము, ఆటలు, ధ్యానం, యోగా, ప్రాణాయామ వంటి వాటిని విధిగా ఆచరించాలి. మానసిక స్థితిని మార్చుకోవాలి. ఇతర కులాలతో కలిసి మెలసి జీవిస్తూ సామాజిక అంగీకృతిని పెంచుకోవాలి. అన్ని రకాల పోటీలకు, లక్ష్య సాధనలకు సిద్ధపడాలి. ప్రభుత్వం అనుమతించిన, న్యాయబద్ధమైన అన్ని వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో ప్రవేశించి ఆర్థికంగా బలోపేతం కావాలి. తప్పని సరిగా తమకు నచ్చిన ఏదో ఒక రాజకీయ పార్టీలో

క్రియాశీలకంగా ఉండాలి. బ్రాహ్మణుడంటే మునులు, తాపసులనే కాదు. ద్రోణ, కృపాచార్య, పరశురాములను కూడా గుర్తుకు తెచ్చుకోవాలి. ఇతర కులాల నుంచి స్త్రీలను వివాహం చేసుకోవడం శాస్త్ర సమ్మతమని గ్రహించాలి.

బ్రాహ్మణులు సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా వెనుకబడి ఉన్న మాట వాస్తవం. అందుకు కారణం వారి జీవన విధానమే. వారి ఆహారపు అలవాట్ల వల్ల శారీరకంగా బలహీనంగా ఉంటారు. వైదిక వృత్తిలో ఉన్నవారు పూజలు, జపాలు, నోములు, వ్రతాల కారణంగా అకాల భోజనాలు, ఉపవాసాలు చేస్తూ ఉంటారు. నడక, వ్యాయామం, క్రీడల వంటి వాటికి సమయమే దొరకదు. అందువల్ల శారీరక శ్రమకోర్చలేరు. ఒకప్పుడు సమాజం కూడా వారినుంచి అదే ఆశించింది. గత వైభవాలను తలచుకొని నిమ్న వృత్తులలోనికి పోలేరు. అందువల్ల ఆర్థికంగా బలహీన పడతారు. వ్యాపారాలలోకి ప్రవేశించాలంటే భయపడతారు. దానికి తోడు రాజకీయ బలం, సామాజిక బలం ఉండదు కాబట్టి వ్యాపారాలు ప్రారంభించినా నష్టాల్లోనే మునుగుతారు.

వైదిక, నియోగి, వైష్ణవ, మధ్వ, ఇత్యాది శాఖా భేదాల వల్ల ఐకమత్యం లోపించి సామాజికంగా కూడా బలహీనంగా ఉంటారు. వాస్తవానికి అందరూ మౌలికంగా బ్రాహ్మణులే. వారి నుంచి ఒకేసారి ఆరువేల మంది ప్రభుత్వోద్యోగులుగా నియమించబడడం చేత వారు నియోగులుగా పరిగణించ బడ్డారు. మిగిలిన వారు వైదిక వృత్తిని కొనసాగిస్తూ వైదికులుగానే మిగిలిపోయారు. వైష్ణవ, శైవ, మధ్వ అన్నవి సాంప్రదాయాలే తప్ప వేరు కులాలు కావు. ప్రస్తుతం నియోగులు కొందరు జీవన భృతి కోసం వైదిక, అర్చక వృత్తులు చేపడుతున్నారు. అలాగే వైదిక కుటుంబాలలోని వారు ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలలో నియోగింపబడుతున్నారు. అందువల్ల వైదిక, నియోగ, శైవ, వైష్ణవ, మధ్వ భేదాలను విస్మరించి బ్రాహ్మణులందరూ ఏకం కావాల్సిన అవసరముంది. నేను నియోగి కుటుంబంలో జన్మించినవాడినైనా నా విద్యాభ్యాసంలో ఆర్థిక సాయం చేసినవారు ఎక్కువ భాగం వైదికులే. అలాగే ప్రస్తుతం మా కుటుంబాలలో వైదికులతో అమ్మాయిల నిచ్చిపుచ్చుకున్న సందర్భాలు కూడా ఉన్నాయి. శాఖాభేదాల వల్ల ప్రతి శాఖలోని బ్రాహ్మణుల

సంఖ్య తక్కువగా ఉండి బ్రాహ్మణ వధూవరుల లభ్యత తక్కువగా ఉంటుంది. అదే శాఖలో పదే పదే సంబంధ బాంధవ్యాలు నెరపడం వల్ల జెనిటిక్ లోపాలు సంభవించే అవకాశం ఉన్నది. ఈ దృష్టితో చూచినా బ్రాహ్మణ శాఖలన్నీ ఏకమవడం తక్షణావసరం.

బ్రాహ్మణులు అన్ని కులాలలో అధికులమన్న భావన విస్మరించాలి. ఎందుకంటే వైదిక మతంలోని మునులు, దేవతలు అందరూ క్షత్రియ లేదా శూద్ర వర్ణాలలో జన్మించిన వారే. అన్ని కులాలతో కలిసి పనిచేయడం, అన్ని కులాల కొరకు పని చేయడం బ్రాహ్మణులు అలవాటు చేసుకోవాలి. సర్వేజనాస్సుఖినోభవంతు అన్న మాటను ఆచరణలో కూడా చూపించాలి. అన్ని రకాల వర్తక, వాణిజ్య, వ్యాపార రాజకీయాలలో ప్రవేశించి అందరితో కలసి ముందుకు నడవాలి. బ్రాహ్మణులు రాజకీయాలను సునిశితంగా పరిశీలించాలి. శ్రీకృష్ణుడు రాయబారంలో దుర్యోధనుడితో *"నీ పిల్లలు పాపలున్ ప్రజలు పెంపు వహింపగా సంధి చేసుకుంటావా లేక యుద్ధం చేస్తావా? యుద్ధం చేస్తే నీ మిత్రుడు కర్ణుడితో సహా నీ సైన్యం నాశనమైపోతుంది. రాజ్యమంతా నీవే ఉంచుకో. పంచ పాండవులకు ఐదూళ్ళివ్వు చాలు"* అంటూ హిత వచనాలు పలికాడు. వాస్తవానికి ఆయన మనసులో ఉన్నదేంటో అందరికీ తెలుసు. యుద్ధం జరగవల్సిందే. పాండవుల శపథాలు నెరవేరవల్సిందే. రాజ్యం లాక్కోవల్సిందే. నేటి రాజకీయ నాయకులు కూడా కార్యకర్తల కోసం, బడుగు, బలహీన వర్గాల కోసం, న్యాయం కోసం ఆఖరి రక్తపు బొట్టువరకు పోరాడతానని ఉపన్యాసాలు చెపుతూ ఉంటారు. కాని వారి పోరాటం దేని కోసమో రాజకీయ పరిజ్ఞానమున్న ఎవరికైనా తెలుసు. ఇంట్లో చేతితో మేత తినిపించి పెంచిన కోడిని, మేకను కసకస కోసి వేయించుకు తినటంతోనే వీరి మొదటి రాజకీయ పాఠం ప్రారంభమవుతుంది. ప్రజల పట్ల కూడా రాజకీయ నాయకుల ఆలోచనా విధానం అలానే ఉంటుంది. బ్రాహ్మణులు కూడా వారి సొంత ఆకలి కేకలు వినిపించడం ఆపి వెనుకబడిన అన్ని కులాలను కలుపుకొని న్యాయం కోసం పోరాడటం నేర్చుకోవాలి. వారి బాధలు మాత్రమే వినిపించి వాపోయిన కొద్దీ సమాజం నుంచి ఇంకా దూరమవుతారు.

బ్రాహ్మణులు అలా జీవించారు కాబట్టే వారి జీవితాలను సాంస్కృతిక, సాహిత్య కళారంగాలకు, భక్తి భావ వ్యాప్తికి, విజ్ఞాన సముపార్జనకు అంకితం చేయగలిగారు. అందువల్లనే అనేక గ్రంధాలు, వైజ్ఞానిక విషయాలు ఆవిష్కృతమైనాయి. ఒక్క మాటలో చెప్పాలంటే బ్రాహ్మణుల జీవన విధానం త్యాగమయం. అలాంటి వారిని వారి ధార్మిక చింతనను గుర్తించి, నిస్వార్ధ సేవా తత్వాన్ని గుర్తించి, జ్ఞానాన్ని గుర్తించి మంత్రులుగా ఉపయోగించుకున్నది స్వార్థపూరిత ప్రభువులే తప్ప బ్రాహ్మణులకు అలాంటి ఆకాంక్షలు లేవు. నాజూకుతనం ఎక్కువై బలహీనతకు దారి తీసినట్లు బ్రాహ్మణ జీవన విధానం తయారైంది. వారు ప్రస్తుత పరిస్థితులకనుగుణంగా కొంత మారాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే నాటి ధర్మ ప్రభువులు గాని, ధార్మిక సమాజం గాని నేడు లేదు.

ఈ మధ్య మా ఇంట్లో పనిచేసే ఇతర కులస్తుడికి మోకాళ్ళనొప్పులు వచ్చాయి. వాళ్ళ కులపు డాక్టరు దగ్గరకు వెళ్ళాడు. డాక్టరు అడిగాడట ఏమి పని చేస్తుంటావని. 'హరిబాబు గారింట్లో పని చేస్తున్నా' అని చెప్పాడట. అందుకే వచ్చినయిరా నీకు కాళ్ళ నొప్పులు. శుభ్రంగా మేక ముడుసులు, పులుసు పెట్టుకొని తిను. ఎందుకొస్తయి మోకాళ్ళ నొప్పులు అన్నాడట. మేకలు రసాయన ఎరువులు, పురుగు మందులు వాడిన పంటలు దినవురా. రోడ్డు ప్రక్కన, అడవుల్లో ఆకులు అలములు తింటాయి. అని నవ్వాడట. ఆయన నవ్వులాటకన్నా అందులో ఎంతో కొంత వాస్తవం కూడా ఉంది.

హరప్పకాలంలో బ్రాహ్మణులు, వైశ్యులు చెమట చిందిచలేదు అంటూ మూలుగుతూ కూర్చుంటే ఏం లాభం. హరప్ప కాలంలో మన ముత్తాతలు ఎవరో ఎవరైనా చెప్పగలరా. హరప్పాదాకా వద్దు. మన తాతగారి ముత్తాతగారి పేరు మనం చెప్పగలమా. అది తెలుసుకోవడానికి ప్రయత్నించరు గాని కొందరు హరప్పా కాలంలో ఏం జరిగింది అని ఊహిస్తూ ఉంటారు. దేశం స్వాతంత్ర్యం కోల్పోతే ఘోరకలి జరుగుతుంది. ఆర్థికాభివృద్ధి జరగకపోతే ఆకలి చావులు శరణ్యమౌతాయి. దేశంలో సామాజిక, ఆర్థిక, రాజకీయ, శాంతి భద్రతలు, అభివృద్ధి వంటి అనేక సమస్యలు విలయతాండం చేస్తున్నాయి. ఒక ప్రక్క లక్షల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. బీడి, సిగరెట్, పాన్

గుట్కా, ఆల్కహాలు, మాదకద్రవ్యాలకు యువత అలవాటు పడుతున్నారు. ఇలాంటి సమస్యలనధిగమించడానికి సమాజ సేవ చేయవలసి ఉంది. ఇలాంటివన్నీ వదిలేసి హరప్పా కాలంలో ఏం జరిగింది అంటూ సమాజంలో వివాదాలు రేపే ప్రయత్నం చేయడం ఎవరికైనా తగిన పని కాదు.

బ్రాహ్మణులు స్వేదం చిందించకపోవడమేమిటి? విమర్శించేవారిని గాలి కూడా కదలని గర్భగుడిలో సాంబ్రాణి, హారతి కర్పూరం పొగలో ఒక రోజంతా ఉంచితే అర్థమౌతుంది. మనుమసిద్ధి ఆస్థాన కవి ఖడ్గ తిక్కన, భారత కాలంనాటి ద్రోణాచార్యులు, కృపాచార్యులు, అశ్వత్థామ బ్రాహ్మణులు కారా, భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 1857లో జరిగింది. దీనినే సిపాయిల తిరుగుబాటు అంటారు. దీనిని నిర్వహించిన ఝాన్సీ లక్ష్మీబాయి, బాజీరావు పీష్వా బ్రాహ్మణులు కారా. ఆంగ్లేయులను, రజాకారులను గడగడలాడించిన జమలాపురపు కేశవరావు బ్రాహ్మణుడు కాడా, పి.వి నరసింహారావు గారు కూడా పైరవీలతో నాయకుడు కాలేదు. భారత స్వాతంత్ర్య సమరంలో పోరాడి త్యాగాలు చేసి ముఖ్యమంత్రిగా, ప్రధానమంత్రిగా పరిపాలన చేశారు. భారత స్వాతంత్ర్య సమరంలో భాగస్వామ్యులైన బ్రాహ్మణుల పేర్లు వ్రాస్తే కొన్ని వేల పేజీల గ్రంథమౌతుంది. కమ్యూనిష్టు పార్టీలు కూడా బ్రాహ్మణుల నాయకత్వం ఉన్నచోటనే కొంత అభివృద్ధి చెందినాయి.

భారత మాజీ ప్రధానమంత్రి పి.వి నర్సింహారావు గారు బహు భాషా కోవిదులు. విశ్వనాథ సత్యనారాయణ గారి వేయి పడగలు నవలను హిందీలోనికి అనువదించాడు. తెలంగాణలో రజాకారులపై పోరాటాన్ని పురస్కరించుకొని రామవ్వ అనే కథను రాసాడు. స్వాతంత్ర్యోద్యమ కాలంనుండి కాంగ్రెస్ పార్టీలో క్రియా శీలకంగా పనిచేసారు. తెలంగాణ విముక్తి పోరాటంలోనూ, భారత స్వాతంత్ర్య పోరాటంలోనూ పాల్గొన్నారు. రాష్ట్ర మంత్రి వర్గంలో అనేక హోదాలలో పనిచేసి ముఖ్యమంత్రిగా ఎదిగారు. జై ఆంధ్ర ఉద్యమంలో ఆంధ్ర నాయకులు ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలని కోరారు. లేదా ప్రత్యామ్నాయంగా ముల్కీ నిబంధనలను, తెలంగాణ వ్యక్తిని ముఖ్యమంత్రిగాను తొలగించమని డిమాండు చేసిన కారణంగా 11 నెలలకే ముఖ్యమంత్రి పదవిని వదులుకోవలసి వచ్చింది. ఆ తర్వాత కేంద్ర మంత్రివర్గంలో అనేక శాఖలు నిర్వహించి చివరిగా

ప్రధానమంత్రిగా మిశ్రమ ప్రభుత్వాన్ని 5 సంవత్సరాలు విజయవంతంగా నిర్వహించారు.

ఏ నిర్ణయం తీసుకోకపోవడమే ఆయన ప్రత్యేకత అని ఆయనను విమర్శిస్తూ ఉంటారు. వాస్తవానికి ఆయన తీసుకున్నంత సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకున్న నాయకుడు మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు. అకాలి, నిరంకారి వర్గాల మధ్య హింసాత్మక విభేదాలు నెలకొని ఎన్నికలు జరుపలేని పరిస్థితులను చక్కదిద్ది, పంజాబ్‌లో ఎన్నికలు నిర్వహించిన నేర్పరి. అలాగే కాశ్మీర్‌లోనూ సుదీర్ఘంగా పెండింగ్‌లో ఉన్న ఎన్నికలను నిర్వహించిన సాహసి. విదేశాలకు తాకట్టు పెట్టిన భారతీయ బంగారు నిల్వలను విడిపించిన సమర్థుడు. విదేశీ నిల్వల లోటును అధిగమించి ఆర్థిక సంస్కరణలతో భారతీయ ఆర్థిక వ్యవస్థను తీర్చిదిద్దిన ఆర్థికవేత్త. స్థానిక సంస్థల ఎన్నికలలో వెనుకబడిన కులాలకు రిజర్వేషన్లు కలగజేయడానికి 73 మరియు 74 రాజ్యాంగ సవరణలను ప్రతిపాదించిన సామాజిక న్యాయవేత్త.

ఒక్క కలం పోటుతో ప్రైవేటీకరణను, విదేశీకరణను పరుగులు పెట్టించడం ద్వారా నేటి యువత కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ మరియు హార్డ్‌వేర్ రంగాలలో దేశ విదేశాలలో ఉద్యోగాలు పొందగలుగుతున్నారు. వ్యాపారాలు చేయగలుగు తున్నారు. వారి ఆలోచన ప్రకారం డబ్ల్యూ.టి.ఒ. ఒప్పందం అమలు చేయడానికి 10 సంవత్సరాల మోరటోరియం కోరారు. కాని వారి తరువాత వచ్చిన ప్రభుత్వం డబ్ల్యూ.టి.ఒ. ఒప్పందాన్ని వెంటనే అమలు చేసింది. ఈనాడు భారతీయులు అనుభవిస్తున్న ఆర్థికాభివృద్ధికి ముఖ్య కారకుడు పి.వి. నర్సింహారావు. వారి కోరిక మేరకు 10 సంవత్సరముల మోరటోరియం అమలుపరిస్తే భారత పరిస్థితి ఇంతకంటే మెరుగ్గా ఉండేది.

రాజ్య సాధన తంత్రం సమస్తం రక్త సిక్తం. ప్రజల ధన, మాన, ప్రాణాలు మంటల్లో మాడిపోతాయి. ఓడిపోయిన జాతి బానిస బ్రతుకు బ్రతక వలసి వస్తుంది. చరిత్ర హీన జాతిగా బ్రతక వలసి వస్తుంది. లేదా అంతరించిపోవలసి వస్తుంది. భారతదేశం ఇలాంటి పరిణామాలనెన్నింటినో చవి చూచింది. జాతిని జాగృతం చేసి, సమైక్య పరచి, తమకంటూ ఖచ్చితమైన భూ భాగాన్ని, చరిత్రను,

భాషా, సంస్కృతులను సంరక్షించుకునేది పోయి హరప్పా కాలంలో బ్రాహ్మణులు, కోమట్లు చెమట చిందించ లేదు అనడం సమంజసమా? స్వీయ సమాజాన్ని స్వలాభం కోసం అమ్ముకునే వాళ్ళ వల్లనే భారత దేశం అనేక సార్లు స్వాతంత్ర్యం కోల్పోయింది. అభివృద్ధి మాత్రమే కూడా సరిపోదు. జాతి స్వేచ్ఛ, అహం, అస్తిత్వం నిలుపుకోవడం కూడా ప్రధానం.

ప్రపంచ దేశాలన్నీ ఆర్థిక పురోగతిలో పోటీబడుతుంటే ఇదేం పాడుబుద్ధి? సమాజంలో కల్లోలం రేపే ప్రయత్నం జేస్తున్నారు కొందరు. దీని వెనుక ఏదో బలవత్తరమైన కుట్ర దాగి ఉంది. బౌద్ధం కదా యజ్ఞ యాగాదులందు జంతు బలులను నిషేధించింది? 1700 సంవత్సరాలు జైన, బౌద్ధ మత రాజులు ఆపై 800 సంవత్సరాలు మహమ్మదీయులు, ఆ పై 200 సంవత్సరాలు క్రిష్టియన్‌లు కదా భారతావనిని పరిపాలించింది? అందుకే గదా బ్రాహ్మణులు యజ్ఞ యాగాదులను, జంతు బలులను, మాంసాహారాన్ని వదులుకున్నది? మాంసాహారాన్ని నిషేధించింది, మాంసాహారులను చిన్నచూపు చూసింది బ్రాహ్మణులని కుహనా మేధావులు విష ప్రచారం చేస్తున్నారు. సామాజిక దురాచారాలకు కూడా ఈ 2700 సంవత్సరాల అన్య ధర్మాల పాలనే కారణం. సనాతన ధర్మాన్ని వారు నాశనం చేశారు. అందువల్ల సమాజం ఆచారాలను, నమ్మకాలను ఆశ్రయించవలసి వచ్చింది.

ప్రతి వృత్తికీ ఒక ధర్మం ఉంటుంది. రాజ ధర్మం వేరు, సేవక ధర్మం వేరు, వ్యాపార ధర్మం వేరు. అలాగే వైదిక వృత్తి ధర్మం. పురోహితుడు ఇంటింటికి తిరిగి శుభాశుభ కార్యక్రమాలు నిర్వహించవలసి ఉంటుంది. అందులో భాగంగా దైవారాధన చేయవలసి ఉంటుంది. గృహస్తుకు సంబంధించిన స్త్రీ జనాలతో వ్యవహరించవలసి ఉంటుంది. అనేక వేద మంత్రాలు పఠించవలసి ఉంటుంది. ముఖ్యంగా కొన్ని క్రతువులలో శుచికి అత్యంత ప్రాముఖ్యత ఉంటుంది. గృహస్తు కుటుంబాన్నంతా నిండుమనసుతో మానసిక శక్తినంతా కేంద్రీకరించి సంతృప్తిగా ఆయురారోగ్య ఐశ్వర్యాలతో, సుఖసంతోషాలతో, వంశాభివృద్ధితో నూరు సంవత్సరాలు వర్ధిల్లమని దీవించవలసి ఉంటుంది. గృహస్తులు కూడా పురోహితుని నుంచి అదే ఆశిస్తారు. అటువంటి పురోహితుడు శుచిగా స్నానమాచరించకుండా, గాయత్రీ మంత్ర మననం చేసుకోకుండా, అశుచి

గలిగిన వస్తువులను స్పృశించి, శుభ్రంగా లేని బట్టలు ధరించి వస్తే గృహస్తులు ఇంటికి రానిస్తారా?

గృహస్తు క్షేమం కోసం, తృప్తికోసం తమ మనోశక్తిని ధారపోయడానికి విప్రుడు సంసిద్ధుడు కావాలంటే పాటించవలసిన వృత్తి ధర్మాలే శుచి, శుభ్రం. అప్పుడే వాక్సుద్ధి లభిస్తుంది. ఇతరులను దీవించిన తరువాత, ఇతరులచే పాదనమస్కారం పొందిన తర్వాత, దానం పరిగ్రహించిన తరువాత బ్రాహ్మణులు విధిగా నిర్ణీత సంఖ్యలో గాయత్రీ మత్రం మననం చేసుకుంటారు. భారత సనాతనధర్మ సారధులు బ్రాహ్మణులు. వారిని క్షత్రియుడే సృష్టించాడు. సమాజమే పోషించింది. సనాతన ధర్మంపై నమ్మకమున్న వారు కూడా బ్రాహ్మణులనే హింసిస్తే ఇంక బ్రాహ్మణులెలా బ్రతుకుతారు. అన్య మతాలు వారి మతాలను, మతాచార్యులను ఎంత గౌరవాదరాలతో చూస్తున్నారు? మనమెలా చూస్తున్నాం? ఒకసారి పరిశీలించుకోవాలి. బ్రాహ్మణీకం బ్రతకడానికి పనికి వచ్చే వృత్తే తప్ప. కార్లు, బంగళాలు, కోట్లాది రూపాయలు సంపాదించడానికి పనికివచ్చే వృత్తిగాదు. దానిపై కూడా అక్కసు పెంచుకుంటే ఎలా? బ్రాహ్మణులు బ్రతకవద్దా? బ్రాహ్మణ వృత్తి అంత ఆకర్షణీయమైన వృత్తి అయితే విమర్శకులంతా ఆ వృత్తిలోకి వలస రావచ్చు కదా?

బ్రాహ్మణులను విమర్శించడానికి గాని పొగడడానికి గాని ఎక్కువ విషయం లభ్యమౌతుంది. ఎందుకంటే బ్రాహ్మణుల చరిత్ర శ్రీకృష్ణుడు వర్ణ విభజన చేసిన నాటి నుంచి నేటి దాకా అంటే గత 5500 సంవత్సరాల నుంచి లభిస్తుంది. ఇతర కులాల చరిత్రలు అంత సుదీర్ఘంగా లేవు. ఉదాహరణకు కమ్మ, రెడ్డి, వెలమ, కాపు, మహ్మదీయుల, క్రిస్టియన్ చరిత్ర భారతదేశంలో ఈ మధ్య కాలంలోనే కనిపిస్తుంది. ఈ కొద్దికాలంలోనే వారు ఎంత మంచి పనులు చేశారో, ఎంత చెడ్డ పనులు చేశారో మనం గమనించవచ్చు. తూర్పు చాళు క్యుల కాలంలో అంటే క్రీ.శ. 10వ శతాబ్దంలో గ్రామ పెద్దను కాపు అనే వారు. అలాగే రెడ్డి, వెలమలు, కరణాలు దాదాపు అదే కాలంలో కాకతీయ సామ్రాజ్యంలో సైనికాధికారులుగా, గ్రామ పెద్దలుగా ఉండే వారని చరిత్ర చెబుతున్నది.

బ్రాహ్మణీకం లేకుంటే భారతదేశానికి, బంగ్లాదేశ్‌కు తేడానే లేదు. బ్రాహ్మణీకం వైదిక విధులపై నిర్మించబడ్డది కాబట్టి బ్రాహ్మణీకమే భారతదేశపు గుండెకాయ. బ్రాహ్మణీకం, వైదికత రెంటినీ భారతదేశం నుండి తొలగిస్తే భారతదేశం మరో బ్రిటన్ అవుతుంది లేదా పాకిస్తాన్ అవుతుంది లేదా మరో చైనా, మరో థాయిలాండ్ అవుతుంది. ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, బంగ్లాదేశ్, చంపా, బాలీ, జావా, ఇండోనేషియా, మలేషియా, సింగపూర్ ఇవన్నీ కూడా ఒకప్పుడు హిందూ దేశాలే. ఇవే కాక చతుస్సాగర పర్యంతం విస్తరించి ఉన్న భారతదేశంలో ఇంకా అనేక దేశాలు ఉండేవి. ఇతర దేశాలకు భారతదేశానికి ఒకటే తేడా. అదే బ్రాహ్మణీకం. అందుకే భారతదేశాన్ని ఆక్రమించాలనుకునే అన్ని దేశాలు ముందుగా బ్రాహ్మణీకం పైనే గురిపెడతాయి. భారతదేశంలోనే కొందరు విదేశీ సాంస్కృతిక ఏజెంట్లుగా, విదేశీ రాజకీయ ఏజెంట్లుగా మారి బ్రాహ్మణీకం పై దాడులు చేయడం దురదృష్టకరం.

అసలు భారతదేశానికి రాజకీయ, సాంస్కృతిక పితామహులు బ్రాహ్మణులు. వేదవ్యాసుడు రాశిగా చిందరవందరగా ఉన్న వేదాలను ఋగ్వేదము, యజుర్వేదము, అధర్వణ వేదము, సామవేదము అని నాలుగు భాగాలుగా విభజించడమే కాక, భారత, భాగవతాది ఇతిహాసాలను, అష్టాదశ పురాణాలను రచించడం ద్వారా, సంస్కృత భాషను మనకందించడం ద్వారా భారతీయులకు సాంస్కృతిక పితామహుడిగా అవతరించాడు. పాండురాజు, ధృతరాష్ట్రుడు, విదురునికి జన్మతః తండ్రి అయినందున కౌరవ, పాండవ వంశజులకు, వారి వారసత్వ రాజవంశాలకు జన్మతః కూడా పితామహుడయ్యాడు.

మహాభారతాన్ని మనం ప్రామాణికంగా అంగీకరిస్తే ద్వాపర యుగంలో భారత దేశంలోని క్షత్రియ వంశాలన్నీ బ్రాహ్మణుల అంశలే. పరాశరుని కొడుకు వ్యాసుడు. వ్యాసుని ద్వారా జన్మించారు కాబట్టి ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు  కూడా బ్రాహ్మణ అంశజులే. అలాగే పరశురాముడు 21సార్లు భూమండలాన్నంతా అపక్షాత్రం చేశాడనీ అప్పుడు క్షత్రియ స్త్రీలు దేవరన్యాయంగా బ్రాహ్మణుల ద్వారా సంతానం పొంది క్షత్రియ వంశాలను పునరుద్ధరించారని కూడా భారతంలో ఉంది. వేల సంవత్సరాల చరిత్రలో వేలసార్లు అనేక రాజ్యాలు,

అనేక జాతులు కలిసి, విడిపోయి, మరల కలిసి చివరకు భారతీయులు ఒక మిశ్రమ జాతిగా ఉన్నారని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తన ఇందిరకు లేఖలు అనే గ్రంథంలో రాశారు. ఆనాడు బ్రాహ్మణీకము, క్షత్రియము రెండూ వృత్తులే తప్ప ఈనాడు పిలుస్తున్నట్లుగా కులాలు కావు. భారతంలో కర్ణుడే ఒక ఉదాహరణ. అతను రాకుమారి కుంతీదేవి కుమారుడు. శూద్ర స్త్రీ రాధ వద్ద పెరిగినందున సూత పుత్రుడు అన్నారు. దుర్యోధనుడి ద్వారా అంగరాజ్య పట్టాభిషిక్తుడు కాగానే క్షత్రియుడిగా చలామణి అయ్యాడు. అంటే రాజ్యం ఉన్నవాడు మాత్రమే క్షత్రియుడు.

మనిషికి జంతువుకి బేధం భాషాపరిజ్ఞానమే కదా. ఆ భాషను సుసంపన్నం చేసే ఛందస్సు, వ్యాకరణము, తర్క మీమాంసాది విషయాలను బ్రాహ్మణులు అభివృద్ధి చేయలేదా? గణిత, ఖగోళ శాస్త్రజ్ఞులు బ్రాహ్మణులు. భరతాది నాట్యరీతులను ఆవిష్కరించింది బ్రాహ్మణులే. ఆంధ్ర మహాభారతానికి తమ జీవిత కాలాలను అంకితం చేసి రచించిన కవిత్రయం నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ, భాగవతాన్ని తెనుగించిన పోతనామాత్యుడు బ్రాహ్మణులే. వైద్య శాస్త్రంలో చరక సంహిత రచించిన చరకుడు, గణిత శాస్త్రజ్ఞుడు ఆర్యభట్ట, రామానుజాచార్యులు, ఖగోళ శాస్త్రజ్ఞుడు వరాహమిహిరుడు, అర్థశాస్త్రం రచించిన కౌటిల్యుడు, యోగా శాస్త్రజ్ఞుడు పతంజలి ఇత్యాదులందరు బ్రాహ్మణులే. బ్రాహ్మణికానికి, సమాజ శ్రేయస్సుకు అంకితమైన బ్రాహ్మణ కులాన్ని విమర్శించడం భావ్యమా. సుమధుర సంగీత సాంప్రదాయాన్ని ప్రపంచాని కందించిన త్యాగయ్య, అన్నమయ్య, రామదాసు వంటి వాగ్గేయకారులు బ్రాహ్మణులు కాదా? సంగీత, సాహిత్య, భక్తి తత్వాలకు సేవచేయడమే కాకుండా సంఘసంస్కరణలకు, స్వాతంత్ర్యోద్యమానికి కూడా తమవంతు కృషి చేసిన మాట వాస్తవం. కాని, ఇతరుల రాజకీయ అధికార సాధన తంత్రంతో పూర్తిగా దోషులుగా చిత్రీకరించబడ్డారు. సర్వసాంఘీక దురాచారాలకు బ్రాహ్మణులను దోషులుగా నిలబెట్టారు. కులాలను బ్రాహ్మణులే సృష్టించి తమను అగ్రభాగాన ఉంచుకొని మిగిలిన వారిని చిన్న చూపు చూశారని ప్రచారం చేశారు. రాజకీయ రంగంలో పోటీకి రాగలవారిని మట్టుబెట్టడం సహజమే కదా.

బ్రాహ్మణ వృత్తి నేటికీ ఒక  సామాజిక అవసరం. ప్రజల ప్రవర్తన పూర్తిగా చట్టం ద్వారా నియంత్రించబడదు. అంతఃకరణ ద్వారా కూడా నియంత్రించ బడుతుంది. అంతఃకరణను సజావుగా నడిపేది సదాలోచన, సాంప్రదాయం, భక్తి భావం, పాపపుణ్యాల స్పృహ. ఇది సాధించడం ధర్మబోధనల వల్లనే అవుతుంది. వాస్తవానికి బ్రాహ్మణులను, చాతుర్వర్ణాలను నిర్వచించి వారివారి విధులను నిర్దేశించినది క్షత్రియులే. ప్రజలను ధర్మమార్గంలో నడిచేలా నీతిని, భక్తిని బోధిస్తూ రాజ్యపాలన సజావుగా సాగేలా తోడ్పడటం బ్రాహ్మణుల విధి. వారు సాత్వికాహారం తింటూ సాత్వికంగా ఉండాలన్నది సాంప్రదాయం. బ్రాహ్మణీకం ఒక జాతి కాదు. ఒక వృత్తి. ఆ వృత్తి ధర్మాలు కొన్ని ఉంటాయి. ముప్పొద్దుల సంధ్య వార్చుకోవడం, గ్రంధ పఠనం, జ్ఞాన బోధనం, వైదిక విధులనాచరించటం, దానం గ్రహించడం, దానం ఇవ్వడం వారి వృత్తి. అందుకు స్వేదం చిందవలసిన అవసరం లేదు. కాని సామాజిక, ఆర్థిక, రాజకీయ, విద్యా, వృత్తి, పారిశ్రామిక రంగాలలో జరిగిన పరిణామాల ప్రభావం బ్రాహ్మణీకంపై  కూడా పడి వారు ఇతర వృత్తి, ఉద్యోగ వ్యాపారాల వైపు కూడా సాగుతున్నారు. ధర్మో రక్షతి రక్షితః అన్నట్లు బ్రాహ్మణ్యాన్ని రక్షిస్తే అది హిందూ ధర్మాన్నే కాదు సమాజాన్ని కూడా రక్షిస్తుంది.

బ్రాహ్మణులు శ్రేష్ఠులమని, పవిత్రులమని, జ్ఞానులమని, సాక్షాత్తు భగవత్ స్వరూపులమనే భావన హద్దులు దాటడం వల్లనే సమాజ ఆగ్రహానికి గురి అయినారు.  ప్రభుత్వం కల్పించిన ప్రత్యేకతలను, అధికారాలను కొందరు దుర్వినియోగం చేయడం, అందువల్ల ఆ ప్రభావం ఆ సమాజ మొత్తానికి వర్తించడం కూడా సహజం. కమ్యూనిస్టు ఉద్యమాల పేరుతో మెడకాయలు కోసి చంపబడ్డారు. స్వాతంత్ర్యం రాగానే రాజకీయాలలో వెనక్కి నెట్టబడ్డారు. ఒక ప్రభుత్వం భూసంస్కరణలు, సీలింగ్ పేరుతో జమీందారుల భూములు లాక్కుంది. మరొక ప్రభుత్వం  పటేలు, పట్వారి వ్యవస్థను రద్దు చేసింది. ఉద్యోగ రిటైర్‌మెంటు వయసు 58 నుంచి 55కి తగ్గించడం ద్వారా  బ్రాహ్మణ ఉద్యోగులను పెరికివేసింది. పటేల్, పట్వారి వ్యవస్థల రద్దు ద్వారా ఉద్యోగ వసతులు, ఏ ఆలంబనా చూపకుండా అకస్మాత్తుగా పెరికివేసింది. ఈ కారణంగా ఉద్యోగాలు కోల్పోయిన వారు అన్ని కులాల వారు ఉన్నారు కాని బ్రాహ్మణులే అధికం.

అనేక దశాబ్దాలుగా అదే ఉద్యోగం చేసిన వ్యక్తిని నీవు ఆ ఉద్యోగానికి పనికిరావని పెరికి వేస్తే అతను మరే వృత్తి, ఉద్యోగం చేసి బ్రతకగల్గుతాడు. కొందరు ఆ సమయానికి ఐదు పదుల వయస్సు దాటినవారున్నారు. అప్పుడే వారికి ఆడ పిల్లల పెళ్లిళ్లు, మగ పిల్లల చదువుల అవసరాలుంటాయి. రిటైరయిన తర్వాత ప్రశాంతంగా గడపడానికొక గూడు నిర్మించుకోవాలనే ఆశతో వుంటారు. ఆ దశలో వారిని మరో దారి చూపకుండా పెరికి వేయడం తప్పనిసరిగా అమానుషమే. అనేకమంది అభ్యర్థులు గుండెపోటుతో మరణించారు. కొందరు మనోవ్యధతో చిక్కి శల్యమై మరణించారు. ఆడపిల్లలు వివాహానికి నోచుకోక ఇబ్బంది పడ్డారు. మగపిల్లలు చదువులు కొనసాగించటం కష్టమైంది.

ఏడు పదుల సంవత్సరముల వయస్సు దాటిన రాజకీయ నాయకులు రాజ్యాధికారం కోసం, రెండవ పెళ్లి కోసం, సంతాన ప్రాప్తి కోసం అర్రులు చాస్తూ యాభై అయిదు సంవత్సరాలకే ప్రభుత్వ ఉద్యోగులను రిటైరవ్వాలనడం సమంజసమా? పాఠకులలో కొందరు ప్రభుత్వ చర్యను న్యాయస్థానం సమర్థించింది కదా అనవచ్చు. వారు ఆలోచించాలి. ప్రభుత్వోద్యోగులను, పటేల్ పట్వారీలను మామూలుగా వయస్సు ప్రకారం పదవీ విరమణ చేసిన తరువాత వారి స్థానంలో ప్రభుత్వం నిర్ణయించిన విద్యార్హతలు కలిగిన వారిని నియమించుకుంటామంటే న్యాయస్థానం కాదంటుందా? అలాగే పదవులు కోల్పోయిన వారికి ఇతరత్ర జీవనభృతి కల్పిస్తామంటే న్యాయస్థానం కాదంటుందా? ప్రభుత్వాలకు మానవత్వంతో ఆలోచించవలసిన బాధ్యత లేదా?

ఒక్క మాటలో చెప్పాలంటే బ్రాహ్మణ కులాన్ని ఇక తిరగబడలేని స్థాయికి తొక్కివేశారు. ఇదంతా చేసింది పాలకులే. కారణం ఏమిటంటే స్వాతంత్ర్యానంతరం రాజకీయ ప్రస్థానంలో పోటీగా నిలచినవారు బ్రాహ్మణులు. స్వాతంత్ర్యోద్యమంలోను, సంఘ సంస్కరణలోను బ్రాహ్మణులు ముఖ్య భూమిక పోషించారు. అందువల్ల రాజకీయ అగ్రవర్ణాలకు టార్గెట్ అయినారు. అందుకే నిర్దాక్షిణ్యంగా అణచివేశారు. ఎవరికి అగ్రాసనం ఇచ్చినా ఎవరిని అణగద్రొక్కినా పాలకులకే చెల్లుబాటు గదా. ఆ క్రమంలో బ్రాహ్మణ కులంపై సమాజంలో కావలసినంత దుష్ప్రచారం చేశారు. అదే నిజమని భ్రమించిన కొందరు అలా

భ్రమించడం తమమేధాసంపత్తికి నిదర్శనంగా భావించుకొని సంస్కర్తలుగా ప్రచార కర్తలుగా తయారవుతున్నారు.

అదే మరో నాయకుని రాజకీయ పరిణతి, ధర్మప్రవర్తన చూడండి. ఎంతో కొంతకాలం కాంట్రాక్టు ఉద్యోగులుగా పని చేసిన వారిని పర్మినెంట్ చేయడమేకాక ప్రభుత్వ జీతభత్యాలనందించడం చరిత్రలో నిలిచిపోయే అంశం. తెలంగాణ ఉద్యమకాలంలో చేసిన వాగ్దానం నిలబెట్టుకోవడం కోసం సమాజంలోని కొన్ని వర్గాల వ్యతిరేకతను సైతం లెక్క చేయకుండా కాంట్రాక్టు ఉద్యోగులను క్రమబద్ధీకరించడం పాలకులకు ఉండవలసిన నిబద్ధతకు నిదర్శనం. భారతంలో గయోపాఖ్యానం గుర్తుకొస్తుంది.

బ్రాహ్మణులు గౌరవించబడడానికి కారణం వారి విద్య, వారి ప్రవర్తన మరియు జీవన విధానమే. సాత్వికాహారం తింటూ, సాత్విక ప్రవర్తన కలిగి, రాజ్యకాంక్ష, ధనకాంక్ష లేక, ఇచ్చింది పుచ్చుకొని, దీర్ఘాయుష్మాన్ భవః ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి రస్తు, వంశాభివృద్ధిరస్తు, మనః సంకల్ప సిద్ధి రస్తు అని ఆశీర్వదించే బ్రాహ్మడిని తిట్టే వారెవరు, కొట్టే వారెవరు? వేద, పురాణేతిహాసాలను పఠిస్తూ, బోధిస్తూ, గ్రంధ రచనలు చేస్తూ, భిక్షాన్నంతో బ్రతికే బ్రాహ్మణులు నిజంగా భూసురులే. ఈ రోజుకైనా ఏ కులం వాడైనా అలా నిస్వార్థంగా సమాజ శ్రేయస్సుకు పాటుబడే వాడు భగవంతుడితో సమానమే. వేద శాఖలు 1100 వరకు ఉండేవట. విదేశీయుల పాలనలో, జైనుల, బౌద్ధుల పాలనలో అవి క్రమక్రమంగా అంతరించి పోయి నేటికి 13 శాఖల వరకే అందుబాటులో ఉన్నాయట. అలా అంతరించిన వేద వాఙ్మయాన్ని పునరుద్ధరించే ప్రయత్నంలో భాగంగానే బ్రాహ్మణులు వేద విధులకు అంకితమైనారు. బౌద్ధ సిద్ధాంతాలలో ముఖ్యమైనది వేదాలను ప్రమాణములుగా అంగీకరించక పోవడం. యజ్ఞ యాగాదులను నిరసించడం, యజ్ఞాలలో జంతుబలులను నిషేధించడం. 1300 సంవత్సరాలు బౌద్ధం భారతదేశ రాజమతం. యజ్ఞ, యాగాదులు కనుమరుగైపోయాయి. ప్రభుత్వం బౌద్ధమైనపుడు ఇతర మతాలు అవమానాలు పొందడం సర్వసహజం.

బ్రాహ్మణీకమనేది ఒక కులం కాదు. ఒక జీవన విధానం. భారతీయులకు వారి జాతి చరిత్ర గొప్పదనాన్ని పురాణేతిహాసాల ద్వారా తెలియజేస్తూ, వైదిక విజ్ఞానాన్ని, ఖగోళ జ్ఞానాన్ని తెలియజేస్తూ, సాంప్రదాయాలను తెలియజేస్తూ, నోములు, వ్రతాలు, పండుగలు, క్రతువులు నిర్వహించడంలో సాయపడుతూ సమాజం పాప పుణ్యాల స్పృహ గలిగి సన్మార్గంలో నడిచే విధంగా సహకరించడం బ్రాహ్మణుల విధి. సాత్వికాహారం తింటూ సాత్విక జీవనం సాగించడం వారి జీవన విధానం. ఐతే బ్రాహ్మణులను పెంచి పోషించిన యస్.సి., యస్.టి., బీ.సి, రాజులు అంతరించి పోయి, హిందూ మతమే దాదాపు అంతరించి పోయి క్రీ.పూ. 7వ శతాబ్ది నుంచి జైన, బౌద్ధ మతాలు ప్రబలిన కారణంగా దేవాలయాలు మూత బడినాయి. బ్రాహ్మణులు అవహేళనలకు, భయాందోళనలకు గురైనారు. వేదవిధులు విడిచి పుచ్చి ఇతర వృత్తుల నవలంబించ ప్రారంభించారు. ఇలా క్రీ.శ. 8వ శతాబ్దంలో శ్రీ ఆదిశంకరాచార్యులు ఆవిర్భవించి బౌద్ధ పండితులను వాదంలో ఓడించి అద్వైత సిద్ధాంతం ప్రతిష్ఠించేంత వరకు అంటే షుమారు 1500 సంవత్సరాలు బ్రాహ్మణులు అజ్ఞాత వాసం చేయవలసి వచ్చిందని చెప్పవచ్చు. ఎక్కడెక్కడో వేద విధులు మరచిపోయి బ్రతుకుతున్న బ్రాహ్మణులను వేద విధులు నిర్వహించేటట్లుగా నియమించడం తలకు మించిన భారమే. ఆ సందర్భంగానే బ్రాహ్మణుల రక్షణ గురించిన చట్టాలు, వారి ఆర్థిక స్థితి గతులను గురించి చర్యలు ప్రభువులు చేబట్టారని నా భావన. అలా బ్రాహ్మణ సామాజికాధిపత్యంగాని, బ్రాహ్మణ వృత్తిలో ఒకప్పుడు వున్న వారి సంతానం కూడా బ్రాహ్మణులుగా పరిగణించబడటం గాని ప్రారంభమైంది. బ్రాహ్మణాధిపత్యం అలా ప్రభువులు కల్పిస్తే వచ్చింది తప్ప సాత్వికాహారులైన బ్రాహ్మణులు పోరాటాలు చేసి లేదా ఇతర వర్ణాలను అణగద్రొక్కి గాని సాధించిన పరిపాలనాధిపత్యం కాదు.

సనాతన వాఙ్మయాన్ని విమర్శించడానికి కుహనా మేధావులు సంధించే అజ్ఞానాస్త్రం పురుషసూక్తంలోని కొన్ని వాక్యాలు. పురుషసూక్తంలో ఇలా వుంటుంది. *బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూ రాజన్య కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయత* అని. కుహనా మేధావులు దీని అర్థం

ఇలా చెబుతారు. బ్రాహ్మణులు బ్రహ్మముఖం నుండి పుట్టారట, బాహువుల నుంచి క్షత్రియులు పుట్టారట, ఉదరం నుంచి వైశ్యులు పుట్టారట, శూద్రులు పాదాల నుంచి పుట్టారట అని. వీరికి సంస్కృత భాషా జ్ఞానం లేకపోవడం ఊహించదగ్గ విషయమే. అలాగే వారి శ్రోతలకు కూడా సంస్కృత భాషా పరిజ్ఞానం ఉండక పోవచ్చు. అందువల్ల ఈ కుహనా మేధావులు వల్లించిందే వేదంగా చలామణి అవుతున్నది. వాస్తవానికి ఆ మంత్రం అర్థం అదికాదు. ఈ విశ్వం సర్వస్వం పురుషుని యందు అంటే భగవంతుని యందు నిబిడీకృతమై ఉంటుందని, మరల మరల సృష్టి, స్థితి, లయాదులనే ప్రక్రియల ద్వారా ప్రకటితమౌతుందని, విశ్వ పరిణామ క్రమాన్ని వివరించే వేద మంత్రమది.

వేదాన్ని తప్పుగా చదివినా, తప్పుగా అన్వయించుకున్నా విపరీతార్థాలు గోచరిస్తాయని, అనర్థాలు వాటిల్లుతాయని పండితుల అభిప్రాయం. ఇక్కడ కూడా ఇదే జరుగుతున్నది. బ్రాహ్మణోస్య ముఖమాసీత్ అంటే బ్రాహ్మణులు ముఖం నుంచి పుట్టినారని కాదు. ఆశించి ఉంటారని అర్థము. అలాగే బాహూ రాజన్య కృతః అంటే బాహువులు రాజన్యులుగా ఉన్నారని అర్థం. కృతః అంటే అర్థం పుట్టుట కాదు, చేయబడినది అని అర్థం. అలాగే పద్భ్యాం శూద్రో అజాయత అంటే శూద్రులు విరాట్పురుషుని పాదాల నుంచి పుట్టారని అర్థం కాదు. అజాయత అంటే తెలుసుకొనబడుతున్నారని అర్థం. ఇది చక్కని భావం. ఈ సృష్టిలో అరణ్యాలు, జంతువులు, మానవులు, గ్రామాలు తిరిగి తిరిగి ఉద్భవిస్తాయి.

ఈ సృష్టియందు ఉన్న అన్ని కన్నులు, అన్ని తలలు, అన్ని పాదములు ఆ విరాట్పురుషునివే అని కూడా ఆ మంత్రంలో ఉంటుంది. అనగా మీరు ఏ క్రియ చేసినా, ఏ ఆలోచన చేసినా భగవంతుడు చూస్తూనే ఉంటాడు. మీరు చేసే ప్రతి మంచి, చెడు పనులకు తగిన ప్రతిఫలం మీకు పాపపుణ్యాల రూపంలో మీ ఖాతాలో జమా ఖర్చులు పడతాయి. వాటి ఆధారంగా జన్మ జన్మాంతరాలకు వరాలో, శిక్షలో పొందక తప్పదు. మీ కారణంగా ఏ ఒక్కరు సంతోషించినా మీ ఖాతాలో జమ పడుతుంది. ఏ ఒక్కరు బాధపడినా మీ ఖాతాలో మైనస్ తప్పదు. అందుకే అంటారు తథాస్తు దేవతలూంటారని, పరులెరుగకున్న పరమాత్మ

ఎరుగడా అని. సహర్ష శీర్షా పురుషః, సహస్రాక్ష సహస్రపాత్, సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్టద్దశాంగులమ్ అన్న పురుష సూక్త శ్లోకం ప్రకారం భగవంతుడు వేయి తలలతో, వేయి కళ్ళతో మీరెక్కడికిపోయి ఏ ఆలోచన చేసినా, ఏ క్రియ చేసినా వేయి కాళ్ళతో వెంబడించి గమనించి తదనుగుణమైన ఫలితాన్నందిస్తాడు. *సభూమిం విశ్వతోవృత్వా అత్యతిష్టద్దశాంగులం* అనడం ద్వారా మీరు ఈ లోకంలోనే కాదు ఏ లోకంలో ఎక్కడికిపోయి ఏం చేసినా, ఏం ఆలోచించినా వాటినన్నింటిని గమనించి రికార్డు చేసి, ఫలితం నిర్ణయించి ఒక క్రమ ప్రకారం శిక్షలో, వరాలో మీకు ఆ విరాట్పురుషుడందిస్తాడు. అందుకే చట్టాలకు భయపడిగాని, చూచే వారికి వెరచి గాని చెడు కార్యాలు చేయకుండా ఉన్నంతమాత్రాన సరిపోదు. చెడు ఆలోచనలు కూడా చేయరాదని భావం.

విరాట్పురుషుని ఆపాదమస్తకం మానవ విభాగాలుగానే వర్ణించబడింది. ఈ సిద్ధాంతం ప్రకారమే శ్రీకృష్ణభగవానుడు చాతుర్వర్ణాలను నిర్వచించి వుండవచ్చు. ఈ సృష్టి ఉత్కృష్టదశ మానవ సమాజమే. ఏదీలేని పేదవాడు క్రింద ఉంటాడు, డబ్బున్నవాడు ఆపైన ఉంటాడు, రాజ్యాధికారం కలిగిన వాడు ఆపై ఉంటాడు, ఇవేమీ అవసరం లేకుండా సమాజ శ్రేయస్సుకు అంకితమైన వాడు ఆపైన ఉంటాడు అనడంలో ఎంతమాత్రం తప్పు లేదు కదా. అందుకే పై నుంచి క్రిందకు క్రమంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నిలువెత్తునా భగవంతుని రూపంలో ఆపాదమస్తకం నిండి ఉన్నారని పురుష సూక్తంలో వర్ణించబడింది. అంత మాత్రాన శరీరంలో ముఖం గాని, పాదాలు కాని ఏదైనా భాగం ప్రాధాన్యత లేదనుకుంటే ఎలా? భగవంతుని పాదాలకు గదా తల వంచి నమస్కారం చేస్తాం. భగవంతుని అంగాంగార్చనలోని భావం కూడా సమాజంలోని అన్ని వర్గాలను పూజించడమే. ముఖ్యంగా ఈ పని చేసేది బ్రాహ్మణులు. మరి వారినే విమర్శిస్తే ఎలా?

బ్రాహ్మణులు చేసే పూజ భావనా మాత్రం. క్షత్రియులు చేసే పూజ క్రియా పూర్వకం. సమాజంలోని అన్ని వర్గాల సేవ చేయడం ద్వారా, వర్ణాశ్రమ ధర్మాలను కాపాడటం ద్వారా ప్రజలకు సౌకర్యాలు, అభివృద్ధి, సంక్షేమం, శాంతి భద్రతలనందించడం ద్వారా ఆ భగవంతుని పూజను క్షత్రియులు క్రియా

పూర్వకంగా చేస్తున్నట్లు లెక్క. అందుకే ఆ రెండు వర్గాలకు సమాజంలో గౌరవం అధికం. ఆ తర్వాత, ఏదైనా వ్యాపారం లేదా పరిశ్రమ లేదా వ్యవసాయం నిర్వహించి పదిమందికి ఉపాధి కల్పించే వ్యాపారస్తుడికీ కొంత గౌరవం దక్కడం సమంజసం. ఎలాంటి వనరులు లేక సేవక వృత్తిలో ఉన్నవారికి ఆదరణ, సేవ అవసరం. అలాగని ఎవరు శూద్రుడంటే భ్రష్టుడైన బ్రాహ్మణులు, రాజ్యం కోల్పోయిన క్షత్రియులు, వ్యాపారం కోల్పోయిన వైశ్యులు కూడా శూద్ర వర్ణంలోనే చేరతారు. శూద్రులు స్త్రీలైతే అగ్ర వర్ణాల వారిని వివాహం చేసుకోవడం ద్వారాను, పురుషులైతే వారి ప్రయత్న పూర్వకంగాను వైశ్యులుగా, క్షత్రియులుగా, బ్రాహ్మణులుగా కూడా ఎదగవచ్చు. ఆధునిక సమాజంలో కూడా జరుగుతున్నదదే. అన్ని వర్ణాల వారు వ్యాపారం వైపు, రాజకీయాల వైపు చూస్తునే ఉన్నారు. అలా వర్ణాల ఊర్ధ్వ, అధోచలనాల అవకాశమున్న వేదాధారమైన వర్ణవ్యవస్థ వుంటే ఈనాటికీ ఏ రకమైన ఇబ్బందీ ఉండేది కాదు. అన్య ధర్మాలు భారతదేశంపై పెత్తనం సాగించడం వలననే ఈ వర్ణాశ్రమ ధర్మవ్యవస్థ దెబ్బతిని అవస్థ పడుతున్నాం. రాజకీయాలకు ఉపయోగపడుతున్నది గాబట్టే పాలకులే కుల వ్యవస్థను సంరక్షిస్తున్నారు.

బ్రాహ్మణులను మనువాదులంటూ కొందరు కుహనా మేధావులు ఉపన్యాసాలు దంచడం మనం వింటూ ఉంటాం. ఒకసారి ఖమ్మంలో సామాజిక న్యాయంపై ఒక సదస్సు పెట్టారు. దానికి నన్ను కూడా ఆహ్వానించారు. ఒక వక్త ఉద్రేకంతో ఊగిపోతూ మనుస్మృతి అనే పుస్తకంలోని కొన్ని భాగాలను ఉటంకిస్తూ ఉపన్యాసం దంచి వేదిక దిగాడు. నేను ఆయన దగ్గరకు వెళ్ళి ఈ పుస్తకం ఎక్కడ కొన్నారని అడిగాను. కొనలేదు ఒక సాహిత్య మిత్రుడు చదవమని ఇచ్చాడు అన్నాడు. తీసుకుని చూచాను. ఈ పుస్తకం పేరు మనుస్మృతి. సంస్కృతంలో ఉండాలి కదా. తెలుగులో తర్జుమా ఎవరు చేశారో తెలియదు కదా. సంస్కృతంలో ఒరిజినల్ టెక్స్ట్ కూడా ప్రయత్నించక పోయారా అన్నా. అది నాకనవసరం. సంస్కృతం అంటేనే నాకు అసహ్యం అన్నాడు. అసహ్యం అన్నది సంస్కృత పదమే అన్నాను. వాడికి చిర్రెత్తుకొచ్చింది. మీకనవసరం ఇవన్నీ అన్నాడు. విజయవాడలో ఫుట్‌పాత్‌ల మీద పాత పుస్తకాలు అమ్మే చోటనే ఇట్లాంటి పుస్తకాలు అమ్ముతూ ఉంటారు అన్నా. ఐతే ఏమైంది అన్నాడు.

ఇది వ్రాసిన మనువు ఏ కాలంలో వ్రాశాడు అన్నా. ఓ పురాతన కాలంలో, వేదకాలంలో రాసుంటాడు అన్నాడు. మరిప్పుడెందుకు ఆ గొడవ అన్నా. మేం రీసెర్చ్ చేస్తున్నాం. సోషల్ రీసెర్చ్ అన్నాడు. ఇప్పుడున్న పరిస్థితులలో ఏది మంచో దాని ప్రోత్సహించండి. ఏది మంచిది కాదో దానికి వ్యతిరేకంగా ప్రచారం చేయండి. సరిగ్గా తెలియని గతాన్ని గురించి గతంలో జరిగిన మంచిని విస్మరించి, చెడును ఊహించి యాగి చేస్తూ సమాజంలో ద్వేషాలు రగల్చడమెందుకు? సమాజ సంస్కరణ ఒక నిరంతర శాశ్వత ప్రక్రియ. ఎన్ని యుగాలు గడిచినా ఆ ప్రక్రియ అలాగే కొనసాగుతుంది అన్నా. వాడు ఉవ్వెత్తున లేచాడు. నువ్వు బాపనోడివా? అందుకే ఇవన్నీ మాట్లాడుతున్నావు. నన్ను చెంపదెబ్బ గొట్టి గతం గతః మర్చిపో అంటే కుదురుతదా? సారీ చెపితే సరిపోతదా? నువ్వు సారీ జెప్పాల, ముందు ముందు గట్లాంటి పనులు జేయనని ముక్కు నేలకు రాయాలె, గప్పుడు దెబ్బకు దెబ్బ నేను నిన్ను చెంపదెబ్బ గొట్టాలె అన్నడు. ఆ! నేను నిన్నెప్పుడు గొట్టా అన్నా. నువు గాకపోతే మీ నాయన, మీనాయన గాకపోతే మీ తాత గసుంటి పనులు చేయలేదా? మా దళిత సోదరులను అవమానించలేదా? ఏం మాట్లాడుతున్నావు? ముడ్డికి తాటాకులు గట్టి నడిపించలేదా? ఊరి బయట ఉంచలేదా? అంటరానోళ్ళు అనలేదా? ఇదంతా మీరు కాదా చేసింది? అంతకన్న అమానుషముంటదా? అంటూ ఊగిపోయాడు. మా కుటుంబీకులెవరూ అట్ల జేసిన చరిత్ర నాకు తెలియదు అన్నా. మీ కుటుంబీకులు గాకపోతే మీ కుల పోళ్ళండీ అన్నాడు. మిగతా కులపోళ్ళందరూ మిమ్ములను గలుపుకున్నరా? పక్కన గూర్చోనిచ్చిన్రా? వాళ్ళు గూడ మిమ్ములను గలుపుకోలేదుగద? వాళ్ళింటి పక్కన మీ ఇళ్ళు ఉండనియ్యలేదు గద? మీ ఇంట్లో వాళ్ళు భోజనం చేయలేదు కదా? వాళ్ళింట్లో మీకు సమానంగ భోజనం బెట్టలేదు గదా? ఊరు బయటనే గదా ఉంచిన్రు. మరి అందరిని వదిలిపెట్టి బ్రాహ్మణులను తగులుకున్నవేంది అన్నా. వాళ్ళేగద మావోళ్ళను ఊరిబైట ఉంచింది అన్నడు. బ్రాహ్మణులు జెబితే ఎవరింటరు. పాలకులుగదా సమాజాన్ని నియంత్రించేది. రాజ్యాలు ఏర్పడి కొన్ని వేల సంవత్సరాలు అయింది కదా అన్నా. మీరేదేదో మాట్లాడుతున్నారు అంటూ అక్కడ నుంచి లేచిపోయాడు.

విజయవాడలో ఫుట్‌పాత్‌ల మీద అమ్ముడయ్యే మనుస్మృతి అనే పుస్తకం ఇలాంటి వారికి ఒక గైడు పుస్తకం లాంటిది. మనువు బ్రాహ్మణుడా. అనేక వందల దేశాలుగా విడివడి ఉన్న భారతదేశంలో ఏ దేశానికి చెందినవాడు. ఆ దేశపు రాజెవరు? ఆయన దీనిని అమలు చేశాడా? అమలు చేసినా, ప్రభుత్వాన్ని నిందించాలా, చట్టం కూర్పు చేసిన వాడిని నిందించాలా? వాడి కులాన్ని నిందించాలా? రాజు సూచనల మేరకు కదా లేఖకుడు చట్టాలు లిఖిస్తాడు? ఈనాడు జి.యస్.టి. చట్టం గాని, మరో చట్టం గురించి గాని అది వ్రాసిన వాడెవడు అని ఆలోచిస్తామా. ప్రభుత్వాలనే బాధ్యులను చేస్తాం గదా. పనిలేని వాళ్ళే ఏదో ఒక అంశాన్ని లేవనెత్తి ప్రాముఖ్యత పొందాలని ప్రయత్నిస్తారు.

ఆ మధ్య కమ్యూనిస్టు పార్టీ వారి పుస్తక ప్రదర్శన ఖమ్మంలో జరిగితే నేను సందర్శించడం జరిగింది. నాకు సహజంగానే పుస్తక పఠనాభిలాష జాస్తి. అక్కడ మనుస్మృతి అని తెలుగు పుస్తకం చూచి కొన్నాను. ఈ పుస్తకం పేరు బెట్టి సనాతన ధర్మాన్ని, సనాతన వాదులను విమర్శిస్తున్నారు. అసలు ఈ పుస్తకంలో ఏముందో చూద్దామన్న జిజ్ఞాసతో కొని చదివాను. మీకర్థమయ్యే ఉంటుంది. అందులో ఏముందో చూద్దామన్న జిజ్ఞాసతో కొన్నానని చెప్పినప్పుడే. అంటే నా 60 సంవత్సరాల జీవితంలో నేను గాని మా తల్లిదండ్రులు తాత ముత్తాతలుగాని ఆ పుస్తకం చూచి ఎరగము. అసలా పుస్తకం వాస్తవ రూపంలో చలామణిలోనే లేదు. స్వార్థం కోసమో, రాజకీయ లబ్ధికోసమో సనాతన భారతీయ భావనలను విమర్శించడం పనిగా పెట్టుకున్నవారు మాత్రం మనుస్మృతి పేరుతో చిలవలు పలవలుగా వ్యాఖ్యానాలు చేస్తూ ఉంటారు. వారికి నా మనవి ఒకటి. వారు తమ స్వంత మాతృ సంస్కృతిని నాశనం చేసుకుంటున్నారని గుర్తిస్తే చాలు.

భారతీయ సంస్కృతి మనకు గర్వకారణం. ఇప్పటికే విదేశీయుల పాలనలో భారతీయతను కొంత కోల్పోయాం. ఇక్కడి సంస్కృతి, విజ్ఞానము, చరిత్ర, సర్వస్వం కొల్లగొట్టబడ్డాయి. మరొకసారి అలాంటి పరిస్థితి ఆహ్వానిద్దామా? అంతఃకలహాలతో అంతమై పోదామా? మనలోని లోపాలను సరిదిద్దుకుంటూ భారతీయత, వైదికతతో కూడిన మన సనాతన ధర్మాన్ని పునరుజ్జీవింప చేసుకుని

మన ఉనికిని కాపాడుకుందామా? ప్రతి ఒక్క భారతీయుడు ఆలోచించుకోవాలి. మనుస్మృతిలో ఒక చోట రాసి ఉంది. వివాహము, తద్దినము ఇత్యాది కార్యక్రములు నిర్వహించిన బ్రాహ్మణునకు రుసుము క్రింద పక్షి మాంసమైతే ఎంత ఇవ్వాలి, మేక మాంసమైతే ఎంత ఇవ్వాలి, పశుమాంసమైతే ఎంత ఇవ్వాలి అని. ఈ విమర్శకులను గుండె మీద చేయి వేసుకుని నిజాయితీగా చెప్పమనండి. బ్రాహ్మణులు మనుస్మృతి ననుసరిస్తున్నారా? సంభావన క్రింద పక్షి మాంసం, మేక మాంసం, పశు మాంసం తీసుకుంటున్నారా?

ఒక్కొక్క కాలంలో ఆనాటి సామాజిక అవసరాల దృష్ట్యా ఆనాటి పాలకులు చట్టాలు రూపొందిస్తారు. కాలాంతరంలో రాజ్యాలూ అంతరించి పోతాయి, చట్టాలు రద్దయిపోతాయి. స్మృతులంటే చట్టాలే. ఉదాహరణకు మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, పరాశర స్మృతి మొదలైనవి. ఈనాటి చట్టాలకు కూడా స్మృతులే ముఖ్యాధారాలు. స్మృతి అంటే జ్ఞాపకము అని అర్థం. గతంలో తరతరాలుగా అమలులో ఉన్న మంచి విధానాల క్రోడీకరణే స్మృతి. మనుస్మృతి ఈనాడు అమలులో లేదు. దాని ప్రతులు తగులబెట్టటం ఒక పనికిమాలిన చర్య. తద్వారా సనాతన ధర్మాన్ని, సనాతన వాదులను నిరసిస్తున్నామనుకుంటే పొరపాటే. ఏది ఏమైనా అది అనేక వేల సంవత్సరాల క్రితం రద్దయిన చట్టం. ఆ తర్వాత అనేక రాజ్యాలు, అనేక చట్టాలు వచ్చినై. ప్రస్తుతం ఎలా జరిగితే బాగుంటుందో ఆలోచించేవారే విజ్ఞులు.

శ్రీకృష్ణుడు చేసిన వర్ణ విభాజన, ఆచరణ అమలులో ఉంటే అంతకు మించి కోరుకోదగిన సామాజిక న్యాయం మరొకటి ఉండదు. శూద్రులు ప్రయత్న పూర్వకంగా ఏ ఉన్నత వర్ణానికైనా ఎగబాకవచ్చు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు తమ తమ వృత్తులు విస్మరించినా లేక కోల్పోయినా వారు కూడా శూద్రులుగానే పరిగణించబడతారు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు కూడా మాంసాహారులే. ఇంతకు మించి సామాజిక న్యాయం ఈ కాలంలో కూడా లేదు. ప్రస్తుతం ప్రజలు కులాలు, ఉపకులాలుగా విడిపోయి వేరు కుంపట్లు పెట్టుకుంటున్నారు. కులాభిమానాలే కాక కుల దురభిమానాలు కూడా పెచ్చరిల్లుతున్నాయి. ఈనాటి పరిస్థితి కన్నా శ్రీకృష్ణుని వర్ణ విభాజన, ఆచరణ లక్ష రెట్లు నయం.

బ్రాహ్మణ్యం ఉద్భవించిందీ అత్యంత ఆదరణ పొందిది కూడా భారత కాలంలోనే అంటే షుమారు 5500 సంవత్సరాల క్రితం. అప్పుడు దళిత కులము లేదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు మాత్రమే ఉన్నాయి. ఆ తరువాత క్రీ.పూ 5వ శతాబ్దం నుండి బౌద్ధమే భారతదేశాన్ని పరిపాలించింది. ఆ తరువాత మహ్మదీయులు, బ్రిటీషు, డచ్చి, ఫ్రెంచి, పోర్చుగీసు వారే భారత భూభాగాలను పరిపాలించారు. భారత యుద్ధ కాలంనుండి విదేశీయుల దండ యాత్రల వరకు జరిగిన రాజ్య పోరాటాలలో ఎప్పుడో ఒకసారి ఓడిపోయి దళితులుగా మార్చబడ్డ ఒక క్షత్రియ కులంగా దళిత కులాన్ని భావించవచ్చు. అదే కులం భారతదేశమంతటా విస్తరించి ఉండడాన్ని బట్టి భారతదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించిన ఏకైక జాతి దళిత జాతి అని భావించవచ్చు. వారికి జరిగిన అవమానాలు రాజకీయ కారణాల వల్ల జరుగుతాయి తప్ప సామాజిక కారణాలవల్ల కావు. రాజకీయ కారణాల వల్ల ఇంతకన్నా భయంకరమైన ఘోరాలు జరుగుతాయి. హిట్లరు 70 లక్షల మంది నాజీలను చంపించాడని చరిత్ర చెబుతున్నది. ఒక్కొక్కరిని చంపాలంటే ఎక్కువ సమయం తీసుకుంటుందని అనేక వేలమందిని గ్యాస్ చాంబర్లలో పెట్టి విషవాయువు నింపించేవాడట.

భారతయుద్ధంలో 18 అక్షౌహిణుల సైన్యం హతమయిందని భారత గ్రంథం తెలియ జేస్తున్నది. అక్షౌహిణి అంటే షుమారు లక్ష కాల్బలంతో పాటు కొన్ని వేల ఏనుగులు, గుఱ్ఱాలు అన్నమాట. అలాగే మహ్మదీయుల దండయాత్రల సందర్భంగా లక్షల మంది హత్యగావించ బడ్డారంటే అతిశయోక్తి గాదు. మహ్మదీయుల, ఆంగ్లేయుల పరిపాలనలో జరిగిన ఘోరాలను వివరిస్తే అది మరొక మత విద్వేషాన్ని రెచ్చగొట్టినట్లే అవుతుంది. ఆ పని నేను చేయను. రాజ్యకాంక్షతో ఒకరినొకరు ఆటవికంగా చంపుకున్న ఇద్దరు వ్యక్తులు, లేదా రెండు ప్రత్యర్థి సమూహాలు గానే వారిని నేను భావిస్తానే తప్ప వారిని కుల పరంగా, మత పరంగా గుర్తించను. కులం, మతం రాజ్యసాధన తంత్రంలో క్షత్రియులు వేసుకునే ముసుగులు మాత్రమే. వారి రాజ్య సాధన స్వార్థకాంక్షకు అవసరమైతే ఆ ముసుగును తగిలించుకుంటారు లేదా తొలగించుకుంటారు. రాజ్యసాధన స్వార్థ కాంక్షకు అవసరమైతే కులాన్ని, మతాన్నే కాదు బంధుత్వాన్ని

కూడా విస్మరించి అన్నలు, తమ్ములు, తండ్రులు, కొడుకులు, తాతలు, మనుమలు, మామ, అల్లుళ్ళు వెన్ను పోట్లు పొడుచుకున్న సంఘటనలు భారత యుద్ధకాలం నుంచి నేటి ఆధునిక రాజకీయ చరిత్ర వరకు చరిత్ర పుటలు నిండి ఉన్నాయి. భారత యుద్ధం మొత్తం అన్నలు, తమ్ముళ్ళ మధ్య జరిగిందే కదా.

మహాభారత గ్రంథం భారతదేశంలోని అన్ని భాషలలోను ఈనాటికీ అందుబాటులో ఉన్నది. ఈ గ్రంథాన్ని మొదటగా సంస్కృత భాషలో వేదవ్యాసుడు రచించాడు. ఆపై అనేక భారతీయ భాషలలోకి తర్జుమా కాబడింది. అనేక వ్యాఖ్యానాలకు కారణమైంది. అనేక చలన చిత్ర నిర్మాణాలకు భూమిక అయింది. సహజంగానే సినిమాల విజయం కోసం హాస్య, వీర, శృంగార, భయ, రౌద్ర, విస్మయాది నవరసాలు, నాటకీయత మేళవించబడి మనసుపై అత్యంత ప్రభావం చూపే విధంగా దృశ్య, శ్రవణ మార్గాల ద్వారా భారతం ఎంతో కొంత కలుషితం చేయబడి అనేక విమర్శలకు ఆలవాలమైనది. వాస్తవానికి ప్రపంచంలో ఏ జాతికీ సరియైన లిపి లేని కాలంలో, లిపి ఉన్నా సంస్కృత భారతమంతటి వ్యాకరణ, ఛందోబద్ధమైన వాఙ్మయం ప్రపంచంలో మరెక్కడా లేదు. భారతంలో ఉన్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణతమైన విషయాలు గాని, ఛందో వ్యాకరణ, అలంకార, సంధి, సమాసాది బాషా విన్యాసాలు గాని, ధర్మాధర్మ నిర్ణయ మహా సంక్లిష్ట భావ వివేచనా సంఘటితమై ఉండడం గాని, నభూతో నభవిష్యతి. అందుకే భారతాన్ని ధర్మజ్ఞులు ధర్మశాస్త్రమని, ఆధ్యాత్మవిదులు వేదాంతమని, రాజనీతి కోవిదులు రాజనీతి గ్రంధమని, కవులు కావ్యమని, పౌరాణికులు పురాణమని, భాషావేత్తలు సాహిత్య గ్రంధమని ఇలా ఏ విధంగా చూచిన వారికి ఆ విధంగా కన్పిస్తుందని పండితుల ఉవాచ. భారతంలో లేనిది మరెక్కడా లేదని, మరెక్కడైన ఉన్న ఏ విషయమైన భారతంలో లేకపోలేదని అంటారు.

మహాభారత కాలంలోనే అనగా సుమారు 5500 సంవత్సరాల క్రితం కులాలకు అంకురార్పణ జరిగింది. ఆనాడు సమాజాన్ని నాలుగు వర్ణాలుగా శ్రీకృష్ణుడు గుణాలను, కర్మలను బట్టి విభజించానని భగద్గీతలో తెలియజేశాడు. మహాభారత గ్రంధాన్నంతా పరిశీలిస్తే బ్రాహ్మణ, వైశ్య కులాలు తప్ప ఈనాడు

మనం చూస్తున్న ఇతర కులాలు భారతంలో లేవు. అందువల్ల ఈ కులాలన్నీ గత 5500 సంవత్సరాల కాలంలో పుట్టుకొచ్చినవే. మహాభారత గ్రంధానికున్న ప్రశస్తి మనకు తెలుసు. మహా భారతంలో లేని విషయం ప్రపంచంలో మరెక్కడా లేదని స్కోపెన్ హార్ వంటి ఫ్రెంచి తాత్వికుడు కూడా ప్రశంసించిన విషయం మనకు తెలుసు. శ్రీకృష్ణ భగవానుడు చేసిన విభాగం అన్ని విధాల సమర్ధనీయం. అదే విధానం నేటికి కొనసాగి ఉంటే ఏ రకమైన చిక్కులు ఉండేవి కావు. జన్మనా జాయతే శూద్రః, సంస్కారోస్తు ద్విజః అంటే పుట్టుక చేత అందరూ శూద్రులే. సంస్కారాన్ని బట్టి మాత్రమే రెండవ జన్మ అని అర్ధం. ద్విజః అంటే శూద్రుల నుండే బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులుగా రూపాంతరం చెందుతారని అర్ధం. అలాగే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా సమాజాన్ని గుణాలు, కర్మలు అనగా చేసే పనిని బట్టి విభజించానని శ్రీకృష్ణుడు గీతలో చెప్పాడు. ఆ సిద్ధాంతం ఆ కాలంలో తు.చ తప్పకుండా సమర్ధంగా అమలులో ఉన్నట్లే కనిపిస్తుంది.

భారత యుద్ధం జరిగి 5500 సంవత్సరాలు అయిందని ఆధునిక చరిత్ర కారులు కూడా అంగీకరిస్తున్నారు. వ్యాసుడు వేద, పురాణ, ఇతిహాస వాఙ్మయం మొత్తం సంస్కృతంలో లిఖించడం ద్వారా క్రీస్తుపూర్వం 3500 సంవత్సరాల క్రితం ముఖ్య భాష లేదా రాజ భాష సంస్కృతం అయి ఉంటుందని ఊహించడంలో తప్పు లేదు. పురాణేతి హాసాలలో చతుస్సాగర పర్యంతం అనే మాట పదే పదే వాడటం ద్వారా భారత మహా సామ్రాజ్యం చతుస్సాగర పర్యంతం విస్తరించి వుందని భావించవచ్చు. అట్టి భారత సామ్రాజ్యంలో అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కేరళ, ఆంధ్రా, కాశి, అవంతి, గాంధార, ఇత్యాది అనేక రాజ్యాలు ఇమిడి ఉన్నాయని భారతం మనకు తెలియజేస్తుంది. అవే రాజ్యాలు రాష్ట్రాలుగా నేటికి కనిపిస్తూనే ఉన్నాయి. భారత యుద్ధ కాలాన్ని ద్వాపర, కలియుగాల సంధి కాలంగా చెప్తారు.

యుగాంతమనగా ద్వాపరయుగం పూర్తయి కలియుగారంభం జరగటం అంటే భూగోళంపైనున్న జీవరాశి పూర్తిగా అంతమవడం జరగలేదు. ప్రస్తుతం గల్ఫ్ దేశాలుగా పిలువబడుతున్న భూభాగంపై నున్న సముద్రం ద్వారక వైపు ప్రయాణించి ద్వారకతో సహా ద్వారక వరకు ఉన్న భూభాగాన్నంతా

ముంచివేసింది. ఆనాటి నుండి నేటి వరకు కొన్ని వేల యుద్ధాలు జరిగి అనేక రాజవంశాలు అంతరించి క్రొత్త రాజ వంశాలు తెరపైకి వచ్చి ఉంటాయి. అలాగే భారత మహాసామ్రాజ్యం అనేక స్వతంత్ర దేశాలుగా విడిపోయి ఉండవచ్చు. అది సత్యం కూడ. నేటికి అవే రాజ్యాల పేర్లు, అవే భాషల పేర్లు నిలిచి ఉండటం మనం గమనించవచ్చు. చక్రవర్తులు బలహీనమైనప్పుడు సామంత రాజులు స్వతంత్రులవడం, సామ్రాజ్యం నుండి విడివడి స్వతంత్ర రాజ్యాలుగా ప్రకటించుకోవడం సర్వసహజం. అట్టి ప్రాంతీయ స్వతంత్ర రాజులు తమ ప్రాంతీయ భాషలను పునరుద్ధరించడం సహజాతి సహజం.

భారతంలో స్పష్టంగా ఉంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే చాతుర్వర్ణ వ్యవస్థలో బ్రాహ్మణుడు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో ఏ వర్ణం నుంచైనా స్త్రీని వివాహం చేసుకోవచ్చు. అలాగే క్షత్రియులు, వైశ్య, శూద్ర స్త్రీలను, వైశ్యులు, వైశ్య, శూద్రస్త్రీలను, శూద్రులు మాత్రం శూద్ర స్త్రీలను మాత్రమే వివాహం చేసుకోవచ్చని. అలాగే క్రింద వర్ణము పురుషులు అగ్రవర్ణ స్త్రీలను వివాహం చేసుకోకూడదు అని కూడా ఉంది. సరిగా అర్థం చేసుకుంటే ఇది చాలా మంచి కట్టుబాటు. ఎందుకంటే ఆనాడు సమాజంలో ఇప్పటి లాగానే బ్రాహ్మణులు షుమారు ఒక శాతం ఉండేవారని ఊహించవచ్చు. బ్రాహ్మణులంటే వైదిక వృత్తినవలంబించి, వైదిక జీవన విధానాన్ననుసరించే వారని అర్థం చేసుకోవచ్చు. అలాగే క్షత్రియులంటే వివిధహోదాలలో రాజ్యపాలన చేస్తున్న వారనుకోవచ్చు. నేటి ప్రజాప్రతినిధులుగా విధులు నిర్వహిస్తున్న వారిని క్షత్రియులనుకోవచ్చు. అలాగే భూసంపద, పశుసంపద లేదా వ్యాపార వృత్తిలో ఉన్నవారు వైశ్యులు. ఉద్యోగాలు, చేతివృత్తులు వగైరా కూలీల వంటివారు అనగా ఏ రకమైన సంపదలు, వ్యాపారాలు లేనివారు శూద్రులు. ఇది ఒక వ్యక్తి స్థాయిని శాశ్వతంగా నిర్ణయించే విధానం కాదు. శూద్రుడు అతని ప్రవృత్తిని బట్టి, స్వశక్తితో బ్రాహ్మణుడుగా, క్షత్రియుడుగా, వైశ్యుడుగా ఎదగవచ్చు. స్త్రీకి మరీ ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడింది. స్త్రీగా జన్మించిన మాత్రముననే వివాహ బంధంతో శూద్ర స్త్రీ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలలో చేరగలుగుతుంది. నేడు అమెరికా అబ్బాయిని వివాహం చేసుకుంటే అమ్మాయికి అమెరికన్ గ్రీన్ కార్డు లభించినట్లు. అబ్బాయిలైతే

మాత్రం ఊర్ధ్వవర్ణ చలనం స్వశక్తితో సాధించవలసిందే. ఈ క్రమంలోనే వర్ణ ధర్మాలు నిర్వచించబడ్డాయి. 90శాతం ఉన్న శూద్రవర్ణం పైవారికి సేవలను అందించగలుగుతుంది. అలాకాక 90శాతం ఉన్న శూద్రవర్ణం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల నుంచి అమ్మాయిలను చేసుకొనవచ్చునంటే పై వర్ణాల వారికి వారి వర్ణంలో వధువులు మిగులుతారా? క్రింది వర్ణాల నుంచి పొందవచ్చుగదా అంటే బ్రాహ్మణులను, రాజ్యం లేని క్షత్రియులను, వ్యాపారం లేని వైశ్యులను వివాహం చేసుకోవడానికి శూద్రకన్యలు కూడా ముందుకు రారుకదా. వృత్తి మరియు ఉద్యోగాలు చేసేవారు కూడా శూద్ర వర్ణం క్రిందకే వస్తారు . అంతేకాదు సమాజంలో 1శాతం, 4శాతం, 5 శాతం మాత్రమే ఉన్నవారిని సంరక్షించే బాధ్యత ప్రభుత్వాలకు ఉంటుంది. అందులో తప్పుబట్ట లసిన విషయమేదీ లేదు.



# 4. మత విశ్వాసాలు ఎలా పరివర్తన చెందాయి?

జైనమతం క్రీ.పూ. ఏడవ శతాబ్దంలోను బౌద్ధమతం క్రీ.పూ. ఐదవ శతాబ్దంలోను స్థాపించబడ్డాయి. ఈ రెండు మతాలను స్థాపించిన వారు రాకుమారులే తప్ప బ్రాహ్మణ కులస్థులు కారు. గౌతమ బుద్ధుడు సిద్ధార్థుడనే రాకుమారుడు. జైనమత స్థాపకుడు రిషభనాధుడు, ఇరవై నాల్గవ జైన తీర్థంకరుడైన మహావీరుడు రాకుమారులే. ఈ రెండు మతాలు క్రీ॥శ॥ ఎనిమిదవ శతాబ్దంలో శ్రీ ఆది శంకరాచార్యులు వారు అద్వైత మతం స్థాపించే వరకు అధికారంలో కొనసాగినై. ఆ తర్వాత పదవ శతాబ్దంలో శ్రీ భగవద్రామానుజుల వారు విశిష్టాద్వైతం స్థాపించిన కొద్ది కాలంలోనే భారతదేశం మహ్మదీయుల, బ్రిటీష్, డచ్, ఫ్రెంచ్, పోర్చుగీసు వారి పాలనలోనికి వెళ్లిపోయింది. అనగా క్రీ.పూ. ఏడవ శతాబ్దం నుండి ఈనాటి వరకు అనగా గత రెండు వేల ఏడువందల సంవత్సరాల నుండి రాజ్యాధికారంపై హిందుత్వ ప్రభావం లేదని గమనించాలి. భౌద్ధమతం విస్తృతి ఎంతగా ఉందంటే ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి, ఆంధ్ర రాష్ట్రంలోని నాగార్జున సాగర్, అమరావతిలోని భౌద్ధారామాలే ఉదాహరణ. తెలుగు ప్రాంతంలో జైనమత వ్యాప్తికి తెలంగాణలోని వరంగల్, కొలనుపాక జైన దేవాలయాలే ఉదాహరణ. హిమాలయాలలో ఉన్న బదరీనాథ్ దేవాలయం కూడా ఒకప్పటి భౌద్ధారామమేనట. ఆదిశంకరాచార్యులవారు ఆ దేవాలయాన్ని సందర్శించిన తరువాతనే అది హిందూ దేవాలయంగా మార్చబడిందట.

క్రీ॥పూ॥ ఏడవ శతాబ్దంలో జైన మతారంభానికి ముందు మాత్రమే బ్రాహ్మణ మతం అమలులో ఉంది. ఆ మత విధానాలైన యజ్ఞయాగాదులు, జంతు బలులకు వ్యతిరేకంగా ఉద్భవించినవే జైన, బౌద్ధ మతాలు. జైన, బౌద్ధ మతాల పరిపాలనలో ఈనాటి యస్.సి., యస్.టి., బీ.సి కులాలేవీ అధికారంలో

ఉన్నట్లు కాని, గౌరవ మర్యాదలు పొందినట్లుగాని కనపడదు. అంతకు ముందు మాత్రమే వీరు అధికారంలో ఉండి బ్రాహ్మణులచే యజ్ఞయాగాదులు చేయించి ఉండవచ్చు. ఆ తర్వాతనే రాజ్యాలు కోల్పోయి వెనుకబడవేయబడి ఉండవచ్చు. ఎందుకంటె ఆ తర్వాత యజ్ఞయాగాదులు, జంతుబలులు నిషేధించబడినాయి. అలాగే మనకు భారతదేశంలో కన్పించే దేవాలయాలన్నీ ఎనిమిదవ శతాబ్దం తర్వాత నిర్మించినవే. అంతకుముందు నిర్మించబడి కనీసం శిథిలావస్థలో ఉన్న దేవాలయాలు కూడా ఎక్కడా కన్పించవు. క్రీ.శ. 7వ శతాబ్దం నుండే మహ్మదీయుల దండయాత్రలు ప్రారంభమైనా ఆపై 1947లో స్వతంత్రం వచ్చే వరకు ఆంగ్లేయులు పరిపాలించినా భారతదేశమంతటా అక్కడక్కడ మహ్మదీయులను, ఆంగ్లేయులను ఎదిరించి రాజ్యం చేసిన రాజులు అనేక మంది ఉన్నారు. వారందరూ యస్.సి., యస్.టి., బీ.సి. కులాల వారు మరియు బ్రాహ్మణులు తప్ప నేటి ఇతర అగ్రవర్ణాల వారెవ్వరూ లేరు. ఈ సంధి కాలంలోనే అనగా క్రీ॥శ॥ ఎనిమిది మరియు పదిహేడు శతాబ్దాల మధ్యనే తిరిగి యస్.సి., యస్.టి., బీ.సి. కులాలు ఇక్ష్వాకులు, పల్లవులు, చాళుక్యులు, విష్ణు కుండినులు, చోళులు, పాండ్యులు, కాకతీయులు, రాష్ట్రకూటులు ఇత్యాది నామాలతో రాజ్యం చేసినట్లు కన్పిస్తుంది. వీరి నుంచి విదేశీయులు, విదేశీయుల పాలననుండి ప్రజాస్వామ్య పాలనలోకి అడుగు పెట్టాం.

మతవిశ్వాసాల పరివర్తన ఎలా జరిగిందో చూద్దాం. బుద్ధుడు ఒక రాకుమారుడు. అతని అసలు పేరు సిద్ధార్థుడు. క్రీ॥పూ॥ 5వ శతాబ్దివాడు. అతడు సన్యాసిగా మారిపోయి బౌద్ధమతాన్ని స్థాపించాడు. అన్ని వేదనలకు కారణం కోరికలేనని తెలుసుకున్నాడు. బౌద్ధమతం వేదాలను ప్రమాణాలుగా అంగీకరించదు. క్రీ.పూ. 7వ శతాబ్దంలో రిషభనాధుడనే బీహారు రాకుమారుడు జైనమతం స్థాపించాడు. రాకుమారులు సన్యాసిగా మారి మతాన్ని స్థాపించడం, బ్రాహ్మణ సమాజాన్ని నిరసించడం ఒక సంచలనం అయింది. దాదాపు భారతదేశంలోని రాజులందరూ జైన, బౌద్ధమతావలంబకులుగా మారిపోయారు. బ్రాహ్మణులు అవహేళన చేయబడ్డారు. వేదవిధులు రాజ నిరాదరణకు గురి అయినాయి. మౌర్య సామ్రాజ్యాధినేతల కుటుంబ సభ్యులు కూడా బౌద్ధమత ప్రచారకులుగా మారి సిరియా, కంబోడియా, చంపా, బలి, జావా, చైనా వంటి

దేశాలు సందర్శించి బౌద్ధమత ప్రచారం గావించారు. అలా దాదాపు 1500 సంవత్సరాలు గడిచి పోయింది.

క్రీ॥శ॥8వ శతాబ్దంలో ఆది శంకరాచార్యులు జన్మించి, అతి చిన్న వయస్సులోనే భారతదేశమంతటా పర్యటించి, బౌద్ధ మరియు ఇతర పండితుల నోడించి, వారిచేత అద్వైతమతాన్ని స్వీకరించే విధంగా చేశారు. బౌద్ధమతం జన్మించిన భారతదేశం నుంచి ఆ మతాన్ని దాదాపుగా తరిమికొట్టారు. అయితే ఆ మతం ప్రసరించిన ఇతర దేశాలలో వేళ్ళూనుకుంది. అద్వైతం రాజాదరణకు నోచుకుంది. వేద విధులు విస్మరించిన బ్రాహ్మణులు తిరిగి వేదవిద్య నభ్యసించడం మొదలయింది. ఇందులో భాగంగానే బ్రాహ్మణులకు గౌరవ, పురస్కార, ప్రోత్సాహకాలు లభించాయి. తిరిగి 8వ శతాబ్దం నుండి అద్వైత మత ఆవిర్భావంతో క్షత్రియులు పోటీలు పడి దేవాలయాల నిర్మాణాలు చేపట్టారు. మీరు గమనించవచ్చు. 8వ శతాబ్దం కన్నా ముందు నిర్మించబడిన హిందూ దేవాలయాలు ప్రపంచంలో ఎక్కడా కన్పించవు. దురదృష్టవశాత్తు ఈ కాలం నుండే భారతదేశం అన్య దేశాల పాలన క్రిందకు వెళ్ళటం ప్రారంభమైంది. దేవాలయాల పునరుద్ధరణ మరియు వైదిక కర్మల ఆచరణ ప్రారంభం కావటం వల్ల వేదవిధులు, అర్చనా విధులు తెలిసిన బ్రాహ్మణుల అవసరం పెరిగింది. కాని అంతకు ముందు 1500 సంవత్సరాలు జైన, బౌద్ధ పరిపాలనల కారణంగా అలాంటి బ్రాహ్మణులు దొరకటం అరుదుగా ఉండేది. అందువల్లనే బ్రాహ్మణ, అర్చక విధులు నిర్వర్తించే వారికి అనేక రకాల రక్షణలు, గౌరవ మర్యాదలు ఇవ్వజూపి సుఖజీవనం జరగటానికి మణులు, మాన్యాలు ఇవ్వటం జరిగింది.

దాదాపు క్రీ॥శ॥ 650 సంవత్సరాల నుంచి మహ్మదీయులు దండయాత్రలు ప్రారంభమై క్రీ॥శ॥ 1000వ సంవత్సరం వరకు దాదాపుగా పూర్తి భారతావని మహ్మదీయుల పాలనలోకి వెళ్ళిపోయింది. అలా మరొక 700 సంవత్సరాలు గడిచేసరికి బ్రిటీషువారు మహ్మదీయులను జయించి సువిశాల భారతదేశాన్ని ఆక్రమించారు. మీకు తెలుసు 1947 ఆగష్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆనాటి నుంచి నేటి వరకు కుల, మత ప్రసక్తి లేని లౌకిక రాజ్యంలో ఉన్నాం. లౌకిక రాజ్యంలో అల్ప సంఖ్యాక మతాలకున్న ప్రాధాన్యత హిందూ మతానికి లేదు. వెరశి గత 2700ల సంవత్సరాలుగా భారతదేశంలో పూర్తి

హిందూ మతాధిక్యత లేనే లేదు. అందువల్ల బ్రాహ్మణాధిక్యత ఉందనటం కూడా పొరపాటే.

హిందూమతం వేదాధారితమని హిందువులు భావిస్తారు. వాస్తవానికి ప్రపంచంలోని మత భావనలన్నీ వేదాధారితాలే. అన్ని మతాలలో ప్రవర్తనా నియమాలు మానవ విలువలతో, సమానత్వంతో, సాటివానికి సాయం చేయడంలో, దయ, దాక్షిణ్యాలలో సారూప్యత కలిగి ఉంటాయి. వేదాలు అపౌరుషేయాలు. వాటికి మతం లేదు. వేదం ఒక విజ్ఞాన సర్వస్వం. హిందూ జీవన విధానం ఎక్కువ విషయాలను వేదాలనుంచి గ్రహించి ఉండవచ్చు సంస్కృతం నుంచి పదాలను అనేక ఇతర భాషలు గ్రహించినట్లు. కొన్ని భారతీయ భాషలు, ఉదాహరణకు హిందీ, ఎక్కువ సంస్కృత పదాలు కలిగి ఉండవచ్చు. తమిళం, మళయాళం వంటి భాషలు సంస్కృతం నుండి తక్కువ పద జాలాన్ని గ్రహించి ఉండవచ్చు. అలాగే ప్రపంచంలోని అనేక మతాలు వైదిక జీవన విధానం నుంచి ఎంతో కొంత గ్రహించి ఉన్నాయి. ఉదాహరణకు అనేక మతాలలో భగవంతుడు నామరూపరహితుడని, అవాఙ్మానసగోచరమని, సర్వ సృష్టి, స్థితి,లయ కారకుడని, స్వయంభువు అని భావనలు కలిగి ఉండటం, స్వర్గ, నరకాల ప్రస్తావన, కర్మ, పునర్జన్మల సిద్ధాంతం, కాలమానం, ఖగోళ జ్ఞానం, జంతుబలుల విధి విధానాలు. వడ్డీపై బ్రతికేవారు తాంబూలం ఇవ్వడానికి అర్హులు కారని వేదాలలో ఉంది. జంతువును బలి ఇచ్చేముందు, ఆ జంతువును నీవు చనిపోవడం లేదు, భగవంతుని దగ్గరకు వెళుతున్నావు, నాకు బలము, ఆయుష్షు, తేజస్సు ఇవ్వవల్సిందిగా ప్రార్థించాలని కూడా వేదాలలో ఉంది. ఇలాంటి సిద్ధాంతాలే ఇస్లాంలో కూడా ఉన్నాయి.

వేదం ఒక కులానికి, ఒక మతానికి లేదా ఒక ప్రాంతానికి సంబంధించినది కాదు. వేదం అంటే బహు ముఖతః కాల క్రమేణ చెప్పబడ్డ విజ్ఞాన సర్వస్వం. అందులో ఆహార విహారాల దగ్గర నుండి, సాంకేతిక పరిజ్ఞానం నుండి, ఖగోళ శాస్త్రం నుండి, భగవద్భావన నుండి, జన్మ పునర్జన్మ ఇత్యాది సమస్త విషయాల గురించి ఆనాటి వరకు ఆవిష్కరించబడ్డ సమగ్ర విజ్ఞాన సర్వస్వం ఇమిడి ఉన్నాయి. అలాంటి విజ్ఞానం ప్రపంచంలో ఎక్కడైనా ఏ దేశంలోనైనా ప్రభవించి ఉండవచ్చు. భావనారూపంలో ఉండి ముఖతః మాత్రమే అనుగతంగా మాత్రమే

సంక్రమించుతున్న వేద విజ్ఞానానికి అక్షర రూపం ఇచ్చి, నాలుగు భాగాలుగా వ్యాసుడే విభజించాడు. అలాగే సంస్కృత భారత, భాగవతాలను, అష్టాదశ పురాణాలను ఆయనే రచించాడు. భగవంతుని అవతార సిద్ధాంతాన్ని సమర్థించింది ఆయనే. ఈ అవతార సిద్ధాంతమే అనేక విమర్శలకు అవకాశం కల్పించింది. అనేక మతాల ఆవిష్కరణకు కారణభూతమైంది. మతాలలోనే ఉపమతాల ఆవిర్భావానికి కారణమైంది.

వేదాలలో ముఖ్యంగా ప్రకృతి శక్తుల ఆరాధనే ప్రతిష్టితమై ఉన్నది. అందుకు యజ్ఞ యాగాదులే మార్గాలు. సూర్యాది నవగ్రహాలను, భూమ్యాది పంచభూతాలను, ప్రకృతి ప్రతీకలైన నదీనదాలను, మానవాళికి వాటి ప్రాముఖ్యాన్ని బట్టి కొన్ని వృక్ష, జంతు జాతులను పూజించేవారు. అలాగే అష్టదిక్పాలకులను, భూమ్యాకాశాలను, సముద్రాలను పూజించేవారు. తల్లిదండ్రులకు, గురువులకు దేవుని హోదా ఇచ్చేవారు. వేదాలు అపౌరుషేయాలంటారు. అలాగే దైవభావన కూడా అపౌరుషేయమే. అది నామరూప రహిత అవాఙ్మానస గోచర అద్భుత శక్తి. అది ప్రకృతి ప్రవర్తనతోటే ప్రకటితమౌతున్నది. కాబట్టే ప్రకృతి ప్రవర్తన దాని లక్షణంగా భావించుకోవచ్చు. దైవభావన ఇలాగే ఉంచినట్లయితే ఏ రకమైన విమర్శకు తావు ఉండేదికాదు. ప్రపంచంలోని అత్యధిక జనాభా దీనిని అంగీకరించేవారు. ప్రపంచంలో ఎక్కువ భాగం వైదిక మతంగానే ఉండిపోయేది. అవతార సిద్ధాంతం వైదికతకు గొడ్డలిపెట్టుగా మారింది.

సమాజానికి మేలు చేసినా, కీడు చేసినా ముఖ్యంగా మేధావులేనన్న నానుడి నిజమనిపిస్తోంది. మేధావులు తమ వాదనా పటిమతో వర్ణనాచతురతతో లేని వస్తువును కళ్ళకు కట్టినట్లు చూపగలరు. నమ్మించగలరు. ఆచరించే విధంగా ప్రేరేపించగలరు. సాహిత్యానికి ఆ శక్తి ఉంది. సాహిత్యానికి సంగీతం, సంగీతానికి శబ్దం, శబ్దానికి భావం, భావానికి దృశ్యం తోడయినప్పుడు వాటికి గురైన మనిషి తనను తాను మరిచి తన్మయత్వం పొందుతాడు. అందుకే కొందరు రాజకీయ నాయకుల ప్రసంగాలకు, మతాచార్యుల ప్రవచనాలకు, శ్రోతలు ప్రేరణ పొంది వారి అనుయాయులుగా మారిపోతారు. ధన, మాన, ప్రాణాలను త్యజించడానికి కూడా సిద్ధపడతారు. కొందరు సినిమా ప్రేక్షకులు

అక్కడికక్కడే సినిమాల్లోనే వెక్కి వెక్కి ఏడవడం కూడా మనం చూస్తుంటాం. ఇలా భక్తి అనుభూతులలోకి తరలించడానికి అవసరమైనంత సాహిత్యం, సంగీతం, శబ్దం, దృశ్య పరంపర మనకు కావలసినంత ఉంది. తాదాత్మ్యంలో అర్థం లేని ప్రేలాపనలు సర్వసహజం. అలాంటి భాషా పరిజ్ఞానం బహు విరివిగా ఉన్న భక్తుడైన పండితుడు శివుడిని, వైష్ణవ అవతారాలను, వారి అనుచరగణాలనీ విపరీత పదజాలంలో పొగడటం సర్వసహజం. వాటికి అర్థాలేంటని నిలదీసి అడిగితే ఎవరూ చెప్పలేరు. అందుకే హరిదాసులు, భాగవతులు, పండితులు, ఆచార్యులు అలాంటి మాటలకు వేదార్థాలను జోడించి చెపుతారు. అజ్ఞానులకివి అర్థం కావని గడుసు ముక్తాయింపు ఇస్తారు.

హిందూమతం నుండి అనేక కోట్లమంది ఇస్లాంలోకి వెళ్ళిపోయారు. అనేక కోట్లమంది క్రిస్టియానిటీలోకి వెళ్లిపోయారు. కొన్ని కోట్లమంది సిక్కులుగా, కొన్నికోట్లమంది బౌద్ధులుగా, కొన్నికోట్లమంది జైనులుగా, కొన్నికోట్లమంది నాస్తికులుగా మారిపోయారు. ఎక్కడైనా ఒక్క కోటిమందైనా కొత్తగా అన్యమతాలనుంచి హిందూమతంలోకి వచ్చారా. హిందూమతం నుంచి తయారైనంత మంది నాస్తికులు, ఇస్లాం, క్రిస్టియన్, బౌద్ధ, సిక్కు, జైనమతాల నుంచి తయారయ్యారా? ఇందుకు కారణాలేమిటని ఆలోచించాలి. వేద విహితమైన దైవీభావన నుంచి దూరమౌతున్నామేమో ఆలోచించాలి. హిందూమతం పేరు వైదిక మతంగా మార్చుకొని, భగవంతుని అవాఙ్మానస గోచరమైన బ్రహ్మ పదార్థంగా, నామరూపరహిత అద్భుత శక్తిగా, అది మనకు ఈ ప్రకృతి రూపంలో ప్రకటితమౌతుందని, ఆ ప్రకృతి రూపాలను పూజించడం అవసరమని, నేను, నీవు అందరం అందులో అంతర్భాగమేనని ప్రచారం చేసి వుంటే ప్రపంచంలో అనేక మతాల పుట్టుక జరిగి ఉండేదికాదు.

భారతకాలంలో క్షత్రియులకు కూడా ఉపనయన విధులు, శ్రాద్ధకర్మ విధులు ఉన్నాయి. జైన, బౌద్ధ, మరియు అన్య ధర్మాలలోనికి వెళ్ళిపోయిన క్షత్రియులు ఈ వైదిక విధులను విస్మరించారు. తిరిగి వారిని వైదిక విధులకు పరిచయం చేయడం నేడు బ్రాహ్మణులు చేయవలసిన పని. బ్రాహ్మణులు భారతీయ సనాతన ధర్మ సాధకులుగా, బోధకులుగా, సంరక్షకులుగా వ్యవహరించగలరే తప్ప అన్య ధర్మాల నుండి, అన్య దేశాల దాడుల నుండి

ధర్మాన్ని రక్షణ చేయలేరు. భారతీయ సనాతన ధర్మ రక్షణ బాధ్యత క్షత్రియుల భుజస్కంధాలపై వేసుకుంటేనే అది నిలబడుతుంది. భారతదేశంలోని దేవాలయాలన్ని క్షత్రియులు నిర్మించడం వల్ల ఏర్పడ్డవే కదా. భారతీయ ధర్మాన్ని వారు రక్షిస్తేనే అది వారిని రక్షిస్తుంది. లేదంటే భారతీయ ధర్మమూ ఉండదు, భారతీయ ప్రభువులూ ఉండరు. విదేశీ ధర్మాలు, విదేశీ పాలకులు కొద్దికాలంలోనే భారతదేశాన్ని పరిపాలించి తీరతారు.

శంకరాచార్యుని వాదనా పటిమ, రామానుజాచార్యుని సార్వజనీకరణ ఈనాడు లేకపోయె. క్రీ.పూ. 7వ శతాబ్దంనుంచే భారతదేశం జైన, బౌద్ధ మతాలలోకి వెళ్లిపోయింది. అలా 1500 సంవత్సరాలు అవైదికంగా వుండిపోయింది. క్రీ.శ. 8వ శతాబ్దంలో శంకరాచార్యుల వారు జన్మించి 32 సంవత్సరాల వయసు లోపులోనే సువిశాల భారతదేశం మొత్తం పాదచారియై సంచరించారు. ఆ ప్రాంతాలు కొన్ని ప్రస్తుతం పాకిస్తాన్, శ్రీలంక, టిబెట్‌లలో ఉన్నాయి. వారి యాత్ర ఒక సాంస్కృతిక దండయాత్ర. రాజాదరణ కలిగియున్న బౌద్ధమతాన్ని భారతదేశపుటెల్లలు దాటించి తరిమిన దండయాత్ర. వారు ప్రవచించిన సిద్ధాంతం అద్వైతం. ఆ సిద్ధాంతంతోనే వారు బౌద్ధపండితులను వాదంలో ఓడించి వైదికత వైపుకు మళ్ళించారు. శంకరాచార్యులవారు శైవులు కారు. వైష్ణవులూ కారు. శైవ వైష్ణవ రూపాలు రెంటినీ ఆరాధించారు. వారు రచించిన కనకధారా స్తోత్రం, శివానందలహరి, నరసింహ కరావలంబ స్తోత్రాలు ఇందుకు ఉదాహరణలు.

అద్వైత సిద్ధాంతం శైవ లేదా వైష్ణవానికి సంబంధించిన సిద్ధాంతం కాదు. జీవుడు, దేవుడు వేరువేరు కాదన్నదే అద్వైత సిద్ధాంతం. విశ్వంలో ఉన్నదొక్కటే. అది స్త్రీ కాదు, పురుషుడు కాదు, నామ రూప రహితమని భావన. సృష్టిలో భగవంతుడు తప్ప మరో పదార్థమున్నా, సృష్టి చేయడానికి భగవంతుడికి మరో పదార్థం అవసరమున్నదన్నా భగవంతుని అద్వైత భావనకి, గొప్పతనానికి విఘాతమే. అందువల్ల సృష్టియంతా భగవంతుడి నుంచే అవిర్భవించి భగవంతుని యందే లీనమౌతుందని భావిస్తేనే భగవంతుడి గొప్పదనం ప్రతిష్ఠితమౌతుంది. భగవంతుని నుంచి ఆవిర్భవించిన సృష్టికి భగవంతుని లక్షణాలు ఉండవా? భగవంతుడి నుంచి ఉద్భవించిన విశ్వం భగవంతుడి నుంచి వేరుగా ఉంటుందా?

గులాబి వాసన గులాబి పువ్వు నుంచి వేరైనదా. కాదనే అనిపిస్తున్నది. చెట్టు మట్టిలోనే పుడుతుంది. మట్టిలోనే కలిసిపోతుంది.

శంకరాచార్యులవారి తర్వాత షుమారు రెండు వందల సంవత్సరాలకు రామానుజాచార్యుల వారు జన్మించారు. వారు అద్వైతానికి విశిష్టత్వాన్ని జోడించారు. భగవద్భావనను సార్వజనీనం చేసే ప్రయత్నం చేశారు. స్త్రీ, పురుష బేధం లేకుండా, జాతి, కుల, మత భేదం లేకుండా వైదిక విధానాల నవలంబించవచ్చని తెలియజేశారు. ఈనాడు కావలసిందిదే. వైదిక విధానాల నుంచి దూరమైన అన్ని కులాలను జాతులను తిరిగి వైదిక విధులలోకి ఆహ్వానించవలసిన అవసరముంది. ఆదిశంకరాచార్యులవారి దృష్టి కూడా దీని నుంచి భిన్నమైనది కాదు. వారు రచించిన మనీషా పంచకం ఇందుకు ఉదాహరణ. వారికి ప్రయాణంలో ఒక చండాలుడు ఎదురయ్యాడు. అతనిని తొలగమని ఆదేశిస్తారు. దానికి చండాలుడు ఎవరినయ్యా తొలగమంటున్నావు అంటాడు. అప్పుడు శంకరాచార్యుల వారు చెబుతారు, ఏ కులమైనా ఏ మతమైనా ఏ రూపమైనా అందరిలో అంతర్లీనంగా ఉన్న పరమాత్మ ఒక్కడేనని. ఆ సందర్భంలోనే మనీషా పంచకం రచించారు. అలాగే మధ్యాచార్యులవారు జీవుడు, దేవుడూ ఒకటెలా అవుతారు. అందువల్ల విశ్వభావన ద్వైతమన్నారు.

ఈ ముగ్గురు ఆచార్యుల మధ్య భగవంతుడొక్కడే అన్న భావనకు వైరుధ్యం లేదు. ఆ ఒకరెవరంటే ఆయన నామ, రూప రహితుడు, ఆద్యంత రహితుడని, సృష్టి, స్థితి, లయ కారకుడని, స్వయంభువు అన్న భావనలలో కూడా వైరుధ్యం లేదు. బేధమున్నదల్లా భావనా జనితమైన పూజా విధి విధాన సాంప్రదాయాలలోనే. ఈ ముగ్గురు మతాచార్యులు భగవద్భావన ఏ ఒక్కరికీ పరిమితం కాదనీ సార్వజనీనమని వచించినా సంస్కృత పద భూయిష్టమైన శాస్త్రాలు, కఠినతరమైన పూజా విధానాలు, ఆచారాలు, పరస్పర వైరుధ్యాలు భగవద్భావనను సార్వజనీనం చేయడంలో సఫలం కాలేకపోయాయనే చెప్పాలి. ఈనాటికీ అనునిత్యం వేలమంది అన్యధర్మాలలోకి వెళుతున్నారు. అటు నుంచి ఇటువచ్చే వారెవరూ లేరు. ఇప్పటికైనా పద్ధతులు మార్చుకోకపోతే కష్టమే. ఇప్పటికీ మతాచార్యులు మానవులలో ఒకరుగా కాక అతి మానవ వ్యక్తులుగానే మిగిలిపోతున్నారు. యస్.సి., యస్.టి., బీసి.లతో మైనారిటీలతో మమేకం కాలేక పోతున్నారు.

వారి కాలనీలకు వెళ్ళాలి. వారి గృహాలు సందర్శించాలి. వారితో కలిసి భోజనం చేయాలి. వారి చేతి భోజనం చేయాలి. వారి భాషలో మాట్లాడాలి. ఎందుకంటే వారే దేవుళ్ళు. ప్రజలకు మించి దేవుడెక్కడుంటాడు.

సినిమాలో చూస్తూ ఉంటాం. రాక్షసులంటే నెత్తిన కొమ్ములు, పెద్ద పెద్ద కోరలు కలిగి మనుషులను మ్రింగివేస్తారనే భావన కల్పిస్తుంటారు. నేటి తరం యువతకు రాక్షసులంటే ఇదే ముద్రపడుతుంది. ఎందుకంటే వాళ్ళు సినిమాల్లో చూడటం తప్ప మూలగ్రంథాలను అందునా విమర్శనా దృష్టితో చదివినవారు కారు. అసలు చదివి వ్రాసే అలవాటే నేటితరంలో అంతరించి పోతోందని, అంతా కీ బోర్డేనని సర్వేలు చెబుతున్నాయి. కంప్యూటర్లు, గేమ్స్ వాటి బటన్‌లు పసిపిల్లవాళ్ళకు తెలిసినంత సులభంగా పెద్దలకే తెలియడంలేదు. ఒక ఉదాహరణ చూస్తే కృష్ణుడు దేవుడు. అయన మేనమామ కంసుడు రాక్షసుడు. ఆయన బావమరిది అర్జునుడు నరుడు. భీముడు నరుడు. భీముని భార్య హిడింబి ఒక రాక్షసి. అంటే దేవదానవులు రెండు రాజకీయ పక్షాలకు చెందినవారని అర్థమవుతున్నది. ఒకే కుటుంబంలోని వారుకూడా కొంతమంది రాక్షసులు, కొంతమంది దేవతలుగా ఉన్నట్లు అర్థమవుతున్నది. ప్రహ్లాదుడు, హిరణ్యకశిపుడు అంతే కదా. దేవదానవులు రాజ్యం కోసం యుద్ధాలు చేసిన దాయాదులే కదా.

ఏ రకమైన కల్తీలు లేకుండా భగవద్భావన గ్రామాలలో కన్పిస్తుంది. అధునాతన దేవాలయాలు లేని గ్రామాలు ఇప్పటికీ చాలా ఉన్నాయి. అక్కడి గ్రామీణులకు సంస్కృతభాషా పరిచయం లేనందున పూజా విధానాలు, మంత్రాలు తెలియకపోయినా క్రియ మరియు దైవ భావన మాత్రం ఉంది. అవే ముత్యాలమ్మ, మైసమ్మ, పోలేరమ్మ, ఎల్లమ్మ, పెద్దమ్మ, బొడ్డురాయి వగైరా. వాటికి ఆకారాలు లేవు. ఒక రాయికో, ఒక కొయ్యకో పసుపు రాసి బొట్లుపెట్టి పూజిస్తారు. ఇక్కడ బ్రాహ్మణుల ప్రమేయం కూడా ఉండదని గ్రహించాలి.

మతాల చరిత్ర మనకు సంబంధించినంత వరకు పరిశీలిస్తే క్రీ.పూ 7వ శతాబ్దానికి ముందు అంటే క్రీ॥పూ॥ 10 నుంచి 15 శతాబ్దాల క్రితం ఐతరేయ బ్రాహ్మణ మతం లేదా వైదికమతం ఆచరణలో ఉంది. 7వ శతాబ్దంలో జైనమతం, 5వ శతాబ్దంలో బౌద్ధమతం, 2000 సంవత్సరాల క్రితం క్రిస్టియన్ మతం, 1500 సంవత్సరాల క్రితం ఇస్లాం మతం, 1000 సంవత్సరాల క్రితం

అద్వైత, విశిష్టాద్వైతం, ద్వైత భావనలతో కూడిన మతం ఉండేది. ఆ మతం పేరు హిందూమతం కాదు. శంకరాచార్యులవారి రచనలలో గాని, రామానుజాచార్యుల వారి రచనలలో గాని, మధ్వాచార్యులవారి రచనలలో గాని ఎక్కడా హిందూమతం అన్న పేరు లేదు. హిందూ అన్న పదం వైదిక మతానికి లేదా భారతీయ సనాతన ధర్మానికి ఎవరు తగిలించారో తెలియదు గాని ఆ పేరు సుమారు 200ల సంవత్సరాల లోపులో మాత్రమే అమలులోకి వచ్చింది.

గత ఐదు వందల సంవత్సరాలలో సిక్కు మతం, వివిధ బాబాల అవతారాలు చూస్తుంటే షుమారు ప్రతి 500 సంవత్సరాలకు ఒక కొత్త మతం అవతరిస్తునట్లు కనిపిస్తున్నది. అందువల్ల ప్రస్తుతం కొద్దికాలంలో మరో మతం రాబోతున్నదని సూచితమౌతున్నది. అదే వైదిక మతం. భగవంతుడొక్కడేనని, ఆయన నామ రూప రహితుడని, ఆద్యంత రహితుడని, స్వయంభువు అని, సర్వశక్తివంతుడని, సృష్టి స్థితి లయ కారకుడని, నియమము నియంత కూడా ఆయనేనని, ఆయన శక్తి, ప్రవర్తనా విధానాలు ప్రకృతి ద్వారా ప్రకటితమౌతాయని, ప్రకృతిలోని ఏదో ఒక రూపం కాక సర్వ దృశ్యా దృశ్య ప్రపంచమంతా ఆయన రూపమని ప్రకటించే మతం. భగవంతునికి రూపం ఆపాదించాల్సి వస్తే అది అమ్మా, నాన్నల రూపమేనని ప్రకటించే మతం. అందుకే ప్రకృతి విఘాతంగా కాక ప్రకృతిలో మమేకమై జీవించాలని చెప్పే మతం. సృష్టికి ఉత్కృష్ట దశ మానవ రూపమేనని, అందువల్ల ఏదో ఒక మానవ రూపాన్ని గాక సర్వమానవ సమాజసేవే భగవత్సేవ అని తెలియజెప్పే మతం. ప్రకృతిలో మమేకమై జీవించడమే, మానవ సమాజానికి సేవ చేయడమే భగవంతుడినారాధించే విధానమని వివరించే మతం.

ఆ మతం దైవ ప్రార్థన ఇలా ఉంటుంది *"ఈ విశ్వం నుంచే జన్మించాను. ఈ విశ్వంలోనే జీవిస్తాను. ఈ విశ్వంలోనే లయిస్తాను. ఈ విశ్వమే నా సర్వస్వం. అట్టి విశ్వానికి నమస్కారం. జన్మనిచ్చిన తల్లిదండ్రులకు నమస్కారం. విద్య నేర్పిన గురువులకు నమస్కారం. సర్వ చరాచర జీవరాశికి నమస్కారం. కలిసి బ్రతుకుతున్న కుటుంబానికి కృతజ్ఞతలు. ఈ విశ్వంలోని ప్రతి అణువుపట్ల నేను శ్రేయోదాయకంగా ప్రవర్తిస్తాను. అలాగే ఈ విశ్వంలోని ప్రతి అణువు నా పట్ల శ్రేయోదాయకంగా ఉండాలని ప్రార్థిస్తున్నాను. ఇట్లు ..............."*

విశ్వం వేరు. భగవంతుడు వేరు అని కొందరు భావిస్తూ ఉంటారు. పరిణామగతమైన విశ్వం భగవంతుడెలా అవుతుంది అన్న వాదన ఉంది. విశ్వం పరిణామగతమన్నది వాస్తవం. విశ్వం శాశ్వతం కాకున్నా విశ్వ లక్షణం శాశ్వతం కదా. మార్పు విశ్వం యొక్క లక్షణమని గ్రహించాలి. దానినే భగవంతుడనవచ్చేమో ఆలోచించాలి. అట్టి లక్షణం గల్గిన విశ్వాన్ని భగవంతుడిగా విశ్వసిస్తే సరిపోతుందేమో ఆలోచించాలి. ఏది ఏమైనా ఈ విశ్వం పరిణామగతం. ఆ పరిణామాలకు కొన్నింటికి కార్యకారణ సిద్ధాంతం అన్వయించవచ్చు లేకపోవచ్చు కానీ ఈ విశ్వ ప్రవర్తనా రీతులకు కొంత ప్రత్యేకత ఉంది. ఒక నిర్దిష్ట విధానంలో అది స్పందిస్తూ ఉంటుంది. ప్రతి ఒక్క చర్యకు ఒక ప్రతిచర్య ఉండి తీరుతుంది. విశ్వం సర్వస్వం ఒక సూపర్ కంప్యూటర్ అనుకుంటే అది ఈ విశ్వంలో జరిగే ప్రతి చర్యను గుర్తించి తన ప్రతిచర్యను ప్రకటిస్తూ ఉంటుందని నా అభిప్రాయం. విశ్వం యొక్క అట్టి సిద్ధాంతాన్నే భగవంతుడు అనవచ్చు. అందువల్ల భగవంతుడు ఉన్నాడా లేదా అనేది అనవసరమైన ప్రశ్న. నీ ప్రవర్తనకు పరిణామాలుంటాయన్నది మాత్రం వాస్తవం. అందుకే మంచిగా ప్రవర్తించు అంటున్నా. అందుకు కూడా నీకభ్యంతరమైతే నీ ఖర్మ. ఎలా జరగాలో అలాగే జరుగుతుంది.

భగవంతుడు ఉన్నాడు అనాలా, ఉన్నది అనాలా లేక లేడు, లేదు అనాలా అన్నది మనం నేర్చుకున్న భాషా పరిమితి తప్ప మరొకటి కాదు. పురుషసూక్తంలోని "సభూమింవిశ్వతో వృత్వా అత్యతిష్టద్దశాంగులం" అనడం ద్వారా భగవంతుడు ఈ విశ్వాన్ని అధిగమించి అదనంగా ఉన్నాడని భావం. అలాగే విష్ణు సహస్రనామాలలో "నియంతానియమో యమః" అనడంలో కూడా నియమమూ నియంత కూడా భగవంతుడేనని భావం. అంటే భగవంతుడు ఒక నియమం. అదే మార్పు అనే నియమం. ఆ మార్పే శాశ్వతం. ప్రపంచమే దృశ్యమానం, నశ్యమానం తప్ప మార్పు శాశ్వతం, అదృశ్యం, అవినస్యం. పరిణామగతమైన విశ్వం ఒకసారి శూన్యంగా మారవచ్చు. ఆ శూన్యం మనకు శూన్యం తప్ప విశ్వానికి కాదు. శూన్యం కూడా ఒక విశ్వ పరిణామ దశే. ఆ స్థితిలో కూడా ఈ విశ్వం తన పరిణామ శీలతను కొనసాగిస్తూనే ఉంటుంది. అత్యత్తిష్టద్దశాంగులం అనడంలో భావం కూడా ఇదే. ఈ దృశ్యా దృశ్య విశ్వం

సమస్తం శూన్యంలోకి పోయినా అంతకు అధిగమించి మార్పు అనే నియమం పనిచేస్తూనే ఉంటుంది. విశ్వానికి నీవు శ్రేయోదాయకంగా ఉంటే అది నీకు శ్రేయోదాయకంగా ఉంటుంది. సంఘటనలు దైవాధీనం. స్పందన మానవాధీనం. సంఘటనల పట్ల మీ స్పందనను బట్టే మీ కొచ్చే ప్రతిఫలం ఉంటుంది.

భారతీయ జీవన విధానం అందునా తెలుగువారి జీవన విధానం అందమైనది. వాస్తవానికి భారతీయ కళలు, సంగీత సాహిత్యాలు, దైవీ భావనలు, పదార్థ విజ్ఞానం అత్యున్నత స్థాయిలో ప్రపంచంలోని అన్ని ప్రాంతాల, జాతుల, నాగరికతల కంటే ఎంతో ముందుగానే పరిఢవిల్లినై. ఆహార్యం విషయానికొస్తే రంగురంగుల పట్టు బట్టలు ధరిస్తారు. స్త్రీలయితే చీరెలు, జాకెట్లు, పరికిణీలు, ఓణీలు, రంగురంగులవి పట్టు, ఉన్ని, నూలుతో చేసినవి ధరిస్తారు. పురుషులైతే పంచలు, లుంగీలు, లాల్చీలు, పైజామాలు, చొక్కాలు, తలపాగాలు, భుజాన కండువా ధరిస్తారు. అనేక రంగులు, అనేక డిజైన్లు కలిగి ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. భారతీయ వస్త్రాలంకరణను బట్టి పురుషత్వం లేదా స్త్రీత్వం, హుందాతనం, వయ్యారం ఉట్టిపడుతూ ఉంటాయి. చూడగానే స్త్రీనా, పురుషుడా స్ఫురించే విధంగా ఉంటాయి.

శరీరాలంకరణ మరో ప్రత్యేకత. ముఖాన తిలకం, కళ్లకు కాటుక, చెవులకు దిద్దులు, ముక్కుకు ముక్కెర, నెత్తిన పాపిడి చేర్లు, చంప సరాలు, మాటీలు, హారాలు, అనేక రకాల కంఠాభరణాలు, వడ్డాణాలు, అరవంకీలు, గాజులు, ఉంగరాలు, మెట్టెలు, పట్టీలు, ఆపాదమస్తకం సర్వాంగాలంకరణే. అట్టి ఆభరణాలు వెండి, బంగారం, వజ్ర వైఢూర్యాది నవరత్నాలతో కూడి ఉంటాయి. ఇక సుగంధ ద్రవ్యాల వినియోగం చెప్పే పనే లేదు. ప్రపంచంలో అనేక జాతులలో బట్టలు కట్టుకొనే సంస్కృతి ప్రారంభం కాకముందే భారతదేశపు చేనేత కళాకారులు అగ్గిపెట్టెలో ఇమిడిపోయేంత పట్టు చీరను మగ్గాల పైననే తయారు చేసేవారట.

ఇక ఆహార విషయం తలచుకుంటే నోరూరె రుచులు, ఘుమఘుమలు తెలుగు వారి స్వంతం. భోజనాన్ని షడ్రసోపేతం అంటారు. అంటే ఉప్పు, పులుపు, చేదు, వగరు, కారం, తీపి ఆరు రుచులు కలగలసిన ఆహారం మన

సంస్కృతిలో భాగం. ఈ విషయంలో తెలుగు వారు మరీ ముందుంటారు. వడియాలు, అప్పడాలు, పొడులు, పచ్చళ్లు, చారు, పప్పుచారు, పులుసులు, వేపుళ్లు, వడలు, గారెలు, అరిసెలు ఇలా అనేక రకాల వంటలు చేయటంలో భారతీయ స్త్రీలే కాదు పురుషులు కూడా చేయి తిరిగినవారే. నలుడు, భీముడు ఇందుకు ఉదాహరణలు. తెలుగు వారికి భారతమన్నా, గారెలన్నా మరీ ప్రీతి. అందుకోసమే వింటే భారతమే వినాలి, తింటే గారెలే తినాలి అన్న నానుడి పుట్టింది. భోజనానంతరం వేసుకొనే తమలం కూడా స్త్రీ పురుషులకు ప్రత్యేకంగా ఉండేవట. ఈ విషయం మనుచరిత్రలో అల్లసాని పెద్దనగారు ఒక పద్యంలో తెలియజేశారు. *మృగమద సౌరభ విభవద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధస్థగితేతర పరిమళమై మగువ పొలుపు దెలుపు మారుత మొలసెన్.* అంటే హిమాలయ పర్వతాలలో తిరుగుతూ ఉండగా మంచు తడికి పాదలేపనం కరిగి పోవటంతో ప్రవరాఖ్యుడు మనోగమన శక్తిని కోల్పోయి తను వచ్చిన దారి తెలియక వెతుకుతున్న సందర్భంలో ఆ నిర్మానుష్య పర్వత ప్రాంతంలో మగువలు నమిలే తమలం వాసన తగిలిందట. అది వరూధినిదని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. తమలంలో సున్నము, వక్కలు, జాజికాయ, జాపత్రి, యాలుకలు, లవంగాలు, కస్తూరి, కర్పూరం ఇలా అనేక ప్రత్యేకమైన సుగంధ ద్రవ్యాలు వాడేవారట.

ఇక సాంఘీక జీవనం విషయానికొస్తే ఎన్నో పండుగలు, పర్వదినాలు, సంస్కారాలు భారతీయుల స్వంతం. సంక్రాంతి శోభకు ముగ్గులు వేయని తెలుగు వారు ఉండరు. శీతాకాలపు చలిలో తెలుగు జవరాండ్రు లాఘవంతో కళాత్మకంగా తీర్చిదిద్దే రంగురంగుల రంగవల్లులు, అందులోని గొబ్బెమ్మలు ప్రత్యేకంగా సంక్రాంతికి చేసుకొనే అరిసెలు, చక్కిలాలు, పాలకాయలు, గంగిరెద్దు, హరిదాసుల అక్షయ పాత్రలు, ఆశగా అత్తారింటికి చేరే అల్లుళ్లు, ఆట పట్టించే మరదళ్లు, కోడి పందేలు, ఎడ్ల పోటీలు, ఇంటికి చేరే కొత్త పంటలు ఇదంతా తెలుగు వారి ఒక కళాత్మక జీవన విభాగం. అలాగే దసరా పండుగకు జరుపుకొనే దేవీ నవరాత్రులు, ఆపై జరుపుకొనే దీపావళి రంగురంగుల దీపాలు, టపాసులు, కళాత్మతకు మరో ఉదాహరణ. గణేశ నవరాత్రులు, నిమజ్జనాలు, స్త్రీలకు ప్రత్యేకంగా శ్రావణ, కార్తీక మాసాలు,

సామూహిక వనభోజనాలు ఇలా చెపుతూ పోతే భారతీయులకు, ముఖ్యంగా తెలుగువారి జీవన విధానం ఆద్యంతం కళాత్మకం. ఎన్నో పండుగలు, సాంప్రదాయాలు అందుకే తెలుగు వారి జీవనం నిత్యనూతనం. పండుగలే కాదు మనిషి పుట్టినప్పటినుంచి చనిపోయే వరకు ప్రతి సంఘటన ఒక పండుగలానే చేయడం భారతీయులకు అలవాటు. అలాగే సాహిత్య ప్రక్రియలు చూచినా జానపదాలు, జావళీలు, కవితలు, పాటలు, పద్యాలు, అవధానాలు, సామెతలు, హరికథలు, బుర్రకథలు, తోలుబొమ్మలాటలు, నృత్యాలు, నాటకాలు, ఒగ్గు కథలు ఇలా మనిషి జీవనాన్ని అనుక్షణం అనుభవిస్తూ గడిపే అవకాశం మన సంస్కృతిలో ఉంది.

భారతీయ భగవద్భావన గమనించినా అది ఎంతో కళాత్మకం. భగవంతుడు శంఖు, చక్ర, గదాధారి అని, కౌస్తుభధారి అని, శిఖిపించమౌళి అని, వేణు ధరుడని, అలంకార ప్రియుడని, కిరీటం కలిగి ఉన్నాడని, పట్టు పీతాంబరాలు ధరించి ఉన్నాడని, శివుడినైతే త్రిశూలము, ఢమరుకము ధరించిన వాడని, నటరాజని ఇలా ప్రతియొక్క దేవుడిని, దేవతని అత్యంత మనోహరంగా అలంకరించి భావించడం, రంగురంగుల పుష్పాలతోను, పసుపు కుంకుమలతోను పూజించడం, ధూప, దీప నైవేద్యాలతో, ఆచమనాలతో నృత్య, గీత వాయిద్యాలతో సంతోష పెట్టడం, అనేక ఉపచారాలతో సంతృప్తి పరచడం భారతీయ సాంప్రదాయం. ఇందుకు కారణం భారతీయులకు జీవితం పట్ల కళాత్మకమైన దృష్టి ఉండటమే తప్ప ఏ ఒక్క భారతీయ భక్తుడికీ భగవంతుడొక్కడేనని, ఆయన అవాఙ్మానస గోచరుడని, నామరూప రహితుడని, సృష్టి, స్థితి, లయ కారకుడని, స్వయంభువు అని తెలియక కాదు. వారు సర్వాంగ సుందరంగా జీవితాన్ని ఎలా దర్శిస్తున్నారో భగవంతుని కూడా అలానే దర్శించాలని వారి అభిలాష. వారు అభిమానంతో పూజించే భగవంతునికి అందమైన రూపం, అలంకారం ఆపాదించడంలో తప్పు లేదనుకుంట.



# 5. గోవధను ఎందుకు నిషేధించాలి?

జంతుబలులను, మాంసాహారాన్ని నిరసించింది బౌద్ధమే తప్ప వేదమూ కాదు, సనాతన భారతీయ ధర్మమూ కాదు, బ్రాహ్మణ కులమూ కాదు. జంతుబలులు నిషేధించిన బౌద్ధులు పాములు, కప్పలు, కుక్కలు, పిల్లులతో సహా హాయిగా తింటున్నారు. బౌద్ధమతం కారణంగా యజ్ఞ యాగాదులతో జంతుబలులు నిలిపివేసి మాంసాహారాన్ని విసర్జించిన బ్రాహ్మణులనే మాంసాహార నిషేధానికి కారకులుగా విమర్శిస్తున్నారు. ఇది కువిమర్శ. గోవధ నిషేధంపై ఈ మధ్య చర్చ జోరుగా నడుస్తోంది. గోవధ చాలా కాలం క్రితమే నిషేధించబడింది. ఐనా గోవులు నిరాఘాటంగా వధించబడుతూనే ఉన్నాయి. అన్ని రాజకీయ పార్టీలు చూసీ చూడనట్లు ఉదాసీనంగా వ్యవహరిస్తూనే ఉన్నాయి. గోవధ నిషేధం రాజకీయంగా అవసరమైనప్పుడల్లా లేవనెత్తుతూనే ఉంటారు. గతంలో హైదరాబాదు పాతబస్తీలో అల్లర్లు కూడా రాజకీయ లక్ష్యాలతోనే కొందరు చేస్తున్నారని ఆరోపణలు ఉండేవి. బ్రాహ్మణులు ఆశీర్వాదంలో భాగంగా *"న్యాయేన మార్గేణ మహీం మహీశాం గో బ్రాహ్మణేభ్య శుభమస్తు నిత్యం"* అని దీవించేవారు. *"గో బ్రాహ్మణేభ్య శుభమస్తు నిత్యం"* అన్నవారు బ్రాహ్మణులే కాబట్టి బ్రాహ్మణుల మీద కోపం ఆవుల మీద చూపడం మొదలు పెట్టారు కొందరు. వీరు ప్రజ్ఞగాని, ప్రజల మీద ప్రేమగాని ఉన్నవారు కాదు. ఏదో ఒక పేరుతో మేధావిగా చలామణి అవ్వాలన్న కోరికతోనో, రాజకీయ లబ్ధి కోసమో, హిందూ మతాన్ని దెబ్బ తీయడానికో, అన్య మతాలనుంచి సుపారీ పుచ్చుకొనో ఇలా చేస్తూ ఉంటారు. గోవధ నిషేధాన్ని కొందరు సనాతనధర్మ వ్యతిరేక వాదానికి దన్నుగా వాడుకొంటున్నారు. కొందరు కులాల మధ్య చిచ్చు బెట్టడానికి ఉపయోగించుకుంటున్నారు.

ఒకాయన ఈ మధ్య గోవులనెందుకు రక్షించాలి, గేదెలనెందుకు కాదు అని వాదించడం చూశాను. ఆయనేదో గేదెల పక్షపాతి అయినట్లు. గేదె మాంసం

తినని వాడైనట్లు.  అలాగే కృష్ణుడిని వెన్నదొంగ అనడమేంటండీ? యాదవుల మనోభావాలు దెబ్బతినవా? అంటూ కృష్ణుడు తరపున కూడా వకాల్తా పుచ్చుకున్నాడు ఆయనేదో కృష్ణ భక్తుడైనట్టు. ఇది ఆత్మ వంచన. హిందూమతం, బ్రాహ్మణులు, కోమట్లు మంచోళ్ళు గారట. క్రిస్టియానిటి మంచిదట. ఇలా చిత్తశుద్ధి లేని, ఒక మాటకు ఒక మాటకు పొంతనలేని వాదనలు వినిపించడం సమాజాన్ని కన్ఫ్యూజ్ చేసి లాభపడాలనే ఉద్దేశమే తప్ప సమాజానికి దిశానిర్దేశం చేసే  ఉద్దేశం కాదు.

"గో బ్రాహ్మణేభ్య శుభమస్తు నిత్యం" అనడంలో అర్థమేమిటంటే గోవులు సంపద, సమృద్ధికి చిహ్నం. బ్రాహ్మణులు సమాజానికి మంచి చెడులు, వేదాలు, పురాణేతిహాసాలు, ఆచారాలు, సాంప్రదాయాలు  చెప్పడానికి, యజ్ఞయాగాది సత్కార్యాల నాచరింప జేయడానికి అవసరం. గోవులు అంటే తెల్లావులే కాదు, నల్లని గేదెలు కూడా. అందునా ముఖ్యంగా గోవు అత్యంత ప్రధానమైనది మరియు పవిత్రమైనది కూడా. తల్లిపాలు లేని పిల్లలకు ఆవు పాలు పోస్తారు. అలాగే ఆవు మూత్రం అనేక ఔషధ గుణాలు కలిగి ఉన్నదని శాస్త్రీయంగా కూడా రుజువైంది. మానవులకు హాని చేసే క్రిమీకీటకాదులు ఇంట్లో ప్రవేశించకుండా ఆవు పేడతో ఇల్లు అలుకుతారు. వ్యవసాయ పనులకు కూడా ఆవును ఉపయోగిస్తారు. ముఖ్యంగా తల్లి పాలు లేని పిల్లలకు ఆవు పాలు పోయడం వల్ల ఆవుకు తల్లి స్థానం కల్పించటం భారతీయ సంస్కారానికి ప్రతీక. అలాగే ఆవు పాలు, నెయ్యిలో కూడా ఆరోగ్యానికి హాని చేసే కొలెస్టరాల్ ఉండదని పరిశోధనల్లో తేలింది. ఇన్ని ప్రత్యేకతలున్న ఆవును రక్షించుకోవడం మనను  మనం రక్షించుకోవడమే.

మరొక కారణంగా కూడా ఆవులను, గేదెలను ఎందుకు చంపకూడదంటే, మొదటి నుండి మానవుల ముఖ్య ఆహారం పాడి, పంట, మాంసం. ఈ మూడింటినీ మానవాళికి అందించగల్గింది పశు జాతి. అందులో ఆవు  ముఖ్యం. ఒక కోడిని మూడు సంవత్సరాలు మేపినా ఒక కిలో కన్నా ఎక్కువ మాంసం రాదు. ఒక మేకనో, గొఱ్ఱెనో మూడు సంవత్సరాలు మేపితే 7-8 కిలోల మాంసం ఇస్తుంది. ఒక కోడెదూడను మూడు సంవత్సరాలు మేపితే 400 కిలోల మాంసం ఇవ్వగలుగుతుంది. అంటే మాంసపు ఉత్పత్తికి పశువులు

ఎంత ముఖ్యమో అర్థం చేసుకోవచ్చు. మరి పశువులలో ఆడవాటికే ప్రాముఖ్యత ఎందుకో ఆలోచిద్దాం. 100 ఆవులు, ఒక గిత్త ఉన్నా 100 ఆవులకు ఏడాదికి 100 దూడలు జన్మించగలుగుతాయి. అదే 100 గిత్తలు ఒక ఆవు ఉన్నదనుకోండి. ఏడాదికి ఒక దూడ మాత్రమే జన్మిస్తుంది. గేదెలు, దున్న పోతుల విషయంలోనూ అంతే. మీరు గమనిస్తే గ్రామాలలోని వ్యవసాయదారులు కూడా గ్రామంలోని గిత్తలన్నింటిని సంతానోత్పత్తి సామర్థ్యాన్ని తొలగించి ఎద్దులుగా మారుస్తారు. గ్రామంలోని ఆవులకోసం ఆంబోతుని మాత్రమే వదులుతారు. ఒంగోలు జాతి గిత్తను ఒక దానిని తెచ్చి ఆ గ్రామంలో ఆంబోతుగా వదులుతారు. తద్వారా ఆ గ్రామంలోని ఆవులన్నీ అట్టి ఆంబోతుద్వారా మంచి జాతి దూడలను కనగలుగుతాయి. ఈ మధ్య వార్తాపత్రికలలో చూసి ఉంటారు. హర్యానాలో సుల్తాన్ అనే ఒక దున్నపోతు ధర 25 కోట్ల రూపాయల వరకు వున్నదట. ఐనా ఆ యజమాని దానిని అమ్మడు. దాని వీర్యం సంగ్రహించి అమ్మడం ద్వారా అతను అంతకన్నా ఎక్కువ సంపాదించగలుగుతాడట. గోవధను ఎందుకు నిషేధించాలో ఇప్పటికయినా అర్థమయిందనుకుంటా.

ఆహార నియమాలకు కులాలకు సంబంధం లేదు. ఈ కులం వారు శాఖాహారమే తినాలి. ఈ కులం వారు మాంసాహారమే తినాలి అన్న నిబంధన లేదు. కులం అంటే అనేక జాతుల మిశ్రమం అనుకున్నాం. మారుతున్న పరిస్థితులలో మతాలు కూడా అనేక కులాల మరియు జాతుల మిశ్రమాలుగా రూపుదిద్దుకుంటున్నాయి. ఉదాహరణకు హిందూమతంలోను క్రిస్టియన్ మతంలోను, ఇస్లాం మతంలో కూడా అనేక కులాల వారున్నారు. ఏ మతంలోకి మారినా తమ కులాన్ని మాత్రం వదులు కోవడానికి సిద్ధంగా లేరు. బ్రాహ్మణులు కూడా ఒకప్పుడు మాంసాహారులేనని నేను వ్రాసినందుకు కొందరు అభ్యంతరం చెప్పవచ్చు. అనేక ఇతర కులాల నుంచి బ్రాహ్మణ వృత్తినెంచుకోవడం ద్వారా బ్రాహ్మణ కులం ఏర్పడింది తప్ప భూమితోపాటే బ్రాహ్మణ కులంగానీ మరే ఇతర కులంగాని ఆవిర్భవించలేదు గదా! మానవులంతా మొదటగా పచ్చి మాంసం పీక్కుతిన్న ఆది మానవులేగదా. వారినుంచే కాలాంతరంగా అనేక కులాలు ఏర్పడ్డాయి. బ్రాహ్మణ వృత్తినవలంబించే వారే బ్రాహ్మణులు, ఇతర వృత్తుల ద్వారా జీవనం కొనసాగిస్తున్నవారు బ్రాహ్మణులెలా అవుతారు? బ్రాహ్మణ

వృత్తి ధర్మంగా మాంసాహారం ముట్టకుండా మనస్సును ప్రశాంతంగా, పవిత్రంగా ఉంచుకోవలసిన అవసరం వుంది. కులాలు మానవసమూహాల రూపాంతరాలే. అలాగే మతాలు. నేను మనసు మార్చుకుంటే చాలు. నా మతం మారిపోతుంది. నేను ఈ రోజు హిందూ, రేపు క్రిష్టియన్, ఎల్లుండి ముస్లిం, మరో రోజుకు మరో మతస్తుడిగా మారే అవకాశం ఉంది. మతాలు పుట్టకముందు కులాల పరివర్తన కూడా ఇలాగే ఉండవచ్చు. పుట్టుకతోనే కులం అంటగట్టే దౌర్భాగ్యం ప్రస్తుతం నెలకొనివుంది. మాంసాహారం విషయంలో భారతంలో భీష్మ, ధర్మరాజుల సంభాషణ గమనించండి.

సర్వదేవతలు, బ్రాహ్మణులు, మునులు కూడా అహింస గొప్పదని చెబుతారు గదా అట్టి అహింస గురించి నాకు తెలియజేయవలసిందని ధర్మరాజు భీష్మ పితామహుడి నడిగాడు. అందుకు భీష్ముడిలా చెబుతాడు. మాంసాహారపు కోరికలోను, జంతువును చంపవలెనను కోరికలోను, చంపుటలోను, తినుటలోను నాలుగు రకాల హింసాప్రవృత్తి నిండి ఉంటుంది. కావున మాంసాహార భక్షణ విడుచుట అహింసయని "హింస వర్తింపజేయుగాన కడుగీడు మాంసభక్షణము దలప" అని చెబుతాడు. పితృశ్రాద్ధ కర్మలు ముఖ్యంగా మాంసాహారంతోనే చేయాలని చెబుతారు కదా! వధించకుండా మాంసమెలా లభిస్తుందని ధర్మరాజడుగుతాడు. పితృకార్య యజ్ఞములలోను, వేద విదితమైన హింస చేటు చేయదు కాని రుచి కొరకు మాంసభక్షణ చేయడం పాపం. మాంసభక్షణ మానివేయుట వంద యాగాలు చేసిన ఫలాన్నిస్తుంది. వానియందు సర్వ భూతములు హితంగా ఉంటాయి. క్షత్రియులకు మాత్రం వేటను, మాంస భక్షణాన్ని అగస్త్యుడు పాపరహితంగా చేశాడు. మాంసాహారులు కూడా ఆషాఢమాసం నుంచి చతుర్మాసములు మాంసాహారం భుజించకుండా వుండటం వలన ఆయురారోగ్యాలు రెండూ సిద్ధిస్తాయి అని భీష్ముడు చెబుతాడు. ధర్మరాజు మరల ప్రశ్నిస్తాడు. "మాంసముల రుచి మరగిన వానికి మానవశమె? అట్టుగాకయు శృంగారాసక్తునికి బలం కలిగిస్తుంది. జబ్బుపడిన వ్యక్తి మాంసాహారం వల్ల త్వరగా కోలుకుంటాడు. గాయములు త్వరగా మాన్పుటకు సహాయ పడుతుంది. రుచి గలిగి యుంటుంది. ఇలాంటి లక్షణాలు శాఖాహారమందు లేవు కదా! అలాంటప్పుడు మాంస భక్షణంబు మానుట

శక్యమా? అని. అందుకు భీష్ముడిలా చెబుతాడు. దయను మించిన ధర్మంలేదు. నీవు సర్వభూతములకు హితంగా ప్రవర్తిస్తే అవి నీకు హితంగా ప్రవర్తిస్తాయి. వేరు ప్రాణుల మాంసంతో స్వీయమాంసాన్నభివృద్ధి చేసుకోవడం కంటె కీడు మరొకటి లేదు. మాంస భక్షణము మానివేసి దేవతలు రాక్షసులపై విజయం సాధించారు. మనకు ప్రాణభయమెంతగా ఉంటుందో ప్రతి ప్రాణికి అంతే గదా! అందువల్ల అహింస పాటించిన వారికి స్వర్గలోక నివాసము తథ్యము. "భూతములకు అలుగునతనికి భూతము లఖిలమును అలుగు. భూతహితార్థియై భూతముల కభయమిచ్చిన పుణ్యాత్మున కభయమిచ్చు భూతము లన్నియున్" అని చెబుతాడు. శాస్త్రములిలా ఉండగా ప్రజాస్వామ్యంలో ఎవరిష్టం వారిది. ఆహార నియమాలు వ్యక్తిగతాలు. కుల మతాలతో సంబంధం లేదని నా అభిప్రాయం.



# ౬. ఈ పుస్తకం ఎందుకు వ్రాస్తున్నాను? అందుకు నాకున్న అర్హతేంటి?

ఏది ఏమైనా విభిన్న వ్యక్తులు విభిన్న కారణాలతో ఇతర కులాలను తీవ్ర పదజాలంతో విమర్శలు జరపడం చూసి మనస్తాపం చెంది, ఈ సమస్యకు సామరస్య పరిష్కారం కోసం, సమాజంలో ప్రాకిపోతున్న దుష్ప్రచారాలకు అడ్డుకట్ట వేయాలనే ఉద్దేశంతో నా అనుభవాలు, ఆలోచనలు సవినయంగా సమాజ దేవాలయానికి ఉడుతాభక్తిగా, వారధి కొక రేణువుగా సమర్పించుకొంటున్నాను. సామరస్య హృదయంతో పఠించండి, ఆలోచించండి, తప్పులుంటే మన్నించండి, అవకాశం చేసుకొని సామరస్యంగా స్పందించండి. పాఠకులెవరైన నా అభిప్రాయాలతో విభేదిస్తే, నా భావనలు నాకు తప్పనిపిస్తే తప్పనిసరిగా సరిదిద్దుకుంటాను. ప్రపంచమే పాఠశాల. అనుభవాలే గురువులని నేను నమ్ముతాను. నా అరువది సంవత్సరాల జీవితానుభవంతో సమాజానికి ఏదైనా మేలు చేయాలనే ఉద్దేశ్యంతోనే ఈ పుస్తకం వ్రాయటం జరుగుతున్నది. ఈ పుస్తకం వ్రాయడానికి నాకున్న అర్హతేమిటనుకుంటారేమో, నాగురించి కూడా కొంత విన్నవించుకుంటాను.

*ఆయుర్విత్తం గృహశ్ఛిద్రం మంత్రౌషధ సమాగమః దాన మానావమానశ్చ నవ గోప్యా మనీషిభిః* అన్నది నీతి శాస్త్రం. అంటే ఆయుష్షు, డబ్బు, ఇంటిలోని లోటుపాట్లు, మంత్రము అనగా ఇతరులతో చేసిన సమాలోచన, ఔషధము, సమాగమము, దానము, మానము, అవమానము అనే తొమ్మిది విషయాలను మనిషైనవాడు గోప్యంగా ఉంచుకోవాలి. ఈ న్యాయం పాటిస్తూ నాగురించి అత్యవసరమైనవి మాత్రమే మనవి చేస్తా. నా గురించి అంతకన్నా ఎక్కువ తెలిసున్న వారెవరైనా ఉంటే ఎందుకు చెప్పలేదో అర్థం చేసుకోండి.

బ్రాహ్మణ కుటుంబంలో 1956లో చెన్నూరు గ్రామం, ఖమ్మం జిల్లాలో జన్మించాను. తండ్రి ఈశ్వరప్రగడ గోపాలరావు గారు. దమ్మపేట, ఖమ్మం జిల్లా. ఉపాధ్యాయుడిగా పనిచేసి రిటైర్ అయి 2015లో మరణించారు. తల్లి కందిబండ రంగనాయకమ్మ గారు, ఖమ్మం జిల్లా, చెన్నూరు గ్రామం, 1987లోనే పరమపదించారు. పదో తరగతి ఖమ్మం జిల్లాలోని ములకలపల్లి ప్రభుత్వ పాఠశాలలోను, ఇంటర్, డిగ్రీ కొత్తగూడెంలోను పూర్తి చేశాను. ఇంటర్ నుండి సి.ఎ పూర్తయ్యే వరకు ముఖ్యంగా స్వయంకృషితోనే చదువుకున్నాను. సి.ఎ. చదవడానికి హైద్రాబాదు చేరి కాలినడకన జంట నగరాలలోని సి.ఏ.లందరినీ సందర్శించి అభ్యర్థించాను. ఎవ్వరూ సి.ఏ.లో సీటు ఇవ్వలేదు. సి.ఏ.లో సీటు దొరకక యమ్.బి.ఎ ప్రవేశ పరీక్ష వ్రాసి 17వ ర్యాంకుతో పాస్ అయి ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్ కాలేజీలో యం.బి.ఎ.లో 1978లో చేరాను. నా సి.ఎ., యల్.యల్.బి., చదవాలన్న కోరిక చావలేదు. అవకాశమున్నప్పుడల్లా సి.ఎ.ల దగ్గరకు తిరుగుతుండేవాడిని. చివరకు మానిక్‌లాల్ ఝూవర్ అనే సి.ఎ సీటు ఇచ్చాడు. యమ్.బి.ఎ సీటు, హాస్టలు సీటు, నెలకి రూ.230 స్కాలర్ షిప్ అన్నీ వదులుకుని సి.ఎ.లో చేరాను.

నేను సి.ఎ.లో చేరిన ఆరు నెలలకు చెన్నైలోని సి.ఎ ఇనిస్టిట్యూట్ ద్వారా నా అప్లికేషన్ తిరస్కరించబడింది. నాకు సి.ఎ.లో సీటు ఇచ్చిన మానిక్ లాల్ గారికి సీటు ఇచ్చే అర్హత రావాలంటే ఇంకా రెండు సంవత్సరాలు ఆగాలట. ఎందుకంటే ఆయన ప్రాక్టీసులో లేకుండా వేరే చోట రెండు సంవత్సరాలు ఉద్యోగం చేశారట. యూనివర్సిటీకి వెళితే మెదటి సంవత్సరం పూర్తయిపోయింది. మళ్ళీ జాయిన్ కావాలంటే మరుసటి సంవత్సరం మళ్ళీ ఎంట్రన్స్ వ్రాయాల్సిందే అన్నారు. రెంటికి చెడ్డ రేవడి అయింది నా పరిస్థితి. మా నాన్నగారు నెలకొక వంద, నూటఏభై రూపాయలు పంపేవారు. నేను హైద్రాబాదులో స్టూడియో శ్రీనివాస్ అనే ప్రింటింగ్ ప్రెస్‌లో పార్ట్ టైమ్ పని చేస్తూ కాలం గడిపే వాడిని. మరల ఆరు నెలలు తిరగ్గా తిరగ్గా కూచిపూడి ప్రహ్లాదరావుగారు సీటు ఇచ్చారు కానీ ఆయన కూడా ఆ తరువాత ఆరు నెలల్లో ప్రాక్టీసు మానివేసి ఏదో కంపెనీకి డైరెక్టరుగా వెళ్ళారు. మళ్ళీ నా ట్రెనింగ్ రద్దయింది. ఆ తర్వాత కొంత కాలానికి ఎ.యస్. మూర్తి & కో.లో

చేరాను. టి.యస్. క్రిష్ణ స్వామి గారు ఆఫీసుకు ఇంఛార్జిగా ఉండేవారు. వారు నాకు నెలకు రూ.60 జీతంగా ఇచ్చేవారు. ఆయన వద్ద పది మంది వరకు సి.ఎ విద్యార్థులుండే వారు. నేను ఆఫీసు అసిస్టెంటులాగా పనులు నిర్వహించే వాడిని. అందుకే నాకు జీతమిచ్చేవారు. అది నాకు పరీక్షలు పాసవడంలో చాలా ఉపయోగపడింది.

సి.ఎ.తో పాటే యల్.యల్.బి కూడా పూర్తి చేయాలని భావించాను. యల్.యల్.బి ప్రవేశ పరీక్ష వ్రాశాను. సాయంత్రపు కాలేజిలో చేరాలి. నాన్నగారికి ఉత్తరం వ్రాశా. ఫీజు కట్టడానికి రూ.230/– మనియార్డరు ఆఫీసుకు వచ్చింది. గౌలిగూడ చమన్ దగ్గర సిటీ బస్సు ఎక్కా. చిక్కడపల్లి రూముకు బయలుదేరా. అక్కడ నుంచి ఉస్మానియా యూనివర్సిటీకి వెళ్ళాలి. అప్పుడు చిక్కడపల్లిలోనే ఉండేవాడిని. బస్సు దిగి చూస్తే జేబులో డబ్బులు లేవు. చిక్కడపల్లి పోలీసు స్టేషనుకు వెళ్ళా కంప్లయింట్ ఇవ్వడానికి. హెడ్ కానిస్టేబుల్ గారనుకుంటా ఉన్నారు. బాబూ గౌలిగూడ చమన్ నుంచి చిక్కడపల్లి వరకు సిటీ బస్సులో ప్రయాణించావు. ఎక్కడ పోయినాయో ఎలా తెలుస్తుంది? ఫీజు విషయమంటున్నావు కాబట్టి మేము కొంతమందిమి కలిసి వేసుకుని ఇస్తాం తీసుకో అన్నారు. నాకు చాలా బాధనిపించింది. వారి మంచితనానికి నాకు కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి. పోన్లే ఈ సంవత్సరం కాకుంటే మరో సంవత్సరం చేద్దాంలే అనుకుని వెళ్లిపోయా. ఆ కోరిక సి.ఎ పాసై ఖమ్మంలో ప్రాక్టీస్ పెట్టాక 1990లో తీర్చుకున్నా. ఆ తర్వాత నల్సార్ యూనివర్సిటీ నుంచి మధ్యవర్తిత్వంలో పి.జి. కోర్సు చేశాను.

మొదటిసారి సి.ఎ ఇంటర్ ఎగ్జామ్స్ వ్రాశాను. ఆ రోజు ఫలితాలు వెలువడనున్నాయి. ఆఫీసులో అందరూ కూర్చొని జూనియర్ బాస్‌తో పరీక్షా ఫలితాల గురించి చర్చించుకొంటున్నారు. నేను కనపడగానే నన్నడిగారు. హరిబాబూ నీ ఫలితాలు ఎలా ఉంటాయని ఊహిస్తున్నావని. పాస్ అవుతాను సార్ అన్నా. అందరూ గొల్లున నవ్వారు. గేలి చేశారు. ఇది డిగ్రీ పరీక్ష అనుకుంటున్నావా వ్రాయగానే పాస్ కావడానికి? ఇక్కడ 3,4 సార్లు నుంచి వ్రాస్తున్న వాళ్ళు ఉన్నారు అన్నారు. పరీక్షా ఫలితాలు మధ్యాహ్నం ఫ్లయిట్‌కి చెన్నై నించి వస్తాయి. అందరూ ఎయిర్ పోర్టుకు వెళ్ళిపోయారు. నేను మాత్రం

సాయంత్రం 5.గంటలకు లోయర్ టాంకుబండ్‌లోనున్న ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఆఫీసుకు వెళ్ళా. ఎందుకంటే మరుసటి రోజు పేపర్లో ప్రింట్ చేయడం కోసం ముందు రోజు టెలి ప్రింటరు ద్వారా వారి కార్యాలయానికి వస్తాయి. అలాగే వచ్చాయి కూడా. చూసుకున్నా. నా నంబరుంది. మా ఆఫీసు నుంచి నా ఒక్కడి నెంబరే ఉంది.

నేను సి.ఎ. ఇంటరు ఒక్కొక్క గ్రూపు ఒక్కొక్క సారి వ్రాసినా మొదటి సారే పాసైనందుకు ఫైనల్ ఇయర్ ఇండస్ట్రియల్ ట్రైనింగుకు వెళ్ళే అర్హత వచ్చింది. యల్.ఐ.సి. డివిజన్ ఆఫీస్‌లో అడిగా. వారు నెలకు 500/- స్టయిఫండు ఇస్తామన్నారు. మా బాస్ క్రిష్ణ స్వామిగారి వద్దకు వెళ్ళి విషయం చెప్పా. ఆయన అగ్గి మీద గుగ్గిలమయ్యారు. నా ఆర్థిక పరిస్థితి వివరించా. ఛాంబర్ నుంచి విసురుగా బైటకు వెళ్ళిపోయారు. నేను మాత్రం నిశ్చేష్టుడనై అక్కడే కూర్చున్నా. పది నిమిషాలకు మళ్ళీ విసురుగా వచ్చి నా వద్ద కాగితాలు తీసుకుని సంతకం పెట్టి యూ హేవ్ స్పాయిల్డ్ ది హోల్ అట్మాస్పియర్ ఆఫ్ ది ఆఫీస్. నీవు ఇలాంటి వాడివనుకుంటే నీకు సీటు ఇచ్చేవాడిని కాదు. ఇంకెవరికైనా ఇచ్చేవాడిని అన్నారు. నేను ఆ కాగితాలు చేతికి తీసుకుని వారి దగ్గరగా వెళ్ళాను. రెండు పాదాలనంటి నమస్కారం చేశా. అంతే వారు నన్ను కౌగిలించుకుని హరిబాబూ నా వయసు, బి.పి. కారణంగా కోపంగా మాట్లాడాను. ఏమనుకోకు. నీవు బెగ్గింగ్ చేయడంలేదు. ఇండస్ట్రియల్ ట్రైనింగ్‌కి వెళ్ళడం నీ హక్కు అని, ఆల్‌ది బెస్ట్ అంటూ దీవించారు.

యల్.ఐ.సి.లో ట్రైనీగా చేరా. ముప్పా వెంకయ్య చౌదరి గారికి అటాచ్ చేశారు. ఆయన యల్.ఐ.సి.లో పనిచేస్తూనే అంచెలంచెలుగా ఎదిగి ఆ తర్వాత పెద్ద రియల్ ఎస్టేట్ డీలరుగా ఎదిగారు. ఆయన వ్యక్తిత్వం, ప్రవర్తన, అలవాట్లు నాకే కాదు ఎవరికైనా ఆదర్శప్రాయాలే. ఆయన గురించి వ్రాయాలంటే మరో గ్రంధమవుతుంది. తను ఎంత బిజీగా ఉన్నా స్నేహితులు కనిపిస్తే వారికోసమే ఎదురుచూస్తున్న వాడిలా ఆదరిస్తాడే తప్ప తన బిజీ గురించి అసలు ఆలోచించడు. తన చుట్టూ ఉండే సహోద్యోగులు, బంధు మిత్రులకు అందరికీ పెద్దన్నలాగానే ప్రవర్తించేవాడు. ఎప్పుడూ ఎదుటివారి సమస్యలు, బాగోగులు తరచి తరచి అడిగి తనకు తోచిన సహాయము, సలహాలు అందించడం ఆయన

జీవితంలో ఒక భాగం. ఒకసారి నేను సి.ఏ. ఫైనల్ ఫీజు రూ.1500/- కట్టడానికి కెనరా బ్యాంక్‌లో లోను అప్లై చేసాను. శాంక్షన్ అయ్యింది కాని ఎవరినైనా గ్యారంటీ తెచ్చుకొమ్మన్నారు. బంధువులు కొంతమందిని అడిగితే మాకు ష్యూరిటీ ఇచ్చే అలవాటే లేదన్నారు. లోను విషయం వెంకయ్య చౌదరిగారితో చెప్పాను. ఆయన వెంటనే తన స్కూటరుపైనే కెనరా బ్యాంకుకు నాతో వచ్చి బ్యాంకు పేపర్లపై సంతకం చేసి వెళ్ళారు. నా ఒక్కరి విషయంలోనే కాదు ఆయనతో పరిచయమున్న అందరిపట్ల అలానే వ్యవహరించే వారు. ప్రశాంతంగా నవ్వుతూనే ఉన్నా ఖచ్చితమైన నిర్ణయాలు, తక్షణ నిర్ణయాలు తీసుకునేవారు. మంచి వివేకము, వివేచన ఉండేవి. ఏ సందర్భంలోను ఘర్షణ వాతావరణాన్ని మాత్రం ఆహ్వానించేవారు కాదు. ఆయన స్వరం పెంచి మాట్లాడటం గాని, ఏదైన విషయం గురించి ఎక్కువ విచారించడం గాని నేనెన్నడూ గమనించలేదు. నేను ఇప్పటికీ ఏదైన నిర్ణయం తీసుకోవలసి వచ్చినప్పుడు వెంకయ్య చౌదరిగారైతే ఎలా స్పందించి ఉండేవారు? అని ఆలోచించి నిర్ణయం తీసుకోవడం నాకు ఒక అలవాటుగా మారిపోయింది.

ట్రెనింగ్ పూర్తయి దమ్మపేట చేరగానే సత్తుపల్లికి చెందిన సోమరాజు ఉషారాణిని 1982లో వివాహం చేసుకున్నాను. వారు ఆర్థికంగా కొంత బాగున్నవారే కాని వారినుంచి నేనేరకంగాను సాయం అంగీకరించలేదు. ఎందుకంటే కష్టపడి పైకొచ్చానన్న నా సంతృప్తి కలుషితం కావడం నాకిష్టం లేదు. వెనువెంటనే కొత్తగూడెంలో టాక్స్ కన్సల్టెంట్‌గా ప్రాక్టీసు పెట్టాను. 1985లో సి.ఎ. పాస్ అయ్యాను. ఆ తరువాత మకాం ఖమ్మానికి మార్చాను. ఖమ్మంలో యల్.యల్.బి. పూర్తి చేశాను. నల్సార్ యూనివర్సిటీ నుంచి మధ్యవర్తిత్వంలో పి.జి. డిప్లోమా పొందాను. ఖమ్మంలో ఆడిటర్‌గా ప్రాక్టీసు ప్రారంభించాను. దానితో సంతృప్తి మాత్రం కలగలేదు. జీవితంలో ఏదో సాధించాలి. గొప్ప వ్యక్తిని కావాలనే పట్టుదలతోనే కదా స్వయం కృషితో ఈ స్థాయికి చేరాను. నేనాశించిన స్థాయికి చేరడానికి ఖమ్మం వేదిక కాదని అర్థం చేసుకున్నాను.

ఉషారాణితో చెప్పాను హైదరాబాదు వెళదామని. ఆమె ససేమిరా అంది. నేను సి.ఏ., యల్.యల్.బి., చదివాను. చాలా పెద్ద చదువు. హైదరాబాదులో

గొప్ప సి.ఏ.గా ఎదిగితే కోట్ల రూపాయలు సంపాదించ గలుగుతాను. లాయర్‌గా ప్రాక్టీస్ పెట్టినా సి.ఏ., యల్.యల్.బి., కాబట్టి హైకోర్టు జడ్జిగా ఎదగగలుగుతాను. నాకు వృత్తి పరమైన సంతృప్తి కలుగుతుంది. కష్టపడి పై కొచ్చినందుకు సార్థకత ఉంటుంది అన్నాను. ఆమె నాకలాంటి కోరికలు లేవు. మీరు కూడా ఊహలలో తేలవద్దు. ఇక్కడ ఉన్న దానితో సంతృప్తి పడడం మంచిది. నేను ఇంత మాత్రం కూడా ఊహించలేదు. ఏదో బడిపంతులును చేసుకొని ఉండేదాన్ని. అదృష్టం కొద్ది మీరు దొరికారు. ఇక్కడ నేను సంతృప్తిగా ఉన్నాను. ఇద్దరు పిల్లలు మీరు ప్రొద్దున లేస్తే కళ్ళెదుటే ఉంటారు అంది. మర్రిచెట్టును పూల కుండీలో వేస్తున్నావు. మనం హైదరాబాదులో ఉంటే పెరిగి శాఖోపశాఖలుగా విస్తరించే అవకాశముంది. నాలో ఉన్న తపన, పట్టుదల అనే అగ్ని చల్లారట్లేదు అన్నాను. హైదరాబాదు ట్రాఫిక్ రద్దీ, పొల్యూషన్, బార్‌లు, క్రైమ్ నాకు నచ్చవండి అని తెగేసి చెప్పింది. ఆమెకు దైవభక్తి చాలా ఎక్కువ. భగవంతుడు ఏదివ్వాలో అదే ఇస్తాడు. ఉన్న దానితో తృప్తిపడటం నేర్చుకోండి అనేది. దాదాపు 5 సంవత్సరాలు మా మధ్య ఇదే ఘర్షణ. దాదాపు డిప్రెషన్‌లోకి వెళ్ళిపోయాను. హైదరాబాదు వెళ్ళడం అసాధ్యమనిపించింది. ఖమ్మంలోనే ఛిట్‌ఫండ్, ఫైనాన్స్ వ్యాపారం ప్రారంభించాను. ఒక్క సంవత్సరంలోనే అర్థమయింది. అవి తగిన వ్యాపారాలు కావని. మూసివేశాను. విషవలయంలో చిట్, ఫైనాన్స్ వ్యాపారాలు అనే శీర్షికన ఆంధ్రజ్యోతిలో ఒక వ్యాసం రాశాను. 1999లో హీరోహోండా డీలర్‌షిప్ తీసుకున్నాం. అదే శ్రీశ్రీశ్రీ ఆటో మొబైల్స్. ఆ తర్వాత ఒక పెట్రోల్ బంకు తీసుకున్నాము. గత పదిహేను సంవత్సరాలుగా షోరూం వ్యవహారాలు ముఖ్యంగా మా ఆవిడే నిర్వహిస్తుంది. నా ఆశలు పూర్తిగా చల్లారలేదు గాని చాలా వరకు తీరినాయి. ఆమె ఖమ్మంలోనే ఉందామన్నదానికి ప్రతిఫలం ఇదేనేమో అనుకుని సంతృప్తి పడుతున్నా.

నా భార్య ఎంత ససేమిరా అన్నా రాజకీయాలలో ప్రవేశించా. టి.ఆర్.యస్ పార్టీలో రాష్ట్ర సెక్రటరీగా మూడు సంవత్సరాలు పనిచేశా. ఆ తర్వాత ప్రజారాజ్యం పార్టీ నుంచి ఖమ్మం అసెంబ్లీ నియోజక వర్గానికి యమ్.యల్.ఎ.గా పోటీ చేశా. అర్థమైంది. నా చదువు, నా ఆత్మాభిమానం, నా నిజాయితీ నుంచి ఉత్పన్నమైన అహంకారం రాజకీయాలకు పనికిరావని. నేను కష్టపడి

సంపాదించిన డబ్బు రాజకీయాలకు సరిపోదని. ఎన్నికలంటే డబ్బు పంపిణీ పోటీలే అని అర్థమైంది. మిత్రులు, మాజీ మంత్రివర్యులు శ్రీ సంభాని చంద్రశేఖర్‌గారు సలహా చెప్పారు. డబ్బు ప్రధానం హరిబాబుగారు, మీరు కష్టపడి పైకొచ్చారు, డబ్బు పోయే రాజకీయాలు చేయకండి అని. మా ఆచార్యుల వారు మా దంపతులనిద్దరినీ ఒకసారి ప్రత్యేకంగా పిలిపించి మందలించారు. ఎందుకమ్మా ఈయననిలా వదిలేశావ్? రాజకీయాల్లోకి అలా వెళ్ళిపోతూనే వుంటాడు. డబ్బులన్నీ పాడు చేసేస్తాడు అన్నారు. చెపితే వినట్లేదు, స్వయంకృషితో చదువుకొని పైకొచ్చాను, ఏదైనా చేయాలంటాడు అంది మా ఆవిడ. ఐతే సంపాదించో, అడుక్కోనో చేసుకోమనండి రాజకీయాలు. మీ షోరూం నుంచి డబ్బులు ఇవ్వకండి అని తీవ్రంగా మందలించారు . ఇద్దరు మగ పిల్లలున్నారు. టూవీలర్ వ్యాపారంలో ఉన్నారు. త్రీవీలర్, ఫోర్ వీలర్‌లోకి వెళ్ళండి. మరి కొంత డబ్బు సంపాదించుకోండి అని చెప్పి ముగించారు. నా ట్రెజరీ, నా రాజకీయాలు రెండూ బంద్లైనాయి. రాజకీయాల నుంచి విరమించినా తెలంగాణ అభిమానం, కె.సి.ఆర్ కుటుంబంపై అభిమానం, మెగాస్టార్ చిరంజీవి వచించిన రాజకీయాలలో మార్పు, రాజకీయాలలో సామాజిక న్యాయం, అవినీతి లేని రాజకీయాలనే సిద్ధాంతాలపై అభిమానం నేటికీ నా హృదయంపై చెరగని ముద్రగానే మిగిలున్నాయి.

నా జీవితాన్ని మలుపు తిప్పిన సంఘటనలు రెండు. నేను చదువు మానివేసి ములకలపల్లి దగ్గర మాధారం అనే గిరిజన గ్రామంలో వ్యవసాయం చేస్తూ ఉండేవాడిని. ఒకరోజు మాధారం నుంచి కొత్తగూడెం 20 కిలోమీటర్లు నడిచి వెళుతున్నాను. కాళ్ళకు చెప్పులు లేవు. నిక్కరు, షర్టు, భుజాన కండువాతో వెళుతున్నాను. పాత పాల్వంచ దగ్గర స్కూలు నుంచి వస్తూ నన్ను చూసి హరీ అని పిలిచింది బొర్రా జయమ్మ. ఇంటికి తీసుకుళ్ళింది. భోజనం పెట్టింది. నడిచిపోవద్దు, బస్సెక్కి వెళ్ళమని ఐదు రూపాయలు ఇచ్చింది. చదువుకునే వాళ్ళం మేమెలా ఉన్నాం, నువ్వేలా ఉన్నావు చూడు. ఇంటికి వెళ్ళి చదువుకుంటానని మొండిపట్టు పట్టమని చెప్పింది. ఆమె 7వ తరగతిలో పెనుబల్లిలో నా క్లాస్‌మేట్. ఆ ప్రేరణతోనే ఆగిపోయిన నా చదువు తిరిగి ప్రారంభమైంది. ఆ విధంగా నన్ను కన్న తల్లి ద్వారానే కాదు, కట్టుకున్న భార్య ద్వారానే కాదు, సోదరి బొర్రా జయమ్మ ద్వారా కూడా యావత్ మహిళాలోకానికే

నా జన్మ రుణపడి ఉంది. ఆమె ప్రోత్సాహంతో స్కూలుకు వెళ్ళడం ప్రారంభించాను. 8,9 తరగతులు పరీక్షలు లేకుండానే పూర్తయినాయి. పదవ తరగతిలో పబ్లిక్ పరీక్ష ఫీజు రూ.20 కట్టలేక పరీక్షకు వెళ్ళలేదు. మరుసటి సంవత్సరం మళ్ళీ సంవత్సరమంతా స్కూలుకు వెళ్ళా. మళ్ళీ పరీక్ష ఫీజు కట్టలేక మళ్ళీ మాని వేశా. అప్పుడే సదాశివరావుగారనే తెలుగు మాష్టారు రూ. 20 గురించి విద్యార్థి చదువు ఆగిపోవడమేమిటని నాకు కబురు చేసి పిలిపించారు. పరీక్ష ఫీజు వారే చెల్లించారు. ఆ విధంగా ఆగిపోయిన నా చదువు మళ్ళీ ప్రారంభమై సి.ఎ., యల్.యల్.బి చదివే వరకు కొనసాగింది. అలాగే నేను కొత్తగూడెంలో బి.కాం చదివేటప్పుడు రాత్రులందు పెట్రోలు బంకులో పంప్‌బాయ్‌గా పనిచేయడం వల్ల కాలేజిలో నిద్రలో తూలుతూ ఉండేవాడిని. ఒకరోజు మా లెక్చరర్ శంకరరావు గారు ఆప్యాయంగా భుజంమీద చేయి వేసి హరిబాబూ! ఇంటికి పోయి పడుకో పో! అటెండెన్సు నేను చూసుకుంటాను. సబ్జెక్టులో ఏమన్నా డౌట్స్ ఉంటే ఇంటికి ఎప్పుడైనా వచ్చి చెప్పించుకో అన్నారు. ఆ విధంగా నా జీవితంలో అధ్యాపక లోకానికి కూడా తీర్చుకోలేనంత రుణపడి ఉన్నాను.

ఇద్దరు కుమారుల వివాహ విషయంలోను ఎదురు దెబ్బ తగిలినందున 2009 నుంచి 2017 వరకు సమాజానికి కొంత దూరంగా ఉంటూవచ్చాను. రాజకీయాలు, న్యూహాలెండ్ ట్రాక్టర్ డీలర్‌షిప్, టీ.వి.యస్ ఆటో డీలర్‌షిప్ వదులుకున్నాం. పెట్రోల్ బంక్ కూడా లీజుకిచ్చేసి, సి.ఏ ప్రాక్టీస్ కూడా చాలా వరకు వదిలేసుకున్నాం. భగవంతుడి దయవలన, మిత్రుల సహాయ సహకారాల వల్ల ఈ మధ్యనే అంటే జూలై 2017 నుంచే కష్టాల కారుమబ్బులు తొలగిపోయి బంగారం లాంటి కుమారులు చిరంజీవి భార్గవ ప్రసాద్, చిరంజీవి రంగనాథ్, కోడళ్ళు సాయిశృతి, లక్ష్మి తేజస్విలు, మనుమలతో ఎంతో ఆనందంగా ఉన్నాము. ప్రస్తుతం ఖమ్మం జిల్లా బ్రాహ్మణ సంక్షేమ సంఘం అధ్యక్షుడిగా బ్రాహ్మణ సమాజానికి నా రుణం తీర్చుకునే ప్రయత్నం చేస్తున్నాను. ఎందుకంటే నా విద్యాభ్యాసం ముఖ్యంగా బ్రాహ్మణుల ఆర్థిక సాయంతోనే జరిగింది.



# 7. ప్రతి రంగంలోనూ మార్పు సహజం

సార్వకాలిక సంభావనా పరిణతమైన సామాజిక సిద్ధాంతాలు ఉండవన్నది వాస్తవం. అవి దేశ కాలానుగుణంగా అవసరాల దృష్ట్యా రూపాంతరం చెందుతూ ఉంటాయి. ఉదాహరణకు గత చరిత్ర పరిశీలిస్తే అష్ఠ వర్షాధ్భవేత్ కన్య, అనగా బాలికకు 8 సంవత్సరముల వయస్సు వచ్చే వరకు వివాహం చేయడం సంప్రదాయమని. అదే ఈ రోజున, 18 సంవత్సరాల లోపు యువతికి వివాహం చేస్తే, చేసిన తల్లిదండ్రులు, బంధుమిత్రులు, పురోహితుడితో సహా వివాహానికి కారణమైన, హాజరైన అందరూ శిక్షార్హులే.

అలాగే సమీప గత కాలంలో కన్యాశుల్కం అనే ఆచారం ఉండేది. అంటే వరుడు వధువు తల్లిదండ్రులకు కొంత రొక్కం ముట్టజెప్పి వధువుని భార్యగా చేసుకొనేవారు. ఆ రోజుల్లో దానికీ ఓ కారణం ఉండేది. వివాహ కాలంలో రూ. 1000/- వెచ్చించి వధువును వివాహం చేసుకొలేనివాడు భార్యను జీవితాంతం ఎలా పోషిస్తాడు అని ప్రశ్నిస్తే అదీ వాస్తవమే అనిపించేది. బహుశః ఆ కాలంలో ఇప్పుడున్నట్లుగా అనేక విద్యా, ఉద్యోగ, వృత్తి వ్యాపారాలు అందుబాటులో ఉండేవి కావు. అందువల్ల భార్యను పోషించగల సత్తా వరునికి ఉన్నదా లేదా అనేది ఒక సంశయమే. వధువు తల్లిదండ్రులకు కూడా ఈనాటి లాగ అనేక రకాల ఆస్తులు ఉండి ఉండక పోవచ్చు. ఈ వ్యవహారాలలో ఇచ్చుకునే వారు, పుచ్చుకునే వారు అని రెండు ప్రత్యేక వర్గాలు ఉండవు. ఒకే కుటుంబం ఒక సందర్భంలో ఇచ్చే వర్గంగాను మరో సందర్భంలో పుచ్చుకునే వర్గంగాను ఉండే అవకాశం ఉంది. పైగా ఆ కాలంలో కుటుంబ నియంత్రణ వ్యవస్థ లేక ఒక్కొక్కరు పదిమంది సంతానం వరకు కలిగి ఉండటం మామూలు విషయంగా ఉండేది. కన్యాశుల్కం చెల్లించి వివాహం చేసుకొనలేనివారు చాలామంది బ్రహ్మచారులుగా మిగిలిపోయేవారు. బహుశా జనాభాలో స్త్రీల నిష్పత్తి బాగా తక్కువగా ఉన్నందువల్లనే అలా జరిగి ఉంటుంది అనుకోవచ్చు.

స్త్రీలు ఎక్కువగా కాన్పులలో చనిపోతూ ఉండేవారు. అందులో భాగంగానే కావచ్చు, ఆంధ్ర, నైజాం రాష్ట్రాలలోని అనేకమంది తమిళనాడు, కేరళ నుంచి అమ్మాయిలను కొని తెచ్చుకొని వివాహం చేసుకునేవారు. ఆ తర్వాత కాలంలో ఆ పరిస్థితి మారింది.

సంఘ సంస్కర్తలు రంగంలోకి దిగి కన్యాశుల్కం రూపుమాపారు. దాని రూపాంతరంగా వరకట్నం అవతరించింది. వరకట్నానికి అనుకూలంగా ఒక వాదన వుంది. తల్లిదండ్రులకు అబ్బాయిలలాగానే అమ్మాయిలు జన్మించారు కదా, అలాంటప్పుడు తల్లిదండ్రులు సర్వ ఆస్తి పాస్తులు కొడుకులు అనుభవిస్తుండగా కూతుళ్ళను కట్టుబట్టలతో బయటకు ఎందుకు పంపాలి అని. అందువల్ల సమాన వాటా కాకున్నా తల్లిదండ్రులు అవకాశాన్ని బట్టి మరియు వరుని ఆర్థిక లేదా హెూదాను బట్టి గుండుగుత్తగా ఇంత అని కట్నంగా ఇచ్చేవారు. సాదరంగా సాగనంపేవారు. పండగలకు, పబ్బాలకు పిలిచి మర్యాదలు జరిపించేవారు. దీని వికృత రూపంగా వరకట్న వేధింపులు ఎక్కువయ్యాయి. వరుని కుటుంబీకులకు డబ్బు అవసరమైనప్పుడల్లా వధువు తండ్రి నుండి డబ్బు తెమ్మని వేధించడం వంటివి ఎక్కువైనాయి. అలాగే వివాహ సమయంలోనే ఎక్కువ కట్నం అడగటం ప్రారంభించారు. ఎక్కువ కట్నం అడగటం తమ హెూదాకు చిహ్నంగా భావించడం మొదలుపెట్టారు. దీని పర్యవసానంగా అనేక మంది స్త్రీలు వయసు దాటి పోతున్నా అవివాహితులుగానే మిగిలిపోవడం ప్రారంభమైంది. వరకట్న వేధింపులు, వరకట్న చావులు నిత్యకృత్యాలయ్యాయి.

మళ్ళీ రచయితలు, సంఘ సంస్కర్తలు రంగంలోకి దిగి కట్నం తీసుకునే వాడిని అమ్ముడుపోయే పశువుగా చిత్రించడం మొదలు పెట్టారు. ప్రభుత్వం రంగంలోకి దిగి వరకట్న వేధింపుల చట్టం, గృహహింస చట్టం లాంటివి తేవడం ద్వారా ఈ సమాజ రుగ్మతను అరికట్టాలని భావించింది. సమాజంలో సగం మహిళలన్న సత్యాన్ని రాజకీయ నాయకులు గుర్తించి వారికోసం ప్రత్యేక చట్టాలు, ప్రత్యేక పథకాలు పెట్టడం ప్రారంభించారు. సమాజంలోని ప్రతి సమస్యను రాజకీయ లబ్ధికి ఉపయోగించుకోవడం రాజనీతికదా. మరో స్త్రీ జనోద్ధరణ సంస్కరణ చూచినట్లయితే అది వరకట్న నిరోధక చట్టం, గృహహింస

చట్టం. ఈ చట్టాల ప్రకారం వకరట్నం ఇచ్చినా, పుచ్చుకున్నా నేరం. అధిక వరకట్నం కోసం భార్యను వేధిస్తే కటకటాల పాలే. భర్త మాత్రమే కాదు భర్త యొక్క బంధువులందరూ నేరస్తులే. స్త్రీ ఫిర్యాదు చేస్తే చాలు భర్త యొక్క బంధువులందరూ విచారణ లేకుండా జైలు పాలే.

ఈ చట్టాలు మంచివేకాని ముఖ్యమైన రెండు విషయాలను విస్మరించి నిర్మించారు కాబట్టి దుర్వినియోగానికి ఆస్కారమిచ్చాయి. మొదటి విషయం, మంచి వారు, చెడ్డ వారు అనే వారు అమ్మాయిలలోను, అబ్బాయిలలోను కూడా వుంటారు. అలాగే అత్తలంతా కోడళ్లను వేధించే గయ్యాళిలే కాదు. తల్లిలా ఆదరించే ఆదర్శవాదులూ ఉన్నారు. కాని వరకట్న దురాచార వ్యతిరేక ఉద్యమంలో అత్తా కోడళ్లు శాశ్వత శత్రువులుగా చిత్రించబడ్డారు. ఇలాంటి ఇతి వృత్తాలతో అనేక పుస్తకాలు, సినిమాలు విడుదలయ్యాయి. రెండవది అమ్మాయి తల్లిదండ్రులు అమ్మాయిని అత్తవారింటికి కట్టు బట్టలతో ఎందుకు పంపాలి? లేదా ఎంతో కొంత ఇచ్చి ఎందుకు పంపాలి? పారదర్శకంగా తల్లిదండ్రులు ఆస్తిలో చట్టబద్ధంగా ఎంత వస్తుందో అంత ఇచ్చి పంపవచ్చు గదా?

1986 నుంచి మహిళలకు మగవారితో సమానంగా తల్లిదండ్రుల ఆస్తిలో వాటా కల్పించారు. ఈ చట్టం ద్వారా కట్నాన్ని మీ అమ్మాయికి ఆస్తిలో ఏ మాత్రం వాటా వస్తుంది అని చట్టబద్దంగా అడిగే అవకాశం వచ్చింది. ఏది ఏమైనా ఇదే నిర్దిష్టమైన మరియు పారదర్శకమైన విధానంలా కనిసిస్తున్నది. దీనికి కూడా చెడు ప్రభావాలు లేకపోలేదు. ఆడపిల్లకు వివాహ సమయంలో తమకున్న ఆస్తిని బట్టి గౌరవ ప్రదంగా కొంత మొత్తాన్ని పరస్పర అంగీకారంతో ఇచ్చి ప్రేమపూర్వకంగా సాగనంపి, ఆపై పండుగలకు పబ్బాలకు ఆహ్వానించి గౌరవించి పంపడం జరిగేది. ఆడ పిల్లలకు వాటాలు పెండ్లికి ముందే పంపకాలు చేయవలసి వస్తే ఆ పెళ్ళిలో ఆప్యాయంగా ఇంటికి పిలిచే సాంప్రదాయమే చెడిపోయే అవకాశం వుంది. శుభకార్యం పక్కన పెట్టి ముందు ఆస్తుల పంచాయితీతో అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, కుటుంబ సభ్యులు, బంధువులు కోర్టుబాట పట్టే అవకాశముంది. దీనివల్ల అమ్మాయికిచ్చే ఆస్తిపాస్తులేమో కాని ఆమె వివాహమే ప్రశ్నార్థకమయ్యే అవకాశముంది. ఆమె మానసికంగా క్రుంగి పోతుంది. వివాహమే ఒక ప్రహసనంగా మారుతుంది.

ఈ మధ్య కాలంలో కోర్టులలో విడాకుల కేసులు అత్యధికంగా దాఖలౌతున్నాయని సర్వేలు తెలియజేస్తున్నాయి. స్త్రీ పక్షపాతమైన చట్టాలు, స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం, వాటి ధైర్యంతో, సెల్‌ఫోను సమకూర్చిన రహస్య మంతనావకాశాలతోను, పరిమిత సంతానమైనందున కలిగే పుత్రికా వ్యామోహం చేతను పిల్లల సంసారాలపై తల్లుల పెత్తనం ఎక్కువయింది. ఒక పక్క టీ.వి.లు, సినిమాలు, సెల్‌ఫోన్లు, ఇంటర్నెట్, సోషల్ మీడియా, విదేశీ నాగరికతలు యువతను ప్రభావితం చేయడం ప్రారంభించాయి. స్త్రీల హక్కులను రక్షించడానికి ఏర్పడ్డ చట్టాలు కాబట్టి స్త్రీలకు అనుకూలంగా మాత్రమే అమలు చేయాలని సుప్రీంకోర్టు నుంచి అన్ని న్యాయస్థానాలు భావించినాయి. ఫలితం, పరస్పర ఆరోపణలు, అపార్థాలు, ఘర్షణలు, కోర్టులలో, పోలీసు స్టేషన్లలో ఫిర్యాదులు. స్త్రీ స్వాతంత్ర్యం, రక్షణ కొరకు ఏర్పడ్డ చట్టాలు దురవగాహనకు దారి తీశాయి.

స్త్రీ స్వాతంత్ర్యం పేరుతో అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలను అనుకరించే ప్రయత్నం చేస్తున్నారు. కాని అక్కడి సామాజిక, ఆర్థిక, వాతావరణ పరిస్థితి వేరు. భారతదేశ సామాజిక, ఆర్థిక, వాతావరణ పరిస్థితి వేరు. భారతదేశంలో ఈ వాస్తవాన్ని విస్మరించి ధరించే వస్త్రాలు, ధరించిన వారికన్నా ప్రేక్షకులకే ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తాయంటే అతిశయోక్తి కాదు. స్త్రీ రక్షక చట్టాలు దుర్వినియోగానికి గురౌతున్నాయని సాక్షాత్తు భారత సర్వోన్నత న్యాయస్థానమే వ్యాఖ్యానించిందంటే దుర్వినియోగం ఏ స్థాయిలో జరుగుతున్నదో గమనించవచ్చు. దీనివల్ల కుటుంబాలు కలిసి ఉండటానికి బదులు కూలిపోతున్నాయని కూడా న్యాయస్థానం వాఖ్యానించింది. పురుషులపై తీసుకునే చర్యలను నిర్దిష్టం చేసి నియంత్రించింది. వరుడి కుటుంబ సభ్యులను అరెస్టు చేయవద్దని, వధూవరులకు ముందుగా కౌన్సిలింగ్ నిర్వహించాలని అరెస్టు చేసిన కారణాలు నమోదు చేయాలని, పోలీసు స్టేషన్‌లోనే బెయిల్ ఇవ్వవచ్చని అలా అనేక సంస్కరణలు చేసింది. ప్రతి జబ్బును ఒక ఔషధం, ప్రతి ఔషధానికి ఒక సైడ్ ఎఫెక్ట్ తప్పదు కదా.

మరొక సామాజిక మార్పు పరిశీలిద్దాం. ఒకప్పుడు బ్రాహ్మడికే అగ్రాసనం ఇవ్వాలి. ప్రథమ తాంబూలం ఇవ్వాలి. బ్రాహ్మణ దూషణ తప్పు. బ్రాహ్మణహత్య మహాపాతకం. ప్రస్తుతమైతే ఎస్.సి., ఎస్.టి.లకు ఉద్యోగాలలో అగ్రాసనం

ఇవ్వాలి. అవకాశాలలో ప్రథమ తాంబూలం ఇవ్వాలి. ఎస్.సి., ఎస్.టి.ల దూషణ తప్పు. వారిపట్ల అట్రాసిటీ మహానేరం. ఆనాడు బ్రాహ్మణాధిపత్యం నడిచినా ఈనాడు ఎస్.సి., ఎస్.టి.ల అధికృత ఉన్నా అది ఆయా కులాల వారి గొప్పదనమో లేదా అది వారి సాధన వల్లనో జరిగింది కాదు. ఆయా కాలాల నాటి పాలకులు వారు గుర్తించిన సామాజిక ప్రాధాన్యతల ప్రకారం అమలు పరిచారు. రాజ్యామోదం లేనిదే ఏదీ జరగదని గమనించాలి.

ప్రపంచంలోని ప్రతి రంగంలోను కాలానుగతంగా మార్పులు చోటు చేసుకోవడం సహజం. విశ్వంలోని అన్ని అంశాలే కాదు, సాక్షాత్తూ విశ్వమూ పరిణామ గతమే. సృష్టి స్థితి లయానుగతమే. శూన్యం నుండి సూక్ష్మం లోనికి, సూక్ష్మం నుండి విరాడ్రూపం లోనికి తిరిగి విరాడ్రూపం నుండి శూన్యం లోనికి నిరంతరం ప్రకృతి పరిభ్రమిస్తూనే వుంటుంది. మార్పు శాశ్వతం, అనివార్యం, మరియు అది ఒక నిరంతర ప్రక్రియ. అది సామాజిక రంగమైనా, ఆర్థిక రంగమైనా, రాజకీయ రంగమైనా, సంగీత, సాహిత్య, కళా రంగాలైనా, అలవాట్లైనా, ఆచారాలైనా, ఆకారాలైనా అన్నీ పరిణామ గతాలే.

మార్పును గమనించలేని వారు ప్రస్తుత పరిస్థితే శాశ్వతమని భ్రమిస్తారు. సమతౌల్య బుద్ధిగాని, వాస్తవాన్ని విచారించి తెలుసుకోవాలనే ధ్యాసగాని లేనివారు తమకు తెలిసిన, తాము విన్న, లేదా తాము ఊహించగలిగిన స్వల్పమైన గత కాలాన్ని తలుచుకొని అట్టి ఆధారంతోనే విమర్శలూ, పొగడ్తలూ చేస్తూ జ్ఞానుల్లాగా పోజు కొడుతూ ఉంటారు. ఆనాటి పరిస్థితులకు ఎవరినో ఒకరిని కారణంగా భావించి విమర్శలు చేస్తూ వారిపై వ్యతిరేకత పెంచుకుంటూ వుంటారు. దానినే విజ్ఞాన సర్వస్వంగా ప్రచారం చేస్తూ ఉంటారు. వారి విచారణ, జిజ్ఞాస మంచిదే కాని వారు దానికి కొంత వివేచన జోడించి విషయాసక్తితో ఆలోచిస్తే మంచి ఫలితాలు సంభవిస్తాయి. లేకుంటే విద్వేషాలకు, అజ్ఞాన వ్యాప్తికి దోహదమౌతారు.

సాంఘీక ఆచారాలలోను, రాజకీయ వ్యవస్థలలోను, నాగరికతల లోను, భాషల లోను వచ్చిన మార్పులను గమనించాం. అలాగే ఆర్థిక వ్యవస్థలో వేట నుండి వ్యవసాయము, పశుపోషణ వరకు అలాగే వస్తు మార్పిడి విధానం నుండి నేటి అత్యాధునిక వాణిజ్య విధానాల వరకు వచ్చిన మార్పులు

గమనించవచ్చు. ప్రయాణ సాధనాలలోను, భావవ్యక్తీకరణ మరియు వ్యాప్తికి ఉపయోగించే సాధనాలను గమనించవచ్చును. భగవంతుని గురించిన భావనలలో కూడా మార్పులు చోటు చేసుకున్నాయి. భగవంతుడనే భావనే లేని పరిస్థితి నుండి, భగవంతుడు నామ రూప రహితుడని, అవాఙ్మానస గోచరుడని, సర్వాంతర్యామి అని, సర్వ శక్తివంతుడని స్వయంభువు అని సృష్టి, స్థితి, లయ కారకుడని, చివరగా అనేక అవతారాలలో ఆవిష్కరించుకున్నాడని అనేక భావనలు ప్రచారంలో ఉన్నాయి. ఇంకా కొత్త కొత్త బాబాలు, అవతార పురుషులు పుట్టుకొస్తూనే ఉన్నారు. ఇలా భగవంతుడి ఉనికికి సంబంధించిన భావనలు కూడా అనేక మార్పు చేర్పులకు గురైనాయి. భగవంతుని ఆరాధనా విధానాలలో కూడా అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. నాట్య రీతులలోను, సంగీత రీతులలోను సాహిత్య ప్రక్రియలలోను అను నిత్యం మార్పులు చోటు చేసుకుంటూనే ఉన్నాయి. మార్పులను వాస్తవాలుగా గ్రహిస్తూ తదనుగుణంగా తమను తాము మార్చుకున్నవారే సుఖ సంతోషాలతో ఉంటూ విజయాలు సాధించగలుగుతారు.

మార్పు ప్రతి మనిషి జీవితంలోనూ వస్తుంది. ఎలాంటి మార్పు వస్తున్నది? ఎంత వేగంగా వస్తున్నది? తాను మార్పును ఎలా స్వీకరించాలన్న విషయంలో ప్రతి మనిషికి స్పష్టమైన అవగాహన అవసరం. ప్రతి మనిషికి, వ్యవస్థకూ అత్యంత ఆత్మీయమైన కొన్ని విషయాలుంటాయి. అవి రాజకీయ నాయకునికి అతని అధికారం కావచ్చు. నటీనటులకి వారి అవకాశాలు, అందం, అభినయం, వయసు, వాచకం కావచ్చు. ఒక ఉద్యోగస్తుడికి అతని హెూదా, అతని జీతం కావచ్చు. ఒక వ్యాపారస్తుడికి అతని వ్యాపార లాభదాయకత కావచ్చు. ఒక ఆటగాడికి అతని ఆడే శక్తి, శ్రామికుడికి శ్రమించే శక్తి. ఒక భార్యకు ఆమె భర్తే దైవం. ఒక భర్తకు అతని భార్యే సర్వస్వం. కానీ ఇవన్నీ ఏదో ఒక రోజు తప్పక దూరమౌతాయి. ఆ వాస్తవాన్ని అనుక్షణం గమనిస్తూ ఆ మార్పులకనుగుణంగా తనను తాను మార్చుకోగల్గిన వారే విజేతలు. లేకుంటే అకస్మాత్తుగా ఆశ్చర్యానికి, ఆవేదనకు గురి కావలసిందే.

మార్పును శాశ్వతంగా ఆపడం ఎవరికీ సాధ్యంకాదు. కుల వ్యవస్థ, రాజకీయ, ఆర్థిక రంగాలలో ఎంత బలంగా ఉన్నా, ఈనాటికీ తెలివితేటలతో

నిజాయితీగా కష్టించి పని చేసే వారికి అవకాశాలకు కొదువలేదు. ప్రజాస్వామ వ్యవస్థలైన పార్లమెంటరీ విధానం, అధికార యంత్రాంగం, న్యాయ వ్యవస్థ మరియు పత్రికా రంగాలు ఇప్పటికీ పటిష్టంగానే ఉన్నాయి. కొంత కొంత లోటుపాట్లు తాత్కాలికం మరియు ఏ వ్యవస్థలోనైనా సహజంగానే ఉంటాయి. వ్యవస్థల విషయంలోగాని సామాజిక, ఆర్ధిక, సాంకేతిక, రాజకీయ రంగాలలో గాని భారతదేశం తప్పక పడుతూ లేస్తూ నైనా ముందుకు సాగుతూనే ఉన్నది.

ఒక వర్గం రెచ్చిపోయినప్పుడు మిగిలిన అన్ని వర్గాలు కలిసి వారిని క్రిందకు దించే ప్రయత్నాలు చేస్తూనే ఉంటాయి. ఆ మార్పు ప్రజల ద్వారా ప్రత్యక్షంగా ఎప్పుడూ జరగదు. ఎందుకంటే ప్రజలు రాజ్యాధికార సాధన తంత్రంలో ఒక సాధనం మాత్రమే. అందువల్ల రాజకీయ మార్పు ప్రాంతీయ శత్రువు వలన గాని, జాతీయ శత్రువు వలన గాని, అంతర్జాతీయ శత్రువు వలన గాని, సహజ కారణాల వలన గాని, స్వయంకృతాపరాధం వలన గాని, శత్రువుల పోరాట పటిమ వలన గాని, వెన్నుపోటు వలన గాని జరగవచ్చు. ఎవరనుకున్నారు భారతీయులు కనీ వినీ ఎరగని ఆంగ్లేయులు సముద్రాలు దాటి వచ్చి రాజ్యాధికారం లాక్కుంటారని. అలాగే అసాధ్యమనుకున్న ఎన్నో బలమైన సామ్రాజ్యాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

ఆటవిక జీవనం నుండి, అరాచక పరిస్థితుల నుండి, సంచార జీవనం నుండి, చిన్నచిన్న సమూహాలుగా, గ్రామాలుగా నివసించడం దగ్గరనుండి నియంతృత్వ, రాచరిక, విదేశీ పాలన, నేటి ప్రజాస్వామ్య వ్యవస్థల వరకు జరిగిన పరిణామాలు మనం గమనించవచ్చు. అలాగే రాచరిక లేదా ప్రజాస్వామ్య వ్యవస్థలలో కూడా అనేక పరిణత స్థాయిలను కూడా మనం గమనించవచ్చు. అందువల్ల ఈనాటి పరిస్థితి కూడా ఎల్లకాలం ఉంటుందని భావించలేము. తప్పనిసరిగా ఈనాటి పరిస్థితి కూడా మారి తీరుతుంది. ఆ మార్పు మంచి దిశగా ఉండాలని ఆశిద్దాం.

చతుస్సాగర పర్యంతం ఏకఛత్రాధిపత్యంగా పరిపాలించ బడ్డ భారతదేశం అనేక వందల దేశాలుగా విడిపోయింది. ఈ క్రమంలో వేలకొద్ది యుద్ధాలు జరిగే ఉంటాయి. మనకు తెలిసిన ఆధునిక కాలంలో స్థానిక స్వదేశీ రాజుల నుండి అరబ్బులు, డచ్చి, ఫ్రెంచి, బ్రిటిష్ వంటి పరాయి దేశస్తుల పాలనలోనికి

భారతదేశం వెళ్లిపోయింది. కోట్లాది ప్రజల ప్రాణ, మాన, ధనాలు హరించబడ్డాయి. భారతీయులు రెండవ తరగతి పౌరులుగా బ్రతకవలసి వచ్చింది. స్వంత దేశంలోనే బానిసలుగా పరాయి వారి వలే బ్రతకవలసి వచ్చింది. దరిద్రం, అవిద్య, అభద్రతా భావం, అవమానం భారతదేశంలో తాండవమాడాయి. గుర్రాలపై భారతదేశంలో ప్రవేశించిన వేయిమంది లోపే ఉన్న అరబ్బులు భారత దేశాన్ని పూర్తిగా ఆక్రమించి సుమారు వేయి సంవత్సరాలు పరిపాలించారు. ఎక్కడో ఉన్న ఇంగ్లాండు నుండి ఓడలలో వచ్చిన కొద్దిమంది వ్యాపారస్తులు భారతదేశాన్ని హస్తగతం చేసుకొని రెండు వందల సంవత్సరాలు పరిపాలించారు. ఈ పరిస్థితి దాపురించడానికి కారణం స్వదేశీ రాజుల అనైక్యత, అవినీతి, అసమర్థత, దురాశ, భోగలాలసలు కాక ఇంకేమిటి?

ఈనాటికి భారత రాజకీయాలలో అవే లక్షణాలు అంతకు మించిన స్థాయిలో కనిపిస్తున్నాయి. ఆనాటిలాగానే ఈనాడు కూడా అనేక ఇతర దేశాలు వాణిజ్య వ్యూహాలతో భారతదేశంలో ప్రవేశించాయి, ఇంకా ప్రవేశిస్తూనే ఉన్నాయి. ప్రజలు కూడా నాలుగువందల రాజకీయ పార్టీలుగా, అనేక కులాలుగా, మతాలుగా విడివడి ఉన్నారు. ఆనాడు అంతే సుమారు 500 దేశాలుగా విడివడి ఉన్నారు. ఆనాడు అనేక మంది వీరుల బలిదానంతో మహాత్మాగాంధీ సారథ్యంలో శాంతియుత పోరాటంతో 1947 ఆగష్టు 15వ తేదీన స్వాతంత్ర్యం సాధించుకున్నాం. క్రీ.శ. 1600 సంవత్సరం డిసెంబరు 31వ తేదీన జాయింట్ స్టాక్ కంపెనీగా ఇంగ్లాండులో రిజిస్టర్ అయిన ఈస్ట్ ఇండియా కంపెనీ క్రీ.శ. 1750 సంవత్సరం కల్లా భారత దేశాన్ని రాజకీయంగా పూర్తిగా ఆక్రమించింది. అంటే 150 సంవత్సరాల సమయం పట్టింది. మరి ఇప్పుడేం జరుగుతుందో వేచి చూడాల్సిందే. ఆ విషయం వివరంగా ముందుముందు చర్చిద్దాం.

స్వాతంత్ర్యం రాకముందు, రాచరిక పాలనలో రాజ్యసాధన తంత్రమంటే కుట్రలు, కుతంత్రాలు, లక్షలాది మంది తలలు తెగ నరకడమే. యుద్ధమంటే అదేకదా! ఆ మారణ హోమానికి ముద్దు పేరు వీరత్వం. రాజ్యం వీర భోజ్యం అంటూ సమర్థించుకునేవారు. ఆ మారణ హోమంలో లక్షలాది మంది సామాన్య ప్రజానీకం, సైనికులు హతమయ్యేవారు. ప్రజల ధన, మాన ప్రాణాలు

మంటల్లో మాడి పోయేవి. రాజ్య కాంక్షతో పరాయి వారినే కాక స్వంత తండ్రులు, కొడుకులు, సోదరులు సైతం ఒకరినొకరు చంపుకున్న ఉదంతాలు చరిత్రలో కోకొల్లలు. ముఖ్యంగా విదేశీ రాజులు విజయం సాధించినప్పుడు ఓడిపోయిన రాజుల తలలు నరికి కోట గుమ్మానికి వ్రేలాడగట్టిన సందర్భాలున్నాయి. వారి భార్యలను చెరబట్టి వారి సంతానాన్ని శత్రుశేషం ఉండరాదనే సిద్ధాంతం వల్లెవేసి సంహరించిన సందర్భాలున్నాయి. ఇప్పుడా పరిస్థితి పోయి రాజ్యాధికార మార్పిడికి ప్రజాస్వామ్య విధానాన్ని ఎంచుకున్నాం. ఈ విధానంలో ప్రజల తలలు తెగిపడేది లేదు. క్షత్రియుల ప్రాణ త్యాగాలతో పని లేదు. ఈ విధానంలో ప్రజలను అజ్ఞానంలో ఉంచి, సమస్యలలో ముంచి రాజ్యం సాధించుకోవటమే లక్ష్యం. డబ్బు, దౌర్జన్యం, కుల, మత, ప్రాంత, భాషా విబేధాలు ఆయుధాలుగా అంది వచ్చాయి.

వైదిక జాతికి తెలిసిన మొదటి భాష అమరం. వ్యాసుడు అమరాన్ని సంస్కరించడం ద్వారా సంస్కృత భాషను సృష్టించాడు. సంస్కృత భాష కొన్ని వేల సంవత్సరాలు చతుస్సాగర పర్యంతం కల భూభాగంలో అమలులో వున్నది. ఆ తరువాత అనేక ప్రాంతాలలో సమగ్రంగా లేని ప్రాతీయ భాషలు వాడుక పదాలతో సంస్కృతాన్ని మేళవించి, ప్రాంతీయ భాషలను ఆయా ప్రాంత ప్రజలు అభివృద్ధి చేసుకొని ఉండి ఉండవచ్చు. ఎందుకంటే సంస్కృతాన్ని ఉపయోగించిన జాతుల, రాజుల, చక్రవర్తుల ప్రాబల్యం పోయి ఇతర రాజుల ప్రాబల్యం పెరిగినప్పుడు అట్టి ప్రాంతీయ రాజులు వారి ప్రత్యేక భాషను, సంస్కృతిని, సాహిత్యాన్ని, విజ్ఞానాన్ని అభివృద్ధి చేస్తూ గతాన్ని ఆనవాళ్లు లేకుండా చేస్తారు. అంటే ఆ ప్రాంతంపై తమదైన ముద్ర వేస్తారు. తమ వంశ పాలనకు శ్రీకారం చుడతారు. తమకంటూ ఓ కులాన్ని ఏర్పాటు చేసుకొని దానిని బలోపేతం చేస్తారు. భారతదేశంలోని అనేక కులాలు అలా ఏర్పడ్డవే. ఒక్కమాటలో చెప్పాలంటే ఈనాటి రాజకీయ పార్టీల వంటివే ఆనాడు ఏర్పడ్డ అన్ని ముఖ్యమైన కులాలు.

ఆనాడైనా, ఈనాడైనా పాలకుల ప్రవర్తన అలాగే ఉంటుంది. ఒక పాలకుడు తహసీళ్లు, శాసన మండలి, ఆస్థాన పదవులు రద్దు చేసి మండలాలు ఏర్పాటు చేస్తే మరొక పాలకుడు మండలాలు రద్దు చేసి తహసీళ్లు, శాసనమండలి,

ఆస్థాన పదవులు పునరుద్ధరించినట్లు, ఒకరు చెరువులు పాడు పెడితే మరొకరు చెరువులు పునరుద్ధరించినట్లు, ప్రతి పాలకుడు భాషా, సంస్కృతి, సాంప్రదాయాలలోను పరిపాలనా విధానాలలోను తనదైన ముద్ర వేస్తూ గతాన్ని మరిపించే ప్రయత్నం చేస్తూ ఉంటాడు. అందువల్లనే భారతదేశంలోని అన్ని భాషలు అలాగే భారతదేశపు ఇరుగు పొరుగు అనేక దేశాలలోని భాషలలోను సంస్కృత పదజాలం కనిపిస్తూనే ఉంటుంది. అలాగే హిందూ దేవాలయ అవశేషాలు పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, శ్రీలంక, ఇండోనేషియా, కంబోడియా, మలేషియా వంటి అనేక దేశాలలో కనిపిస్తూనే ఉంటాయి. అందుకే సంస్కృతాన్ని అనేక భాషలకు మాతృక అనవచ్చు. కాలాంతరంలో భాషలలో వచ్చిన పరిణామాలు గమనించాం. అలాగే నాట్యరీతులలోను, సంగీత సాంప్రదాయాల లోను తరతరాలుగా వస్తున్న మార్పులను మీరు గ్రహించవచ్చు.

వేల సంవత్సరాలుగా విదేశీ పాలనలో స్వదేశీ పరిజ్ఞానము, భాష, ఆచార వ్యవహారాలు కొంతవరకు కనుమరుగయ్యాయని భావించవచ్చు. ఏ జాతి మరొక జాతిపై విజయం సాధించినా, ఓడిపోయిన వారి వ్యవస్థలను, బాషను, సంస్కృతిని విచ్ఛిన్నం చేసి తమ వాటిని రుద్దే ప్రయత్నం చేస్తారు. ఉర్దూ, ఇంగ్లీషు మరియు కొన్ని భాషలు భారతదేశంలో అలా వచ్చి చేరినవేకదా. ఒక ముఖ్యమంత్రి ఆస్థాన పండితుల, గాయకుల పదవులను రద్దు చేశాడు. మరొక ముఖ్యమంత్రి అధికారం సాధించగానే తిరిగి తహశీల్దారులను ఏర్పాటు చేశారు. మండలిని పునరుద్ధరించాడు. ఎన్.టి.ఆర్. ఎయిర్‌పోర్టును రద్దుచేసి రాజీవ్ గాంధీ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టు ఏర్పాటు చేశారు. ఇలా ప్రజాస్వామ్యంలోనే, స్వదేశీ నాయకుల మధ్యనే, ఇంతటి వైరుధ్యం ఉండి పరస్పర వ్యతిరేకతలకు దారి తీస్తున్నదంటే పూర్తి విదేశీయుల దండయాత్రల తర్వాత ఎంతటి మారణహోమం జరిగి ఉంటుందో, ఎంతటి అరాచకత్వం మరియు వ్యవస్థల ఛిద్రం జరిగివుంటుందో ఊహించడం కష్టం కాదు. సనాతన భారతీయ విజ్ఞానం ఈ విధంగానే నాశనమైంది.



# 8. ప్రజలు చెడుగైన ప్రభుత్వ తప్ప మీరేమంటారు?

ఏ వ్యవస్థ అయినా, ఏ మార్పు అయినా, ఏ సంస్కరణ అయినా ఆవిర్భావం ఆనాటి సమాజ పరిజ్ఞానం మేరకు సదుద్దేశంతోనే జరుగుతుంది. అవి సమాజంలో ఎవరి యొక్క స్వీయ అభీష్టమూ కాదు. చిక్కంతా ఎక్కడంటే కాలానుగతంగా సంస్కరణలు కూడా మార్పుకు గురౌతాయి. అప్పుడు మార్పు మరలా అనివార్యమవుతుంది. ఉదాహరణకు ఎంతో అభివృద్ధి చెందిన ఆధునిక సమాజంలో కూడా ఆవిష్కరించబడ్డ చట్టాలను మనం చూసినట్లైతే భారత రాజ్యాంగంతో సహా అవి అనేక మార్పుచేర్పులకు లోనౌతున్నాయి. సంస్కరణలలోని లొసుగులు బయట పడుతూనే ఉంటాయి. వాటిని ఉయోగించుకునే వ్యక్తులు పుట్టుకొస్తూనే ఉంటారు. అందుకే గత కాలాన్ని గత కాలపు పరిస్థితులను వాటికి కారకులు అయిన వారిని ఇప్పుడు నిందించడం తగదు. ఇప్పుడున్న పరిస్థితుల్లో ఏది సరియైనదో ఏది సమాజానికి హితమైనదో దాని కొరకు మాత్రమే ప్రయత్నించాలి. వారే నిజమైన సంఘసంస్కర్తలు. ఎవరినో ఒకరిని లేదా ఒక వర్గాన్ని విమర్శిస్తూ గత పరిస్థితులకు వారిని బాధ్యులను చేస్తూ ప్రతీకారం తీర్చుకోవాలని ప్రభోదించే పెద్ద మనుషులను సంఘ విద్రోహులు అనడానికి నేను సంకోచించను. ఎందుకంటే దేశ కాల మాన, సంస్కృతీ సాంప్రదాయాల, సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల సమాహార స్వరూపమే సమకాలీన సమాజం. అందులోని తప్పొప్పులకు సమాజంలోని ఏ ఒక్క వ్యక్తిని గాని, వర్గాన్నిగాని నిందించడం అవివేకం. ఎవరినైనా నిందించవలసి వస్తే ఆనాటి పాలకులనే.

సంస్కరణలకు ఎవ్వరూ వ్యతిరేకులు కారని గుర్తుంచుకోవాలి. ఒకే సమకాలీన సమాజంలో అనేక రకాల ప్రజలుంటారు. వారి తెలివితేటలలో,

వివేకంలో, అవకాశాలలో, నిజాయితీలో వ్యత్యాసాలుంటాయి. అందువల్ల అదే సమాజంలో అనేక దురలవాట్లు, ఆచారాలు, అనాచారాలు, దురాచారాలు ఉంటాయి. నమ్మకాలు, అపనమ్మకాలు, వైవిధ్యాలు ఉంటాయి. అన్నీ కలగలిపిన సమాహార స్వరూపమే సమకాలీన సమాజం. సర్వజన సమ్మతమైనవి లేదా ప్రభుత్వ చట్టాల ద్వారా క్రమబద్ధీకరించబడినవి నిలుస్తాయి. లేనివి మెల్లగా నశిస్తాయి. నిలిచిన సాంప్రదాయాలన్నీ మంచివని కాదు. పోయినవన్నీ చెడువనీ కాదు. సర్వజనానీకానికి, సర్వకాలాలకు గౌరవించదగ్గ సామాజిక సిద్ధాంతాలు ఉండవు. సామాజిక ప్రాధాన్యతలో మార్పులూ ఉంటాయి. మేధావులైన వారు ఇది గ్రహించి సాంఘిక ఆచారాలైనా, దురాచారాలకైనా ఏదో ఒక వ్యవస్థనో, కులాన్నో, మతాన్నో దోషిగా చిత్రీకరిస్తూ సమాజంలో విషం చిమ్మడం తగిన పనికాదు. ఈనాడు మనం ప్రజాస్వామ్యంలో ఉన్నాం. విజ్ఞాన పరిధులు విస్తరించాయి. బలమైన రాజ్యాంగ వ్యవస్థలు ఉన్నాయి. వాటిని కాలరాస్తున్న దుర్మార్గపు వ్యక్తులు ఉన్నారు. వీరిని దోషులుగా పరిగణించి సమాజ సంస్కరణకు మాత్రమే మేధావులు దృష్టి సారిస్తే సమాజం బాగుపడుతుంది.

ఈ రోజు ప్రపంచ మానవ సమాజాన్ని, ముఖ్యంగా భారత సమాజాన్ని పట్టిపీడిస్తున్న సమస్య సెక్స్. పసిపిల్లల మీద, వృద్ధుల మీద కూడా లైంగిక దాడులు జరుగుతున్నాయి. వయసులో ఉన్న అవివాహితుల మీద, వివాహితుల మీద కూడా అత్యాచార ప్రయత్నాలు జరుగుతున్నాయి. విద్యాలయాలలోను, ఉద్యోగ ప్రదేశాలలోను, స్త్రీ పురుషులు కలిసి మసలుతున్న ప్రతి సందర్భంలోను ఇలా అక్కడ ఇక్కడ అనకుండా ప్రతిచోట లైంగిక దాడులు, అసభ్య ప్రవర్తనలు చోటు చేసుకుంటున్నాయి. అత్యాచారాలు, హత్యలు కూడా నిత్యకృత్యమైనాయి. ఇలాంటి పనులు ఎవరు చేస్తున్నారని విచారిస్తే మైనర్లనుంచి వృద్ధుల వరకు వుంటున్నారు. పేదలూ, ధనికులూ ఉంటున్నారు. బాధితులు కూడా పసిమొగ్గల నుండి పండు ముదుసలి వరకూ ఉంటున్నారు. అజ్ఞానుల నుంచి అవధానుల వరకూ ఉంటున్నారు. వీధిరౌడీలు, వ్యాపారస్తులు, ఉద్యోగులు, పండితులు, పామరులు, శాసన కర్తలూ, మంత్రులూ, గవర్నర్లూ కూడా లైంగిక దుష్ప్రవర్తనకు మినహాయింపుగా లేరు. ఈ కులం ఆ కులం అన్న భేదం లేదు. అన్ని కులాల్లో ఉన్నారు. ఈ విషయంలో పల్లెలూ, పట్టణాలు, నగరాలన్న భేదం లేదు. ఇవన్నీ

మనకు తెలిసేవి. తెలియకుండా చాటుమాటుగా ఎంత పెద్ద ఎత్తున వ్యభిచారం జరుగుతున్నదో తెలుసుకోవాలంటే ఈ ఘటనలన్నీ అతి చిన్న సూచికలేనని నా అభిప్రాయం.

స్త్రీల కోసం రాజ్యాలు పోగొట్టుకున్న రాజులున్నారు. లైంగిక వాంఛతో కుటుంబాలు కూలదోసుకుంటున్నారు. ఆరోగ్యం నాశనం చేసుకుంటున్నారు. నచ్చిన పిల్ల తిరస్కరిస్తే గొంతులు కోస్తున్నారు. అపహరణలకు, కిడ్నాపులకు హత్యలకు పాల్పడుతున్నారు. ఇది డబ్బు, హోదా లేని యువకులు, పేదవారు చేసేపని. అవకాశాలున్నవారు హాయిగా అనుభవిస్తూనే ఉన్నారు. గ్లామర్ పరిశ్రమలో ఉన్న వారైతే ఎవరు ఎవరితో డేటింగు చేస్తున్నారో పత్రికలలో వ్రాస్తుంటారు. అవి చదివి పాఠకులు పెదవులు తడుపుకుంటూ ఉంటారు.

ఇంతటి విస్తృతమైన ప్రభావం గలిగిన సమస్య పట్ల ప్రభుత్వ దృక్పథం ఏమిటి? వారి అవగాహన ఏమిటి? విధానమేమిటి? ఏదైనా ఘోరమైన అత్యాచారం, హత్య జరగ్గానే మహిళా సంఘాలు ముందుకొచ్చి మృగాళ్ళను ఉరేయాలంటారు. రాజకీయ నాయకులు గొంతు కలిపి ఉరెయ్యాల్సిందే అంటారు. ఇలా ఎవరి పాత్ర వారు పోషించి నిష్క్రమించే వారే. ఆ తర్వాత ప్రేక్షకులు, శ్రోతల్లా ప్రజలు ఎవరిపనుల్లో వారు నిమగ్నమవుతారు. దీనిపై సంఘసంస్కర్తలు మనసు విప్పి, గొంతు పెంచి ఎందుకు చర్చించరు? రాజకీయ నాయకులు చట్టసభల్లో చర్చించి ఈ సంఘటనలను అరికట్టడానికి చట్టాలనెందుకు చేయరు? అసలీ పరిస్థితులకు దారితీస్తున్న అంశాలేమిటి? మౌనాన్ని ఛేదించాలి. ఆత్మవంచన విధానాలను విడిచిపెట్టాలి. వాస్తవాలను గుర్తించాలి. అత్యాచార నిందితులను ఉరెయ్యాలంటూ ప్రధాన మంత్రులు సైతం తీవ్ర పదజాలం వాడటం నియంత్రించలేని తమ అసమర్థతను ప్రకటించుకోవటమే తప్ప మరొకటి కాదు. నిద్ర నటించవద్దు.

నా దృష్టిలో లైంగిక నేరాలకు కారణం కామం. ఇది సహజమైనదే. భగవంతుడిచ్చిన వరమే. మానవ హక్కులలో భాగమే. సరిగా ఉపయోగించుకోలేక ఇబ్బందులు పడుతున్నాం. ఐతే స్వలింగసంపర్కం మాత్రం ఐ.పి.సి. 377 ప్రకారం శిక్షార్హమైన నేరం. స్వలింగ సంపర్కమూ చట్టబద్ధమేనని మానవ హక్కులలో భాగమేనని కొన్ని కోర్టులు అభిప్రాయపడిన సందర్భాలున్నాయి.

అందుకు ఉద్యమాలు జరగడం కూడా మనం చూస్తున్నాం. ఓటర్లలో వారి సంఖ్య అధికంగా ఉంటే ముందు వెనక చూడకుండా వారికనుకూలంగా చట్టాలు చేయడానికి కూడా మన పాలకులు వెనకాడరు. అవసరమైతే వారే ఉద్యమిస్తారు కూడా.

*కామాతురాణాం నభయం నలజ్జ* అన్నాడు భర్తృహరి. అంటే కామాతురులకు వెరవు, సిగ్గు ఉండవని అర్థం. ఉర్దూలో *గరజ్‌మంద్‌కూ అఖల్ నహీహై* అన్నా అదే అర్థం. పైగా ఈ కామం లక్షణమెలా ఉంటుందంటే, *"కామం ఉపభోగే నశామ్యతి. హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభి వర్ధతే"* అంటే కామం అనుభవించిన కొలది అంతకంతకు అధిగమించునే కాని ఉపశమించదు. అగ్నిలో ఆజ్యం పోసినట్లు వృద్ధి చెందుతుందని అర్థం. ఈ మన్మథతాపం నుంచి విశ్వామిత్రాది మునులు, ఇంద్రాది దేవతలు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే తప్పించుకోలేక పోయారు. ఇక మానవ మాత్రులెంత? త్యాగరాయస్వామివారే అన్నారు. ఎంతవారలైన కాంతాదాసులే అని. అలాగే కృష్ణ దేవరాయలు పండిత సభలో స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి *పలుకులకేల కలిగెనో ఈ అతులిత మాధురీ మహిమ* అంటే *సుకుమార వారవనితా జనతా ఘన తాపహరి సంతత మధురాధరోదిత సుధారస ధారల గ్రోలుటంజుమీ* అని తెనాలి రామలింగ కవి చమత్కరించాడట. అది చమత్కారమైనా ధైర్యంగా రాజాస్థానంలోనే ప్రకటించడం గమనార్హం.

దీనిని బట్టి ఆ కాలంలో కూడా వార వనితలున్నారని అర్థమౌతున్నది. ఆ కాలంలోనే కాదు అన్ని కాలాల్లోను వార వనితలున్నారు, జార వనితలున్నారు. అలాంటి వారే పురుషులూ ఉన్నారు. వేశ్యావృత్తిని అత్యంత పురాతన మానవ వృత్తిగా వర్ణిస్తారు. అనేక పట్టణాల్లో భోగం వారి పేరుతో బజార్లు, పేటలు ఉండటం మనం గమనించవచ్చు. ఉదాహరణకు హైదరాబాదులో బొగ్గులకుంట, ఖమ్మంలో బోగం బజార్, సత్తుపల్లిలో వేశ్యకాంతల చెరువు ఇలా ప్రతి గ్రామంలోను, పట్టణంలోను, నగరంలోను భోగం వారి ఉనికిని తెలిపే ప్రాంతాలుంటాయి. అలాగే కొన్ని గ్రామాలు, పట్టణాలు వేశ్యా వృత్తికి ప్రసిద్ధి చెంది ఉంటాయి. ఉదాహరణకు పెద్దాపురం, మండపేట ఇలా ఇంకా అనేక ప్రాంతాలు ప్రసిద్ధి చెంది ఉన్నాయి. దీనిని బట్టి వేశ్యావృత్తి ఒకప్పుడు

సంఘం అంగీకరించిన వృత్తిగా కనిపిస్తుంది. ఈ వృత్తిని దురాచారంగా భావించి రూపుమాపే ప్రయత్నాలు అనేకం జరిగాయి. సంఘ సంస్కర్తలు రంగంలోకి దిగి సామాజిక ప్రచారం నిర్వహించారు. ప్రభుత్వం చట్టాల ద్వారా నియంత్రించే ప్రయత్నం చేసింది. ఒక సహజ సిద్ధమైన అవసరాన్ని, కోర్కెను పూర్తిగా చట్టం ద్వారా నియంత్రించడం అసాధ్యమని నా అభిప్రాయం. ధర్మప్రబోధాలు, కుటుంబ కట్టుబాట్లు, సామాజిక నియంత్రణ, ప్రభుత్వ నియంత్రణ, కఠినమైన చట్టాలు, వీటన్నింటిని చిత్తశుద్ధితో అమలు చేయడం ద్వారా మాత్రమే లైంగిక నేరాల సంఖ్య, తీవ్రత తగ్గుతాయని నా అభిప్రాయం.

అలాగే పిల్లల పెంపకంలో తల్లిదండ్రులు కూడా బాధ్యతగా మెలగవలసిన అవసరం ఉంది. ఆవు చేనులో మేస్తే దూడ గట్టున మేస్తుందా? అన్నట్లు ముందుగా తల్లిదండ్రులు నిజాయితీగా వ్యవహరిస్తూ సంతానానికి ఆదర్శంగా నిలవాలి. పిల్లల కదలికలను అనుక్షణం గమనిస్తూ ఉండాలి. ఈ విషయంలో కూడా శాస్త్రోక్తి ఉంది. పిల్లలకు ఐదు సంవత్సరాల వయసు వచ్చే వరకు దేవునిలా చూడాలి. ఐదు నుంచి పదకొండు సంవత్సరాల వరకు రాజువలె చూడాలి. పదకొండు నుండి పదహారు సంవత్సరముల వయసు వరకు సేవకునివలె చూడాలి. *ప్రాప్తేషు షోడశ వర్షే పుత్రం మిత్ర వదాచరేత్* అంటే పదహారు సంవత్సరముల వయసు నుండి కుమారుని మిత్రునివలె చూడాలని అర్థం.

ఈ రోజుల్లో లభ్యమవుతున్న స్మార్ట్‌ఫోన్లు, విశ్వవ్యాప్త అంతర్జాలం కారణంగా గూగుల్ ధర్మమా అని పసిపిల్లలు సైతం పచ్చి శృంగార నీలి చిత్రాలు చూడగలుగుతున్నారు. ఈ ఒక్క కారణంగానే అనేక మంది పసిపిల్లలు మానసిక వ్యాధులలో పిచ్చాసుపత్రులలో జాయిన్ అవుతున్నారు. విదేశాలలో ఇంత విచ్చలవిడితనం లేదు. ఇక్కడ ప్రభుత్వ నియంత్రణ లేదు. పెద్దల అజమాయిషీ లేదు. వెరసి బాలల జీవితాలు బుగ్గిపాలవుతున్నాయి. పిల్లలు ఏ విషయంపై ఎక్కువ సమయాన్ని గడుపుతున్నారు? ఏ ప్రదేశంలో గడుపుతున్నారు? ఎవరితో గడుపుతున్నారు? ఏకాంతంగా గడుపుతున్నారు? సమయానికి తిండి, నిద్ర, చదువుకోవడం, ఆడుకోవడం చేస్తున్నారా? ఇవి పెద్దలు అనునిత్యం గమనించాలి. ప్రతి రోజూ ప్రేమపూర్వకంగా మాట్లాడటం,

తినిపించడం ముఖ్యంగా ప్రేమగా శారీరకంగా స్పృశించాలి. ఈ ప్రేమే వారిని ఉత్తమ పౌరులుగా, బాధ్యత గలిగిన సంతానంగా తీర్చిదిద్దుతుంది. విద్యాలయాలలో ఎలాగూ శిక్షణ సాంకేతికమే.

ప్రస్తుతమున్న చట్టాలను కూడా కఠినంగా అమలు చేయకపోవడం, అధికారంలో ఉన్న వారికి అధికారులు వత్తాసు పలకడం వల్ల కూడా సాక్షాత్తు శాసనసభ్యులు, వారి కుటుంబీకులు కూడా నిర్భయంగా లైంగిక నేరాలకు పాల్పడుతున్నారు. స్త్రీల రక్షక చట్టాలను అమలు చేయడంలో వివక్ష లేకుండా కఠినంగా ప్రభుత్వాలు ప్రవర్తిస్తే కూడా ఈ రంగంలో నేరాల సంఖ్య తగ్గుతుంది. అలాగే స్త్రీల రక్షణలో నేర పరిశోధన, న్యాయస్థానాలలో విచారణకు సంబంధించిన విధి విధానాలను సాధారణ నేర పరిశోధన, విచారణల నుంచి భిన్నంగా స్త్రీల గౌరవ మర్యాదలకు, సౌకర్యాలకు భంగం రానివిధంగా నిర్మించవలసిన అవసరం ఉంది. వ్యభిచారము, పరదారా గమనం వంటి చట్టాల క్రింద స్త్రీలకు శిక్షలు పడినా పడకపోయినా లేదా అతి తక్కువ అపరాధ రుసుము చెల్లించే కేసులలో కూడా వారికి జరిగే అవమానం, అసౌకర్యం, పరువునష్టం వర్ణనాతీతం. దీనివలన కూడా అనేక మంది స్త్రీలు వారికి అన్యాయం జరిగినా ప్రభుత్వ శాఖలను నమ్మి న్యాయస్థానాల తలుపులు తట్టలేకపోతున్నారు.

లైంగిక నేరాలకు మరో కారణం అవసరం. ఏ అవసరం కారణంగానైనా చట్టాన్నతిక్రమించడం ఇతరుల స్వాతంత్ర్యాన్ని, సుఖాన్ని, మానవ హక్కులను కబళించే హక్కు మాత్రం ఎవ్వరికీ లేదు. ధర్మాకామ మోక్షములను చతుర్విధ పురుషార్థములలో కామమే శక్తివంతమైనది. లైంగిక నేరాలకు మరోకారణం అనేక మంది యువతీ యువకులు అవివాహితులుగా మిగిలిపోవడం లేదా వయసు మీరే వరకు వివాహయోగం లేకపోవడం. కొందరు కురూపం వల్ల, కొందరు అంగవైకల్యం వల్ల, కొందరు సంపాదనలేక, స్వంతకాళ్ళ మీద నిలబడలేనితనం వల్ల, కొందరు తమని పట్టించుకొని వివాహం చేయగల పెద్దలు లేకపోవడం వలన అవివాహితులుగా సంపూర్ణ జీవనమో అర్ధ జీవనమో అవివాహితులగా గడపవలసి వస్తున్నది. అలాగే వివిధ కులాల, మతాల భిన్నత్వం కూడా స్త్రీ పురుషుల మధ్య వైవాహికబంధం ఏర్పడడానికి అడ్డుగోడలుగా నిలుస్తున్నాయి. ఆర్థిక అసమానతలు, యువతీ యువకుల ఆశల మధ్య పొంతన

లేకపోవడం మరో కారణం. వివాహమైన వారి మధ్యలో వారి ఆరోగ్యాల స్థాయిలో అంతరాలుండవచ్చు. సుదూర ప్రాంతాలలో విడివిడిగా నివసిస్తూ ఉండవచ్చు. అలాగే వారిలో కోర్కెల తీవ్రతలలో భేదం ఉండవచ్చు. కొందరి శరీరతత్వాన్ని బట్టి అతియైన కోర్కెలు, కొందరిలో అతి తక్కువగా కోర్కెలుండటం, అసలు లేకపోవడం జరుగవచ్చు. అటువంటి సందర్భాలలో భార్యా భర్తల మధ్య అసంతృప్తి, ఘర్షణలు, విడాకులు లేదా జీవిత భాగస్వాములలో ఎవరో ఒకరు ప్రక్కదోవ పట్టడం జరుగుతుంది. నేను 1978లో డిగ్రీలో అర్థశాస్త్రంలో జనాభా పెరుగుదల గురించి చదివాను. జనాభాలో ప్రతి వేయిమంది మగవారికి 934 మంది స్త్రీలే ఉన్నారని, ఈనాటికి కూడా అదే నిష్పత్తి కొనసాగుతున్నది. అంటే ప్రతి వేయిమంది పురుషులలో 66 మంది అవివాహితులుగా ఉండిపోవలసిందే గదా!

వృత్తి, ఉద్యోగ ఒత్తిడులు కూడా బలహీనమైన లైంగిక సంబంధాలకు దారితీస్తాయి. కంప్యూటర్ యుగంలో పనులలో వేగం పెరిగింది. సమాచార వేగం పెరిగింది. వ్యక్తులపై ఒత్తిడి పెరిగింది. గతంలో ఉత్తర ప్రత్యుత్తరాలతోను, లాండ్‌లైన్ టెలిఫోన్లతోనే కమ్యూనికేషన్ జరిగేది. ఇప్పుడు సెల్‌ఫోన్లు, సర్వవ్యాప్త ఇంటర్నెట్ సౌకర్యం వల్ల సమాచారం అన్ని వైపుల నుంచి తక్షణమే అందుతోంది. సమాచారమందుకొన్న మెదడు ఊరుకోదు కదా! దాని విశ్లేషణ, అనుచరణ, తిరిగి కమ్యూనికేట్ చేయడం అవసరమౌతుంది. దీనివల్ల మెదడు అతిగా వినియోగింపబడుతున్నది. ప్రకృతిపరమైన స్త్రీ పురుష సహజ సంబంధాల గురించి ఆలోచించే సమయం లేకపోతున్నది. దీనిని బట్టి కూడా సహజ సాంసారిక సంబంధాలు దెబ్బతింటున్నాయి. అతిగా వాణిజ్యీకరించబడి, అతిగా కంప్యూటర్లుపయోగించే జపాన్, సింగపూర్ వంటి దేశాలలో జనాభా పెరుగుదల రుణాత్మకంగా ఉంది. అక్కడి స్త్రీ పురుషులకు సంసారం రెండో ప్రాధాన్యత. జన సంఖ్యను పెంచుకోవడానికి అక్కడి ప్రభుత్వాలు అనేక పథకాలు ప్రవేశపెడుతున్నాయి. ఐదు రోజుల పని దినాలు, భార్య ప్రసూతికి భర్తలకు సెలవులు, కన్న వారికి కానుకలు అందిస్తున్నాయి. ఈ మధ్య కృత్రిమ గర్భధారణ విధానాలు, అద్దె గర్భ విధానాలు, కృత్రిమంగా సంతానోత్పత్తి చేసే సౌకర్యాలు

కూడా కుప్పలు తెప్పలుగా వస్తున్నాయి. ఇదే సమస్య భార్యభర్తలు ఇద్దరిలోను ఉంటే బాధేలేదు. సమస్య భార్యాభర్తల్లో ఒక్కరికే ఉంటే అదీ సమస్యే.

ధూమపానము, మద్యపానము, జంకు ఆహారపానీయాల వినియోగం, అర్ధరాత్రి ఉద్యోగాలు, రేడియేషన్, రకరకాల శబ్ద, జల, వాయు ఆహార కాలుష్యాలు, రసాయన ఎరువులు, పురుగు మందులు, నిల్వ ఉంచే రసాయనాలు అధికంగా వాడిన ఆహార పదార్థాల వినియోగం మానవుల సహజ శృంగారాసక్తిని, శక్తిని తగ్గిస్తున్నాయి. ఈ ప్రభావం పురుషులపైనే ఎక్కువగా ఉంటుంది. గతంలో ఒక ఒంపో, సొంపో, చిరునవ్వో, చీరకొంగో, ఒక తలపో, ఒక పలకరింపో కూడా యువతను పిచ్చెక్కించేవి. నేటి యువత వాటన్నింటికీ కూడా అతీతమైపోతున్నారు. మనసులు మొద్దుబారుతున్నాయి. వారి మధ్య సున్నితమైన శృంగార భావనగానీ, మోహంగానీ లేకపోతే ప్రేమ పటాపంచలైపోతుంది. పెళ్ళి పెటాకులవుతుంది. చిన్న చిన్న మాటపట్టింపుల వద్ద కూడా విడిపోతారు. ఎందుకంటే వారికి పైన తెలిపిన కారణాల వల్ల కలిసుండడానికి, విడిపోవడానికి పెద్దగా భేదంలేదు. ఎవరి సంపాదన వారికి ఉండనే ఉంది.

ఆర్థికావసరాలలో నిస్సహాయ స్థితిలో కడుపు నింపుకోవడానికో, తల్లిదండ్రులను బ్రతికించుకోవడానికో, తమ్ములను చదివించుకోవడానికో ఇతర మార్గం లేక శరీరాన్నమ్ముకోవడానికి సిద్ధపడ్డ స్త్రీని వేశ్య అని సమాజం చిన్న చూపు చూస్తుంది. పోలీసులు హింసిస్తారు. చట్టాలు శిక్షిస్తాయి. శిక్షించండి. కాదనను కానీ ఒక నిస్సహాయ యువతికి ఆ ఖర్మ ఎందుకు పట్టింది? ప్రభుత్వాలు ఆలోచించవలసిన అవసరం లేదా? ఏ యువతికి కోరికలుండవు కలల రాకుమారుని భర్తగా పొందాలని? ఏ యువతి కోరుకుంటుంది చీకటి బజార్లలో మ్రగ్గి చనిపోవాలని? ఏ యువకుడు కోరుకోడు తనకంటూ ఒక కుటుంబం, ఒక జీవనం కావాలని? ప్రజలు మానమర్యాదలతో బ్రతకడానికనువైన సమాజాన్ని సృష్టించడంలో ప్రభుత్వాలు విఫలమయ్యాయని అర్థం కావట్లేదా? ఈ దరిద్ర సమాజంలో స్త్రీలు శరీరాలనే కాదు, పురుషుడై పుట్టినందుకు కిడ్నీల వంటి శరీర భాగాలనే అమ్ముకోవడానికి సిద్ధపడుతున్నారు. లక్షలమంది ఆర్థికావసరాలతో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

ఒక నటి మరొకరితో డేటింగ్ చేస్తున్నదని బ్రేకింగ్ న్యూస్‌లా ఇస్తారు. అదే మరొక నటి ఎవరితోనే ఉండగా పోలీసులకు పట్టుబడిందంటారు. ఏమిటీ వ్యత్యాసం? చట్టాలేం చెబుతున్నాయి? ఎలా అమలవుతున్నాయి? అర్థం చేసుకోవాల్సిన అవసరముంది. స్త్రీ అనుమతి లేకుండా ఆమె శరీరాన్ని తాకడం నేరం అని కోర్టులు చెబుతున్నాయి. అంటే ఆమె శరీరంపై ఆమెకు మాత్రమే హక్కులున్నాయనేగదా! ఆమె శరీరాన్ని మరొకరితో ఇష్టపూర్తిగా పంచుకున్నా కులట అని కోర్టులో నిలబెట్టి తప్పేస్తున్నారేమిటి మరి? ఆమె మరొకరితో గదిలో ఉంటే తొంగిచూడవలసిన అవసరం పోలీసువాడికేముంది? కూడళ్ళలో నిలబడి విటులనాహ్వానించడం నేరం. వ్యభిచార గృహాలు నడపడం నేరం. లైంగిక వేధింపులు నేరం. రేప్ నేరం. వాటినరికట్టాలి. అలాంటి అవసరాలు లేని సమాజాన్ని నిర్మించాలి. లేదా లైంగిక అవసరాలు క్షేమంగా, చట్టబద్ధంగా తీర్చుకునే వ్యవస్థనైనా ఏర్పాటు చేయాలి.

అస్తవ్యస్తమైన వ్యవస్థను ఆసరా చేసుకుని దళారులు దాష్టీకాలకు పాల్పడుతున్నారు. ఆ మధ్య ఆంధ్రప్రదేశ్ విడిపోకముందు టీ.విలో ఒక వార్త చూపించారు. ఒక వేశ్యను తొడలు కమిలిపోయేట్లుగా పోలీసులు బూటు కాలితో తన్నిన సంఘటన చూపించారు. మనసు వికలమైంది. పిల్లి కళ్ళు మూసుకుని పాలు త్రాగినట్లు వాస్తవాలు విస్మరించి ప్రభుత్వాలు నిద్ర నటిస్తే ఎలా? పట్టుబడని సామాజిక కార్యకర్తలు నీతులు వల్లిస్తే ఎట్లా? సినీ పరిశ్రమలో ఎవరో ఒక్క స్త్రీని యువరాణిలా చూస్తే సరిపోదు. మరొకరు సంపాదించుకొని బెంజి కార్లో తిరిగితే సరిపోదు. అభివృద్ధికి, సమన్యాయానికి సినీ పరిశ్రమలో అవి మాత్రమే మచ్చుతునకలు కావు.

ఒక శ్రీరెడ్డి కథ ఏమిటి? ఆమెలాంటి అనేకమంది యువతీ యువకుల పరిస్థితి ఏమిటి? ఆమె సిగ్గు విడిచి గొంతెత్తి ఏం చెబుతున్నది? అర్థం చేసుకోవలసిన అవసరం లేదా! అంతా ఓకే అని ఆత్మవంచన చేసుకుంటే సరిపోతుందా? ఆమే మంచిది కాదు. అలా పబ్లిగ్గా పైట విప్పుకోవడమేమిటి? అని కొందరు ప్రశ్నించడం నేను విన్నాను. వారితో నేను వాదించాను. ఆమె ఎలాంటిదనేది ఇక్కడ అప్రస్తుతం. ఐనా ఎలాంటిది? మర్డర్లు చేసిందా? మానభంగాలు చేసిందా? దోపిడీలు చేసిందా? కళాకారిణిగా మంచి జీవితం

కావాలని ఆశించింది. అందరిలానే ప్రయత్నించింది. పరిశ్రమలో జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను అర్థం చేసుకుని ఎదురు తిరిగి ప్రశ్నించింది. అన్యాయాలకు అక్రమాలకు ఇష్టపడేదైతే అందులోనే ఇమిడిపోయేదే కదా! ఆమె మనోవేదన అర్థం చేసుకోవాలి. ఆమె ఎలాంటిదన్నది కాదుముఖ్యం. ఆమె చెబుతున్నదేమిటన్నది ముఖ్యం.

ఆమె చెబుతున్న విషయాన్నే గతంలో చిన్న నిర్మాతలు, కళాకారులు బాహాటంగానే టీ.విల్లోను, పత్రికలలోను అనేకసార్లు ప్రస్తావించారు. సినీ పరిశ్రమ సౌకర్యాలను, రాష్ట్రంలోని అన్ని సినిమా హాళ్ళను ఐదారు కుటుంబాలే శాసించడం వల్ల చిన్న చిన్న నిర్మాతలు, కళాకారులు నలిగి పోతున్నారని ఆమె చెప్పదల్చుకుంటున్నదని నాకర్థమయింది. అందువల్ల ఇండస్ట్రీ బాస్‌ల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి లేదా రెండవ శ్రేణి పౌరుల్లా గౌరవం, హక్కులు లేకుండా ఇండస్ట్రీలో బ్రతకవలసి వస్తున్నదని ఆమె అభిప్రాయంలా కనబడింది. ఒక స్త్రీ అలా గొంతెత్తి అరిచిందాకా కాదు. అంతకు ముందే పరిస్థితులను అంచనావేసి సరిదిద్ద వలసిన బాధ్యత ప్రభుత్వాలది.

కాంపిటేషన్ కమీషన్ ఆఫ్ ఇండియా వారి వద్ద కేసువేయాలి. ఏ పరిశ్రమలోనైనా గుత్తాధిపత్యాన్ని నివారించడం, అందరికి సమానావకాశాలు కల్పించటం కాంపిటీషన్ కమీషన్ ఆఫ్ ఇండియా వారి విధి. పరిశ్రమలో పోటీ ఉండే విధంగా చర్యలు తీసుకోవలసిందిగా అభ్యర్థించవచ్చు. నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు వారి కుటుంబీకులు, రక్త సంబంధీకులు రాష్ట్రంలో సినిమా హాళ్ళను అద్దెకు తీసుకోకుండా నిరోధించమని అడగవచ్చు. ఎవరైనా అద్దెకు తీసుకునే వారున్నా ఒక్కొక్కరు ఒక్కటి మించి సినిమా హాలు అద్దెకు తీసుకోకుండా కూడా నిరోధించమని అడగవచ్చు.

ఇండస్ట్రీవారు స్వంతంగా ఒక క్రమశిక్షణ సంఘం వేసుకుంటే సరిపోదు. అలాంటి సంఘాలు పరిశ్రమ పెద్దల చెప్పుచేతల్లోనే ఉంటాయి. పరిశ్రమ పెద్దలను కాపాడుతూనే ఉంటాయి. బాధితులకు నయానా భయానా ఎంతో కొంత ఆర్థిక పరిహారం ఇప్పించి విషయం బైటకు పొక్కకుండా మసిబూసి మారేడు కాయ చేయడం జరుగుతుంది. నేరాలు బైటకు పొక్కకుండా ఉంటే సరిపోదు. నేరాలు జరగకూడదు కూడా. సినీ పరిశ్రమ ప్రత్యేక దేశం కాదు.

సమాజంలో అంతర్భాగమే. అందువల్ల అక్కడ సామాజిక మరియు స్థానిక ప్రభుత్వ నియంత్రణ ఉండవల్సిందే. సినీ పరిశ్రమలో కీర్తి, కాంత, కనకం అనే మూడు ప్రలోభాలున్నాయి. అక్కడ ఆకర్షణ ఉంది, అవకాశం ఉంది. ప్రోత్సహించే సంఘటనలూ ఉన్నాయి. అందువల్ల అక్కడ నేరాలు జరిగే అవకాశాలు ఎక్కువ. పరిశ్రమ పెద్దలతోటి, న్యాయకోవిదులతోటి, మహిళా సంఘ సంస్కర్తలతోటి, ప్రభుత్వాధికారులతోటి కలిపి స్వతంత్ర కమిటీ వేయడం అవసరం.

సహజమైన శృంగారవాంఛ తీరనప్పుడు వికృత రూపం ధరించి తీరుతుంది. అందుకు ఉరివేయవలసింది ఆ నేరం చేసిన వారిని కాదు. సరియైన సమాజాన్ని సృష్టించలేని పాలకులను మాత్రమే. ఎప్పుడో పది, పదిహేను సంవత్సరాల క్రితం ఒక బ్రహ్మచారి ప్రధానమంత్రి సెలవిచ్చారు. అలాంటి నేరం చేసిన వారిని ఉరితీయాలని. శిక్షలు వేయడం తాత్కాలిక ఉపశమనానికే. శాశ్వత పరిష్కారానికి మేధావులు ఆలోచన చేయాలి. గాలి బయటకు పోయే మార్గం లేకపోతే ఒత్తిడి ఎక్కువైతే టైరు పేలిపోతుంది. నీరు పోయే దారిలేకపోతే చెరువైనా తెగిపోతుంది. ఆ తప్పు నీటిది, గాలిది కాదు. అజ్ఞానంతో అలాంటి పరిస్థితి సృష్టించిన వారిదే తప్పు. బలం ఉందికదా అని విశృంఖలంగా, పైశాచికత్వంగా లైంగిక నేరాలకు పాల్పడే వారికి కఠినమైన శిక్షలు వేయవలసిందే. దానితోపాటు కళ పేరుతో అంగాగ అర్ధనగ్న ప్రదర్శనలు, డబుల్ మీనింగ్ డైలాగులు నిరోధించవలసిన అవసరం కూడా ఉంది.

లైంగిక నేరం చేసినందుకు చట్టం ముందు అందరూ సమానులే అంటూ పేదవాడికైనా, లక్షాధికారికైనా అదే వేయి రూపాయలు జరిమానా విధించడం సరికాదు. ఆ వేయి రూపాయల విలువ పేద వాడికున్నంతగా ధనికుడికుండదు. ఎవరికైనా అతని యొక్క ఏడాది సంపాదన లేదా అతని ఆస్తిలో పదిశాతం అంటే అప్పుడు సమన్యాయం జరుగుతుంది. కొరడా దెబ్బలో, లేక కాలం కొలత ప్రకారమో వేసే శిక్షలైతే సమంగా విధించినా సమన్యాయమే జరుగుతుంది. ఆర్థిక పరమైన అపరాధ రుసుము విధించవలసి వస్తే నేరస్తుని ఆర్థిక హోదాలో కొంత శాతంగా విధిస్తేనే సమన్యాయమౌతుంది.

వివాహ బంధంలో లేని వారు సహజీవనం చేసే హక్కు ఉందని సర్వోన్నత న్యాయస్థానం స్పష్టం చేసింది. శారీరక సుఖం పొందటం మానవ హక్కుగా గుర్తించింది. అలాంటప్పుడు ఆ హక్కుపై అత్యంత తక్కువ నిబంధనలు మాత్రమే విధించే అవకాశమున్నది. అలాగే ఇండియన్ పీనల్ కోడ్ సెక్షన్ 497 పరదారాగమనం గురించి వివరిస్తుంది. ఒక వివాహిత స్త్రీతో ఆమె భర్త అనుమతితో మరొక పురుషుడు సంపర్కం జరుపవచ్చు. అందుకు ఆమె సమ్మతి కూడా కావాలి. ఒక భార్య పరపురుషుడితో సంపర్కం జరపాలంటే ఆమె యొక్క భర్తగారి అనుమతి కావాలి. అలా అనుమతి లేకుండా ఆమె వ్యభిచరించినా ఆమెను బాధితురాలిగా మాత్రమే భావించాలి తప్ప నేరస్తురాలిగా పరిగణించడానికి వీలు లేదని, ఆమెతో సంపర్కం జరిపిన పర పురుషుడిని మాత్రం అడల్ట్రీ క్రింద నేరస్తుడిగా పరిగణించాలని చట్టం చెబుతున్నది. వివక్ష గమనించండి. భార్యలైతే భర్తల అనుమతి తీసుకోవాలి. భర్తలైతే పరదారాగమనానికి తమ భార్యల అనుమతి పొందవలసిన అవసరం లేదు. పురాతన కాలంలో కూడా అతిథి దేవోభవ అని గృహస్తు ఇంటికొచ్చిన అతిథి కోరితే గృహస్తు తన భార్యను ఆ రోజుకు అతిథికి అప్ప జెప్పవలసిందే. అలాగే భర్తల అనుమతితో దేవరన్యాయంగా భార్యలు ఇతరుల ద్వారా సంతానం పొందిన సందర్భాలు కూడా పురాణాల్లో ఉన్నాయి. అతిథి దేవోభవ అన్న భావన లేదు గాని మిగిలిన స్త్రీ పురుష సంబంధాలన్నీ అప్పుడూ ఇప్పుడూ ఒకేలా ఉన్నాయనిపిస్తుంది. భార్యను ఆస్తిగానే పరిగణించినట్టనిపిస్తున్నది.

ఈ సందర్భంగా మీకొక చిన్నకథ చెబుతాను. ఒక దేశంలో ఒక రాజు పరిపాలన చేస్తూ ఉన్నాడు. ఒక రోజు ఆయన కుమారుడు యువరాజు వచ్చి నాన్నగారూ నాకు రాజ్యాధికారం ఎప్పుడు అప్పజెబుతారు? నాకు యుక్తవయసొచ్చింది. నా చదువు కూడా పూర్తయింది. మీరు చెప్పినట్లే దేశమంతా పర్యటించి వచ్చాను. నాకు పట్టాభిషేకం ఎప్పుడు చేస్తారు? అని అడిగాడట. అందుకు రాజు గారు చదువు, అనుభవం మాత్రమే సరిపోవు నాయనా మనసు కూడా పరిపక్వత పొందాలి. నీవు మనకు దక్షిణ దిక్కున ఉన్న దుర్గమారణ్యంలో మన కుల గురువు విద్యారణ్య స్వామి వారున్నారు. వారు గొప్ప మేధావి. మన శ్రేయోభిలాషులు. నీవు వెళ్ళి వారిని దర్శించి,

వారు చెప్పిన పని చేసి, వారడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పిరా అప్పుడు ఆలోచిస్తానన్నారట. యువరాజు అలాగేనని చెప్పి మందీ మార్బలంతో మునిని సందర్శించాడు. త్వరగా ముని చెప్పిన పని చేసి, అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పి సత్వరమే వెళ్ళి పట్టాభిషేకం పొందాలని ఆతృతగా ఉన్నాడట. తీరా వెళ్తే ముని మౌనవ్రతంలో ఉన్నాడు. పలకరించడానికి వీల్లేదని శిష్యులు వారించారు. మౌనవ్రతం ఎప్పుడు పూర్తవుతుందంటే చెప్పలేమన్నారట. సరే అని యువరాజు అక్కడే వారం రోజులు వేచియున్నాడు.

ముని కళ్ళుదెరిచి ఏమి నాయనా వచ్చావు అన్నాడు. వచ్చిన కార్యం చెప్పాడు యువరాజు. ముని, మంచిది నాయనా ముందుగా నువ్వు ఇక్కడకు తూర్పు దిక్కున ఉన్న బృహదారణ్యంలో ఈ రోజు గడిపి రేపు కనిపించు అన్నాడు. సరే అలాగేనని వెళ్ళి మరుసటి రోజు ఉదయాన్నే వచ్చాడు. ఎలా ఉంది బాబూ నీ అనుభవం అని అడిగాడు ముని. అందుకు యువరాజు స్వామీ ఏమి చెప్పమంటారు? మార్గమంతా కంటకమయం. చుట్టూ చిమ్మ చీకటి, అడవి జంతువుల అరుపులతో భయానకంగా గడిచింది. అన్నాడట.

మరొక్క రోజు కూడా అరణ్యంలో గడిపిరమ్మని అన్నాడు స్వామి. మరుసటి ఉదయం మళ్ళీవచ్చిన యువరాజును ఎలా ఉంది నీ అనుభవం అని అడిగాడు ముని. అందుకు యువరాజు తెల్లవారుఝాముకు పక్షుల కిలకిలారావాలు, సెలయేళ్ళ సవ్వళ్ళు వీనుల విందు చేశాయి. వింత అనుభూతులనిచ్చాయి. తూర్పు కొండలలో ఉదయించే సూర్యుడు ఎంతో ఆహ్లాదం కల్గించింది స్వామీ అన్నాడట. అందుకు ముని యువరాజా ఈ రోజు కూడా బృహదారణ్యంలో నివసించిరా అన్నాడట. సరేనని వెళ్ళివచ్చిన యువరాజుని ఏమిటీ నీ అనుభవాలని ప్రశ్నించాడు స్వామి. నిన్నలేని పూవులు ఈనాటి ఉదయానికల్లా పుష్పించి సుగంధాన్ని వెదజల్లుతున్నాయి. పచ్చికపై మంచు బిందువులు మంచి ముత్యాల్లా మెరుస్తున్నాయి. చిన్న చిన్న పక్షులు ఆ మంచు బిందువుల నాస్వాదించడానికి వస్తున్నాయి. భ్రమరాలు పూవుల వెంట మకరందం కోసం పరుగెడుతున్నాయి. ఉదయాన్నే పక్షులు బారులు బారులుగా ఆహారం వెతుక్కుంటూ వెళుతున్నాయి అన్నాడట. అప్పుడు స్వామి క్లుప్తంగా ఈ రోజు కూడా వెళ్ళిరా అన్నాడు. మరునాడు తిరిగి వచ్చిన యువరాజు స్వామీ దారిలోని

గ్రామాల పంటలను అడవి జంతువులు పాడుచేస్తున్నాయి. సంచారానికి దారులు లేవు. త్రాగడానికి నీరులేదు. ఈ అడవిలో ప్రజలు చాలా ఇబ్బందులు పడుతున్నారు. వాళ్ళాప్రాంతాల్లో ఎలా నివాసముంటున్నారా అని బాధకలిగింది అన్నాడు యువరాజు. నీవు ఇంటికి వెళ్ళు అన్నాడు స్వామి.

ఇంటికి వెళ్ళి తండ్రిని కలిశాడు యువరాజు. ఏం నేర్చుకున్నావు అని అడిగాడు తండ్రి. నాన్నగారూ ముందుగా ముని వద్ద వారు కళ్ళుతెరిచే వరకు ఓపికగా, వినయంగా అవకాశం కోసం ఎదురుచూడడం నేర్చుకున్నాను. ముని నన్ను వరుసగా నాలుగు రోజులు బృహదారణ్యానికి పంపించారు. ఒక్కోరోజు గడిచిన కొద్దీ పాలకుడిగా ఎలాంటి దృష్టి కలిగి ఉండాలో నాకే బోధపడేట్టుగా చేశారని అన్నాడు. అంటే ఏంటి యువరాజా ఆ నాలుగు రోజులు నేర్చుకున్న విషయాలు అని అడిగాడు రాజు. అందుకు యువరాజు, నాన్నగారూ మొదటిరోజు నా భయాన్ని గురించి, నా అసౌకర్యాన్ని గురించే నేను ఆలోచించాను. రెండవరోజు వినపడే విధంగా నా చుట్టూ మారే పరిసరాలను పరిశీలించాను. మూడవ రోజు సశబ్దంగానే కాక నిశ్శబ్దంగా కూడా నా చుట్టూ జరిగే మార్పులను గమనించగలిగాను. నాలుగవరోజు పరిపాలన చేసే రాజు ప్రజల గురించి కూడా ఆలోచించాలని అర్థమయింది నాన్నగారూ అని అన్నాడు. రాజు సింహాసనం దిగి కొడుకును తనివితీర కౌగిలించుకొని భుజంతట్టి ఇక నీదే ఈ సింహాసనం అన్నాడట.

దీని నుంచి తెలిసే నీతి ఏమిటంటే ప్రజలు రోడ్డెక్కి గొంతు చించుకుని, బట్టలు చించుకుని ఉద్యమాలు చేసే వరకు పాలకులు వేచి చూడకూడదు. నిశ్శబ్దంగా ప్రజలు బాధలు భరిస్తున్నప్పుడే అర్థం చేసుకుని పరిష్కరించాలి. దురదృష్టవశాత్తు నేడు రోడ్డెక్కి గొంతు చించుకున్నా, బట్టలు చించుకున్నా, నిశ్శబ్దంగా లక్షల మంది ఆత్మహత్యలు చేసుకుంటున్నా, దోపిడీలు, కుంభకోణాలు, హత్యలు, మానభంగాలు యధేచ్ఛగా జరుగుతున్నా అవన్నీ మామూలే అంటూ దాటవేస్తున్నారు పాలకులు.

నీరు పల్లం ఎటు వుంటే అటు ప్రవహిస్తుంది. అది దాని సహజ లక్షణం. సహజలక్షణం అనేకన్నా అది దాని అవసరం, దాని బలహీనత లేదా బలం. దాని ద్రవస్థితి వలన, గురుత్వాకర్షణ వల్ల ప్రవహించడం అనివార్యం. అదే

ఒక కట్ట నిర్మించి ఒక దిశగా మార్గం నిర్దేశం చేశామనుకోండి, తప్పనిసరిగా బుద్ధిగా ఆ దిశగా ప్రవహిస్తుంది. నేలను సస్యశ్యామలం చేస్తుంది. ప్రజలు కూడా అంతే. వారికి బ్రతకవలసిన, తీరవలసిన కోరికలు, అవసరాలు ఉంటాయి. అవి ఎటు తిరిగి అయినా సాధించుకోవలసిన అవసరం వారికి ఉంది. నిరుపయోగంగా, ప్రమాదకరంగా నీరు ప్రవహించడానికి కట్టలేకపోవడమే కారణం. అలాగే ప్రజలు అభివృద్ధి పథంలో శాంతియుతంగా ప్రయాణించకపోవడానికి తప్పు వ్యక్తులది, సమాజానిది కాదు. చట్టాలు, కట్టుబాట్లు ఏర్పాటుచేసి అమలు చేయలేని ప్రభువులది, ప్రభుత్వందే. మరి ఆ కట్ట వేయవలసిన బాధ్యత అంటే లీడ్ చేయవలసిన బాధ్యత లీడర్‌దే. ప్రజలు కూడా అంతే. సమైక్యంగా ఏకముఖమైన జాతీయ భావంతో ప్రవర్తిస్తే అభివృద్ధితో కూడిన శాంతియుత సమాజం ఏర్పడుతుంది. పాలకులు అలా చేయలేని రోజున కుల, మత, ప్రాంత, భాషా విభేదాలతోను ఆకలి, అవిద్య, దరిద్రం, అనారోగ్యం, ఉగ్రవాదం, తీవ్రవాదం వంటి సమస్యలతో కల్లోలితమైన సమాజం తయారౌతుంది. ఏ దేశమైనా తన అస్థిత్వాన్ని, స్వతంత్రాన్ని కోల్పోయి పరాయి పాలన క్రిందకు పోవడానికి ఆ దేశంలోని పైన తెలిపిన కారణాలతో ఉత్పన్నమైన కల్లోల సమాజమే కారణం. ఇలాంటి పరిస్థితిని ఉపయోగించుకోవడానికి శత్రుదేశాలు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి. దురదృష్టవశాత్తు అలాంటి శత్రు దేశాలకు సహకరించడానికి స్వీయ సమాజంలోనే స్వార్థపరులైన ద్రోహులు ఉంటూనే ఉంటారు. ఇలాంటి ఉదాహరణలు చరిత్రలో కోకొల్లలు.

అంటే ఈ రోజు మనం అనుభవిస్తున్న సామాజిక, ఆర్థిక, రాజకీయ రుగ్మతలకు తరతరాల, యుగయుగాల పాలకులే కారణం తప్ప ఏ ప్రజలూ, ఏ సమాజమూ, ఏ కులమూ, ఏ మతమూ కాదు. ఎందుకంటే సమాజాలను సృష్టించి నడిపించేది ప్రభుత్వాలే. సమాజానికి దిశా నిర్దేశం చేసి నియంత్రించ గలిగిన బాధ్యత, శక్తి ప్రభుత్వాలకే ఉంటుంది. కొమరులు చెడుగైన తండ్రి తప్పు. కూతురు చెడుగైన తల్లి తప్పు. భార్య చెడుగైన భర్త తప్పు. ప్రజలు చెడుగైన ప్రభుత తప్పు. సమాజం మంచిగా ఉన్నా, చెడుగా ఉన్నా అందుకు బాధ్యత ప్రభుత్వాలదే. స్వార్థపరులు వ్యవస్థను అతిక్రమించడానికి కారణం ఎవరు అంటే అనుమానం లేకుండా చెప్పవచ్చు, ప్రభుత్వం అని. ఉదాహరణకు

భారతీయుడొకడు అమెరికా వెళ్ళాడనుకోండి. అక్కడ అతని ప్రవర్తన పూర్తి భిన్నంగా ఉంటుంది. రోడ్ల ప్రక్కన మూత్రం చేయడు, రోడ్లపై చెత్త కాగితాలు వేయడు, ఇతరులతో గొడవ పడడు, మోసం, దొంగతనానికి ప్రయత్నం కూడా చేయడు. అప్పుచేసి ఎగవేసే ప్రయత్నం చేయడు. ట్రాఫిక్ రూల్సు కూడా అతిక్రమించడు. ఆ క్రమశిక్షణ ఎక్కడ నుంచి వచ్చింది. అదే వ్యక్తిగదా! ఆ గొప్పదనం ఆ వ్యవస్థది, ఆ ప్రభుత్వాలది. ఆ దేశ పౌరులను, వ్యవస్థను అలా తీర్చిదిద్దిన ప్రభుత్వాలదే ఆ గొప్పదనం.



# 9. భారతదేశంపై విదేశీ పెత్తనం?

ఇక రాజకీయ మార్పులు పరిశీలిద్దాం. క్రీ.శ 1600 సంవత్సరంలో భారతదేశంలో ప్రవేశించిన ఆంగ్లేయులు 1750 నాటికి భారతదేశాన్ని పూర్తిగా ఆక్రమించారు. అంటే షుమారు 150 సంవత్సరాలు పట్టిందన్న మాట. ఇప్పుడు భారతదేశం తిరిగి విదేశీ పాలనలోకి వెళ్ళడానికి అంతకాలం కూడా పట్టేటట్లు కనిపించడంలేదు. స్వాతంత్ర్యం సిద్ధించి 70 సంవత్సరాలయింది. ఇంకొక 30 సంవత్సరాలలో భారతదేశం విదేశీ సంస్థల చెప్పుచేతలలోకి వెళ్లిపోయే ప్రమాదం కనిపిస్తున్నది. క్రీ.శ. 1600 సంవత్సరంలో ఆంగ్లేయులు భారత దేశానికి వర్తకులుగానే వచ్చారు. ఇప్పుడు విదేశీ ఆర్థిక సంస్థలు కూడా వ్యాపార నిమిత్తమే భారతదేశంలో ఆడుగు పెడుతున్నాయి. ఇప్పటి రాజ్యాధికార విస్తరణ భౌగోళికం కాదు. ఆర్థిక పెత్తనమే. దేశాల ఆర్థిక జవజీవాలు పీల్చి ప్రజలను జీవచ్ఛవాలుగా మార్చి తమ దేశాన్ని సుసంపన్నం చేసుకోవడమే నేటి రాజకీయ వ్యవస్థ లక్ష్యం. ఆపై సైనిక సంపత్తిని, ఆయుధ సంపత్తిని పెంచుకొని ఇతర దేశాలపై రిమోట్ కంట్రోల్ పెత్తనం చలాయించడమే అంతిమ లక్ష్యం.

ప్రపంచ బ్యాంక్ లక్షల కోట్ల రూపాయలను భారత ప్రభుత్వానికి అప్పుగా ఇస్తున్నది. ఆ విధంగా అప్పు ఇచ్చినందుకు, రక్షణ కల్పించినందుకు ప్రతిగా విదేశీ స్వేచ్ఛా వాణిజ్యానికి అంగీకరింపజేస్తున్నాయి. అంటే ఎగుమతి, దిగుమతులపై పరిధికి మించి ఆంక్షలుగాని పన్నులుగాని విధించరాదు. అప్పు తెచ్చుకొన్న డబ్బే కాక పూర్తి ప్రణాళికా వ్యయ ప్రాధాన్యాలు కూడా ప్రపంచ వాణిజ్య సంస్థ అంగీకరించే విధంగానే నిర్ణయించబడుతున్నాయి. అంటే భారతదేశ ఆర్థిక ప్రణాళిక పూర్తిగా భారత పార్లమెంటు చేతుల్లో లేదని అర్థమవుతున్నది. ఇప్పటికే మనం వాడుతున్న వాహనాలు, టి.వి.లు, కంప్యూటర్లు మొదలుకొని బట్టలు, చెప్పులు, సబ్బులు, సెంట్లు వగైరా అన్ని విదేశీ వస్తువులే. ఎయిర్ పోర్టులు, బ్యాంకులు, విద్యా, వైద్య, న్యాయ సేవా

రంగాలలో విదేశీ సంస్థలను అనుమతించడం జరుగుతున్నది. పర్యవసానంగా విలాసవంతమైన సేవలు, అధిక ధరలు. వాటితో సామాన్యుడి బ్రతుకు ఛిద్రం.

విదేశీ సంస్థలకు భారతదేశం, వారి సంస్థలు లక్షల కోట్ల రూపాయలు బకాయి పడి తిరిగి చెల్లించలేని పరిస్థితి రాగానే బకాయిల క్రింద ఓడరేవులు, రైలు, రోడ్డు రవాణా, టెలికం వంటి కొన్ని రంగాలు అప్పుల చెల్లుబాటుగా విదేశీ సంస్థలకు అప్పగించవలసి వస్తుంది. ఆస్తులను ధర్నాలనుంచి, దహనాలనుంచి రక్షించుకోవడానికి ప్రత్యేక సాయుధ రక్షణ దళాలను నియమించుకునే అధికారం విదేశీయులు కోరతారు. వారి వ్యవస్థలపట్ల నేరం చేసిన వారిని, ఒప్పంద నిబంధనలను ఉల్లంఘించిన వారిని విచారించడానికి ప్రత్యేక న్యాయస్థానాలు లేదా ట్రిబ్యునల్స్ కోరతారు. ఆపై భారతదేశ రాజకీయ అనైక్యత, అవినీతి, అసమర్థత ఉండనే ఉన్నాయి. ఫలితంగా భారతీయులు స్వదేశంలోనే విదేశీయుల పాలన క్రింద మ్రగ్గడం జరుగుతుంది. అందుకే రాజకీయ నాయకులారా! కుహనా సంఘ సంస్కర్తలారా! తస్మాత్ జాగ్రత్త. సమాజాన్ని విభజిస్తూ ప్రజాజీవితంలో విషం చిమ్ముతూ మీ అభివృద్ధిని చూసుకోకండి. భారత జాతి బలోపేతానికి కృషిచేయండి. ఈ పోటీ ప్రపంచంలో నిలవాలంటే అదే ముఖ్యం. లేకుంటే ప్రజల ధన, మాన, ప్రాణాలే కాదు మీ ధన, మాన, ప్రాణాలు కూడా విదేశీయుల చేతుల్లోకి వెళ్ళిపోతాయి.

ఈస్టిండియా కంపెనీ విషయంలోనూ ఇదే జరిగింది. ఔరంగజేబు మనుమడైన బెంగాల్ నవాబు నుండి ఈస్టిండియా కంపెనీ వారు భూమి శిస్తు వసూలు చేసే హక్కును పొందారు. దీనినే దివానీ హక్కుల చట్టం అంటారు. ఆ తర్వాత శిస్తుకట్టని వారిపైన మరియు కంపెనీతో సంబంధమున్న ఇతర వ్యక్తులపైన చర్యతీసుకోవడానికి అనుకూలంగా సివిల్ కోర్టులు పెట్టుకొనే హక్కుతో పాటు ఆ కోర్టులు ఇచ్చిన తీర్పును అమలు పరచడానికి పోలీసులను నియమించుకొనే అధికారాన్ని కూడా పొందారు. ఆ తర్వాత స్థానిక రాజుల మధ్య యుద్ధాలు వచ్చినప్పుడు ఒకపక్క తమసైన్యంతో ఆయుధాలతో సాయంచేసి ప్రతిఫలంగా కొంత భూ భాగాన్ని కమీషన్‌గా పొందేవారు. అలా అనతి కాలంలోనే ఈస్టిండియా కంపెనీ భారతదేశమంతటా విస్తరించింది. అప్పటి రాజ్యవిస్తరణ భూభాగాలపై ఉండేది. ప్రస్తుతం అది ఆర్థిక అధికార విస్తరణగా మారింది.

స్వేచ్ఛావాణిజ్యం ద్వారా మన ఎగుమతులను నిలుపు చేయరాదు. దిగుమతులనూ అడ్డుకోరాదు. దీనివలన ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాలు సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన వస్తువులు తయారు చేసి ఇతర దేశాలకు అమ్ముతారు. వ్యవసాయ ఉత్పత్తులు వంటి వాటిని కొంత ఎక్కువ ధరకైనా సరే దిగుమతి చేసుకుంటారు. మన దేశ ముడి వస్తువులు మరియు వ్యవసాయ ఉత్పత్తులు విదేశాలలో అధిక ధర పలకడం వల్ల సహజంగా అవి విదేశాలకు ఎగుమతి చేయబడతాయి. అంటే మామిడిపండ్లు, మన ఆహార ధాన్యాలు మన నోటిముందు నుంచి కదలి విదేశాలకు వెళ్లిపోతాయన్నమాట. లేదా మనం కూడా అదే అధిక ధరకు కొనుగోలు చేయవలసి వస్తుందన్నమాట. మన రాజకీయ నాయకులు ప్రపంచ బ్యాంకు గుమస్తాలుగా, ఆధిపత్య దేశాల వ్యాపార సంస్థల ఏజెంట్లుగా మారిపోతారు. ముఖ్యమైన వ్యాపారాలన్ని విదేశీ కార్పోరేట్ రంగంలోకి వెళ్లిపోతాయి. కాబట్టి దేశీయ వ్యక్తిగత, చిన్న వ్యాపారులందరూ దుకాణాలు మూసి కార్పోరేటు వ్యాపార సంస్థలలో గుమస్తాలుగా చేరడమో లేక అంతరించి పోవడమో జరుగుతుంది. ఇప్పటి పరిస్థితులు చూస్తుంటే ఇదంతా జరగటానికి 25 నుండి 30 సంవత్సరాలు చాలనిపిస్తున్నది. ఇప్పటికే దేశీయ వ్యాపారస్తులు, తయారీదారులు ఈ దుష్పరిణామాలను చవిచూస్తూనే ఉన్నారు.

స్వేచ్ఛావాణిజ్యం ఓ మాయాజాలం. వస్తువులు, సేవలు స్వేచ్ఛగా ఎగుమతి, దిగుమతి చేసుకొన్నప్పుడు పౌరసత్వం, నివాసహక్కు కూడా స్వేచ్ఛగా ఉంటే అది నిజమైన స్వేచ్ఛా ప్రపంచంగా ఉండేది. ఏ దేశంలో ఆర్థిక అభివృద్ధి అధికంగా ఉంటే అక్కడికి ఏ దేశ ప్రజలైనా వచ్చి పౌరసత్వం పొంది, స్థిర నివాస మేర్పరుచుకొనే అవకాశం ఉంటేనే స్వేచ్ఛా వాణిజ్యం నిజాయితీతో కూడుకున్నట్లు. లేదంటే ప్రస్తుత స్వేచ్ఛా వాణిజ్య విధానం బలహీన దేశాలలోని వనరులను వెలికితీసి బలవంతమైన దేశాలు మరింత బలోపేతమయ్యే అవకాశముంది. అప్పుడు ఆర్థిక సంపత్తి సర్వస్వం ఒకచోట మరియు నిరుపేద ప్రజలు మరొకచోట పోగుపడే అవకాశం ఉంది. అప్పటికి ప్రజా వ్యవస్థ ఎదురుతిరిగే స్థాయిలోకూడా లేనంత దిగజారి బలహీనంగా ఉంటుంది. ఎందుకంటే భారత రాజకీయ పార్టీలకు ఎన్నికలకు నిధులు సమకూర్చేది

విదేశీ కార్పొరేటు సంస్థలే అయినందువల్ల మన నాయకులు ఆ సంస్థలకు వ్యతిరేకంగా ఏమీ చేయరు. వాటికి అనుకూలమైన చట్టాలనే చేస్తారు. స్వేచ్ఛా వాణిజ్యం సమ ఉజ్జీల మధ్య సాగితేనే శ్రేయోదాయకం. లేకుంటే పసిపిల్లవాడికి, పహిల్వానుకి మధ్య జరిగే కుస్తీ పోటీలానే ఉంటుంది. ఇది గుర్తించే అప్పటి భారత ప్రధాన మంత్రి పి.వి నర్సింహారావు ప్రపంచ వాణిజ్య సంస్థతో ఒప్పందం అమలు చేయడానికి పది సంవత్సరాల మారటోరియం కావాలని భావించారు.

చైనా, జపానులు భారతదేశంలో వ్యాపార పెత్తనానికి పోటీపడుతుంటే అమెరికా ప్రపంచ బ్యాంకు ద్వారా డబ్ల్యూ.టి.ఓ. ఒప్పందాల ద్వారా ఇప్పటికే మన ఆర్థిక ప్రణాళిక పరిమాణాన్ని, ప్రాధాన్యతలను నిర్దేశిస్తున్నది. రోడ్లు, కమ్యునికేషన్ రంగాలకు ప్రాధాన్యం, సబ్సిడీల ఎత్తివేత, మతమార్పిడులకు సౌలభ్యం, వివాహ సంబంధాలు, స్త్రీ పురుష సంబంధాలలో సరళీకరణ, వ్యాపారాల ప్రైవేటీకరణ, విత్తన నియంత్రణ, అనేక వస్తువులపై పేటెంట్లు పొందడం, విద్యాధికులైన వారికి విదేశీ ఉద్యోగాలను ప్రోత్సహించడం, విదేశీ పెట్టుబడులు, విదేశీ సాంకేతిక పరిజ్ఞానం, విదేశీ సాంకేతిక నిపుణులను అనుమతించడం, విదేశీ విశ్వవిద్యాలయాలను, విదేశీ న్యాయవాదులను, విదేశీ ఆడిటర్లను, విదేశీ ఆసుపత్రులను భారతదేశంలోకి అనుమతించడం అంటే ఒకరకంగా భారతదేశాన్ని ఆర్థిక నిరాయుధీకరణ చేయడమే. తద్వారా అన్ని వ్యాపార వనరులను అభివృద్ధి చెందిన దేశాలు కొల్లగొట్టే అవకాశం కల్పించడమేనన్నమాట.

ఈ క్రీడలో ఏ దేశం బలవంతమైనదో, ఎవరు గెలుస్తారో తేలికగా ఊహించుకోవచ్చు. ఇప్పుడు భారతదేశంలో ధనవంతులు మరీ ధనవంతులుగా మరియు పేదలు నిరుపేదలుగా మారుతున్నట్లు రేపు ప్రపంచ దేశాలలో కూడా అభివృద్ధి చెందిన దేశాలు, అత్యంత ధనవంతమైన దేశాలుగా మారతాయి. అభివృద్ధి చెందుతున్న మరియు వెనుకబడిన దేశాలు మరింత నిరుపేద దేశాలుగా మారి అవయవాలు అమ్ముకోవడం, ఆత్మహత్యలే ఆలంబనగా బ్రతకవలసి వస్తుంది. ప్రస్తుతం భారతదేశంలో పరిశ్రమలు స్థాపించగల్గిన భారతీయ సాంకేతిక నిపుణులను విదేశాల వారు కొనిపోతున్నారు. అందువల్ల భారతదేశం పారిశ్రామికంగా వెనుకబడటం ఖాయం. ఆ తర్వాత కాలంలో విదేశీయులే భారతదేశంలో పరిశ్రమలు స్థాపించి స్థానిక సంపదను కొల్లగొట్టే అవకాశముంది.

డిసెంబరు 2017లో శ్రీలంక తన హంబతోటి అనే అతి ముఖ్యమైన ఓడరేవును 1.12 బిలియన్ డాలర్ల బాకీ కింద చైనాకు 99 సంవత్సరాల లీజు ప్రాతిపదికన కట్టబెట్టింది. శ్రీలంక ఇంకా 8 బిలియన్ డాలర్లు చైనాకు బాకీ పడి ఉన్నదట. ఈ రకంగా భారతదేశం కూడా ఇండియన్ టెలికమ్యూనికేషన్ విభాగాన్ని గాని, ఇండియన్ రైల్వేస్ విభాగాన్ని గాని, ఎయిర్ పోర్టులను, ఓడరేవులను, ప్రభుత్వ పరిశ్రమలను గాని విదేశీ పెట్టుబడి దారులకు తాకట్టు బెట్టదని గ్యారంటీ లేదు. అప్పిచ్చిన వారు ఊరుకోరు కదా! వ్యాపారాలు, వనరులలాగానే ఏ దేశ పౌరసత్వమైనా, ఏ దేశస్థులైనా పొందవచ్చునన్న పౌరసత్వ ప్రపంచీకరణ కూడా సంభవిస్తే ఆందోళన పడవలసింది లేదు. లేదంటే మన వనరులు, ఆర్థికనియంత్రణ అమెరికాలో ఉంటే, ప్రజలు నిరుపేదలుగా, సేవకులుగా భారతదేశంలో ఉండిపోతారు. 'యధారాజా తథా ప్రజా' అన్న నానుడి నిజమే కదా.

ఒక్క హైదరాబాద్ నగరంతో సమాన విస్తీర్ణం మరియు జనాభా గలిగిన సింగపూర్‌ను చూసినా, కేవలం తెలంగాణ ప్రాంతమంత జనాభా కలిగిన మలేషియా చూసినా, భారతదేశ ప్రజల బ్రతుకు ఎంత నాసిరకంగా ఉందో అర్థమవుతుంది. వారికి మనకన్నా 15 నుంచి 20 సంవత్సరాలు ఆలస్యంగా స్వాతంత్ర్యం లభించింది. అయినప్పటికీ అభివృద్ధిలో, ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపర్చడంలోను, దేశ రక్షణలోను సెక్యులర్ సమాజాన్ని నిర్మించడంలోనూ మనకన్నా ఎంతో ముందున్నాయి. ఇక అమెరికా, ఆస్ట్రేలియా, జర్మనీ, జపాన్‌లాంటి అభివృద్ధి చెందిన దేశాలతో పోలిస్తే మనం ఇంకా ఎంతగానో వెనుకబడి ఉన్నాం. అధిక జనాభా మన సమస్య అని భావించినా మనకన్నా అత్యంత అధిక జనాభా గలిగిన చైనా ఎంతగా అభివృద్ధి చెందుతున్నదో మనకు తెలుసు.

నేను ఒకసారి సింగపూర్ వెళ్ళడం జరిగింది. అక్కడ ఏ దుకాణం ముందు చూచినా ఏ ఇంటి ముందు చూసినా, ఏ హోటల్ ముందు చూసినా ఆ దేశాధ్యక్షుడి ఫోటో, ఆయన పటానికి పుట్టినరోజు శుభాకాంక్షలతో ఉన్నాయి. ఆయన పుట్టిన రోజును దేశమంతా పండగలాగానే చేసుకుంటున్నారు. ఆయన పుట్టిన రోజు పండుగ ప్రజలపై బలవంతంగా రుద్దబడిందేమో అనుకున్నాను.

చాలాచోట్ల అక్కడి పెద్దలతో ఆవిషయం చర్చించాను. అందరూ అతని గురించి ప్రేమగా, సగర్వంగా చెప్పారు. ఆయనే నవ సింగపూర్ నిర్మాత అని. 1960 దశకంలో వారికి బ్రిటీషు నుంచి స్వాతంత్ర్యం లభించిననాటి నుంచి నేటి దాకా అతనే అధ్యక్షుడు. అతను ముఖ్యంగా ఎదుర్కొన్న సమస్య అవినీతి అట. అతను అవినీతిని అంతమొందించి సింగపూరును అత్యంత క్రమశిక్షణ గలిగిన అభివృద్ధి చెందిన దేశంగా తీర్చిదిద్దాడని అక్కడి ప్రజలు ఆనందంతో చెప్పడం నేను విన్నాను.

అక్కడ ముఖ్యంగా బౌద్ధులు, ముస్లింలు, హిందువులు ఉన్నారు. క్రిస్టియన్లు కూడా ఉన్నారు. కానీ అక్కడ మతభేదాలు లేనేలేవు. ఏ మతం అబ్బాయైనా ఏ మతం అమ్మాయినైనా ప్రేమించి పెళ్ళి చేసుకోవచ్చు. అక్కడ దేశ జనాభా కన్నా విదేశీ జనాభానే ఎక్కువ. మనదేశంలో నాయకులకు అంత విలువలేదు. వారు చచ్చినా, బ్రతికినా ఆ పార్టీ కార్యకర్తలే కొంత బాధపడతారు. కొందరు సంతోషించేవారు ఉంటారు. ఆ తరువాత ఆ సంఘటనను పెద్దగా పట్టించుకోరు. మంత్రులు, ముఖ్యమంత్రులు, ప్రధాన మంత్రులు అవినీతి ఆరోపణలపై కోర్టుల చుట్టూ తిరగటం చూస్తే బాధ కలుగుతుంది. కొన్ని దేశాలు మన కన్నా వెనుకబడినవి కూడా ఉన్నాయి. కానీ, వాటితో మనం ఎందుకు పోల్చుకోవాలి? అభివృద్ధి చెందిన దేశాలను మించి మన దగ్గర భూ విస్తీర్ణం ఉంది. అడవులు ఉన్నాయి. జలవనరులు, నిధి, నిక్షేపాలు ఉన్నాయి. లోపించిందల్లా నాయకత్వం నాణ్యత, రాజకీయ వ్యవస్థ నిర్మాణం.



# 10. ప్రకృతి ఎలా పరివర్తన చెందుతున్నదో చూద్దాం

మార్పు ప్రకృతి సహజ లక్షణం అని గ్రహించాలి. మార్పు ఏ దిశగా ఎంత వేగంగా జరుగుతుందో కూడా ప్రకృతి తానే నిర్దేశించుకుంటుంది. మానవ శరీరం తల్లితండ్రుల ప్రత్యేక శరీరాలలో ప్రారంభమై, తల్లి గర్భం నుంచి ఆవిర్భవించిన సందర్భంనుండి మరణించే వరకు క్షణం క్షణం మారుతూనే వుంటుంది. శరీర కణాలలో జరిగే అంతర్గత మార్పులు సదరు వ్యక్తికే తెలియదు. అతని ప్రమేయము లేదు. మార్పుకు ఒక వ్యక్తి, ఒక వర్గం, ఒక సంఘటన కారణంగా మనకు కనిపించినా, ఆ మార్పుకు అవసరమైన ప్రేరణ ప్రకృతియే సృష్టించుకుంటుంది. ప్రకృతి తనపని తాను చేసుకుంటూ పోతుంది. ప్రకృతిలో జరగవలసిన పనులను జీవ నిర్జీవ పదార్థాలతోనే చేయించుకుంటూ ఉంటుంది. మనిషి విజ్ఞానం, ఆ విజ్ఞానంతో తయారయ్యే పరికరాలు సర్వస్వం ప్రకృతి ప్రణాళికలో భాగమే. శస్త్రచికిత్స చేసే పరిజ్ఞానం మరియు శస్త్ర చికిత్స చేయడానికి అవసరమైన పరికరాల రూపకల్పన కూడా ప్రకృతి ప్రణాళికే. విష్ణు సహస్రనామాలలో ఒక నామముంది. *యోగోజ్ఞానం తధా సాంఖ్యం విద్యా శిల్పాది కర్మచ ఏతత్ సర్వం జనార్ధనాత్* అని. జనార్దనాత్ అని భగవంతుడినుద్దేశించి చెప్పినమాట.

విశ్వ ఆవిర్భావానికి బిగ్‌బ్యాంగ్ వంటి ఊహాగానాలు ఉన్నాయి. భూగోళం ఆవిర్భవించి ఎన్ని కోట్ల సంవత్సరాలైందో యిదమిత్థంగా చెప్పలేము. భూమిపై జీవ ఆవిర్భావం ఎప్పుడు ప్రారంభమయిందో చెప్పలేము. మానవాకారం ఎప్పుడు రూపు దిద్దుకున్నదో తెలియదు. అలాగే నాగరికత లేని ఆది మానవులు ఎలా జీవించారు, వారికేమైన ఆచార వ్యవహారాలు ఉన్నాయా లేక అవసరాల ఆధారంగా మాత్రమే జీవించారా అన్న విషయాలకు ఊహలే ఆధారం తప్ప

లిఖిత లేదా ఋజువు చేయగల వ్యవస్థ లేదు. భూమి స్యూర్యుడి నుండి విడిపడిన ముక్క అనికదా అంటారు. ఒకప్పుడు భూమి కూడా మండుతున్న అగ్నిగోళమే కదా. మార్బుల్ గ్రానైట్ వగైరా చూచినా అవి ఒకప్పుడు కరిగి ప్రవహించి ఆపై ఘనీభవించినట్లే చారికలు కనిపిస్తాయి. భూమి మండుతున్న అగ్నిగోళంగా ఉన్నప్పుడు జీవ, జంతు జాలాల ఉనికి అసాధ్యంకదా. మరి భూమిపైకి ఈ సమస్త జీవ, జంతు జలాలు ఎక్కడ నుంచి వచ్చినట్లు?

ఒక్కొక్క వాతావరణానికి ఒక్కొక్క రకం లేదా కొన్ని రకాల జంతు, వృక్ష జాలాలు ఆవిర్భవించినట్లు ఊహించడం సమంజసమేమో అనిపిస్తున్నది. ఈ ప్రక్రియలో ఇతర గ్రహాల ప్రభావం కూడా ఉండి ఉండవచ్చు. అలాగే కాలమంటే మనం కొలిచే ఋతువులు, సంవత్సరాలే కాక అనేక వందలు, వేల, లక్షల లేదా కోట్ల సంవత్సరాలని కలిపి ఒక పేరు కలిగిన ఋతు చక్ర కాలం, ఉదాహరణకు, యుగం లేదా మన్వంతరంగా పేర్కొనవలసిన అవసరమున్నదేమో కూడా ఆధునిక శాస్త్రానికి తెలియదు కదా. అలాంటి కాల సంధిలో కలిగిన వాతావరణాల నుండే మానవులతో సహా అన్ని రకాల వృక్ష, జంతు సంతతులు ఉద్భవించి ఉండవచ్చు. అందువలన డార్విన్ సిద్ధాంతాన్ని నమ్మే ముందు ప్రకృతి నుంచి ఉద్భవించి ఉండవచ్చు కదా అని కూడా ఆలోచించండి.

జీవ పదార్థం పరిణామం చెందుతుందని సిద్ధాంతీకరించాడు డార్విన్. ఇంతవరకు ఎవరికీ అభ్యంతరం ఉండనవసరం లేదు. ప్రతి మనిషికి అనునిత్యం అనుభవంలో ఉన్న విషయమే ఇది. నేను మరొక్క అడుగు ముందుకు వేసి జీవపదార్థం ఏకకణ జీవిగా ఆవిర్భవించిందా లేక నిర్జీవ పదార్థాలని మనమనుకొనే పదార్థాల రూపాంతరంగా ఏకకణ జీవి రూపుదిద్దుకున్నదా? ఇది పరిశీలించ వలసిన అంశం. భూమి, గండ శిలలను సైతం కరిగించి ప్రవహింప చేయగల ఉష్ణోగ్రత గలిగిన గ్రహంగా ఆవిర్భవించింది. లేదా ఒకప్పుడు అలా ఉండేది అని భావించవచ్చు. అలాంటి ఉష్ణోగ్రత సూర్యుడి నుంచి లేదా మండుతున్న మరో గ్రహం నుంచి విడివడినప్పుడు పొంది ఉండవచ్చు. లేదా భూ భ్రమణ, పరిభ్రమణాల కారణంగా సాపేక్ష గ్రహాలతో జరిగిన ఘర్షణ కారణంగానైనా కావచ్చు. ఏదిఏమైనా ఆ భూమి అనేక జంతు జాలాల పుట్టుకకు భూమికయ్యింది. నిర్జీవ పదార్థాలుగా భావించ బడుతున్న

పంచ భూతాది ప్రకృతి శక్తులు ఏక కణ జీవిగా రూపాంతరం చెందగలిగాయంటే ప్రకృతి శక్తులు మరియు ఏక కణజీవి నుంచి నేటి ఆధునిక మానవుని వరకు అన్నీ ఒకే పదార్థ భిన్న రూపాలని అర్థం చేసుకోవచ్చు. *ఏకోవిష్ణుర్మహద్భూతం, పృథగ్భూతాన్యనేకశః* అన్నా, *విద్వాన్ సర్వత్ర సమదర్శనః* అన్నా ఆవులు వేర్వేరు పాలొక్కటి అన్నా, కుండలు వేర్వేరు మన్నొక్కటి అన్నా, ఆత్మలు వేర్వేరు పరమాత్మ ఒక్కటి అన్నా అన్నింటి అర్థం ఒక్కటే.

ఒకవేళ డార్విన్ సిద్ధాంతం నమ్మిదామనుకొన్నా మొదటి ఏకకణ జీవి ఆవిర్భవించిందని నమ్మగలిగితే అలాంటివే భిన్నమైన అనేక జంతు, వృక్ష జాలాలు కూడా ఆవిర్భవించియే ఉండవచ్చని నమ్మవలసి వస్తుంది. అలాగే కొన్ని జంతు మరియు వృక్షజాతులు కాలాంతరంగా అంతరిస్తూ కూడా ఉంటాయి. ఒక్కొక్క జీవపదార్థం కుళ్ళినప్పుడు ఒక్కొక్క రకమైన దుర్వాసన అనగా ఒక్కొక్క రకమైన బ్యాక్టీరియా వ్యాప్తి అన్నమాట. ఒక్కొక్క నేలల్లో, ప్రాంతంలో ఒక్కొక్క రకమైన చెట్లు. వెరసి నాకేమనిపిస్తుందంటే ఒక్కొక్క కాలానికి ఒక్కొక్క వాతావరణానికి ఒక్కొక్క రకమైన జంతుజాలం మరియు వృక్షజాలం వృద్ధి చెందుతుందన్నమాట.

ఏ అన్వేషణకైనా, ఆవిష్కరణకైనా ఊహలే విత్తనాలు. ఊహలకు మూలం ఆకాంక్షలే. నమ్మకాలే ఆలంబన. ప్రయత్నమే కర్తవ్యం. నమ్మకం లేని వాడు ఊహలకు వాస్తవ రూపం ఇచ్చే ప్రయత్నమే చేయడు. మనసుకు గాని ఆకాంక్షలకు గాని విలువ లేదని నమ్మే వెర్రి వాడిని కాదు నేను. మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ గారు ఏం చెప్పాడో తెలుసు కదా. “కలలు కనండి. వాటిని నిజం చేసుకొనే ప్రయత్నం చేయండి”. వారు గొప్ప శాస్త్రజ్ఞులు. అందుకే వారికి తెలుసు కలలు, కోరికలు, ఆకాంక్షల విలువ.

జీవి అవసరాలు ఆకాంక్షలు కారణంగానే సృష్టి పరిణామ క్రమం జరిగిందని నమ్మి డార్విన్ గారికి చెక్కభజన చేసేవాడికి జీవ అవసరాలు, ఆకాంక్షల విలువ, వాటిని నియంత్రించి సన్మార్గంతో నడిపే సదాచారాల విలువ తెలియకపోతే ఎలా? ఎత్తున ఉన్న ఆహారం అందుకోవాలన్న కోరిక వల్లనే జిరాఫీకి మెడ పొడుగయిందని నమ్మే మేధావులు జిరాఫీకి నేలపై ఉన్న మొక్కలను తినడం, నీళ్లను త్రాగడం కూడా అవసరమేనని గుర్తించక పోతే ఎలా? వాస్తవానికి నీళ్లు త్రాగటానికి దాని పొడవాటి కాళ్ళు, మెడ వల్ల జిరాఫీ చాలా ఇబ్బంది

పడుతుంది. జంతువులకు, మనుషులకు కళ్ళు ముందు ప్రక్క మాత్రమే ఉంటాయి. వెనుక ప్రక్క అవసరం లేదా? అవసరముంటే ఎందుకు రావడం లేదు? మానవ సంతానవ్యాప్తి సంగతి చూడండి. మనసులలో కోరిక పుట్టి, తొమ్మిది నెలలు మోసి కనడం జరుగుతుంది. భయంకరమైన పురిటి నొప్పులు కోరి తెచ్చుకుంటారా? గర్భస్థ శిశువు ఎవరి కోరికల ప్రకారం రూపు దిద్దుకొంటుంది. పునరుత్పత్తి వ్యవస్థ కోరి తెచ్చుకున్నదా? వ్యవస్థ లేకముందే ఊహించి కోరుకోవడం వల్లనే అంతటి సంక్లిష్ట వ్యవస్థ ఏర్పడిందా? ముసలితనం, మరణం కోరుకుంటేనే వస్తాయా? మన కోరిక, మన అవసరం లేకుండానే మనలోని ప్రతి అణువు పరిణామం చెందుతూ ఉంటుంది. మన కోరిక కూడా ఒక భాగమే తప్ప అదే సర్వస్వం కాదు. మనం కావాలనుకున్నా వద్దనుకున్నా జరగవలసినవి జరుగుతూనే ఉంటాయి. క్యాన్సర్ కణాలు కోరి ఎవరు తెచ్చుకుంటారు. ఇవన్నీ ఆలోచించవల్సిన విషయాలే.

జీవ ఆవిర్భావ, పరిణామ క్రమం గురించి డార్విన్ అనే శాస్త్రజ్ఞుని ప్రకారం జీవ పరిణామం ఏక కణ జీవిగా ప్రారంభమై చివరికి కోతి నుంచి మనిషి పుట్టినట్టు తేల్చి చెప్పాడు. కాని ఈ సిద్ధాంతం సహేతుకం అనిపించదు. ఎందుకంటే కోతి జాతి నుండి మానవజాతిగా ఆవిర్భవించినా, జన్మజన్మాంతరాలుగా రూపాంతరం చెందినా కోతి మరియు ఈనాటి మనిషి రూపాల మధ్యలో ఉండే దశలలో ఉన్న జీవజాతులు లేవు. కోతికి మనిషికి సారూప్యతలకన్నా విరూప్యతలే ఎక్కువ. అలాగే వృక్ష జాతులలో కూడా ఏ వృక్ష జాతి నుండి ఏ వృక్ష జాతి ఆవిర్భవించింది, అందుకు కారణాలేమిటి అనే వివరణ కూడా లేదు. వృక్ష జాతియైన జంతు జాతియైన రెండూ జీవ జాతులే. కొందరు మతాచార్యులు సర్వ సృష్టిని, జీవ జాలాన్ని భగవంతుడే సృష్టించాడని చెప్పడం మనం విన్నాం. విశ్వము లేదా ప్రకృతియే పరమాత్మయని భావించినట్లయితే భగవంతుడే సర్వ సృష్టి, స్థితి, లయ కారకుడన్న సిద్ధాంతానికి విఘాతం ఉండదు.

జీవ పరిణామాన్ని గురించి డార్విన్ అనే శాస్త్రజుడు సిద్ధాంతం ప్రకారం భూమిపై జీవం నీటిలో ఏకకణ జీవిగా ప్రారంభమై ఆ తర్వాత దాని అవసరాలు, ఆపై పరిసర ప్రభావాలు కారణంగా అనేక జంతుజాలాలుగా జల చరాలుగా,

పక్షులుగా చివరకు కోతుల ద్వారా మనిషిగా రూపాంతరం చెందిందని చెబుతారు. ఈ సిద్ధాంతాన్ని పరిశీలిస్తే మనకు కొన్ని విషయాలు అవగతమవుతాయి. ఒక జీవి తన జీవిత కాలంలోనే మరొక జాతి జంతువుగా రూపాంతరం చెంది ఉండాలి. లేదా ఒక జాతి జంతువుకు మరొక జాతి ప్రాణి పుట్టి ఉండాలి. ఇది మనం చూసి ఎరగము. అదే సిద్ధాంతాన్ని వృక్ష జాతికి కూడా వర్తింపజేయాలి కదా. జీవ పదార్థపు అవసరాల కారణంగానే నడవడానికి కాళ్ళు, చూడడానికి కళ్ళు, నమలడానికి పళ్ళు, వగైరాలు ఏర్పడ్డాయనుకుంటే ఏయే కోరికలు అవసరాలు కారణంగా వృక్ష సంతతి అభివృద్ధి చెందిందో కూడా చెప్పాలి. కాని అది సాధ్యంకాదు. కనీసం జంతుజాలం, వృక్షజాలం ఎన్ని రకాలో కూడా చెప్పడం ఎవ్వరికీ సాధ్యంకాదు. ఇంక వాటి నిర్మాణం గాని, వాటి లక్షణాలను గురించి కాని చెప్పే పనేలేదు. వాటి పేర్లు కూడా చెప్ప లేరు. వాటి నిర్మాణ విశేషాలను, వాటి లక్షణాలను వివరించలేనప్పుడు అవి గత జన్మలో ఏ జంతువులో ఇప్పుడు ఈ రూపంలోకి ఎలా మరియు ఎందుకు ఏ దిశలో రూపు దిద్దుకున్నాయో చెప్పడం ఎవరితరం గాదు.

ప్రకృతి శక్తుల కలయిక వల్లనే జీవం ఆవిర్భావం జరుగుతుందని అనిపిస్తుంది. ఉదాహరణకు వరి బియ్యంలో లేదా వరి తవుడులో ఒక రకమైన కీటకం ఆవిర్భవిస్తుంది. అలాగే పెసలనుండి ఒక రకమైన పురుగు, కందులలో మరో రకమైన పురుగు, కుళ్లిన పాలలో మరో రకమైన పురుగు, వివిధ రకాలైన ఆహార పదార్థాలు భుజించినప్పుడు మనిషి కడుపులో సైతం అనేక రకాల బ్యాక్టీరియా మరియు క్రిములు ఆవిర్భవించడం అందరికి తెలిసిన విషయమే. ఒక్కొక్క కూరగాయ నందు, ధాన్యపు గింజ నందు, పండ్ల నందు, అనేక రకాల బ్యాక్టీరియా గాని క్రిములు గాని ఉద్భవించడం మనకు తెలుసు. అలాగే స్వైన్‌ఫ్లూ, డెంగ్యూ, జికా, కలరా, ఎయిడ్స్, ఆంత్రాక్స్ ఇలా అనేక కొత్త కొత్త బ్యాక్టీరియాలు, క్రిములు ప్రకృతిలో పుట్టుకొచ్చి చికిత్స లేని వ్యాధులు కలుగజేయడం మానవాళిని కలవర పెట్టే అంశమే కదా. అలాగే అనేక రకాల అరుదైన కొత్త జంతువులు ప్రపంచంలో ఎక్కడో ఒకచోట కనపడటం మనకు తెలిసిన విషయమే. అందువల్ల కొన్ని ప్రత్యేక పదార్థాలకు గాలి, నీరు, వెలుతురు, భూమి వంటి ప్రకృతి శక్తుల సంగమంతో విభిన్న జీవజాలం ఆవిర్భావం

జరుగుతుందని భావించడం సమంజసంగా ఉంటుంది. పైన ఎంత మాత్రం సూచిక లేని జామ పండులోను, మేడి పండులోను ఇలా అనేక రకాల జీవ, వృక్ష ఉత్పత్తులలో చిన్న, పెద్ద అనేక రకాల క్రిములను చూస్తూ ఉంటాము. మీకు అనుభవంలో ఉండే ఉంటుంది. ఒక్కొక్క సీజన్‌లో ఒక్కొక్క వాతావరణ పరిస్థితికి కొన్ని రకాల వృక్ష, జంతు జాలాలు ఆవిర్భవించి అంతర్ధానం అవుతూ ఉంటాయి. టేకు చెక్కలో సైతం చెదలు పుడుతూ ఉంటుంది. ఒక్కొక్క రకమైన మొక్కలపై ఒక్కొక్క రకమైన కీటకాలు అభివృద్ధి చెందుతూ ఉంటాయి. నీటిని నిలువ ఉంచితే చాలు ఆ నీటిలో బాక్టీరియాతో పాటు తల కప్పల వంటి అనేక క్రిమీ కీటకాలు వచ్చి చేరతాయి. అవి ఎక్కడ నుంచి ఎలా వస్తాయో కూడా తెలియదు.

మనుషులు, కోతులు, పులులు, ఏనుగులు, పక్షి జాతులు, జల చరాలు, డైనోసార్లు, క్రిమీ కీటకాలు ఇలా సర్వ చరాచర జీవరాసులు మనకు తెలిసిన భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం వంటి ప్రకృతి శక్తులైన పంచభూతాలతో పాటు మనకు తెలియని అనేక ప్రకృతి శక్తుల కలయికల కారణంగానే ఆవిర్భవించి ఉండవచ్చు. అలాగే వాటికి అనుకూలమైన వాతావరణం అంతరించగానే అవి కూడా అంతరించి పోతూ ఉంటాయని ఊహించడం సమంజసం. ప్రకృతి శక్తులైన గాలి, నీరు, వేడి, వెలుతురు వల్ల జరిగింది కాబట్టే ప్రపంచమంతా ఒకేసారి అమీబాలైనా, పక్షులైనా, జంతువులైనా, మనషులైనా పుట్టి ఉండవచ్చు. గాలి, నీరు, వెలుతురు కాబట్టే ఖండాంతరాలు దాటి అతి తేలికగా ప్రసరించగలుగుతాయి. అలా కాక ఎక్కడో ఒకచోట పుట్టిన జంతువులు ఖండాతరాలు దాటి ప్రయాణించి తమ జాతినభివృద్ధి చేసాయనుకునే అవకాశమే లేదు. ప్రకృతి శక్తుల ద్వారానే జీవం అవతరిస్తుంది, వృద్ధి చెందుతుంది, అంతరిస్తుందని నా అభిప్రాయం.

మనుషులకు గులాబి పువ్వు కణం నుంచి గులాబి చెట్టు సృష్టించే క్లోనింగు ప్రక్రియ వరకే తెలుసు. ప్రకృతికి గులాబి వాసన కలిగియున్న గాలికణం నుంచి కూడా గులాబిని సృష్టిస్తుందని, మానవుల ఆలోచనకు కూడా రూపం ఇవ్వగలదని నా అభిప్రాయం. ఎందుకంటే మానవుని ఆలోచనే అతని వాసన. అందుకే మంచి ఆలోచనలతో యజ్ఞం చేయాలి. ఋత్విక్కుల సాక్షిగా ప్రకృతి

శక్తులను హవ్యకవ్యాలతో సంతృప్తి పరచి శాంతిమంత్రాలు పఠించాలి. అంటే మీ సద్భావనలను ప్రకృతి శక్తులకు భక్తి, క్రియా పూర్వకంగా సమర్పించాలన్నమాట. అవి ఏదో ఒక రోజు ఏదో ఒక చోట తప్పనిసరిగా రూపు దిద్దుకుంటాయి. ఆ విధంగా సంస్కారవంతమైన భావి మానవజాతి ఆవిర్భావానికి దోహదమౌతుంది. డార్విన్ సిద్ధాంతం కూడా ఇదే కదా. జీవపదార్థం యొక్క ఆశలు, అవసరాల వల్లనే జీవ పరిణామం జరుగుతుందనే కదా. అందుకే సదాచారాలు, యజ్ఞ యాగాదులు ఆచరించడం అవసరం. అలాగే సంతృప్తినొందిన ఋత్విక్కులు మీకందించిన ఆశీర్వాదాలు మీకూ తప్పక ఫలిస్తాయి. దాదాపు మానవ లేదా జీవ పరిణామ దశలన్నీ ప్రపంచమంతటా ఒకే స్థాయిలో ఉండటం, వారు నివసించే వాతావరణాన్ని బట్టి వేరు వేరు వర్ణాలు కలిగి ఉండటం, వేరు వేరు లక్షణాలు కలిగి ఉండటం చూస్తే వాతావరణ శక్తుల ద్వారానే జీవం ఆవిర్భవిరచి, జీవం కొనసాగిస్తున్నదని అత్యంత తేలికగా అర్థం చేసుకోవచ్చు. మనిషి నుండి మనిషి, లేదా జంతువు నుండి జంతువు పుట్టడం భూమండలమంతా ఒకేలా జరగడం వాతావరణం ద్వారా తప్ప ఇతరత్రా జరిగే అవకాశమే లేదు.

ఒక పూతోటలో ఒక పుష్పముందనుకోండి. దానికి యుక్తవయస్సు రాగానే చక్కని రూపంతో, రంగు రంగులతో రెక్కలు విచ్చుకుంటాయి. మకరందం తయారవుతుంది. పరాగరేణువులు తయారవుతాయి. వాటిపై జిగురు తయారవుతుంది. ఆ పూవులో ఉన్న మకరందం ఒక మధుపానికి అవసరమౌతుంది. ఆ పుష్పం ఇక్కడున్నానోచ్ అంటూ తన ఉనికి ఒక సువాసన ద్వారా ఆ తుమ్మెదకు కబురు పంపిస్తుంది. ఆ తుమ్మెద పరుగు పరుగున రాగానే సుతిమెత్తని రంగు రంగుల రెక్కలతో సాదరంగా ఆహ్వానం పలుకుతుంది. అలా వచ్చిన తుమ్మెదకు తన వద్దగల మకరందం విందుగా అందిస్తుంది. ఈ లోగా పనిలో పనిగా ఆ పుష్పం పైనున్న పరాగ రేణువులు తుమ్మెద కాళ్ళకు అంటుకుంటాయి. ఆ తుమ్మెద అక్కడ నుంచి ప్రక్కతోటలో ఉన్న మరొక పుష్పం ఆహ్వానం అందుకొని అక్కడకు చేరుకుంటుంది. తన కాళ్ళకు ఉన్న పరాగరేణువులు రెండవ పుష్పం మీదకు చేరుతాయి. అక్కడ పరపరాగ సంపర్కం జరిగి, ఫలదీకరణం చెంది, ఫలాలు, వీటి నుంచి విత్తనాలు వృద్ధి చెందుతాయి.

ఆ పూవు యొక్క సంతాన విస్తృతి జరుగుతుంది. ఈ వృత్తాంతంలో మొదటి పూవుకు తెలుసా మరోపూవు ప్రక్క తోటలో ఉందని, దానికి తన పరాగ రేణువులు కావాలనీ, వాటిని తుమ్మెద ద్వారా పంపవచ్చని? ఇలాంటి కార్యక్రమం చేస్తున్నానని తుమ్మెదకు తెలుసా? బహుశా తెలిసే ఉండొచ్చు లేదా తెలియక పోవచ్చు. కానీ, అవి అలా ప్రవర్తించడం అనివార్యం. ఆ తుమ్మెదకు ఆకలి, కోరిక, పూతీగెలకు తమ సంతాన వ్యాప్తి జరగాలనే కోరిక ప్రకృతి ప్రణాళికే.

తన ప్రణాళికను నెరవేర్చుకోవడానికి వృక్షాలను, కీటకాలనే వదలని ప్రకృతి మనుషులైన మనలను ఎలా వదిలి పెడుతుంది. అందుకే ప్రతి మనిషి చేసే ప్రతి పని ఆ ప్రకృతి ప్రణాళికలో ఒక భాగమే ననిపిస్తుంది. పుష్పం యొక్క జాతి వృక్ష జాతి. తుమ్మెదది కీటక లేదా జంతు జాతి. ఒకరి భాష ఒకరికి తెలియదు. కాగల పని గంధర్వులు తీర్చినట్లు ప్రకృతి మాత్రం తనకు కావాల్సిన పనిని తుమ్మెదతో చేయించుకున్నది. అందువల్ల ప్రకృతిలో జరిగే పనులకు నేను కారణం లేదా నువ్వు కారణం అని భ్రమించే వ్యక్తులకు భ్రమరపుటుదంతమే సమాధానం. ఎక్కడో కాశ్మీర్‌లో పండిన యాపిల్ పండు కన్యాకుమారిలోని వ్యక్తికి చేరుతున్నదంటే ఇదే కారణం. నీటి ఒడ్డున పెరిగే కొబ్బరి చెట్టు కాయలు నీటి ప్రవాహంలో తేలుతూ వెళ్లి మరొక చోట మొలకెత్తేలా కొబ్బరికాయ చుట్టూ పీచును ఏ వ్యక్తి కూడా రచించి ఉండలేదు. అది ప్రకృతి రచన. అలాగే విత్తన వ్యాప్తికి, సంతాన వ్యాప్తికి జీవ, వృక్ష జాతులు అనుసరించే రీతులు మానవ నిర్మితాలు కావు. అంటే వృక్ష జాతులలో గాని, జంతు జాతులలో గాని, మానవ జాతులలో గాని, ఒక్క మాటలో చెప్పాలంటే సర్వ చరాచర జీవరాసులలో జరిగే పరిణామాలన్ని ప్రకృతి విరచితాలే.

ఒక ఆవు పచ్చిక మేస్తూ ఉన్నప్పుడు అనేక ఆకు పచ్చని మొక్కలు అడ్డు వస్తూ వుంటాయి. ఆవులు అన్నింటినీ వదలి తమకు కావలసిన అహారపు మొక్కలనే తింటాయి. వాటికి ఏ మొక్క తినవచ్చో, ఏది తినకూడదో ఎలా తెలిసింది? అలాగే ఒక ఆవు ఒక పామును చూచిందంటే భయపడుతుంది. దానికెలా తెలుసు అది పాము అని, దాని కోరల్లో విషముంటుందని. ఇంతెందుకు సింహమైనా సరే, పామును చూస్తే దూరంగా తొలగిపోతుంది. అలాగే ఒక పిచ్చుక పెట్టుకున్న గూడును పరిశీలించండి. ఆ అల్లికలో ఎంతటి ఇంజనీరింగ్

పరిజ్ఞానముందో, ఎంతటి కళాత్మకత ఉందో. గూడును అల్లడానికి అవి ఎంచుకున్న పోగులను చూడండి. ఎన్నో రకాల పోగులు లభ్యమైనా అవి కొన్ని జాతుల వృక్షాల పోగులెంచుకుంటాయి. అవి ఎంత లావుగా ఉండవచ్చు, ఎంత పొడవుగా వుండవచ్చు ఖచ్చితంగా నిర్ధారిస్తాయి. ఆపై ఆ గూడును పెట్టే స్థల నిర్ణయం వాటి మేధాశక్తికి చక్కని సూచిక. పిల్లులు, పాములు వగైరా రాగలిగే గట్టి కొమ్మలపై పెట్టవు. చెట్ల చివరి కొమ్మలకు గూడు జారని విధంగా అల్లి నిర్మిస్తాయి. వీలైనంత వరకు బావుల పైన వేలాడే కొమ్మలకు పెడతాయి. అంటే క్రింద నించి ఏ జంతువుకూ అందని విధంగా నన్నమాట. ఆపై గ్రుడ్లు, పిల్లలూ జారి పడకుండా చక్కని వంపును నిర్మిస్తాయి. గాలితగిలే విధంగా నిర్మిస్తాయి. ఆ గూళ్ళు గాలికి ఊయలలా ఊగినా గ్రుడ్లకూ, పిల్లలకూ హాని జరగకుండా, ఊడిపడకుండా నిర్మిస్తాయి. ఏ ఇంజనీరింగ్ కాలేజీకి పోయి సామూహికంగా అవి అలాంటి విద్య నేర్చాయి? ఆ గూటి నిర్మాణంలో వున్న విషయాలు అంటే వస్తువుల ఎంపిక, వాటి పరిమాణాలు, సేకరణ విధానాలు, అల్లిక విధానాలు, నిర్మించవలసిన కాలాలు, నిర్మించవలసిన స్థలాలు, అలానే ఎందుకు చేయాలో అని వివరంగా వివరించాలంటే కొన్ని వందల పేజీల సాంకేతిక విద్యా గ్రంథమవుతుంది. ఇలాంటివే కొన్ని విద్యలు మానవులకు కూడా పుట్టుకతోనే పట్టుబడతాయి.

కనబడేది, వినబడేది సర్వం ప్రకృతి శక్తియేనని, ప్రతి దృశ్యము, ప్రతి సంఘటన ఆ ప్రకృతి శక్తి సృష్టించిన అద్భుతాలేనని భావించినపుడు అద్భుతాలు జరగవు అని వాదించడం సహేతుకం కాదు. సముద్ర క్షార జలాలు శుద్ధి చేయబడి ఆకాశ మార్గంలో పయనించి సుదూర ప్రాంతాలలో ఉన్న జీవరాశికి అందిచడం, పంటలు పండించడం, జీవానికవసరమైన గాలి, వెలుతురు, నీరు, అందించడం ప్రకృతిలో జరిగే అద్భుతం కాదా. అలాగే సూర్యాది నవగ్రహాలు అత్యంత వేగంగా క్షణం తేడా రాకుండా భ్రమణ పరిభ్రమణాలు చేయడం మానవులుగాని, వారి శాస్త్ర పరిజ్ఞానం కాని చేయగలుగుతుందా. ఒక్క క్వింటాలు రాయిని కదిలించాలంటేనే ఎంతో శక్తి అవసరం. గ్రహాలు అత్యంత వేగంగా భ్రమణ పరిభ్రమణాలు జరపాలంటే ఎంత శక్తి అవసరమౌతుందో మానవ మేధస్సుకు అందే విషయమే కాదు. ఇలా చెబుతూ పోతే ప్రకృతిలో ప్రతి క్షణం ఓ అద్భుతం జరుగుతూనే ఉంటుంది.

అలాగే విశ్వమే భగవంతుడని భావించిన తర్వాత భగవంతుడు ఉన్నాడా లేడా అనేది పిచ్చి ప్రశ్న. విశ్వ లక్షణాలను దాని ప్రవర్తనారీతులను వివరించేదే వేదం. అలాగే జీవునికి దేవునికి గల సంబంధాన్ని వివరిస్తూ భగవంతుని పట్ల మానవుల ప్రవర్తనారీతులను కూడా వేదం వివరిస్తుంది. విశ్వం హార్డ్‌వేర్ అనుకుంటే వేదం సాఫ్ట్‌వేర్. వేదం ఒకప్పుడు ఉండవచ్చు మరొకప్పుడు లేకపోవచ్చు. వేద పరిజ్ఞానం పరిధులు కూడా దేశ కాలాలను బట్టి, వ్యక్తులను బట్టి మారుతూ ఉంటుంది. పరిణామ గతమైన విశ్వం మాత్రం శాశ్వతం.

ప్రకృతిలోని కొన్ని విషయాలు విశదీకరించడమే గొప్ప విషయమయితే ఆ ప్రకృతి పుస్తక రచయిత విజ్ఞానం ఎంత ఉండాలి? ఎన్ని కోట్ల వాట్ల విద్యుదుత్పత్తి కేంద్రాలు కావాలి ఉరుములు, మెరుపులు సృష్టించాలంటే. ఉరుములు, మెరుపులు ప్రయోజనం లేకుండా జరుగుతున్నాయంటే నేను నమ్మను. ప్రకృతి ప్రతి చర్యకు ఏదో ఒక అర్థం, పరమార్థం ఉంటుంది. ఉరుములు, మెరుపులు ఎలా సంభవిస్తాయో శాస్త్రజ్ఞులకు తెలుసు కానీ అవి ఎందుకు, ఏ ప్రయోజనం కోసం జరుగుతున్నాయో వారికి తెలియదు. తార్కిక వాదులు వాదించే శాస్త్రీయ విజ్ఞానం గత వేయి సంవత్సరాలలో అభివృద్ధి చెందినదే. కానీ విశ్వానికి, మానవ జాతికి అనేక కోట్ల సంవత్సరాల చరిత్ర ఉంది.

పాపపుణ్యాల ప్రస్తావన, స్వర్గ నరక ప్రస్తావన, జన్మ పునర్జన్మల ప్రస్తావన, సన్న్యాసము ఇంచుమించు ప్రపంచంలోని అన్ని మతాల్లోను ఉన్నాయి. హిందూ, బౌద్ధ సన్యాసులు, మక్కాను సందర్శించే ముస్లింల వేషధారణ కూడా ఒకేలా ఉంటాయి. ఈ జన్మలో లభించే స్థానం గత జన్మ పాప పుణ్యఫలమని ఎలా నిరూపిస్తారు? చనిపోయిన వారెవరైనా తిరిగి బ్రతకడం చూచారా అని ప్రశ్న సమంజసమే కానీ వాస్తవాలు దృశ్యంగా లేనపుడు వాస్తవాన్వేషణకు ఊహలనాలంబన చేసుకోవడం తప్పు లేదు, తప్పేది కాదు. ప్రతి మనిషి బాహ్య లక్షణాలు ఒకటే అంటే తల, రెండు కాళ్ళు, రెండు చేతులు వగైరా. కానీ అంతర్గత లక్షణాలు ఒకలా లేవు. ఒకే కుటుంబంలో అదే తల్లిదండ్రులకు జన్మించిన సంతానంలో కూడా విరుద్ధ లక్షణాలు గోచరిస్తాయి. ఒకరు పిరికివారు, ఒకరు ధైర్యవంతుడు, ఒకరు లోభి మరొకరు దానశీలి, ఒకరు దయామయులు,

మరొకరు క్రూరస్వభావులు, ఒకరు నిజాయితీ పరులు మరొకరు అవినీతి పరులు ఇలా ఇంకా అనేక విరుద్ధ లక్షణాలను కలిగి ఉంటారు. అదే తల్లిదండ్రులకు జన్మించారు. అదేవిధంగా ఒకే కుటుంబంలో పెంచబడ్డారు. ఈ వైరుధ్యాలెందుకు వచ్చాయంటే వాడి పుట్టుకతోనే వచ్చాయని అర్థం చేసుకోవచ్చు. మరి పుట్టుకతో అలాంటి వాడెందుకయ్యాడంటే పూర్వజన్మ సుకృతం అనే కన్నా మరొక సమాధానం దొరకదు.

గతంలోనే చర్చించుకున్నాం. జన్మతః జంతువులకు అనేక లక్షణాలు, తెలివితేటలు వచ్చినాయని. అంటే జన్మతఃనే కొన్ని లక్షణాలొస్తాయి. అవి జన్మతః సంస్కార ఫలంగానే వస్తాయని ఊహించుకోవచ్చు. ఒక ఆవు మొదటి సారిగ దూడను కన్నప్పుడు కూడా మలమూత్రములవలే వదిలి వెళ్ళదు. దూడను నాకి శుభ్రం చేసి పాలిచ్చి వెంట తీసుకొని పోతుంది. దూడను రక్షించడానికి అవసరమైతే ప్రాణాలకైనా తెగిస్తుంది. మానవులైతే కాన్పుల గురించి పిల్లల పెంపకం గురించి నర్సింగ్ కాలేజీలలో చదువుకుంటారు. తల్లి ఆవు ఎక్కడ నేర్చుకుంది? అంటే దానికి ఆ పరిజ్ఞానం జన్మతఃనే సంక్రమించింది. అలాగే ఒకొక్కరికి ఒకొక్క విషయంలో అద్భుతమైన ప్రతిభ పుట్టుకతోనే పట్టుబడుతుంది. ఉదాహరణకు మనం ఎంత ప్రయత్నించినా ఘంటసాలలాగ పాడలేము. శకుంతలా దేవిలా గణితం చేయలేము. కొందరికి పుట్టుకతోనే కొన్ని ప్రత్యేకతలు సంతరించుకుంటాయి. ఇతరులకు ఎందుకు సంక్రమించవు? అంటే పూర్వజన్మ సుకృతం అనే కంటే వేరే సమాధానమే లేదు.

డార్విన్ సిద్ధాంతంలో కూడా ఒక జీవి తన జీవిత కాలంలో హఠాత్తుగా మరో జీవిగా మారటం అసాధ్యం. మార్పులేవైనా జన్మజన్మాంతర ప్రక్రియల ద్వారానే జరుగుతాయని అర్థమవుతున్నది. అందుకే ప్రస్తుత జన్మలో కోర్కెలను, అవసరాలను అదుపులో పెట్టుకుంటూ సద్భావనలతో జీవితం గడపడం ద్వారా భావి జీవితాలను సంస్కరించుకొనవచ్చుననేది భారతీయ భావన. అందు నిమిత్తం నిర్ణయించినవే ధ్యానము, యోగము, ఆహారనియమాలు, ఆచారాలు, వర్ణ, ఆశ్రమ ధర్మాలు. నీరు ఒక చోట ఇంకిపోయి మరొక చోటకు భూమిలోపల ప్రయాణించి మరొక చోట ఆవిష్కృత మౌతుంది. తాను ప్రయాణించిన మార్గంలో అనేక లక్షణాలు సంతరించుకొంటుంది. కొన్ని లక్షణాలను

పోగొట్టుకుంది. అలాగే మనిషి ప్రాణం ఒకచోట పోయి మరొక చోట ఆవిష్కృతమౌతుంది. అంటే దానికి చావులేదు. ఆ జీవి జీవన ప్రయాణంలో కొన్ని లక్షణాలు సంతరించుకొంటుంది. కొన్నింటిని వదిలించుకుంటుంది. అది ఆ జీవి ప్రయత్న పూర్వక సంస్కారాన్ని బట్టి ఉంటుంది. అందుకే మనసును సంస్కరించుకొనే ఆహార, ఆచార, వ్యవహారాల ప్రాముఖ్యత.



# 11. సనాతన విజ్ఞానమంతా మూఢనమ్మకమేనా?

పరిపాలనలో రూల్ ఆఫ్ లా ఉండాలన్నది నేటి సిద్ధాంతం. అలాగే గతంలో ధర్మమే పరిపాలించాలన్న నియమముండేది. వర్ణాశ్రమ ధర్మాలలో భాగంగా రాజులకు కూడా ధర్మనిర్దేశం జరిగింది. ప్రశ్నించ వీలులేని అధికారాలు కలిగిన రాజులను నియంత్రించడానికి ధర్మబోధ, పాప భీతి తప్ప మార్గమేది? ప్రభువులను గాని ప్రజలను గాని నియంత్రించడంలో ధర్మాధర్మ స్పృహ చాలా అవసరం. పాపం, పుణ్యం, స్వర్గం, నరకం, జన్మ, పునర్జన్మ, అదృష్ట, దురదృష్టాలు, భగవంతుని ఉనికి మానవుని సక్రమమార్గంలో నడిపించడానికి తప్పనిసరిగా దోహదపడతాయి. అవన్నీ సనాతనం కాబట్టి తప్పు, సంస్కృతంలో ఉన్నాయి కాబట్టి తప్పు, బ్రాహ్మణ కులం చెబుతున్నది కాబట్టి, వాడుక భాషలో ఉన్నవి, ఇంగ్లీషులో ఉన్నవే వాస్తవాలని భావించేవారు ఆత్మ వివేచన చేసుకోవలసిన అవసరం ఉంది. కాలాలు మారుతున్న కొద్దీ భాషలు, సంస్కృతులు, సామాజిక సిద్ధాంతాలూ పరివర్తన చెందుతూనే ఉంటాయి. నదులలో నాలాలు కలిసినట్లు కాలప్రవాహంలో సనాతన ధర్మంలోను, జ్ఞానంలోను, ఆచారాలు, అనాచారాలు, నమ్మకాలు, మూఢనమ్మకాలు ప్రక్షిప్తమౌతూనే ఉంటాయి. అందువల్ల సనాతన ధర్మం సర్వస్వం వర్జనీయమని వాదించడం అజ్ఞానం. ఇలా ఆచారాలను నమ్మకాలను ఆశ్రయించడానికి కూడా అన్య ధర్మాల దాడులలో స్వధర్మం నాశనం కావడమే కారణం.

జ్యోతిష్యం విషయానికి వస్తే, మరుసటి సంవత్సరం ఏ రోజున, ఎన్ని గంటల, ఎన్ని నిమిషాలకు చంద్రగ్రహణం లేదా సూర్యగ్రహణం ఏర్పడతాయో భారతీయ సనాతన పరిజ్ఞానంతో పంచాంగకర్తలు చెబుతున్నారు. అంటే గ్రహ గతులను క్షుణ్ణంగా అధ్యయనం చేసినట్టే కదా. గెలీలియో టెలిస్కోపు

కనిపెట్టకముందు కూడా ఈ పరిజ్ఞానం భారతదేశంలో ఉంది. ప్రతి రోజు సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాలు కూడా ఖచ్చితంగా గంటలు, నిమిషాలు, సెకనులతో పంచాంగంలో పొందుపరుస్తున్నారు. గ్రహ గతులను బట్టి ఆరు ఋతువులనీ, నాలుగు కాలాలనీ, ఒక్కొక్క ఋతువు ధర్మమిది యని కూడా గ్రహించారు. ప్రతి గ్రహం యొక్క రంగు, పరిమాణము, స్థానము కూడా పంచాంగ పరిజ్ఞానమున్న ఏ బ్రాహ్మణుడైనా చెప్పగలడు. సంవత్సర కాలాన్ని ఋతువులుగా, మాసాలుగా, వారాలుగా, రోజులుగా, ఘడియలు, విఘడియలుగా, రాశులను పన్నెండు రాశులుగా, తొమ్మిది గ్రహాలుగా గుర్తించారు.

గ్రహగతులకు జన జీవనానికి తప్పనిసరిగా సంబంధముంది. భూమిపై రెండు వంతుల నీరు, ఒక వంతు భూమి ఉంది. మానవ శరీరంలోను రెండొంతులు నీరు, ఒక వంతు ఘన పదార్థాలు. ఆయా ఘన పదార్థాలు కూడా అచ్చం భూమిలో ఉన్నటువంటివే. ఉదాహరణకు ఐరన్, కాల్షియం, పొటాషియం, మెగ్నిషియం, వగైరా. అమావాస్య, పౌర్ణమికి సముద్రం ఆటుపోటులకు గురవుతూ ఉంటుంది. మనిషి మస్తిష్కం అంతే. అమావాస్యకు, పౌర్ణమికి పిచ్చి వాడికి ప్రకోపం వస్తుంది. ఒక సర్వే ప్రకారం అమావాస్య, పౌర్ణమినాడే ఎక్కువగా రోడ్డు ప్రమాదాలు జరుగుతుంటాయి. అంటే గ్రహాలు భూమిపై ప్రభావం చూపిస్తాయని దానర్థం. అలాగే ఒక్కొక్క గ్రహ లక్షణమేమిటి, భూమిపై దాని ప్రభావమేమిటనే విషయాన్ని కూడా భారతీయ శాస్త్రాల అధ్యయనం సరియైనదేనని అనిపిస్తుంది. పరిజ్ఞానం మాత్రం వ్యక్తిగతం. గ్రహణాలు కూడా మనుషులపై ప్రభావం చూపుతాయని శాస్త్రాలు కూడా చెబుతూనే ఉన్నాయి.

మరొక ఆధారమేనగా మన ఆచారపు అలవాట్లు గమనించవచ్చు. కార్బోహైడ్రేట్ కోసం బియ్యం, గోధుమలు, జొన్న, మొక్కజొన్న మరియు ఇతర తృణ ధాన్యాలు భుజించడం, ప్రోటీన్ కొరకు మాంసం లేదా పప్పు భుజించడం, విటమిన్స్ మరియు మినరల్స్ కోసం కూరగాయలు పండ్లు తినడం, ఔషధ విలువల కోసం పోపు వస్తువులు వాడటం మన దేశానికి విదేశీయులు రాకముందు నుంచి ఉన్నదేకదా. అంటే మానవ శరీర అవసరాలు,

ఔషధాలు చక్కగా అభ్యసించినట్లేకదా. భోజనంలో చివరగా మజ్జిగన్నం తినాలన్నది భారతీయ సాంప్రదాయమే కదా. కాగా ఆహార నిపుణులు ఇప్పుడు తెలుసుకున్నారు. ఆహారంలో చివరగా మజ్జిగన్నం తినడం వల్ల తీసుకున్న ఆహారం నుండి ఇనుప ధాతువును రక్తం బాగా గ్రహిస్తుందని. ఇదంతా స్వదేశీ పరిజ్ఞానమే కదా. కాకుంటే పూర్తి పరిజ్ఞానం లేకుండానే వాస్తు, జ్యోతిష్యాలు లౌక్యంగా ఏదో చెప్పి పొట్టపోసుకునే వారుండవచ్చు. అది లాయర్లు, వైద్యం ఇట్లాంటి అన్ని వృత్తుల వారిలోను ఉంటుంది. అంతమాత్రాన ఆయా శాస్త్రాలన్నీ తప్పని విమర్శించడం లేదా విస్మరించడం అవివేకమే అవుతుంది.

50 సంవత్సరాల క్రితం చదివినట్లు గుర్తు. *బాలర్కో ప్రేత ధూమశ్చ వృద్ధ స్త్రీ పల్వలోదకం రాత్రౌ దధ్యాన్న భుక్తిశ్చ ఆయుర్వృద్ధిర్దినేర్దినే. వృద్ధార్కో హెూమ ధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకం రాత్రౌ క్షీరాన్న భుక్తిశ్చ ఆయుర్వృద్ధినేదినే.* అనగా ఉదయంపూట ఎండకాగడం, శవాలపై నుండి వచ్చే గాలి పీల్చటం, తనకంటే పెద్దదైన స్త్రీతో సంగమించడం, ఆకులు మురిగిన నీరు త్రాగటం, రాత్రిపూట పెరుగన్నం తినటం వల్ల రోజురోజుకి ఆయుషు క్షీణిస్తుంది. అలాగే సాయంత్రపు ఎండకాగటం, హెూమం నుండి వచ్చే పొగను పీల్చుటం, తనకంటే చిన్నదైన స్త్రీతో సంగమించడం, నిర్మలమైన నీరు త్రాగటం, రాత్రి పూట పాలన్నం తినడం వల్ల రోజురోజుకి ఆయుష్షు వృద్ధి చెందుతుంది. కాగా ఆహార నిపుణులు ఈమధ్య మధ్యాహ్నం పెరుగన్నం తినమని, రాత్రులు పాలన్నం తినమని ప్రచారం చేయడం మనం చూస్తున్నాం. అలాగే పసిపాపలను కొంతసేపు ఉదయపు టెండలో ఉంచమని వైద్యులు చెప్పడం నేను విన్నాను. వాస్తవానికి అది సరియైనది కాదని ఈ మధ్యనే ఒక పత్రికలో చదివాను. ఆ విషయం నాకు వ్యక్తిగత అనుభవం కూడా. *వినదగునెవ్వరు చెప్పిన వినినంతనే వేగపడక వివరింపదగున్ కని కల్ల నిజము తెలిసిన మనుజుడేపో నీతిపరుడు మహిలో సుమతి* అని బద్దెన గారు 600ల సంవత్సరాల క్రితమే వ్రాసాడు. ఆ మాత్రం వివేకం ఆధునిక మేధావులకు లేకపోతే ఎలా?

వాస్తవానికి మన పూజాదిక విధానాలలో మండపారాధనలో భాగంగా నవగ్రహారాధన చేస్తారు. ఆ క్రమంలో బ్రాహ్మణులు నవగ్రహ మంటప మధ్యభాగంలో సూర్యగ్రహాన్నే ఆవాహన చేస్తారు. అంటే సనాతన భారతీయ

విజ్ఞానంలో సూర్యకేంద్రక సిద్ధాంతమే అమలులో ఉందనేది స్పష్టం. క్రీ॥శ॥ 150వ సంవత్సరం ప్రాంతంలో టాలమీ అనే గ్రీకు శాస్త్రవేత్త భూకేంద్రక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈ సిద్ధాంతం ప్రకారం భూమి మధ్యలో ఉండగా గ్రహాలన్నీ భూమి చుట్టూ తిరుగుతుంటాయి. క్రీ॥శ॥ 1543 సంవత్సరంలో పోలెండు దేశానికి చెందిన కోపర్నికస్ అనే శాస్త్రజ్ఞుడు సూర్యకేంద్రక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈ సిద్ధాంతం ప్రకారం సూర్యుడు మధ్యలో ఉండగా గ్రహాలన్నీ సూర్యుని చుట్టూ తిరుగుతాయి. ఈ సిద్ధాంతాన్ని ప్రతి పాదించిన సంవత్సరంలోనే ఆయన గుండెపోటుతో మరణించాడు. లేకుంటే భూ కేంద్రక సిద్ధాంతాన్ని తప్పు పట్టినందుకు దానిని దుష్ప్రచారంగా భావించి మరణశిక్ష విధించేవారు. ఆ తరువాత క్రీ॥శ॥ 1610లో గెలీలియో అనే మరో గ్రీకు శాస్త్రవేత్త టెలిస్కోపు కనిపెట్టి గ్రహ మండలాన్ని అధ్యయనం చేసి కోపర్నికస్ ప్రతిపాదించిన సూర్యకేంద్రక సిద్ధాంతం సరియైనదని ప్రకటించాడు. అప్పటి వరకు క్రిస్టియన్ ప్రపంచం నమ్మిన భూ కేంద్రక సిద్ధాంతాన్ని ఖండించినందుకు క్యాథలిక్ చర్చ్ ఆయనకు జీవిత ఖైదు శిక్ష విధించింది. తమ తప్పును గ్రహించి చర్చి ఆయనకు 1992లో అంటే సుమారు 400ల సంవత్సరాల తర్వాత క్షమాపణ తీర్మానం రికార్డు చేసింది.

వాస్తు శాస్త్రం వాస్తవమా అని అడిగితే నేను అవుననే అంటాను. ఎందుకంటే దానిని ప్రతిపాదించిన వారు సుర్యాది నవగ్రహాల లక్షణాలను, కదలికలను, ఒక గ్రహంపై మరొక దాని ప్రభావాన్ని అవగాహన చేసుకున్న పండితులు కాబట్టి వాస్తుమూల గ్రంధాలు విదేశీ సంస్కృతుల ప్రభావం వల్ల కనుమరుగైనా తరతరాలుగా ఆచరణలో ఉన్నాయి కాబట్టి నమ్మడమే మంచిదని నా అభిప్రాయం. కొన్ని శాస్త్రీయ పరిశోధనలు ఋజువు చేయడానికి గణాంకాల నాశ్రయించడం మనకు తెలిసిందే. ఇది నాకు వ్యక్తిగత అనుభవంలో కూడా ఉన్నది. ఒకసారి నేను ఏదైనా ఇల్లు కొనాలని హైదరాబాదులో చాలా ఇండ్లు చూశా. ఇంచుమించు అవన్నీ కూడా తూర్పు ఆగ్నేయం, దక్షిణ ఆగ్నేయం, దక్షిణ నైరుతి, పశ్చిమ నైరుతి వీధిశూలలు కలిగి ఉండటం నేను గమనించాను. అలాగే ఆయా గృహాల చరిత్రలో అన్నింటిలోను ఇంటి పెద్ద అకాల మరణమే నేను గమనించాను. వాస్తుపరంగా మంచిగా ఉన్న గృహాలు అమ్మకానికి పెట్టినవి

బహు అరుదుగా ఉన్నాయి. అలాగే వాస్తు విరుద్ధంగా వున్న భవనాల్లో నడుస్తున్న వ్యాపారాలు గూడా అభివృద్ధి పూర్వకంగా లేకపోవడం మనం గమనించవచ్చు. వాస్తు సరిగా లేని గృహ ప్రదేశాలలో కూర్చుంటే నాకు చాలా అసౌకర్యంగా ఉండటం కూడా గమనించాను. ఇది నా ప్రగాఢ విశ్వాసం. దీనిని ప్రశ్నించే అధికారం హేళన చేసే అధికారం ఎవ్వరికీ లేదు. ఎవరికి నచ్చినమ్మాయిని వాడు వివాహం చేసుకుంటాడు. ఏం చూసి చేసుకున్నావని ఎవడో ఒకడు నిలదీస్తే ఎలా? ఇతరుల నమ్మకాలను గౌరవించడమే సంస్కారం.

వీధిశూల విషయంలో నేను గమనించిన మరొక విషయం కూడా మనవి చేస్తాను. రోడ్డు వెంబడి ప్రయాణించిన వాహనం మూలమలుపు వద్ద ప్రక్కకు తిరుగుతుంది. కానీ దాని వేగానికి దాని వెంట వచ్చిన దుమ్ము, ధూళి, పొగ మాత్రం అదే మార్గంలో ప్రయాణించి ఎదురుగా ఉన్న గృహంలోనికి చేరుతుంది. ఇది ఆరోగ్యకరమైన విషయం కాదుకదా! అలాగే వీచే గాలులు రోడ్డుకిరుప్రక్కల గృహాలుండటం వలన రోడ్డు వెంబడే ధారాళంగా ప్రసరించి దుమ్ము, ధూళితో సహా రోడ్డుకెదురుగా ఉన్న ఇంట్లోకి ప్రసరిస్తుంది. ఈశాన్యం వీధిశూల ఉన్నా ఇదే ప్రభావం కదా! మరి ఈశాన్యం వీధిశూల మంచిదని ఎందుకంటారని మీరు నన్ను ప్రశ్నించవచ్చు. తూర్పు, ఉత్తర దిశలలో పడమర దక్షిణాల కన్నా ఎక్కువ జాగా వదిలి గృహనిర్మాణాలు చేయాలని వాస్తు శాస్త్రజ్ఞులు చెబుతారు. ఇందువల్ల ఈశాన్యం వీధిశూల ద్వారా ప్రసరించే దుమ్ము, ధూళి ఇంటి ముందున్న ఖాళీ స్థలంలోకే ప్రసరిస్తుంది తప్ప ఇంటిలోనికి కాదు. ఇది నా తార్కిక ఆలోచన. గ్రహ స్థానాల పరిజ్ఞానం, దిక్కులపై వాటి ప్రభావం గ్రహించిన వాస్తునిపుణులు మరికొన్ని విషయాలు కూడా చెప్పగలుగుతారు.

అయితే ప్రకృతిలోని జీవులు, నిర్జీవులనే రెండు విభాగాలున్నాయి కదా? పుట్టుక, పెరుగుదల, ప్రత్యుత్పత్తి, మరణము, క్షోభ్యత, ప్రేరణ, ప్రతీకారము, ప్రేమ ఇలాంటి లక్షణాలు సజీవులకు కదా ఉంటాయి. మరి వాటిని సంతృప్తి పరచి మనం ప్రయోజనం పొందవచ్చు. మరి నిర్జీవులైన భూమ్యాకాశాది పంచభూతాలను, సూర్యాది నవగ్రహాలను ఒక్కొక్కసారి కొత్తగా కొనుక్కున్న వాహనాల లాంటి వాటిని కూడా పూజిస్తున్నారు, ఇది మూఢనమ్మకం కాదా అని కొందరు వాదన చేయవచ్చు. విశ్వమంతా ఒక్కటే. ఇందులో జీవులు,

నిర్జీవులనే రెండు విభాగాలు లేవు. సృష్టిలో ప్రతి పరమాణువు సజీవమే. అత్యంత శక్తివంతమే. ప్రతి పరమాణువు సర్వ సృష్టికి ప్రతినిధియే, ప్రతీకయే. సూర్యుని చుట్టూ గ్రహాలు పరిభ్రమించినట్లే ప్రతి పరమాణువు నందు కూడా న్యూట్రాన్లు, ప్రోటాన్లు, న్యూక్లియస్ చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. ఇది యాదృచ్ఛికం కాదు. సృష్టి ప్రతికణంలోను సారూప్య లక్షణాలు ఉంటాయి. జీవ పరిజ్ఞానాన్ని వినే వుంటారు. చర్మం నుండి గాని, వెంట్రుకనుండి గాని, గోరు నుండి గాని ఒక మనిషి శరీరంలోని ఏ భాగాన్నుంచయినా ఒక అణు మాత్రం తీసుకొని క్లోనింగ్ ద్వారా అదే ఆకారం గలిగిన మరొక మనిషిని తయారు చేయ వచ్చునని శాస్త్రజ్ఞులు నిరూపించిన విషయం మనకు తెలుసు. అంటే ప్రతి భాగంలోను ఆ రాశి పూర్తి లక్షణాలు నిబిడీకృతమై ఉంటాయని భావించవచ్చు. అంటే ఒక కారులో నైనా మరే ఇతర వస్తువులో నైనా ఉన్నది ప్రకృతియే. ఆ వస్తువు అలా రూపుదిద్దుకోవడానికి, దానికి అవసరమైన పరిజ్ఞానాన్ని మానవులకు కల్గించడానికి ప్రకృతిదే బాధ్యత.

ప్రకృతిని ఎందుకు ఆరాధించాలి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఎందుకు ఆరాధించాలి లేదా ఎందుకు వాటికి కృతజ్ఞతా పూర్వక నమస్కారం చేయాలో చెబుతాను. మనుషులకు, జంతువులకు బాధ, సంతోషం, ఆగ్రహం, అనుగ్రహం, ఈర్ష్యా, ద్వేషం ఇత్యాది లక్షణాలున్నాయి కదా. మెచ్చుకుంటే లేదా మేలుచేస్తే సంతోషిస్తారు. హింసిస్తే, అయిష్టం చేస్తే నొచ్చుకుంటారు కదా. ఇవే లక్షణాలు ఈ ప్రకృతికి కూడా ఉన్నాయి. ఎందుకంటే పాంచ భౌతికం శరీరమని మేధావులు ఒప్పుకుంటారు కదా. సుఖం, దుఃఖం, ఈర్ష్యా, ద్వేష భావనలు మనకు మాతృకలైన పంచ భూతాలకు లేకుంటే మనకు ఎక్కడనుంచి సంక్రమిస్తాయి. వృక్షాలకు కూడా సుఖ, దుఃఖాలున్నాయని జే.సి బోస్ అనే శాస్త్రజ్ఞుడు నిరూపించాడు కదా. అందువల్ల ప్రకృతిలో భాగమైన ఏ మనిషికి, జంతువుకి, ఏ వస్తువుకి నమస్కరించినా అది మనకు సంస్కారమే తప్ప తప్పుకాదు. దానికి ప్రతిఫలం కూడా తప్పకుండా ఉంటుంది. ఈ జన్మలోనా, మరొక జన్మలోనా ఎప్పుడైనా కావచ్చు. *ఏకం సత్ విప్రా బహుధా వదంతి, విద్వాన్ సర్వత్ర సమ దర్శనః* అన్న ఉపనిషద్వాక్యాలు వాస్తవాలనిపిస్తాయి.

ఏ సాధనకైనా ముందుగా సంకల్పం అవసరం. విలువిద్య నేర్వాలంటే రేగు బండునుగాని, రాయినిగాని, చెక్క ముక్కనుగాని, చిత్రపటాన్ని గాని దేనినైనా లక్ష్యంగా ఉంచి సాధన చేయవచ్చు. అలాంటిదే ఒక మూర్తి, రాముడైనా, శివుడైనా, అల్లా అయినా క్రీస్తు అయినా లక్ష్యం ఒక్కటే. మానసిక సాధన. ప్రశాంతతకోసం, లక్ష్య సాధన, పునశ్చరణ లేదా సంకల్పం కోసం విగ్రహం ఒక లక్ష్య సూచిక. అసహ్యమైన దృశ్యాలు అసహ్యాన్నే కలిగిస్తాయి. భయంకర శబ్దాలు భీతికల్పిస్తాయి. దుర్వాసనలు రోతకలిగిస్తాయి. ఇవి ఎదురవని వాతావరణం మంచిది. సంకల్పం లేనిది సాధనే లేదు. సంకల్పం మరియు సాధన క్రమంలో మనసును సంసిద్ధం చేయడానికి కొన్ని ప్రక్రియలు అవసరం. అందుకే విగ్రహారాధన లేదా పూజా కార్యక్రమంలో యజమాని శుభ్రంగా స్నానమాచరించి, పట్టువస్త్రాలు ధరించి, ఉపవాసదీక్షలో పూజా విధానాన్ని ప్రారంభించాలి. మనో వికారాలు కలగకుండా దృష్టి, మనసు కేంద్రీకృతం కావడానికి అందమైన విగ్రహం వుంచి, నయనానందం కలిగించడానికి పసుపు కుంకుమ వంటి రంగులనుపయోగించి, సువాసనకై పుష్పాలను సుగంధ ద్రవ్యాలను అగరుబత్తులను ఉపయోగించి, చెవుల కింపుగా మంగళవాయిద్యాలను ఉపయోగించి, బంధుమిత్రుల నాహ్వానించి, భోజన చందన తాంబూలాది సత్కారాలనాచరించి సంతృప్తి చెందిన వారి ఆశీస్సులతో తమపని నెరవేరాలని సంకల్పం చెప్పుకొని మనసా వాచా కర్మణా కోరుకుంటాడు. ఈ ప్రక్రియలో బ్రాహ్మణుడికి సంభావన ఇచ్చి సంతృప్తి పరుస్తారు. చందన తాంబూల భోజనాది సంభావనలతో సంతృప్తి చెందిన బ్రాహ్మణుడు గృహస్తును నిండు మనస్సుతో మనోవాంఛా ఫలసిద్ధిరస్తు, అవిఘ్నమస్తు అంటూ దీవిస్తాడు.

నిండు మనస్సుతో ఇచ్చిన దీవెనలకు, బాధాతప్త హృదయంతో ఇచ్చిన శాపాలకు తప్పని సరిగా ఫలితముంటుంది. అందునా సాత్వికాహారంతో వైదిక పక్రియలతో అనునిత్యం మనోసాధన చేసే విప్రుని పట్ల ఈ విషయం మరీ సత్యం. శారీరక వ్యాయామం చేసే వానికి శారీరక శక్తి సమకూరినట్లే ధ్యాన యోగాది మనో వ్యాయామాలు చేసే వారికి మనో శక్తి సమకూరటం కూడా సర్వ సహజం. ఈ ప్రక్రియలో కిలో బియ్యమో, కొబ్బరి చిప్పలో, చిల్లర

పైసలో బ్రాహ్మణుడికి చెందుతాయి. ఆ విషయాన్ని ఒక అంశంగా తీసుకొని దుష్ప్రచారం చేయడం ఎంతవరకు సమంజసం? ఏదైనా సాధించాలంటే సంకల్పం, ఆత్మవిశ్వాసం అవసరం. అవి లేకుంటే సాధనే అసాధ్యం. ఐనా ఇచ్చే వాడు ఇస్తుంటే వేరేవాడికెందుకంటా ఏడుపు? భారతీయ సనాతన విజ్ఞానం అపారమైనది. విదేశీయుల పాలనలో లుప్తమైంది.

వాస్తవానికి భారతీయులది వైదిక మతం లేదా వేదాధారిత జీవన విధానం. వేదాల ప్రకారం భగవంతుడు అవాఙ్మానస గోచరమైన బ్రహ్మ పదార్థము, నామరూప రహితము. సృష్టి స్థితి లయలకు కారణభూతము. అట్టి భగవత్ స్వరూపానికి ప్రతీకలే ప్రకృతి శక్తులు. అందుకే వైదికులు సూర్యాది నవగ్రహాలను, భూమ్యాకాశాది పంచ భూతాలను, వాటికి ప్రతీకలయిన నదులను, జంతువులను, వృక్షాలను పూజించేవారు. ప్రకృతియే దైవం. ప్రకృతిలో జరిగే ప్రతి సంఘటన ఆ ప్రకృతి మహిమే. ఇప్పటికీ అనునిత్యం అనేకానేక మహిమలు వాటిని మీరే పేరుతోనైనా పిలవవచ్చు కానీ చూస్తున్నాం. భవిష్యత్తులో ఇంక ఏ కాలంలో ఏ సంఘటన జరుగుతుందో ఏ అద్భుతం ఆవిష్కృతమౌతుందో, ఏ సంఘటన జరుగుతుందో అది జరిగినప్పుడే ఎవరికైనా తెలిసేది.

ప్రకృతి లక్షణాలను కొన్ని పరిశీలించి అర్థం చేసుకున్నంత మాత్రాన ప్రకృతిని శాసిస్తున్నామని ఎవరనుకున్నా పొరబాటే. విశ్వమనే పుస్తకంలోని కొన్ని పేజీలు చదివినవారే అంత విఱ్ఱవీగితే ఆ విశ్వరచన చేసిన ప్రకృతి శక్తి మాటేమిటి. పైగా ఈ విశ్వరచనలో ప్రకృతి శక్తి ప్రతిక్షణం ఒక క్రొత్త పేజీని రచిస్తూనే ఉంటుంది. ఐన్‌స్టీన్ మహాశయుడే తన పరిజ్ఞానాన్ని సముద్ర గర్భంలో ఇసుక రేణువంత అని చెప్పుకున్నాడు. మిడిమిడి జ్ఞానం కలిగిన వారే తామే శాస్త్రీయ దృక్పథం కలిగిన వారమని మిగిలిన వారు మూర్ఖులని వాదిస్తూ ఉంటారు. వాస్తవానికి వారికే శాస్త్రమూ తెలియదు. ప్రశ్నించడమే శాస్త్రీయత అని వాదిస్తూ ఉంటారు. అడిగేవాడికి చెప్పేవాడు లోకువ అన్నట్లు సమాధానం చెప్పేవాడు అన్ని విషయాల గురించి 100 శాతం పరిపూర్ణ జ్ఞానం కావాలి. అడిగే వాడికి అజ్ఞానమే ఆయుధం. అడ్డదిడ్డమైన ప్రశ్నలు వేయవచ్చు. చెప్పేవాడికి తెలిసిన భాష కాని విజ్ఞానంగాని వేరు. అడిగేవాడు ఏ భాషలోనైనా, ఏ

శాస్త్రంనుంచైనా ప్రశ్నించవచ్చు. పైగా వినదలుచుకున్న వారు కారు కాబట్టి మనం ఏది చెప్పినా వారు దాని గురించి ఆలోచించరు, అంగీకరించరు. ఇలాంటి వారితో వాదించటం వృధా.

*ఇసుకను పిండి నూనెను తీయవచ్చు, ఎండమావిలో నీరు త్రాగవచ్చు, తిరిగి కుందేటి కొమ్ము సాధించవచ్చు కాని చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు* అని భర్తృహరి సుభాషితంలో ఏనాడో చెప్పాడు. అదే అడిగే వాడి బలం, చెప్పే వాడి బలహీనత. ఏదైనా సాంకేతిక విషయంపై ప్రశ్నించాలన్నా, చర్చించాలన్నా, సమాధానాన్ని అర్థం చేసుకోవాలన్నా ఆ నిర్దిష్ట శాస్త్రంలో ప్రవేశముండాలన్న కనీస పరిజ్ఞానం వీరికుండదు. వారికి తెలియని విషయాలన్నింటికి మేము "బావిత్తా వున్నాం" అంటుంటారు. ప్రతి విషయాన్ని యధాతథంగా స్వీకరించి యథాశక్తిగా వివేచన చేసుకొని ఇతరుల మనోభావాలు కించపర్చకుండా ప్రజాస్వామ్య బద్ధంగా ఇతరులతో విభేదించడంలో తప్పులేదు. పరిమిత పరిజ్ఞానంతోనే ప్రతి విషయాన్ని విచారించడమంటే భూమి నుంచి చంద్రుడి దూరాన్ని తనకున్న చేతి వ్రేళ్ళతో జాన, బెత్తెలతో కొలిచే ప్రయత్నం లాంటిదే.

న్యూటన్ మహనీయుడు ఆపిల్ పండు చెట్టునించి క్రింద పడటం చూసి భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని ఆవిష్కరించాడని అంటారు. ఆపిల్ పండ్లు అంతకు ముందు కూడా రాలుతూనే ఉన్నాయి. ఆ తర్వాతనూ రాలుతూనే ఉన్నాయి. గురుత్వాకర్షణ అంతకుముందూ ఉంది. ఆ తర్వాతనూ ఉంటుంది. కాకుంటే న్యూటన్ మహాశయునికి ఆ జ్ఞానోదయం అప్పుడు జరిగిందని అర్థం చేసుకోవాలి. నాకైతే న్యూటన్ గురుత్వాకర్షణ సిద్దాంతం పరిపూర్ణమైనదని అనిపించడం లేదు. భూమి శూన్యంలో నిలబడి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఇతర గ్రహాలకు సాపేక్ష దూరంలో వర్తిస్తున్నదంటే ఇతర గ్రహాల ప్రభావం భూమిపై ఉందని చాలా తేలికగా గ్రహించవచ్చు. అది వాటి ఆకర్షణ కావచ్చు లేదా వికర్షణ కావచ్చు. భూమిపై అలాంటి ఇతర గ్రహాల ప్రభావాన్ని విస్మరించి భూమ్యాకర్షణ సిద్దాంతాన్ని నిర్మిస్తే అది సరియైనది ఎలా అవుతుంది?

భూమి విచ్ఛిన్నం కాకుండా ఒక ఆకారంలో ఉండటానికి, భూ పరిధిలో ఉన్న ప్రతి వస్తువు భూమిపై పడటానికి భూమ్యాకర్షణ కారణమా లేక ఇతర

గ్రహాల వికర్షణ కారణమా ఆలోచించవలసి ఉంది. భూగోళ, ఖగోళ శాస్త్రాలలో ఎలా ఉందో నాకు తెలియదు. ఇది నా తార్కిక ఆలోచన మాత్రమేనని మనవి చేస్తున్నా. ఎందుకంటే విశ్వంలోని ఏ గ్రహమూ ఏ అణువూ స్వతంత్రం కాదు. పరస్పర ఆధారితాలు. భూమిలోని ప్రతి అణువు పరస్పర ఆకర్షకాలై ఉండాలి. లేకుంటే భూమ్యాకర్షణ శక్తి భూమికి మధ్య ఉందా ఉపరితలపై ఉందా లేదా మరెక్కడ వున్నదన్న ప్రశ్న తలెత్తుతుంది. భూమిలోని పరమాణువులకు పరస్పర ఆకర్షణ లేకుంటే భూమి విచ్ఛిన్నమై పోతుంది. లేదా భూమిని చుట్టుముట్టి ఉన్న ఇతర గ్రహాల వికర్షక శక్తి ఐనా భూమిని ఒక్కటిగా ఉంచుతుండవచ్చు. యాపిల్ పండు భూమి నుంచి భిన్నమైన వస్తువు కాదు. అది కూడా భూమిలో ఒక భాగమే. అది భూమిపై పడుతున్నదంటే భూమ్యాకర్షణ వల్ల అయి ఉండే అవకాశం కన్న భూమిని ఒక యూనిట్‌గా కలిపి ఉంచే విశ్వ నిర్మాణ సూత్రంలో భాగంగా ఇతర గ్రహాల ప్రభావం వల్ల జరిగే అవకాశమే ఎక్కువ. ఏదిఏమైనా ఇతర గ్రహాల ప్రభావం లేకుండా భూ భ్రమణ పరిభ్రమణలు ఎలా జరుగుతాయి?

అలాగే ఐన్‌స్టీన్ ద్రవ్యశక్తి తుల్యతా నియమాన్ని ప్రతిపాదించాడు. అంటే ఈ విశ్వంలో శక్తిని కొత్తగా సృష్టించనూ లేము, నశింపజేయనూ లేము పరివర్తనం మాత్రమే చేయగలమని సిద్ధాంతం. అనేక వేల సంవత్సరాల ముందే వేద విజ్ఞానంలో ఏముందో చూడండి. ఉపనిషత్తులంటే వేదములకు చివరగా నుండేవి. అందుకే వేదాంతమంటారు. అందులోని ఈశావాస్య ఉపనిషత్తులోని ఒక శ్లోకం చూడండి. *ఓం పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే.* అనగా అది పూర్ణము, ఇది పూర్ణము. పూర్ణము నుండి పూర్ణముదయించెను. పూర్ణము నుండి పూర్ణమును తొలగించగా పూర్ణమే మిగులును. అంటే విశ్వము పరిపూర్ణమైనది. ఈ విశ్వం నుండి దేనినీ తొలగించలేము. కలపనూలేము. రూపాంతరం మాత్రమే చెందించగలం. అది ఎప్పటికీ పూర్ణంగానే ఉంటుంది.



# 12. రైతు ఆత్మహత్యలు ప్రభుత్వాల సమర్థతకు సవాలే

రైతు ఆత్మహత్యలు గత 20 సం॥లుగా కొనసాగుతున్నాయి. అనేక ప్రభుత్వాలు అనేక సంస్కరణలు చేసినా పూర్తి ఫలితం దక్కలేదు. మద్దతు ధరలు, సబ్సిడీలు, ఉచిత విద్యుత్, ఋణమాఫీ, పంటలబీమా వంటి చర్యలు కూడా రైతు ఆత్మహత్యలను ఆపలేక పోయాయి. అంటే ముఖ్య కారణాలు ఇంకా వేరే ఉన్నాయని అర్థం చేసుకోవాలి. ఎకరాకు రూ. 4,000/-ల ఎరువుల సబ్సిడీ కూడా రైతు సంక్షేమం దిశగా మరొక అడుగు మాత్రమే. చిన్న రైతులు సంఖ్యాపరంగా 75 శాతం ఉన్నా, వారి కమతాల మొత్తం 25 శాతం మాత్రమే. అంటే ఉచిత విద్యుత్, ఋణమాఫీ లేదా ఉచిత ఎరువుల పంపిణీ వంటి పథకాలకయ్యే ఖర్చులో 25 శాతం మాత్రమే ఆత్మహత్యలకు పాల్పడగలిగిన మూడెకరాలలోపు రైతులకు చెందుతుంది. ఆత్మ హత్యలకు పాల్పడుతున్నవారు 99 శాతం మూడెకరాల రైతులు లేదా కౌలు రైతులు. వారి కోసం ప్రత్యేకంగా ఏమైనా చేస్తున్నామా అని ప్రభుత్వాలు ఆలోచించాలి.

నా దృష్టిలో రైతు ఆత్మహత్యలకు ముఖ్యకారణాలు మూడు (1) చిన్న కమతాలు (2) ప్రైవేటు అప్పులు మరియు (3) వ్యవసాయ సమాంతర, ప్రత్యామ్నాయ ఆదాయ మార్గాలు లేకపోవడమే. జీవనవ్యయం అధికంగా ఉండటం అనే అంశం అన్ని వర్గాలకీ సమానమే. 5 ఎకరాలు పైబడి స్వంత భూములున్న రైతు ఆత్మహత్యలు 1 శాతం కూడా లేవు. ఆత్మహత్యకు పాల్పడిన రైతులలో 98 శాతం 3 ఎకరాల లోపు ఆసాములు లేదా కౌలు రైతులు. కారణమేమంటే 3 ఎకరాల పొలములో ఎంత పంట పండినా ఎంత మంచి ధర లభించినా రూ. 50,000/-లు ఆదాయము కూడారాదు. అట్టి ఆదాయముతో కుటుంబ ఖర్చులు మరియు అప్పు తెచ్చిన 2 లేదా 3 లక్షలపై వడ్డీ చెల్లించడం

అసాధ్యము. ఋణదాతల నుండి ఒత్తిడి, అవమానానికి తోడు భవిష్యత్తు శూన్యంగా కనిపించి, ఆత్మహత్యకు పాల్పడతారు. వాస్తవానికి వ్యవసాయ సౌకర్యాలు గతంతో పోలిస్తే చాలా మెరుగుపడ్డాయి ఐనా ఆత్మహత్యలు జరుగుతూనే ఉన్నాయి. రైతులు అధిక సంఖ్యాకులు కాబట్టి వారు ఓట్లు పొందటానికి చేసే సామాన్య చర్యలు సరిపోవు. రైతు ఆత్మహత్యల నివారణకు నిర్దిష్ట ప్రణాళిక అవసరము. అందుకు కొన్ని సూచనలు.

సామాజిక కార్యకర్తలతోను, పోలీస్, రెవిన్యూ ఉద్యోగులతోనూ కలసి, గ్రామ, మండల కమిటీలు వేయాలి. వారు గ్రామాలలో పర్యటించి చిన్నరైతులను మరియు కౌలు రైతులను కలసి వారి ఆర్థిక పరిస్థితి, ఋణభారము, కుటుంబసభ్యుల వివాహ, విద్య, వైద్య అవసరాలు మరియు రైతు మానసిక పరిస్థితిపై వివరాలు సేకరించాలి. మండల కమిటీల పనితీరును జిల్లా కమిటీ పర్యవేక్షించి ప్రభుత్వానికి నివేదిక అందజేయాలి. ఆత్మహత్య చేసుకొనే రైతు మానసిక పరిస్థితి ఈ విధంగా ఉంటుంది. విచారంగా ఉండటం, ఒంటరిగా వుండటం, నిరాశగా మాట్లాడటం, రాత్రిళ్ళు సరిగ్గా నిద్రించకపోవడం, భోజనంపై ఆసక్తిని చూపించక పోవడం, అతిగా మద్యం సేవించడం చావే పరిష్కారమని సన్నిహితులతో, కుటుంబ సభ్యులతో అనడం వంటివి జరుగుతుంటాయి. ఇలాంటి వ్యక్తులను కుటుంబసభ్యులు ప్రతిక్షణం వెన్నంటి ఉండాలి. కౌన్సిలింగ్ కూడా నిర్వహించాలి.

గ్రామ, మండల కమిటీలు అవసరమైతే ప్రైవేటు ఋణదాతలను సంప్రదించి రైతు దివాలా తీసినట్లుగా భావించి ఋణపరిష్కారము చేయాలి. పరిష్కారం మొత్తం రూ.2 లక్షలకు లోబడి ప్రభుత్వము ఏర్పాటు చేసిన నిధి నుంచి ఏర్పాటు చేసి దామాషాగా ఋణ పరిష్కారం చేయాలి. రైతు చనిపోయిన తర్వాత ఇచ్చే పరిహారము కన్నా ఇది నయం.

ప్రైవేటు ఋణదాతలు ఒకే ఋణానికి అనేక చెక్కులు అనేక తెల్లకాగితాలు అనేక ప్రాంసరీనోట్లపై సంతకాలు తీసుకోకుండా ఉండాలంటే ప్రాంసరీ నోట్లు కూడా రిజిస్ట్రేషన్ పరిధిలోనికి తీసుకొచ్చి వడ్డీ రేటుపై పరిమితి విధించాలి. దీని వలన రైతు మానసిక వ్యధ మరియు నిస్సహాయత దూరం అవుతాయి. ఖాళీ కాగితాలు, స్టాంపు పేపర్లు, చెక్కులు రైతులనుండి తీసుకోవడం నేరంగా

పరిగణించాలి. ప్రైవేటు వ్యక్తులు తీసుకోగలిగిన గరిష్ఠ వడ్డీ రేట్లను ప్రభుత్వం ప్రకటించాలి.

సహకార వ్యవసాయ సంఘాలను ప్రోత్సహించాలి. ఈ సంఘాలే వ్యవసాయం నిర్వహిస్తాయి లేదా కౌలుకిస్తాయి. ఈ సంఘాలకు భూములు కౌలుకివ్వడానికి తిరిగి స్వాధీనం చేసుకోవడానికి ప్రభుత్వ మద్దతు ఉండాలి. తద్వారా రైతులు తమ భూములు కౌలుకు సురక్షితంగా సహకార సంఘాలకు అప్పగించి ఇతర ప్రాంతాలకు ఇతర వృత్తులకు మళ్ళే అవకాశము ఉంటుంది. ఎందుకంటే ఇతర వ్యక్తులకు అధికారికంగా భుమిని కౌలుకు ఇవ్వడానికి భూ యజమానులు అంగీకరించరు. లోపభూయిష్ఠమైన భూ సంస్కరణలు, కౌలుదారీ చట్టాలు, దున్నేవాడిదే భూమి వంటి నినాదాలు రైతు ఆత్మహత్యలకు దారి తీసే పరిస్థితులు కల్పించాయి. కౌలు చెల్లించకపోయినా కౌలు రైతును ఖాళీ చేయించడానికి వీలు లేదని కోర్టులు తీర్పులు చెపుతున్నాయి. ఇలాంటి పరిస్థితిలో భూములు అధికారికంగా కౌలుకు ఎవ్వరూ ఇవ్వరు. అందరూ అనధికారికంగా మాత్రమే ఇస్తున్నారు. దీని వల్ల ప్రభుత్వాలు ఇచ్చే రాయితీలు కూడా కౌలు రైతుకు బదులు భూ యజమానికి చేరుతున్నాయి. బ్యాంకు ఋణాలు కూడా కౌలు రైతుకు దొరకవు. అందువల్ల ప్రైవేటుగా అప్పులు చేస్తారు. ఫలితం ఆత్మహత్యలు.

ప్రభుత్వం దీర్ఘకాలిక ప్రాతిపదికన నీటిపారుదల, భూగర్భజలాల వంటి అభివృద్ధి పథకాలను అమలు చేయాలని ప్రయత్నిస్తున్నది. అది మంచిపనే కానీ చిన్న కమతాల రైతులకు వ్యవసాయం ఒక్కటి చాలదు. ప్రచ్ఛన్న నిరుద్యోగితను అనుభవిస్తూ ఉంటారు. ప్రత్యామ్నాయ మరియు వ్యవసాయంతో సమాంతరంగా నిర్వహించగలిగిన వృత్తులలోకి రైతులను మరలించాల్సిన అవసరం వున్నది. రైతు స్వగ్రామంలో వ్యవసాయానికి సమాంతరంగా నిర్వహించగలిగిన ప్రత్యామ్నాయ ఆదాయ మార్గాలు చూపించాలి. వీరు గాని వీరి కుటుంబ సభ్యులుగాని కూలికి వెళ్ళడానికి బిడియపడతారు. రైతుకూలీలకంటే అధికమైన జీవన ప్రమాణాలు కోరుకుంటారు. ఉన్న ఊరును, భూములను వదులుకొని వలస వెళ్ళడానికి ఇష్టపడరు. వీరికి అప్పలు పుడతాయి. పరిణామం ఆత్మహత్యలు.

ప్రత్యామ్నాయంగా ఆటోలు, ఆటోట్రాలీలు, చిన్న ట్రక్కులు, ట్రాక్టర్లు, ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు చిరువ్యాపారాలు, వృత్తులు, కుటీర పరిశ్రమలు ముఖ్యమైనవి. ట్రాక్టర్లు ట్రక్కులు వంటి వాటిలో డౌన్‌పేమెంట్స్ ప్రభుత్వమే చెల్లించి, వాయిదాలు రైతు కట్టుకునేట్లు చూడాలి. గత ఐదు సంవత్సరాలుగా 3 ఎకరాలలోపు ఉన్నవారికి మాత్రమే ఇవ్వాలి. క్రొత్తగా ఒక జీవనోపాధి వారి ఇంటికి రావడంతో జీవితంపై క్రొత్త ఆశలు చిగురిస్తాయి. ఆత్మహత్యను గురించిన ఆలోచన మానుకుంటారు. వారు తమ వ్యవసాయంతోపాటు గ్రామంలో ట్రాక్టర్లను చిన్న రవాణా వాహనాలను ఇతరులకు కిరాయికిచ్చి సంపాదించుకో గలుగుతారు. మెల్లగా వ్యవసాయేతర రంగాలకు తరలివెళతారు. సమస్యాత్మక గ్రామాలు విడిచి ఇతర గ్రామాలకు, పట్టణాలకు తరలి వెళ్ళి కొత్త జీవనోపాధులు వెతుక్కొనే అవకాశాలు పెరుగుతాయి.

పై చర్యలతో రైతులలో ఆత్మస్థైర్యము పెరుగుతుంది. ప్రభుత్వ చిత్తశుద్ధి నిరూపితము అవుతుంది. రైతు మరణాలు 100 శాతం తగ్గుతాయి. 10 ఎకరాల రైతుకు కూడా సాలుకు రూ. 2లక్షల మించి ఆదాయం రాదు. అంటే పదెకరాల రైతు కూడా దారిద్ర్యరేఖకు దిగువనే ఉన్నట్లు లెక్క. అందువల్ల కమతాల పునరేకీకరణ జరగాలి. పెద్దపెద్ద కమతాలు ఏర్పడాలి. అప్పుడే యాంత్రీకరణ జరిగి వ్యవసాయ ఉత్పాదకత పెరుగుతుంది. తద్వారా స్థూల జాతీయోత్పత్తి పెరుగుతుంది. వ్యవసాయం లాభసాటిగా మారుతుంది. వ్యవసాయ కూలీల వేతనాల నిర్ధారణ, వ్యవసాయోత్పత్తుల ధరలు నియంత్రించే అధికారం ప్రభుత్వానికి ఉండనే ఉంది. ముందుగా ఉత్పత్తి పెరగాలి. ఆ తరువాతే పంపకం.



# 13. ప్రజాస్వామ్య ధర్మో రక్షతి రక్షితః

ఇది ప్రజాస్వామ్య యుగం. ఈ యుగధర్మం ప్రజాస్వామ్యం. ప్రజలు ఏది కోరుకుంటే అది జరుగుతుంది. ఇది డార్విన్ సిద్ధాంతానికి కూడా అనుగుణంగా ఉంది. జీవకణం యొక్క కోరికలు, అవసరాల కారణంగానే కదా పరిణామం జరిగిందని డార్విన్ సిద్ధాంతం. అందువల్ల ప్రజలు ఏది కోరుకుంటే అది జరుగుతుందని భావించవచ్చు. అది ఎలా జరుగుతుంది? ఎప్పుడు జరుగుతుంది అంటే ఖచ్చితంగా చెప్పలేము. అందుకే ప్రజలకు సరియైన సమాచారం అందించి, చైతన్యం చేసినప్పుడే వారు ఏది మంచి, ఏది చెడు, ఏది కోరుకోవాలనే మంచి నిర్ణయం చేయగలుగుతారు. నిర్ణయం చేయడానికి విషయ పరిజ్ఞానం అవసరం కదా. అట్టి పరిజ్ఞానానికి వివేకం జోడిస్తే మంచి నిర్ణయాలు వెలువడతాయి. అలాంటి వివేకం పని చేస్తే దొంగలు, దోపిడీదారులు, నేర చరితులకు ఓటు ఎవరు వేస్తారు? అందుకే వివేకం పనిచేయకుండ ఉండేందుకే ప్రజలకు డబ్బు, మద్యం, కులం, మతం, స్వార్ధ ప్రయోజనాల మత్తును తలకెక్కిస్తారు రాజకీయ నాయకులు. ప్రజలు మొదటగా వీటి నుంచి బయటపడాలి. జాతీయతా భావం బలపడాలి. జాతీయతా భావం, జాతియ లక్షణం నిర్వచించి బలోపేతం చేయడంలో భారత రాజకీయ వ్యవస్థ విఫలమయిందని చెప్పడంలో సందేహంలేదు. దాని పరిణామమే భారతదేశంలోని అనేక రాష్ట్రాలు, అనేక జాతులు భారతదేశం నుంచి విడివడాలని పోరాటాలు చేస్తున్నాయి. అనేకసార్లు అనేక విదేశీయుల చేతిలో భాతీయ పాలకులు ఓడిపోవడానికి, ప్రభుత్వం నుండి ప్రజలు వేరు కావడమే కారణం.

ధర్మో రక్షతి రక్షితః. ఈ యుగ ధర్మం ప్రజాస్వామ్యం. దానిని మనం రక్షిస్తే అది మనలను రక్షిస్తుంది. వ్యక్తులకు వర్ణాశ్రమ ధర్మాలున్నట్లే సమాజానికీ ధర్మం ఉంటుంది. అదే ప్రజాస్వామ్య ధర్మం. ప్రజల మద్దతు పొందడానికి

ఎన్నికలు జరిపినంత మాత్రాన అది ప్రజాస్వామ్యం కానేరదు. ప్రజా సంక్షేమమే పరమావధిగా ప్రభుత్వాలు పని చేస్తేనే ప్రజాస్వామ్యం పరిఢవిల్లినట్లు. ఉదాహరణకు ఒక మైనర్ బాలునికి సంరక్షకునిగా ఉన్న వ్యక్తి మైనర్ అభీష్టం మేరకు నడుస్తానంటే కుదరదు. మైనర్ సంక్షేమమే పరమావధిగా ప్రవర్తిస్తేనే సంరక్షకుడు తన బాధ్యతను సరిగా నిర్వర్తించినట్లు. అలాగే ప్రజలను కూడా కన్న బిడ్డల్లా ప్రభువులు చూడగల్గితే ఆ పాలన పేరు ప్రజాస్వామ్యమై ఉండవల్సిన అవసరం లేదు. కాకుంటే అలాంటి గురుతర బాధ్యత ఒక వ్యక్తిపై వదిలేస్తే అది నిర్వర్తించబడవచ్చు లేదా నిర్లక్ష్యం చేయబడవచ్చు. అందుకే పాలనా పరిణామ దశలలో ప్రజాస్వామ్య వ్యవస్థ ఉత్కృష్టమైనది. దానిని కాపాడుకుంటేనే అది ప్రజలను, ప్రభువులను, దేశాన్ని కాపాడుతుంది. 51 శాతం లోపు ఓట్లు సాధించిన వారు పరిపాలన చేస్తే అది ప్రజాస్వామ్యమే కాదు.

అధికారం దుర్మార్గుడిని తయారు చేస్తుంది. సంపూర్ణ అధికారం సంపూర్ణ దుర్మార్గుడిని తయారు చేస్తుంది అన్న నానుడి నిజమే కదా. అలాంటి బాధ్యత సమిష్టిగా ఒక సంఘానికి అప్పగించడం వారి పనితనాన్ని పరీక్షించే అవకాశం ఎన్నికల ద్వారా ప్రజలకే కట్టబెట్టడమే ప్రజాస్వామ్య ప్రక్రియ. అలాగే స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన న్యాయవ్యవస్థ, సమాచార వ్యవస్థ, అధికార వ్యవస్థ కలిగి ఉండటం ప్రజాస్వామ్యం లక్షణం. దురదృష్టవశాత్తు రాజకీయ నాయకులు మిగిలిన మూడు ప్రజాస్వామ్య స్తంభాలను కూడా ఆక్రమించే ప్రయత్నం చేస్తున్నారు. మెజారిటి ప్రజల ఆమోదం పొందినవారే ప్రజాప్రతినిధులుగా, పాలకులుగా ఉంటారు. ఈ ధర్మాన్ని భారతదేశంలో మనం రక్షిస్తున్నామా అంటే నిర్ద్వంద్వంగా లేదనే చెప్పాలి. అంటే ధర్మాన్ని మనం రక్షించడం లేదు. అందువలన అది కూడా మనను రక్షించదు గాక రక్షించదు.

మెజారిటీ ప్రజల ఆమోదం అంటే ఎన్నికలలో పోలై చెల్లిన ఓట్లలో కనీసం 51శాతం వచ్చిన వారు మాత్రమే ప్రజాప్రతినిధులు. ఈ అవకాశం రెండు పార్టీలు మాత్రమే పోటి చేసినప్పుడే సాధ్యం. దురదృష్టవశాత్తు భారత దేశంలో జాతీయ, ప్రాంతీయ పార్టీలు కలిసి సుమారు 400 వరకు ఉన్నాయి. ఒక్కొక్క అసెంబ్లీ లేదా పార్లమెంటు స్థానానికి కనీసం పది పార్టీలు పోటీ చేస్తున్నాయి. గెలిచిన అభ్యర్థికి ఒక్కొక్క సందర్భంలో పోలై చెల్లుబాటైన ఓట్లలో మూడవ

వంతు కూడా రావడం లేదు. ఆ మూడవ వంతు ఓట్లు కూడా కుల, మత, ధన, దౌర్జన్య ప్రభావాల చేత వస్తున్నాయి. సదరు వ్యక్తికి అనుకూలంగా 33 శాతం ఓట్లు వస్తే వ్యతిరేకంగా 67 శాతం ఓట్లు వచ్చాయని గమనించాలి. అందువల్ల ఈ ఎన్నికలు ప్రజాస్వామ్య ధర్మానికి విరుద్ధం. ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్యమని గొప్పలు చెప్పుకొనే మన దేశంలో ప్రజాస్వామ్యం నేతి బీరకాయలో నెయ్యి వంటిదే. దాదాపు 30 శాతం మంది, ముఖ్యంగా మేధావులు ఓటు వేయకపోవడానికి కూడా ఇదే కారణం.

ప్రజాస్వామ్య ప్రక్రియను పూర్తిగా వ్యతిరేకిస్తున్న తీవ్రవాదులకు ప్రజామోదం, ప్రభుత్వామోదం ఎంతవరకు ఉన్నాయో మనకు తెలుసు. ప్రజాస్వామ్య సిద్ధాంతానికి విరుద్ధమైన కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని కలిగి ఉండి ప్రజాస్వామ్య ప్రక్రియలో పాల్గొనే ప్రయత్నం చేస్తున్న కమ్యూనిస్టు పార్టీలకు కూడా ప్రభుత్వామోదమున్నా ప్రజామోదం పెద్దగా లభించడం లేదు. ప్రజాస్వామ్య మార్గంలో కమ్యూనిస్టు రాజ్యం సాధించాలని కొందరు ఆలోచిస్తారు. తుపాకీ గొట్టం ద్వారా సాధించాలని కొందరు ఆలోచిస్తారు. వీరి పంథాలు వేరైనా లక్ష్యం ఒక్కటే. అదే కమ్యూనిస్టు రాజ్యం. అలాగే ప్రజాస్వామ్య పార్టీలాగా ప్రవర్తిస్తూ 1975లో అత్యవసర పరిస్థితి ప్రకటించి ప్రజాస్వామ్య హక్కులను పరిహరించే ప్రయత్నం చేసినందుకు లేదా అలా నిందించబడినందుకు కాంగ్రెస్ పార్టీ ఎంతటి మూల్యం చెల్లించిందో కూడా మనకు తెలుసు. అలాగే ప్రజాస్వామ్య రాజకీయాలలో ప్రత్యర్థుల పట్ల ప్రవర్తించే తీరు, ఉపయోగించే భాష కూడా ప్రజాస్వామ్య యుతంగానే ఉండవల్సిన అవసరం ఉంది. లేకుంటే అధికారం కోల్పోయిన రోజున దొరికే ప్రతిఫలాలు కూడా ఆ పరిధిలోనే వుంటాయి. ప్రతి వ్యక్తి కుటుంబ సభ్యులతో కూడా ప్రజాస్వామ్య బద్ధంగా ప్రవర్తిస్తేనే మనశ్శాంతి, ఆర్థికాభివృద్ధి.

భారతదేశంలో ప్రజాస్వామ్యం ఏ మేరకు విజయవంతమయిందని పరిశీలిస్తే కొంతమేరకే అనిపిస్తుంది. పొరుగుదేశాల రాజ్యాధికార మార్పు రక్తసిక్తంగా కనిపిస్తుంది. భారతదేశంలో మాత్రం రాజ్యాధికార మార్పు ఎన్నికల ద్వారా మాత్రమే శాంతియుతంగా జరుగుతున్నది. ఇది కొంతవరకు హర్షించదగ్గ పరిణామమే. ఈ సంఘటన ప్రజాస్వామ్య వ్యవస్థపై ప్రజలకున్న విశ్వాసాన్ని

సూచిస్తున్నదే తప్ప నాయకుల ప్రజాస్వామ్య నిబద్ధతను కాదు. ఎన్నికల ప్రక్రియ లోపభూయిష్టంగా ఉండటం, ఎన్నికలలో మద్యం, మాఫియా, ఓటుకునోటు పంపకం, కులాల సమీకరణ మొదలైన ప్రక్రియలవల్ల ప్రజాస్వామ్యం అపహాస్యానికి గురవుతున్నది. గెలుపుకోసం అభ్యర్ధులు కుల, మత, ప్రాంతీయ భాషాతత్వాలను రెచ్చగొట్టడం జరుగుతున్నది. అందువల్ల రాజకీయ పార్టీలు కూడా అభ్యర్ధులను ఎంపిక చేసేటప్పుడు వారి ధన మరియు కుల బలాలు, రౌడీయిజం చేయగల సత్తాను చూసి సీట్లు కేటాయించడం ప్రారంభించాయి. రాజ్యాంగ ప్రమాణాలన్నీ గాలిలో ఎగిరిపోయినాయి. కోట్లు ఖర్చుబెట్టి గెలిచిన అభ్యర్థులు మరిన్ని కోట్లు సంపాదించడం రాజకీయంలో ధ్యేయమైపోయింది. ఆదర్శవాదులకు, మేధావులకు ఎన్నికలు అందని ద్రాక్షపండ్లే. యధారాజా తధాప్రజా అన్నట్లు  అంతా అదే దారిలో నడుస్తున్నారు.

రాజకీయనాయకుల అవినీతిని ప్రజలు అంతగా పట్టించుకోకపోవడానికి మరొక కారణం రాజకీయనాయకులు సంపాదించిన దానిలో ఎంతో కొంత ఎన్నికల సమయంలో ప్రజలకు ఓటుకింత చొప్పున పంచటం ద్వారా తమ అవినీతిలో ప్రజలను కూడా భాగస్వాములను చేయడంద్వారా వారినోరు మూయించడం. ప్రజలు ఓటుకు రూ.500/–లు లేదా రూ.1000/–లు తీసుకోవడంలో మరొక అర్ధంకూడా ఉంది. ఏమిటంటే ఏ నాయకుడు గెల్చినా ఏం ప్రయోజనం లేదు. అంతా ఆ తానుగుడ్డలే. గెలిచిన తర్వాత కనిపించేవారు కాదు. ప్రజాహితం పట్టించుకొనేవారు కాదు అని. ఇది రాజకీయ నాయకులు అవమానంగా భావించాలి. ఎందుకంటే తమకు ఓటేయడం రూ.500/–లు కన్నా తక్కువ విలువైన పని, రూ. 500/–లు తీసుకోవడమే లాభసాటి అని కదా  ఓటరు  తీసుకున్నాడు.

కానీ, ఈ రోజుల్లో విలువల గురించి ఆలోచించే నాయకులు ఎంతమంది ఉన్నారు? రాజకీయం సామాన్యుడికందని ఖరీదైన జూదంగా మారిపోయింది. యధారాజా తధా ప్రజా అన్నది భారతీయ నానుడి. కానీ ఆధునిక రాజకీయ శాస్త్రానికి పితామహుడిగా పిలువబడుతున్న అరిస్టాటిల్ "పీపుల్ గెట్ ది కైండ్ ఆఫ్ గవర్నమెంటు దే డిజర్వ్" అన్నాడు. అంటే ప్రజలకు ఎలాంటి అర్హత ఉంటే అలాంటి ప్రభుత్వాలే ఏర్పడతాయని ఆయన భావన. కానీ, అది వాస్తవం

కాదు. కాపరిని బట్టి గొర్రెలు తప్ప గొర్రెలను బట్టి కాపరి ప్రవర్తించడు. లోకో భిన్నరుచిః అన్నట్లు లోకులలో భిన్నాభిప్రాయాలుంటాయి. భారతదేశంలోని 70 కోట్ల ఓటర్లను సంస్కరించే బదులు 542 పార్లమెంటు స్థానాలకు పోటీ చేసే 1084 మందిని నియంత్రించడం తేలిక గదా. అందువల్ల యధారాజా తధా ప్రజా అన్న సిద్ధాంతమే సరియైనదనిపిస్తున్నది.

మరొక రాజ్యాంగ వైఫల్యం చూస్తే ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్, పశ్చిమ బెంగాల్, కాశ్మీర్, నాగాలాండ్, అస్సాం, త్రిపుర, పంజాబు, బీహార్ ఇలా ఇంచుమించు అన్ని రాష్ట్రాలలో సాయుధ తిరుగుబాట్లు నడుస్తున్నాయి. ఇవన్నీ భారత సార్వభౌమత్వానికి సవాళ్ళే. ఈ సవాళ్ళను గత 50 సంవత్సరాలుగా అధిగమించలేక పోవడం, అది ఇంకా పెరిగిపోవడం అసమర్ధతగాక మరేమిటి? ఈ పరిణామాలలో సామాన్య ప్రజలు నలిగి పోతున్నారు. అధిక పన్నులతో ప్రభుత్వం విరుచుకు పడుతున్నది. సాక్షాత్తు ఆర్మీని, సి.ఆర్.పి.యఫ్ దళాలను, స్థానిక పోలీస్ స్టేషన్లను ముట్టడించ గలిగిన స్థాయిలో నక్సలైట్లు, తీవ్రవాదులున్నారు. మరొక ప్రక్క అధికారుల అవినీతికి ప్రజలు విలవిలాడుతున్నారు. బయటకు చెప్పలేక లోపలే మధన పడుతున్నారు. అది అన్ని హద్దులు దాటిపోయింది. పనుల కోసం న్యాయపోరాటం చేద్దామా అంటే అది ఒక జీవితకాలం పట్టేటట్లుగా ఉంది.

అధిక అనధికారిక జీవన వ్యయానికి ప్రభుత్వానికి భాధ్యత లేదా? అత్యవసరాలైన విద్య, వైద్యం, న్యాయ సహాయం వంటి వాటికి ఏమైనా ప్రమాణాలు ఉన్నాయా? అవకాశము, దురాశలే హద్దుగా పీక్కు తినకుండ ఏమైనా నియంత్రణ ఉందా? పులిని, మేకను ఒక బోనులో ఉంచి మీరిద్దరు స్వేచ్ఛగా వ్యవహరించుకోండి అంటే ఎంతవరకు సమంజసం? ఆశలు, అవసరాలలో ఆసరా అవసరమైన వ్యక్తి, అన్ని అవకాశాలు, అధికారాలు ఉండి విద్యా, వైద్య, న్యాయాలను అందించగలిగినవారి ముందు నిజంగా స్వేచ్ఛగా వ్యవహరించగలడా? బేరసారాలు చేయగలడా? ప్రభుత్వం పడిపోకుండా చూసుకునే ఒక క్రీడగా మాత్రమే రాజకీయం ఉంది తప్ప ప్రజల మౌనరోదన అర్థం చేసుకొనే స్థాయిలో పాలకులు లేరు.

రాజ్యాంగంలో రాజకీయ పార్టీల ప్రస్తావన లేదు. ఎన్నికలలో వ్యక్తులు పోటీ చేసే అర్హతలు, అనర్హతలు, నాయకుడినెంచుకునే విధి విధానాలు మాత్రమే పొందుపరచబడ్డాయి. అలా ఎన్నుకోబడిన వ్యక్తే ప్రధానమంత్రి. ప్రధానమంత్రికి నచ్చిన వారిని మంత్రులుగా నియమించుకోవడం మాత్రమే రాజ్యాంగపు ఉద్దేశం. అందువల్ల ప్రజా ప్రాతినిధ్య చట్టం 1951 లోని పార్టీల రిజిస్ట్రేషన్‌కి సంబంధించిన సెక్షన్. 29.ఎ. రాజ్యాంగ బద్ధం కాదు. ఒకవేళ అది రాజ్యాంగ బద్ధమైనా దాని ప్రకారం అనేక రాజకీయ పార్టీలు ఉండవచ్చని స్పష్టంగా లేదు. జాతీయ పార్టీలు, ప్రాంతీయ పార్టీలు అన్న విభాజన పార్లమెంటు పాస్ చేసిన ప్రజా ప్రాతినిధ్య చట్టం 1951లో లేదు.

అలాగే ఎన్నికల కమీషన్ విడుదల చేసిన రాజకీయ పార్టీల గుర్తుల కేటాయింపు ఆర్డరు 1969 చట్టబద్ధంకాదు. అందులోని క్లాజు 6ఎ. 6బి. ద్వారా రాజకీయ పార్టీలను జాతీయ పార్టీలు, ప్రాంతీయ పార్టీలు, రిజిస్టర్డు కాని రాజకీయ పార్టీలుగా విభాజన చేసే హక్కు ఎన్నికల కమీషన్‌కు లేదు. ఎన్నికల కమీషన్ ఏకైక విధి ఎన్నికలు నిర్వహించడం. అందువల్ల గుర్తుల కేటాయింపు ఆర్డరు ఎన్నికల కమీషన్ యొక్క హక్కుల పరిధి దాటిందని గమనించాలి. ఒకవేళ అలాంటి ఆర్డరు ఇవ్వడం ఎన్నికల కమీషన్ అధికార పరిధికి లోబడిందే అయినా అట్టి ఆర్డరులో పార్టీలను విభాజన చేయడానికి ఉపయోగించిన క్రిటీరియా సహేతుకం కాదు. 6ఎ–నేషనల్ పార్టీ; ఎ–సాధారణ ఎన్నికలలో 1) కనీసం నాలుగు రాష్ట్రాల్లో పార్లమెంటుకు గాని, అసెంబ్లీలకు గాని పోటీ చేసి మొత్తం పోలయిన చెల్లుబాటు అయిన ఓట్లలో కనీసం 6% ఓట్లు సాధించాలి. 2) కనీసం నలుగురు ఎం.పి.లను గెలిపించుకోవాలి. లేదా బి.1. పార్లమెంటు సభ్యులలో కనీసం 2% సభ్యులను గెలిపించుకోవాలి. 2. అలాంటి గెల్చిన ఎం.పి.లు కనీసం 3 రాష్ట్రాలకు చెంది వుండాలి. 6బి. ప్రాంతీయ పార్టీలు; సాధారణ ఎన్నికలలో ఆ పార్టీ ఎం.పి. మరియు ఎం.ఎల్.ఎ.లుగా మొత్తం పోలయిన చెల్లుబాటు అయిన ఓట్లలో కనీసం 6% సాధించి ఉండాలి. మరియు 2) కనీసం ఇద్దరు ఎమ్మెల్యేలను గెలిపించుకోవాలి. లేదా. బి.(1) మొత్తం అసెంబ్లీలోని సభ్యులలో 3% సభ్యులను గెలిపించుకోవాలి లేదా కనీసం ముగ్గురు ఎమ్మెల్యేలను గెలిపించుకోవాలి. ఏ సంఖ్య ఎక్కువైతే

అది. ఈ ఆర్డర్ వల్ల ప్రాంతీయ పార్టీలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. వీటి ముఖ్య లక్షణం ప్రాంతీయ తత్వం. ప్రాంతీయ పార్టీలు ప్రాంతీయ సమస్యలను వల్లె వేసినా వాటి అంతర్గత అజెండా మాత్రం అధికార సాధనే.

ఒక రాష్ట్రం, నాలుగు రాష్ట్రాలు, ఆరు శాతం ఓట్లు, 3శాతం, 2శాతం సీట్లు, ముగ్గురు సభ్యులను గెలిపించుకోవడం వంటి సంఖ్యలను ఎలా నిర్ణయించారు? వాటికి చట్టబద్ధతలేదు. ఆధారమేదీ లేకుండా, ఊహా జనితమైన సంఖ్యలవి. ప్రజాస్వామ్యంలో మెజారిటీ రూలు కాబట్టి పార్లమెంటులోని సీట్లలో కనీసం 51% పోటి చేయాలని పెట్టవచ్చు గదా. లేదా అలాంటి పరిమితులే విధించకుండా ఉండవచ్చు గదా. ఈ శాతాలు, సంఖ్యలు ఎలా నిర్ణయించారు? ఇవి ఆధారంలేని, శాస్త్రీయతలేని, హేతుబద్ధతలేని ఊహాజనిత అంచనాలు. అందువల్ల చెల్లవు. 6 శాతం బదులు 5 శాతం అనవచ్చు లేదా 25 శాతం అనవచ్చు. మనది మెజారిటీ ప్రజాస్వామ్యం కాబట్టి ఏ పార్టీ అయినా కనీసం 51 శాతం సీట్లకు పోటీ చేయాలన్న నిబంధన సముచితం. పోటీ చేసిన అన్ని స్థానాలూ గెలుస్తారనుకున్నా, మెజారిటీ పాలననందించాలంటే కనీసం 51 శాతం సీట్లకు పోటీ చేయాలి.

ఒకవేళ ఎన్నికల కమీషన్‌కు నిర్హేతుకంగానైనా రాజకీయ పార్టీలను విభజించే, పరిమితులు లేని, ప్రశ్నించరాని, అధికారాలున్నాయనుకున్నా అనేక రాజకీయ పార్టీలను గుర్తించడం ద్వారా రాజ్యాంగ లక్ష్యం నెరవేరట్లేదు కాబట్టి, పొంతన లేని పర్యవసానాలకు దారి తీస్తున్నది కాబట్టి, గుర్తుల కేటాయింపు ఆర్డరు 1969 చెల్లనేరదరని, వర్జనీయమని గ్రహించాలి. అది కాకపోయినా అనేక పార్టీలు ఫ్రంటులుగా రిజిస్టరు కాలేదు కాబట్టి రాజకీయ ఫ్రంటులు చట్టబద్ధంకావు. ఒక రాజకీయ పార్టీలోని సభ్యులకు అనేక నిబంధనలున్నాయి. మరి రాజకీయ ఫ్రంటులోని భాగస్వామ్య పక్షాల చేరికకు, విడివడడానికి విధి విధానాలు ఉండవలసిన అవసరం లేదా. అందువల్ల ఫ్రంటులు చట్టబద్ధం కావు.

అంబేడ్కర్ మహాశయుడు రచించిన రాజ్యాంగంలో రాజకీయ పార్టీల ప్రస్తావన లేదు. సంఘాలుగా ఏర్పడే ప్రాథమిక హక్కు మాత్రం కల్పించ బడింది. ప్రాంతీయ పార్టీల ఉనికి వల్ల, వారిచ్చే రాయితీల వల్ల ఒక దేశం,

ఒకే పౌరసత్వం, సమాన హక్కులు, సమాన అవకాశాలు పౌరుల మధ్యనే కాక పోటీ చేసే జాతీయ, ప్రాంతీయ పార్టీల మధ్య కూడా లోపించింది. ఇది రాజ్యాంగంలో పొందుపరచిన ఆర్టికల్ 14 ప్రకారం సమానత్వం లోపించినట్లే. ఉదాహరణకు కొన్ని రాష్ట్రాల ప్రజలకు ఆరోగ్యశ్రీ, వితంతు, వృద్ధాప్య, వికలాంగ పెన్షన్‌లు, ఉచిత విద్యుత్, రైతుల బ్యాంకు రుణాల మాఫి, విద్యార్థులకు ఫీజు రీయింబర్స్‌మెంట్, కళ్యాణ లక్ష్మీ వంటి అనేక పథకాలు ఉన్నాయి. ఇవే పథకాలు కొన్ని రాష్ట్రాలలో లేవు. అలాగే కొన్ని రాష్ట్రాలలో కుల, మతాల ఆధారంగా అమలు చేస్తున్న రిజర్వేషన్లలో తేడా ఉంది. అలాగే ఎన్నికల సమయంలో ప్రాంతీయ పార్టీలు ప్రాంతీయ సమస్యలను ప్రస్తావిస్తాయి. ప్రాంతీయంగా అనేక రాయితీల వాగ్దానాలు చేస్తాయి. జాతీయ రాజకీయ పార్టీలకు అలాంటి అవకాశం ఉండదు. ఎందుకంటే వారు పాలనలో ఉన్న అన్ని రాష్ట్రాలలో అవే రాయితీలు ఇవ్వవలసి వస్తుంది. కాని అన్ని రాష్ట్రాల ఆర్థిక వనరులు ఒకేలా ఉండవు కదా. అంటే పోటీ చేసే పార్టీల మధ్య సమాన అవకాశాలు లోపించినట్లే. గత 50 సంవత్సరాలుగా ప్రాంతీయ పార్టీల పుట్టుక, ప్రవర్తన దేశ భద్రతకు, అభివృద్ధికి, సార్వభౌమత్వాధికారానికి సవాలుగా మారింది.

ఎన్నికల సందర్భంగా ఓటువేయడానికి ఓటరును ప్రలోభపెట్టడం నేరం. గెలిచిన తర్వాత ఒక్కొక్క వర్గానికి, పెన్షన్లు, లాప్‌టాప్‌లు, టీవీలు, మిక్సర్‌లు, గ్రైండర్లు ఇస్తానని వాగ్దానం చేయడం కూడా తప్పని సరిగా నేరమే. కాంట్రాక్టు చట్టం సెక్షన్2(డి) ప్రకారం కూడా ప్రతిఫలమనేది ప్రస్తుతం, గతం లేదా భవిష్యత్తులో ఇచ్చిన లేదా ఇస్తానని వాగ్దానం చేసినా ఈ కోవ క్రిందకే వస్తుంది. వ్యవసాయ రంగానికి, పారిశ్రామికరంగానికి, యువతకు, గ్రామీణాభివృద్ధికి వగైరా రంగాల పట్ల వారి ప్రాధాన్యతలను వివరించ వచ్చే తప్ప ఫలానా వారికి, వర్గానికి ఇంత నిర్ణీత మొత్తంలో ఆర్థిక లాభం చేకూర్చుతానని వాగ్దానం చేయడం తప్పనిసరిగా నేరమే. ఒక్కమాటలో చెప్పాలంటే భారతదేశం ప్రజాస్వామ్య ప్రక్రియపై ప్రపంచానికి ప్రయోగ క్షేత్రంగా మారింది. దీని నుంచి వారు ఎలా ఉండకూడదో నేర్చుకుంటారు.

రాజకీయ పార్టీల గుర్తుల కేటాయింపు ఆర్డరు 1968 క్లాజు 6ఎ, 6బి ద్వారా ఎన్నికల కమీషన్ రాజకీయ పార్టీలను జాతీయ రాజకీయ పార్టీలు,

ప్రాంతీయ రాజకీయ పార్టీలుగా ఎందుకు విభజించింది? జాతీయ పార్టీగా, గుర్తింపు పొందడం వల్ల ప్రయోజనమేంటి? జాతీయ పార్టీకి దేశ వ్యాప్తంగా ఒకే గుర్తు కేటాయిస్తారు. అంతకు తప్ప ఏ ప్రత్యేకత లేదు. ప్రాంతీయ పార్టీ కూడా దేశ వ్యాప్తంగా పోటీ చేయవచ్చు. కాకుంటే దేశ వ్యాప్తంగా ఆ పార్టీ అభ్యర్థులందరికీ ఒకే గుర్తు కేటాయించడం జరగదు. ప్రాంతీయ పార్టీలు జాతీయ పార్టీలకు పోటీగా ఎదగకూడదన్న ఉద్దేశంతో చేసినదే ఈ పార్టీల విభజన. ఇది అనాలోచిత చర్య. రాజ్యాంగ బద్ధంగా ఆలోచిస్తే చేయవలసింది వేరే ఉంది. ఈ చర్య రాజకీయ అస్థిరతకు, దేశ విభజనకు ఆపై దేశ స్వాతంత్రం కోల్పోవడానికి దారితీస్తుంది. నిరంతర ఎన్నికల కోలాహలంతో అభివృద్ధి కుంటుబడుతుంది. దక్షిణ దేశ ప్రాంతీయ పార్టీలు మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్‌లో ఉండగలిగిన ప్రాంతీయ పార్టీలను కలుపుకుంటే పార్లమెంటులో దేశ పునర్విభజన తీర్మానం అతి తేలికగా పాస్ అవుతుంది. అందుకే ఏ రాజకీయ పార్టీ అయినా పార్లమెంటులోని కనీసం 51 శాతం సీట్లకు పోటీ చేయాలి. ఆపై ఏరాష్టంలోనైనా అసెంబ్లీలో కనీసం 51 శాతం సీట్లకు పోటీ చేయాలని నిబంధన పెడితే బాగుండేది. ఇదే రాజ్యాంగ మౌలిక లక్ష్యం. లేకుంటే రాజ్యాంగ పీఠికలోని "సావరిన్" అనే పదానికి, "డెమోక్రిటిక్" అనే పదానికి అర్థం లేకుండా పోతుంది. అలాగే రాజ్యాంగ పీఠికలోని రెండవ భాగంలో ఉన్న "దేశ యూనిటీ అండ్ ఇంటిగ్రిటీ" అన్న పదానికి పరమార్థం కూడా ఇదే.

రాజకీయ ఫ్రంట్‌లు రిజిస్టరు కానందున చట్టబద్ధంగాని సమూహాలుగా గుర్తించాలి. చట్టబద్ధం కాని సమూహం దేశాన్నెలా పరిపాలిస్తుంది? రాజకీయ పార్టీల రిజిస్ట్రేషన్ కొరకు ప్రజాప్రాతినిధ్య చట్టం సెక్షన్ 29ఎ నిర్దేశించబడింది. ప్రతి రాజకీయ పార్టీ కూడా ఈ చట్టం క్రింద రిజిస్టరు కావాలి. చట్ట సభల సభ్యుల అనర్హతలు షెడ్యూలు 10లో పొందుపరచబడ్డాయి. ఇవి పార్టీల ఫిరాయింపులకు సంబంధించినవి. ఇలాంటి నిబంధనలు ఫ్రంటులలోని సభ్య పార్టీలకు అవసరం లేదా. ప్రతి రిజిస్టర్ పార్టీ కూడా చట్టబద్ధ కృత్రిమ వ్యక్తి (ఆర్టిఫిషియల్ జురుడికల్ పర్సన్) అనే నిర్వచనంలోనికి వస్తుంది. ఇవి మరొక రిజిస్టర్డ్ సంఘంలో సభ్యులుగా ఉండవచ్చు. ఈ ఫ్రంటుల గురించి కూడా రాజ్యాంగంలోగాని, చట్టాలలోగాని ఎక్కడ లేదు.

ప్రతీ పార్టీ ఏదో ఒక మేనిఫెస్టోతోనే ఎన్నికలకు పోతుంది. ఓటరు ఒక పార్టీకి ఓటేయడమంటే ఇతర పార్టీల మేనిఫెస్టోలను తిరస్కరించినట్లే లెక్క. ఎన్నికల తర్వాత ఏ పార్టీతో కలుస్తారో ఓటరుకు తెలియజేయడం లేదు కదా. అందుకు ఓటరు ఆమోదమూ లేదు. ఎన్నికల తర్వాత కలిసి అధికారం పంచుకునే పార్టీలు ఎన్నికలకు ముందే కలిసి పోటీ చేయవచ్చు గదా. కలిసి నాలుగేళ్ళు అధికారం అనుభవిస్తారు. ఐదవ సంవత్సరంలో ఏదో ఒక విషయంలో విబేధించినట్లు నటించి విడిపోయి విడివిడిగా పోటీ చేస్తారు. ఎన్నికలైపోయాక అవసరమైతే మళ్ళీ కలుస్తారు. ప్రజలు వివిధ పార్టీలకు ఓటేస్తున్నారు. అట్టి వివిధ పార్టీలు కలిసి అధికారం పంచుకుంటున్నారు. అంటే నాయకులూ, పార్టీలూ అందరూ ఒకటే. ప్రజలే పిచ్చివాళ్ళు. ఇది ప్రజాస్వామ్యమెలా అవుతుంది.

కేశవానంద భారతి కేసులో పార్లమెంటుకు రాజ్యాంగాన్ని మార్చే హక్కు ఉంది కాని, దాని మౌలిక లక్షణాన్ని నాశనం చేసే హక్కు లేదని సుప్రీంకోర్టు అభిప్రాయపడింది. మౌలిక లక్షణమంటే ఏమిటన్న ప్రశ్న ఉదయిస్తుంది. రాజ్యాంగ పీఠికలో "భారత ప్రజలమగు మేము భారతదేశమును సర్వసత్తాక, సోషలిష్టు, లౌకిక, ప్రజాస్వామ్య, గణతంత్ర రాజ్యముగా నిర్మించుకొనుటకు, మరియు భారత ప్రజలకు స్వేచ్ఛ, సమానత్వము, న్యాయము మరియు ఐకమత్యము సమకూర్చుటకు నిశ్చయించుకొని ఈ రాజ్యాంగమును మాకు మేమే సమర్పించుకొనుచున్నాము" అని ఉంటుంది. రాజ్యాంగ పీఠికలోని "మరియు" అన్న పదానికి ముందున్న భాగాన్ని మొదటి భాగంగాను "మరియు" అన్న పదానికి తర్వాత వచ్చిన భాగాన్ని రాజ్యాంగ పీఠిక రెండవ భాగంగాను పరిగణించాలి. ప్రాథమిక హక్కులు ఈ రెండవ భాగానికి పొడిగింపుగాను, వివరణగాను భావించాలి. అందువల్ల అవి రాజ్యాంగ పీఠిక నుండి భిన్నమైనవి కావని నా అభిప్రాయం. రాజ్యాంగ ప్రాథమిక సూత్రాలు సార్వజనీనమైన ఉన్నత ఆశయాలే తప్ప చట్టబద్ధంగా అమలు పరచవలసినవి కావు. ప్రాథమిక సూత్రాలనే కన్నా స్థూలంగా దిశా నిర్దేశక సూత్రాలనుకోవచ్చు. అందువల్ల రాజ్యాంగ మౌలిక లక్షణమంటే రాజ్యాంగ పీఠిక తప్ప మరొకటి కాదని స్పష్టమౌతున్నది.

రాజ్యాంగ పీఠికలో కూడా మొదటి భాగం, రెండవ భాగం రెంటినీ వేరు వేరుగా చూడాలా లేక రెండూ ఒకటేనా అంటే రెండూ వేరు వేరనే నా అభిప్రాయం. రెండు భాగాల మధ్య "మరియు" అన్న పదం బదులు "టు" అన్న ఆంగ్ల పదం వాడినట్లైతే మొదటి భాగంలో చెప్పబడిన లక్షణాలతో కూడిన భారతదేశాన్ని నిర్మించడం రెండవ భాగంలోని లక్ష్యాలను సాధించడానికి మాత్రమే అన్న భావన వచ్చేది. రెండవ భాగంలోని లక్ష్యాలను సాధించే క్రమంలో మొదటి భాగంలోని లక్ష్యాలను కొంతవరకు వదులుకున్నా తప్పు లేదన్న అర్థం వచ్చేది. కానీ, "మరియు" అన్న పదం వాడడం ద్వారా రాజ్యాంగ పీఠికలోని మొదటి భాగమే రాజ్యాంగ మౌలిక లక్షణమని భావించవలసి వస్తుంది. అందువల్ల మొదటి భాగంలోని లక్షణాలను నిలబెట్టుకొనే క్రమంలో రెండవ భాగపు లక్ష్యాలను కొంతవరకు కుదింపు చేసుకోవచ్చునన్న భావన కనిపిస్తుంది. అత్యవసర సందర్భాల్లో ప్రాథమిక హక్కులపై ప్రభుత్వాలు కనీస నిబంధనలు విధించవచ్చని, కానీ, అట్టి నిబంధనలు ప్రాథమిక హక్కులననుభవించడానికి గల సంపూర్ణ స్వేచ్ఛను హరించేవిగా ఉండరాదని సర్వోన్నత న్యాయస్థానం అభిప్రాయపడింది. దీనిద్వారా రాజ్యాంగ మౌలిక లక్షణం నిర్ద్వంద్వంగా రాజ్యాంగ పీఠికలోని మొదటి భాగమేనని స్పష్టమౌతున్నది.

రాజ్యాంగ పీఠికలోని మొదటి భాగంలో కూడా భావి భారత నిర్మాణ లక్షణాలు ఐదుగా ఉదహరించబడ్డాయి. అవి 1) సార్వభౌమత్వాధికారము 2) సోషలిజం 3) లౌకికతత్వం 4) ప్రజాస్వామ్యం మరియు 5) రిపబ్లిక్ అనగా ప్రజలు, ప్రజాప్రతినిధులే సర్వాధికారులని భావం ఈ ఐదూ ఒకటేనా అంటే కాదు అని అర్థం చేసుకోవచ్చు. ఐదూ వేరువేరైనప్పుడు వాటిలో ఏది ప్రధానమైనదన్న ప్రశ్న తలెత్తుతుంది. ఏ చట్టంలోనైనా ఒక సెక్షనుకు మరొక సెక్షనుకు పరస్పర భిన్నాభిప్రాయాలున్నప్పుడు ముందటి సెక్షన్ల కన్నా తరువాతి సెక్షన్లకే ప్రాధాన్యమివ్వాలి. ఎందుకంటే మొదటిది వ్రాసేటప్పుడు పదవది ఏమిటని తెలియదు కానీ పదవ సెక్షను వ్రాసేటప్పుడు మొదటి సెక్షను సంగతి తెలిసి ఉండాలి కదా. అందువల్ల చివరి సెక్షనే చివరి వీలునామాగా భావించాలి. కానీ, ఒక చట్టం యొక్క, లేదా మరే వస్తువు యొక్కగాని లక్షణాన్ని వివరించేటప్పుడు ముందుగా దాని ప్రధాన లక్షణాన్నే వివరించాలి.

ఉదాహరణకు ఒక ఏనుగును వర్ణించాలంటే ముందుగా చిన్నతోక, దానిపై అతి తక్కువ వెంట్రుకలు కలిగి యుండడంతో ప్రారంభించగూడదు కదా. దాని పెద్ద రూపాన్ని ముందుగా సంబోధించాలి. అలాగే రాజ్యాంగ లక్షణాన్ని వర్ణించేది రాజ్యాంగ పీఠికలోని మొదటి భాగం అనుకున్నప్పుడు అందులోని మొదటి పదం "సావరిన్" అనగా సార్వభౌమత్వాధికారం, రాజ్యాంగ ముఖ్య లేదా మౌలిక లక్షణంగా భావించాలి. ఏ ప్రభుత్వానికైనా మౌలిక లక్షణం సార్వభౌమత్వాధికారమే. ఆ సార్వభౌమత్వాధికారం ఎలా ఉండాలని మరికొంత వివరించేవే సెక్యులర్, సోషలిస్టిక్, డెమోక్రటిక్, రిపబ్లిక్ అనే పదాలు. అందువల్ల సార్వభౌమత్వాధికారాన్ని ఏ మాత్రం కుదించడానికి వీలు లేదు. అందువల్ల రాజ్యాంగంలోని ఏ భాగాన్నైనా మార్చివేసే, రద్దుచేసే అధికారం పార్లమెంటుకు తప్పనిసరిగా ఉండి తీరుతుంది. సార్వభౌమత్వాధికారమే కోల్పోయే సందర్భంలో దానిని నిలుపుకోవడానికి ఏదైనా చేయొచ్చు. ఉదాహరణకు భారత సార్వభౌమత్వాధికారం కోల్పోయి విదేశీ పాలన వచ్చిందనుకోండి వారు భారత రాజ్యాంగాన్ని గౌరవిస్తారా? సుప్రీంకోర్టును సలహా అడుగుతారా? సార్వభౌమత్వాధికారం పోయాక మిగతావి మిగులుతాయా? మరో రకంగా సావరిన్, సోషలిస్ట్ వగైరా పదాలు విశేషణాలనుకున్నా అవన్నీ వాటి చివరన ఉన్న రిపబ్లిక్ అనే పదాన్ని అర్థవంతం చేస్తాయి. రిపబ్లిక్ అంటే ప్రజలు, ప్రజా ప్రతినిధులే సుప్రీం కాబట్టి పార్లమెంటే దేశ అత్యున్నత పరిపాలనాధికార సంస్థ కాబట్టి దాని అధికారాలపై పరిమితులు విధించడానికి వీలు లేదు. దేశమంటూ మిగిలుంటే కదా అది ఎలా ఉండాలనే ప్రశ్న.

ఇలాంటి ప్రశ్నే 1975లో కాంగ్రెస్ పార్టీ ఆత్యయిక పరిస్థితి విధించినప్పుడు ఉత్పన్నమయింది. ఆ సందర్భంలో తెచ్చిందే 42వ రాజ్యాంగ సవరణ. ఈ సవరణ ద్వారా చట్టాల రాజ్యాంగ బద్ధతను పరిశీలించే కోర్టుల అధికారాలు కుదించబడ్డాయి. జాతీయ వ్యతిరేక కార్యకలాపాలను, అలాంటి సంస్థలను నిర్వచించడం జరిగింది. వ్యక్తుల ప్రాథమిక హక్కుల మీద నిబంధనలు విధించడం జరిగింది. దేశ వ్యతిరేక కార్యకలాపాల మీద చట్టాలను చేసే అధికారం రాష్ట్రాలనుంచి కేంద్రానికి బదిలీ చేయడం జరిగింది. అనేక మంది నాయకులు జైళ్ళలో పెట్టబడ్డారు. కొత్త ఆర్టికల్ 51ఎ ద్వారా పౌరులకు ప్రాథమిక బాధ్యతలు నిర్వచించబడ్డాయి. వీటి ఉల్లంఘనలకు శిక్షలు విధించబడలేదు.

పౌరులకు ఆదర్శాల రూపంలో మాత్రమే నిర్దేశించబడ్డాయి. అందువల్ల వీటి గురించి వాస్తవంలో ఆందోళన చెందవలసిన పనిలేదు. ప్రాథమిక హక్కుల హననం జరుగుతోందని విపక్షాలు ఆందోళన చేశాయి. పర్యవసానంగా 1977 సాధారణ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ అధికారం కోల్పోయింది. మొట్టమొదటి మిశ్రమ ప్రభుత్వం జనతాపార్టీ రూపంలో అధికారంలోకి వచ్చింది. ఈ ఫ్రంటులో సుమారు 12,13 పార్టీలు కలిసి ఉన్నాయి. మొదటగా మొరార్జీదేశాయ్ ప్రధానమంత్రి అయ్యాడు. అంతఃకలహాలతో ఆయనను దించివేసి చరణ్‌సింగ్ ప్రధానమంత్రి అయ్యాడు. అంతకు మించిన విభేదాలతో అవమానకరంగా చరణ్‌సింగ్ పదవి త్యజించవలసి వచ్చింది. మూడు సంవత్సరాలలోనే 1980లో మధ్యంతర ఎన్నికలు జరపవలసి వచ్చింది. కాంగ్రెసు పార్టీ అత్యధికంగా 380 సీట్లు సాధించింది. ఇందిరా గాంధీ తిరిగి ప్రధాన మంత్రి అయ్యింది. దీనిని బట్టి భారత ప్రజలు 42వ రాజ్యాంగ సవరణను, ఆత్యయిక పరిస్థితిని వ్యతిరేకించారా, అవకాశవాద మిశ్రమ ప్రభుత్వాలను తిరస్కరించారా అంటే రెండవదే కరెక్టని నాకనిపిస్తున్నది. ఆ తర్వాత కూడా వాజపేయి కొద్దిరోజుల వ్యవధిలోనే రెండుసార్లు పదవీ త్యాగం చేయవలసి వచ్చింది. కానీ దురదృష్టవశాత్తు మిశ్రమ ప్రభుత్వాలే దేశానికి దిక్కులా కనిపిస్తున్నది. దీనికి కారణం ఎన్నికల కమీషన్ విడుదల చేసిన రాజకీయ పార్టీల గుర్తుల కేటాయింపు ఆర్డరు 1968.

రాజకీయ ఫ్రంటులలోని ఏ భాగస్వామి ఎప్పుడు తప్పుకుంటాడో తెలియదు. ప్రభుత్వం ఎప్పుడు పడిపోతుందో తెలయదు. నిర్ణయాలు తీసుకునే శక్తి ప్రభుత్వాలకు ఉండదు. అందువల్ల సార్వభౌమత్వాధికారం లేనట్టే లెక్క. కాబట్టి మిశ్రమ ప్రభుత్వాలు రాజ్యాంగ మౌలిక లక్షణానికి విరుద్ధం. కాబట్టి చెల్లవు. రెండే పార్టీలు రంగంలో ఉండి, ప్రతి నియోజకవర్గం నుండి పోటీ చేసే అభ్యర్థిని అక్కడి పార్టీ కార్యకర్తలే నిర్ణయిస్తేనే అది నిజమైన ప్రజాస్వామ్యం. సార్వభౌమత్వం అదే. రిజబ్లిక్ లక్షణం కూడా అదే. అభ్యర్థులను అధిష్టానాలు నిర్ణయించకూడదు. అలా చేస్తే అవినీతి, బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం వచ్చి చేరతాయి. గెలుపు గుర్రాలు అనే సిద్ధాంతం చెప్పి ప్రజాసంబంధాలు లేకున్నా, ప్రజాసేవ చేసిన చరిత్ర లేకున్నా ధనబలం, కులబలం, కండబలం వారికే సీటు కేటాయిస్తారు. ఆ విధంగా తప్పుడు లీడర్లను తెచ్చి ప్రజల నెత్తిన రుద్దుతారు. అధిష్టానాలు మాఫియా లీడర్లలా తయారవుతారు. వ్యవస్థకు బందీలై నలిగి పోతున్నారు తప్ప ఈ పరిస్థితి

ప్రజలకూ ఇష్టంలేదు. చాలామంది నాయకులకూ ఇష్టం లేదు. అందుకే ఎన్నికల వ్యవస్థనే మార్చాలని నా అభిప్రాయం.

ప్రజాస్వామ్యం అన్న పదం భారత రాజ్యాంగంలో గాని జనరల్ క్లాజెస్ చట్టంలోగాని నిర్వచించబడలేదు. అందువల్ల నిఘంటువులోని నిర్వచనాన్ని అన్వయించుకోవాలి. దాని ప్రకారం అందరి లేదా అధిక సంఖ్యాకుల పాలన అని అర్థం చేసుకోవాలి. చెల్లిన ఓట్లలో 51 శాతం కన్నా తక్కువ ఉన్న ప్రజల ప్రతినిధి ప్రజాస్వామ్య ప్రతినిధి కాడు. అందువల్ల ఎన్నికైన అభ్యర్థికి 51 శాతం కన్నా తక్కువ ఓట్లు వచ్చే విధంగా రాజ్యాంగాన్ని, ఎన్నికల ప్రక్రియను అర్థం చేసుకోకూడదు. ప్రజాస్వామ్యం భారత రాజ్యాంగం ప్రాథమిక లక్షణం కాబట్టి దానిని కుదించే ఏ రకమైన చట్టమైనా, పరిపాలనా నిబంధన ఐనా చెల్లనే చెల్లదు.

రాజకీయ పార్టీల ఉనికి, నిర్వహణలకు సంబంధించిన నిబంధనలు ప్రజాప్రాతినిధ్య చట్టం 1951లోను, ఎన్నికల నిర్వహణ నిబంధనలు 1961, రాజకీయ పార్టీల గుర్తుల కేటాయింపు ఆర్డరు 1968 లోను ఉన్నాయి. ప్రజా ప్రతినిధుల అర్హతలు, అనర్హతలు రాజ్యాంగం ఆర్టికల్ 102లోను, రాజ్యాంగం 10వ షెడ్యూలులోను నిర్వచించబడినాయి. ఎన్నికలు నిర్వహించడానికి, ఓటర్ల లిస్టులు తయారు చేయడానికి ఎన్నికల కమీషన్‌కు అధికారం రాజ్యాంగం ఆర్టికల్ 324 కల్పిస్తుంది. చట్టసభల ద్వారా చెల్లుబాటు అయిన రాజ్యాంగం గాని, ప్రజా ప్రాతినిధ్యచట్టం గాని ఎన్నికల కమీషన్‌కు రెండు రకాలు అనగా జాతీయ, ప్రాంతీయ పార్టీలను సృష్టించే అధికారం ఇవ్వలేదు.

రాజకీయ పార్టీలను సంఘాలనుకొని, సంఘాలుగా ఏర్పడటం ప్రాథమిక హక్కనుకున్నా దేశ రక్షణ, ఐక్యత, సార్వభౌమత్వాధికారాలకు భంగం కలిగించే సందర్భంలో ప్రాథమిక హక్కులపై పరిమితులు విధించవచ్చు. ఐనా సాంస్కృతిక, సేవా సంఘాలకు, రాజకీయ పార్టీలకు చాలా తేడా ఉంది. రాజకీయ సంఘాలు దేశాన్ని పరిపాలించడానికి, అధికారం చెలాయించడానికి ఏర్పడ్డ సంఘాలు. వీటిని సేవా సంఘాలతో సమానంగా చూడడం సమంజసం కాదు. సాంఘిక, సేవా సంఘాల నమోదు ప్రక్రియలో మెమోరాండం ఆఫ్ అసోసియేషన్‌లో వారి భావాలను వ్యక్తీకరించడానికి ఉద్యమాలు చేయబోమన్న ప్రకటన తప్పనిసరి. రాజకీయ పార్టీల ముఖ్యోద్దేశమే ఉద్యమాలు చేయడం. అందువల్ల

రాజకీయ పార్టీలను ఇతర సాఘిక, సేవా సంఘాలతో సమానంగా భావించకూడదు. రాజకీయాలలో ప్రవేశించే వ్యక్తి స్వేచ్ఛకు భంగం లేదు. ఏ రాజకీయ పార్టీలో ఏ హొదాలోనైనా పని చేయవచ్చు. నచ్చిన సిద్ధాంతాన్ని ప్రచారం చేసుకోవడానికీ అభ్యంతరం లేదు. అందుకు దేశంలోన, రాష్ట్రంలోను అనేక రాజకీయ పార్టీలు ఉండవలసిన అవసరం లేదు.

రాజ్యాంగం ప్రకారం భారతదేశంలో యూనిటరీ మరియు ఫెడరల్ విధానముండాలని నిర్ణయించబడింది. అంటే కేంద్రం ఉండాలి. రాష్ట్రాలు కూడా ఉండాలి అని. దీనర్థం రాష్ట్రానికొక రాజకీయ పార్టీ ఉండవచ్చునికాదు. ఈ విషయంలోనే ఎలక్షన్ కమీషన్ తప్పు అభిప్రాయం కలిగి ఉంది. కేద్రంలోను రాష్ట్రంలోను ఒకే రాజకీయ పార్టీ అధికారంలో ఉండడం ఫెడరల్ విధానానికి విరుద్ధం కాదు. ఎందుకంటే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల విధులు, హక్కులు, అధికారాలు నిర్దిష్టంగా రాజ్యాంగంలో పేర్కొనబడి ఉన్నాయి. రాజ్యాంగ నిర్మాతలు దర్శించింది పరిపాలనా ఫెడరలిజం తప్ప రాజకీయ ఫెడరలిజం కాదు.

ప్రభుత్వంలో చేరకుండా చిన్న చిన్న పార్టీలు ప్రభుత్వానికి బయట నుండి మద్దతు ఇవ్వడం మరొక రాజ్యాంగ ఘాతుకం. అదనపు పదిమంది మద్దతుతోనే ఏర్పాటైన ప్రభుత్వాలు ఆ పది మంది సభ్యులున్న పార్టీ డిమాండ్లకు తలవంచక తప్పదు. ఇది బ్లాక్‌మెయిల్ రాజకీయాలకు దారితీస్తుంది. తరచు తరచు ఎన్నికలకు దారితీస్తుంది. ప్రజాధనం దుర్వినియోగం అవుతుంది. ప్రజలకు ప్రజాస్వామ్య ప్రక్రియపై నమ్మకం పోతుంది. ఒక్కొక్కసారి ప్రాంతీయ పార్టీనాయకుడు ప్రధాన మంత్రి అయ్యే అవకాశం ఉంది. అందుకే ఇది తప్పుడు విధానం. దేశంలో తరచు తరచు ఎన్నికల వల్ల, ఒక్కొక రాష్ట్రంలో ఒక్కొక్కసారి ఎన్నికలు జరగడం వల్ల నాయకుల, ప్రజల మనసుల్లో ఎల్లప్పుడూ రాజకీయ ఆలోచనలే తప్ప అభివృద్ధి గురించి, దేశ శ్రేయస్సు గురించి ఆలోచనే రాదు. భిన్నత్వంలో ఏకత్వం భారత రాజ్యాంగ లక్షణమని భావిస్తారు. అది రాజకీయ భిన్నత్వం కాదు. భాషా సాంస్కృతిక భిన్నత్వం. ఏకత్వం అంటే వివిధ దృక్పథాలు గల అనేక రాజకీయ పార్టీలు అధికారం పంచుకోవడానికి ఫ్రంటులుగా టెంటు కింద ఏకమవడంకాదు. ఏకత్వమంటే దేశ సమైక్యత, సార్వభౌమత్వాధికారమని అర్థం. ఒకే దేశం, ఒకే రాజ్యాంగం, ఒకే పౌరసత్వమని ఒకే జాతీయ భావమని అర్థం.

ఇలా పరిమితులు లేకుండా ప్రాంతీయ పార్టీలు పుట్టుకు రావడం వల్లనే అధిక సంఖ్యాకులైన బడుగు బలహీన వర్గాలకు అధికారం దక్కకుండా పోతున్నది. వారి బలం సంఖ్యాబలం, బలహీనత వనరులు లేకపోవడం. అగ్రవర్ణాల బలం వనరులు కలిగి ఉండడం, బలహీనత సంఖ్యాబలం లేకపోవడం. నిజంగా ప్రజాస్వామ్య ధర్మం పాటించి రెండు పార్టీలే పోటీపడితే అధిక సంఖ్యాకులైన బడుగు బలహీన వర్గాలు నిర్వహించుకునే పార్టీలు అతి తేలికగా అధికారంలోకి రాగలవు. అగ్ర వర్ణాలు తమకు సామాజిక సంఖ్యాబలం సరిపడనంతలేదు కాబట్టి ప్రజలను ఇతర రకాలుగా విభజించి ఒక పక్షానికి నాయకత్వం వహిస్తారు. ఉదాహరణకు ప్రాంతీయతత్వం, మతతత్వం. కులతత్వ అజెండాను మాత్రం అంతర్లీనంగా, రహస్యంగా ఉంచుకుంటారు.

ప్రాంతీయ పార్టీల నేపథ్యంలో కులతత్వం, కుటుంబతత్వం నిండి వుంటాయనడంలో సందేహంలేదు. ఆయా ప్రాంతీయ పార్టీలు అధికారంలోకి వచ్చినప్పుడు ఆయా కులాలు, ఆ కుటుంబాలు ధనవంతులవడం, అధికారం అనుభవించడం గమనించవచ్చు. ప్రతి ప్రాంతీయపార్టీకి ఒక కులం, ఒక కుటుంబం, ఒక వార్తా పత్రిక, ఒక టీవి మీడియా, ఒక కళాబృందం, ఒక మేధావి సంఘం ఉండి తీరుతాయి. ఈ జాడ్యం పోవాలంటే ఓటర్లు చైతన్యవంతులై కనీసం పార్లమెంటులోనున్న మూడొంతుల స్థానాలకు పోటీ చేసిన పార్టీలకు మాత్రమే ఓటెయ్యాలి. ఈ జాతీయోద్యమంలో యువకులు, విద్యాధికులు, దేశ ప్రేమికులు ముఖ్య భూమిక పోషించి యావద్భారత దేశాన్ని చైతన్యం చేయవలసిన అవసరం ఉంది. ముఖ్యంగా న్యాయ కోవిదులు ముందు వరుసలో ఉండాలి. లేకుంటే ఈ అనైక్యతే, ఈ అధికార దాహమే, ఈ అహంకారమే, ఈ అవినీతే ముందుగా భారతదేశపు అల్లకల్లోలానికి, వెనుకబాటుతనానికి చివరగా భారతదేశం స్వాతంత్ర్యం కోల్పోయి భారతీయులు దుర్భర జీవితాలు గడపడానికి తప్పక దారి తీస్తుంది.

జాతీయ, ప్రాంతీయ ప్రభుత్వాలు అనేక ప్రజా సంక్షేమ పథకాలు అమలు చేస్తున్నాయి. సంతోషించదగ్గ అంశమే కానీ, ఎన్నికలలో ఓట్లు పొందడానికి ప్రభుత్వ వనరులను ఒక్కో వర్గానికి ఇంత మొత్తమని ప్రలోభంగా ధారాదత్తం చేయడం నేరం. అలాగే పథకాలకు వారి పార్టీనాయకుల పేర్లు పెట్టడం మరో దారుణం. సి.ఎం.రిలీఫ్ ప్రోగ్రాం అని పేరు పెట్టినా పరవాలేదు. సి.ఎం.

సుబ్బారావు రిలీఫ్ ప్రోగ్రాం అని పేరు పెట్టడం సమంజసం కాదు. దీనివల్ల ఓట్ల కోసం పోటీపడి బాధ్యతా రహితంగా ప్రభుత్వ వనరుల పంపిణీ జరుగుతున్నది. ఒక ప్రభుత్వం రాగానే గత ప్రభుత్వ పథకాలు రద్దైపోతాయి లేదా మార్పులకు గురౌతాయి. ప్రతి కొత్త ప్రభుత్వం స్వంత పథకాలు ప్రకటించి అమలు చేస్తుంది. ఆ ప్రభుత్వం అంతర్ధానమవగానే ఆ పథకాలు కనుమరుగౌతాయి. దీనివలన పథకాలలో ఖచ్చితత్వం, శాశ్వతత్వం, పారదర్శకత, విశ్వసనీయత, చట్టబద్ధత లేకుండా పోతున్నాయి. ప్రజలు పథకాల ఫలాలను హక్కులా పొందలేక పోతున్నారు. లబ్దిదారుల ఎంపికలో పక్షపాతం, అవినీతి, బంధుప్రీతి ఉండి తీరుతుంది. ఈ పథకాలేవీ ఆయా పార్టీలగాని ఆయా నాయకుల స్వంత ఆస్తుల నుంచి ఇవ్వడం లేదు కదా! వారి పేర్లతో ఎందుకు పెట్టాలి? వారి దయాదాక్షిణ్యాలతోనే పథకాలు పుట్టి అమలవుతున్నట్లు ప్రచారం చేసుకుంటున్నారు.

ప్రజలపై ప్రేమ ఉంటే, సంక్షేమ పథకాలు ప్రవేశ పెట్టాలనుకుంటే, పారదర్శకంగా, నిజాయితీగా వ్యవహరించాలనుకుంటే సంక్షేమ పథకాలను చట్టం రూపంలో తీసుకురావాలి. అప్పుడే ప్రజలు వాటిని తమ హక్కుగా పొందగలుగుతారు. అవకతవకలు జరిగితే న్యాయస్థానాల్లో నిలదీయగలుగుతారు. లేకుంటే అధికార పార్టీ నాయకుల దయా దాక్షిణ్యాలే దిక్కు. అలా చేస్తే భావి ప్రభుత్వాలు పథకాలను రద్దు చేయాలన్నా, మార్పు చేయాలన్నా చట్ట సభల్లోనే చేయవలసి వస్తుంది. దీనివల్ల పథకాలకు నిర్దిష్టత, చట్టబద్ధత వస్తుంది. అంతేకానీ ఆదరాబాదరగా సంక్షేమ పథకాలను స్వంత సొమ్ము ఇస్తున్నట్లు ప్రకటనల రూపంలో ఇవ్వడం సరికాదు.

ప్రతిరాష్ట్రంలోను ఆర్థికంగా అధిక ప్రాధాన్యత గలిగిన కులాలు కొన్ని ఉంటాయి. అలాంటి కులాలు తమకంటూ ఒక రాజకీయ పార్టీ నేర్పరచుకుంటాయి. ఉదాహరణకు తెలుగు రాష్ట్రాలలో రెడ్డి, కమ్మ, వెలమలు ఆర్థికంగా అభివృద్ధి చెందిన కులాలు. ఆ కులాలకు వారి పార్టీలలో ప్రాధాన్యత తప్పనిసరిగా ఉంటుంది. చట్టం నిర్దేశించిన మేరకు యస్.సి., యస్.టి., బీ.సి కులాలకు కేటాయించక తప్పదు. ఆ తరువాత అధికారాన్నాశిస్తున్న కులం కాపు. వారిలోను స్వతంత్ర్య రాజ్యకాంక్ష రగులుతున్నది. వారి ద్వారా కూడా అనేక రాజ్యాధికార సాధన ప్రయత్నాలు జరిగినాయి కానీ విఫలమైనాయి.

రాజ్యాధికారం ఏ ఒక్క కులం  చేతుల్లో లేకుండా ఉంటేనే నిజమైన సామాజిక న్యాయం జరిగినట్లు లెక్క. ఇందుకు మేధావులైన వారందరూ ఆలోచించి ముందడుగు వేయవలసిన అవసరం ఉంది. తెలుగు రాష్ట్రాలలో గాని, ప్రాంతీయ పార్టీల ప్రబలంగా ఉన్న ఇతర రాష్ట్రాలలో గాని గమనించండి. మీకే తెలుస్తుంది. ప్రతి ప్రాంతీయ పార్టీ యొక్క కులమేంటో, దానికి మూలమైన కుటుంబమేంటో.

ప్రాంతీయ పార్టీలవల్ల దేశంలో అవినీతి పెచ్చుమీరిపోతుంది. ఒక జాతీయపార్టీ ముఖ్యమంత్రి అవినీతికి పాల్పడుతుంటే మిగిలిన నాయకులు విషయాన్ని అధిష్టానం వద్దకు తీసుకెళ్ళే అవకాశముంది. అధిష్టానం అతనిని నియంత్రిస్తుంది. జాతీయపార్టీలో అవినీతి ఉండదా అంటే ప్రస్తుత పరిస్థితులలో ఉంటుందనే చెప్పక తప్పదు. అందుకు కారణం కూడా వారు ఎన్నికలలో అవినీతిమయమై అత్యంత ధనవంతమైన ప్రాంతీయ పార్టీలను ఎదుర్కొనవలసిరావడమే. అలా కాక రెండే జాతీయ పార్టీలు రంగంలో ఉంటే ఇద్దరూ జాగ్రత్తగానే ఉండవలసి వస్తుంది. లేదంటే ఎన్నికలలో రెండవ పార్టీ రాజ్యాధికారాన్ని తన్నుకు పోతుంది. అవినీతి విషయంలో అధిష్టానం బెడద ప్రాంతీయ పార్టీ ముఖ్యమంత్రికి ఉండదు. అందువల్ల సంభవించిన అప్రతిహతమైన అధికారం దేశాన్ని అత్యంత అవినీతిమయంగా మార్చివేస్తుంది.

ప్రస్తుత పరిస్థితులలో అసంఖ్యాక ప్రాంతీయ పార్టీల ఉనికి వల్ల ఎన్నికలు ఒక టెక్నికల్ గేమ్‌గా మారాయి. ప్రజాస్వామ్యం పరిహాసానికి గురౌతున్నది. జాతీయ పార్టీలకు పెద్దగా ప్రజాబలం అవసరం లేకుండా పోతున్నది. రాష్ట్రాల మీద పట్టున్న ప్రాంతీయ పార్టీలను పట్టుకుంటే చాలు. మీకిన్ని మంత్రిపదవులు, మాకిన్ని మంత్రి పదవులు, ఈ వనరులు మీవి. ఆ వనరులు మావి అంటూ పంచుకుని ప్రభుత్వాలు నడపడం జరుగుతున్నది. కొంతమంది ప్రాంతీయ పార్టీల నాయకులు జట్టుకట్టి ఏదో ఒక తాత్కాలిక ఫ్రంటు ఏర్పాటు చేసి జాతీయ ప్రభుత్వాలను తమ చెప్పుచేతల్లో ఉంచుకునే ప్రయత్నం చేస్తున్నారు. తద్వారా కేంద్రీయ అవినీతి పరిశోధక సంస్థల నుండి కూడా రక్షణ పొందవచ్చు. రాష్ట్రీయ అవినీతి నిరోధక శాఖలు ఎలాగూ వారి చేతిలోనే ఉంటాయి.

జాతీయ పార్టీలు దెబ్బతినడానికి కూడా ప్రాంతీయ పార్టీల ఆవిర్భావమే కారణం. వీరి ఉద్దేశం జాతీయ పార్టీలు బలహీనంగానే ఉండాలి. ప్రాంతీయ పార్టీ చెప్పు చేతల్లోనే ఉండాలి. దీనివల్ల దేశ ప్రజలలో కూడా జాతీయ భావం

సన్నగిల్లి ప్రాంతీయతా భావం పెచ్చుమీరుతున్నది. ఇది దేశ సమగ్రతకు, సార్వభౌమత్వానికి మంచిది కాదు. కావున భ్రష్టుపట్టడానికి సిద్ధంగా ఉన్న ఐక్యత, అఖండత, దేశ సార్వభౌమత్వాధికారం పునఃప్రతిష్ఠింపబడాలంటే దేశ ప్రేమికులు, మేధావులు ఆలోచించాలి. 2018 కర్ణాటక అసెంబ్లీ ఎన్నికలు గమనించండి. 222 మంది సభ్యులన్న రాష్ట్రంలో పట్టుమని 20 శాతం కూడా సీట్లు గెలవని ప్రాంతీయ పార్టీకి ముఖ్యమంత్రి పదవి దక్కే అవకాశం వచ్చింది. ఇది కర్ణాటక ప్రజల అభీష్టం కాదు గదా. ప్రజాస్వామ్యానికి ఇది వికృతి.

అధిక సంఖ్యాకులైన బడుగు బలహీన వర్గాలు రాజకీయ ఆధిపత్యం పొందకుండా అడ్డుకునే వ్యూహమే బహుళ పార్టీ ఎన్నికల విధానం. ఈ వ్యూహాన్ని ఛేదించాలంటే ఏంచేయాలో వెనుకబడిన కులాల మేధావులు ఆలోచించవలసిన అవసరం ఉంది. అవసరమైతే ప్రతి రాష్ట్రంలోను పర్యటించి జాతీయోద్యమం నిర్వహించవలసి ఉంటుంది. ఎన్నికలలో బహుముఖ పోటీల వల్ల డబ్బుతోగాని ఇతరత్రాగాని 30 శాతం ఓట్లు సాధించినా గెలిచే అవకాశం వస్తున్నది. అందువల్ల కూడా భారతదేశంలో ప్రజాస్వామ్య ధర్మం పాటించబడట్లేదని నా అభిప్రాయం. ఈ దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థను అసలైన రూపంలో తిరిగి నెలకొల్పవలసిన బాధ్యత బడుగు బలహీన వర్గాలపైననే ఉన్నది. ఇది రాజకీయ సంస్కరణ కాబట్టి సంస్కరణాభిలాషులైన ఏ కులం వారైనా నిస్వార్థంగా ఈ సమాజ కారణానికి జీవితాన్నంకితం చేసి శ్యాశ్వతమైన కీర్తి సాధించవచ్చు. ఈ సేవ భారతదేశానికి బ్రిటీషు పాలన నుంచి విముక్తి సాధించినదానికంటె విలువైనది కాగలదు. దళిత, బడుగు బలహీన వర్గాలు ప్రజాస్వామ్య ధర్మ బద్ధంగా రాజ్యాన్ని సాధించి భారతీయ ధర్మబద్ధంగా, భారతీయ ఔన్నత్యం వెల్లివిరిసేలా జనరంజకంగా పరిపాలన సాగించాలని నా ప్రగాఢ వాంఛ.

నేను ఏ ఒక్క ప్రాంతీయ పార్టీని గాని, ఏ ఒక్క ప్రాంతీయ పార్టీ నాయకుడిని గాని తప్పుపట్టడంలేదు. వ్యవస్థలోని లోపాలను అందరూ వాడుకొంటున్నారు. వారూ వాడుకొంటున్నారు. న్యాయవాదులైనా, డాక్టర్లయినా, వ్యాపారస్తులైనా, ఆడిటర్లయినా, ఇంజనీర్లయినా, రాజకీయ నాయకులైనా చివరికి సామాన్య ప్రజలైనా ఎవరైనా అంతే. మన చట్ట వ్యవస్థే అంత. జల్లెడ లాగానే. అన్నీ బొక్కలే. ఆ బొక్కలను కొందరు వాడుకుంటుంటే ఇతరులెందుకు చూస్తూ ఊరుకుంటారు. వారూ వినియోగించుకుంటారు. ప్రాంతీయ పార్టీలు

రద్దయినంత మాత్రాన ప్రాంతీయ నాయకులకు ఏమీ నష్టం లేదు. వారే జాతీయ పార్టీలో నాయకులుగా అవతరిస్తారు. ప్రాంతీయ పార్టీల్లోను అత్యంత గొప్ప నాయకులే ఉన్నారు. వారే జాతీయ పార్టీలను నిర్మించవచ్చు. సంఘ సంస్కర్తలెవరైనా సర్వోన్నత న్యాయస్థానంలో ఎన్నికల కమీషన్ రాజకీయ పార్టీలను జాతీయ, ప్రాంతీయాలుగా విభజిస్తూ జారీ చేసిన ఎన్నికల గుర్తుల కేటాయింపు ఆర్డరు 1968 చెల్లనేరదని ప్రజా ప్రయోజన వ్యాజ్యం వేస్తే ప్రాంతీయ పార్టీలు వంద శాతం రద్దౌతాయని నా నమ్మకం.

రాజకీయాలతో సంబంధం లేకుండా ఏ తండ్రి అయినా జగన్‌లాంటి కుమారుడు కావాలని కోరుకుంటాడు. తండ్రి ప్రమాదంలో చనిపోతే సర్వసుఖాలు వదులుకొని అవమానాలకు సిద్ధపడి, తండ్రి పేరుతో రాజకీయ పార్టీ స్థాపించి పగలనక, రాత్రనక, ఎండలో, వానలో తండ్రి గుణగణాలను కీర్తిస్తూ, పేదల గుడిసెల్లో వారి చేతి అన్నం తింటూ, చెమటలూరుతున్న వారి నుదుళ్ళు ముద్దాడుతూ రాష్ట్రమంతటా పర్యటిస్తూ ఊరూరా తండ్రి విగ్రహాల నావిష్కరించాడు. కన్న తండ్రికి ఇంతకన్న ఘనమైన నివాళి నర్పించిన కొడుకు మరొకడు లేడంటే అతిశయోక్తి కాదు. ఇంత పెద్దసంఖ్యలో తండ్రి విగ్రహాలను ఆవిష్కరించిన కుమారునిగా గిన్నీస్ బుక్‌లో ఎక్కినా ఆశ్చర్యపోనవసరం లేదు. తల వంచి ఉంటే పదవులు వచ్చేవి. డబ్బుకా కొదువలేదు. కానీ కల్తీలేని తండ్రి మార్కు పాలన తిరిగి స్థాపించాలన్నదే తపన. ఇదంతా నటన, అధికారం కోసమే ఇలా చేస్తున్నాడంటారా! మరి మిగతా నాయకుల పోరాటాలు దేనికో. అందరూ అంతే. కాకుంటే ఇతను ఎంచుకున్న కారణం గొప్పది. రాజకీయాలు ఎట్లైనా పోనీ నాకు సంబంధం లేదు. ఒక తండ్రిగా మాత్రం జగన్‌లాంటి కొడుకు కావాలని కోరుకుంటాను. ప్రతి కొడుకు జగన్‌లా ఉండాలని కోరుకుంటాను.

గతంలో రాజులకు రథ, గజ, తురగ, పదాతి దళాలు యుద్ధంలో ఉపయోగపడేవి. ప్రస్తుత ప్రజాస్వామ్యంలో కూడా నాలుగు విభాగాలు ముఖ్యమైనవి. అవి ఒకటి పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ, రెండు కార్యనిర్వాహక వ్యవస్థ, మూడు స్వతంత్ర్య న్యాయవ్యవస్థ, నాలుగు స్వతంత్ర సమాచార వ్యవస్థ. కానీ, దౌర్భాగ్యం ఏమంటే, రాజకీయ నాయకులు మిగిలిన మూడు వ్యవస్థలను తమ చేతల్లోకి తీసుకునే ప్రయత్నం చేస్తున్నారు. ప్రతి

రాజకీయ పార్టీ తమకంటూ స్వంత మీడియాను ఏర్పాటు చేసుకుంటున్నది. కాబట్టి ఎలాంటి వార్తలు ప్రసారమౌతాయో చెప్పక్కర్లేదు. కార్యనిర్వాహక వ్యవస్థ ఎప్పుడూ ప్రజాస్వామ్య వ్యవస్థలో గుమస్తానే. ఇంకా ప్రజాస్వామ్యం ఊపిరి పీల్చుకునేదెక్కడ?

అలాగే ప్రతి రాజకీయ పార్టీ తమకంటూ ఒక పీర్ గ్రూపును ఏర్పాటు చేసుకుంటుంది. ఈ గ్రూపును పార్టీకి అనుబంధంగా మేధావుల సంఘంగానో, కళాకారుల బృందంగానో ఏర్పాటు చేస్తారు. ఈ సంఘాలలో మేధావులను, విద్యాధికులను, విదేశాలు తిరిగివచ్చిన వారిని నియమిస్తూ ఉంటారు. పార్టీలకు అనుబంధంగా ఉన్న సంఘాలు బాహాటంగానే పార్టీ సిద్ధాంతాల ప్రచారం, నాయకుల ప్రచారం, కళారూపాలుగా, చర్చా వేదికలుగా లేదా వ్యాసాల, పుస్తకాల రచనల ద్వారా సాగిస్తూ ఉంటారు. పీర్ గ్రూపులు మాత్రం బాహాటంగా పార్టీలతో అనుబంధం లేకుండా అంతర్గత అవగాహన మాత్రం కలిగి ఉండి చర్చల ద్వారా ప్రజలను ఆయా పార్టీలకు అనుకూలంగాను ఇతర పార్టీలకు వ్యతిరేకంగాను తయారుచేసే ప్రయత్నం చేస్తుంటారు.

పీర్ గ్రూపుల పని చాలా రహస్యంగా జరుగుతుంది. పార్టీలకు అనుబంధంగా ఉండే కవి, గాయక, కళాబృందాలు కూడా ఈ కోవ క్రిందకే వస్తారు కానీ, వారి కళా ప్రదర్శనలు ప్రత్యక్షంగా ఆయా రాజకీయ పక్షాలను, వారి మౌలిక సూత్రాలను, వారి నాయకులను పొగడుతూ కొనసాగుతాయి. ఐనప్పటికీ ప్రేక్షక, శ్రోతలకు కళారూపాలు మనసుకు హత్తుకోవడం వలన ఆకర్షితులౌతారు. పీర్ గ్రూపుల పని ఇలా కాదు. సామాన్య మానవులు అంత తేలికగా అర్థం చేసుకునేవిగా ఉండవు. మేధావులు చెబుతున్నారు కాబట్టి ఏ రాజకీయ పార్టీకి చెందని, మేధావులమనుకునే వారు వీరి వాదనలకు ఆకర్షితులౌతారు. అప్పుడు మెల్లగా వారు చెప్పదల్చుకున్న విషయం తలకెక్కిస్తారు.

ఉదాహరణకు ఒక ప్రభుత్వం విద్యుత్తు వినియోగ ఛార్జీలు విపరీతంగా పెంచిందనుకోండి. ప్రజల నుంచి తీవ్ర వ్యతిరేకత వచ్చిందనుకోండి. అప్పుడు రాజకీయ పార్టీలు పీరు గ్రూపులను రంగంలోకి దించుతాయి. వీరికి కావలసిన అంగబలం, అర్థబలం, మీడియా సపోర్టును అందజేస్తాయి. వీరు బయలుదేరి పట్టణ పట్టణం తిరిగి ఉద్యోగులను, విశ్రాంత ఉద్యోగులను, మధ్యతరగతి ప్రజలను సమావేశ పరచి చర్చబెడతారు.

పీర్ గ్రూపు మేధావి ముందుగా అధ్యక్షోపన్యాసం చేస్తాడు. అందులో భాగంగా ఈనాడు దైనందిన జీవితాలలో గృహావసరాలనుంచి రైళ్ళ రాకపోకలకు, పరిశ్రమలు నడపడానికి విద్యుత్తు ఎంత అవసరమో వివరిస్తాడు. ఆపై విద్యుత్ చార్జీలు పెంపు సామాన్య ప్రజలపై ఎలా భారం పడుతుందో వివరిస్తాడు. ప్రత్యక్ష విద్యుత్తు వినియోగదారుడుగానే కాక వస్తూత్పత్తి, రవాణా వ్యయాలు పెరగడం వల్ల వినియోగ వస్తు సేవల ధరలు పెరిగి మధ్య తరగతి పౌరులు ఎంతగా ఇబ్బంది పడుతున్నారో వివరిస్తాడు. ఇక్కడితో ఆయన మేధావి అని అంగీకరింజేస్తాడు. మధ్య తరగతి ఇబ్బందులను వివరించడం ద్వారా వారికి ఒక ఆత్మీయుడుగా కనబడతాడు. ఇప్పుడు ఆయన చెప్పదలుచుకొన్న భావం తలకెక్కించే ప్రయత్నం చేస్తాడు.

కరెంటు ఉత్పాదనలో ఉద్యోగుల అలసత్వం వల్ల 30 శాతం ఉత్పాదకత నష్టాలు సంభవిస్తున్నాయని, 30 శాతం ట్రాన్స్‌మిషన్ నష్టాలు జరుగుతున్నాయని అవి రెండూ లేకుంటే ప్రస్తుత యూనిట్ ధరలో 40 శాతం ధరకే విద్యుత్తు సరఫరా చేసినా ప్రభుత్వం ఇంకా కొన్ని కోట్ల రూపాయల లాభంలో ఉండగలదని విద్యుత్తు ఉత్పాదక నష్టం, రవాణా నష్టం వల్ల ప్రభుత్వం నష్టపోయి ప్రజలపై భారం మోపుతున్నదని తేల్చి ఛార్జీల పెంపు భారం ప్రభుత్వం తలపై నుంచి దించి అనాదిగా గత ప్రభుత్వాల ద్వారా వస్తున్న విధానాలను నిందించి బాధ్యత వారి నెత్తిన పెట్టే ప్రయత్నం చేస్తాడు. విద్యుత్ చౌర్యం వల్ల కూడా ధరా భారం నిజాయితీ పరులైన వినియోగదారులపై కూడా పడుతున్నదని వివరించి ఈ సభలో ఎవరైనా విద్యుత్తు మీటర్లు లేకుండా విద్యుత్ చౌర్యానికి పాల్పడుతున్న వారున్నారా? ఉంటే చేతులెత్తడంటూ నవ్వుల పువ్వులు పూయించి ఇప్పుడు వీరు మాట్లాడుతారు, వీరు మాట్లాడుతారంటూ వేదికపైనున్న అందరినీ మాట్లాడిస్తాడు.

మొదటి బ్యాటింగ్ చేసిన మన మేధావున్నాడుగా అందరూ అదే లైనులో మాట్లాడతారు. ఫలితం ఉదయాన్నే వార్తా పత్రికల్లో మొదటి పేజీలో కథనం. విద్యుత్ చౌర్యం, ఉత్పాదక నష్టాలు, రవాణా నష్టాల కారణంగా విద్యుత్ ఛార్జీల పెంపు అనివార్యమౌతున్నదని, ఈ జాడ్యం గత ప్రభుత్వాల నుంచి వారసత్వంగా వస్తున్నదని, ముందుగా ఆ లోపాలు సరిదిద్దాలని మేధావులు అభిప్రాయపడుతున్నారని.

అలాగే గాంధీ, నెహ్రూ, అంబేడ్కర్ వంటి వారిని విమర్శించాలంటే రాజకీయ నాయకులు స్వయంగా ఆ పని చేయరు. దేశవ్యాప్త వ్యతిరేకత వస్తుందన్న భయంతో. అంటువంటి పనులకు ఈ పీర్ గ్రూపు వ్యక్తులను ఉపయోగించుకుంటారు. అలాగే ఇతర పార్టీలలో నేర చరితులెవరు, అక్రమార్జనలు చేస్తున్నదెవరు, వారి మార్గాలేంటి వంటి విషయాలపై వివరాలు సేకరించి ప్రచారమాధ్యమాల ద్వారా, న్యాయస్థానాలలో కేసులు వేయడం ద్వారా ప్రతిపక్ష పార్టీలపై ప్రజలలో వ్యతిరేకత సృష్టించడానికి ఈ పీర్ గ్రూపు సభ్యులను ఉపయోగించుకుంటారు.

అలాగే ఇతర కులాలను, మతాలను సనాతన ధర్మాలను అటాక్ చేయాలన్నా ఈ పీర్ గ్రూపులనే ఉపయోగిస్తారు. ఎందుకంటే ఒక కులం లేదా ఒక మతం లేదా ఏదైనా ఒక పెద్ద ప్రజాసమూహం తమ పార్టీకి వ్యతిరేకంగా మారడాన్ని రాజకీయపార్టీలు ఆహ్వానించవు కదా! రాజకీయ పార్టీలు వీరికి కావలసిన ఆర్థిక మద్దతు మీడియా మద్దతు ఇవ్వడంతోబాటు రాజ్యాంగ రక్షణ కల్గియున్న కులాలను, పార్టీ కార్యకర్తలను భౌతిక మద్దతు కోసం ఏర్పాటు చేస్తారు. వారి అభివృద్ధికి అడ్డుగా నిలిస్తే వీరు ఏదో ఒక రోజు వెనుకబడిన కులాలను కూడా టార్గెట్ చేస్తారు.

సమాజంలో కుల, మత, ప్రాంతీయ దురభిమానాలు రెచ్చగొడుతున్నారు. మర్డర్లు, మానభంగాలు, దోపిడీలు, భూకబ్జాలు, ఉగ్రవాద, తీవ్రవాదాలు పెచ్చుమీరుతున్నాయి. ఇవి ప్రస్తుత రాజకీయ వ్యవస్థవల్ల వచ్చిన దుష్పరిణామాలు. ఈ మధ్య గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్‌లలో భాగంగా భారీ పారిశ్రామికీకరణకు, వాణిజ్యీకరణకు, ఎగుమతులు, దిగుమతులు మౌలిక రంగాలలో తలుపులు తెరుచుకున్నందువల్ల అవినీతి కూడా కొత్తపుంతలు త్రొక్కింది. గతంలో కోటి రూపాయలంటే గొప్ప. ఇప్పుడు వందలు, వేలు, లక్షల కోట్ల రూపాయలు ఒక్కొక్క ఒప్పందంలోనే వెనకేసుకుంటున్నారు. ప్రజలకు కూడా ఇదంతా తెలుసుకాని అందరూ అంతే, మనం ఎవ్వరిని ఆపలేం అనే నిర్వేదం. తమ బిడ్డల చదువులు, అనారోగ్య సమస్యలు, ఋణబాధలు, ఈతిబాధలు తీర్చేవారెవరైనా ఉంటే వారినే ఆరాధిస్తున్నారు. ముందు బ్రతకాలి గదా! అదే వారి ప్రాధాన్యత. అయితే పరిస్థితి ఎల్లప్పుడు ఇలాగే ఉంటుందనుకోను. గతంలో చెప్పినట్లు మార్పు సహజం. ఇందుకు విరుగుడుగా

సమాజం ఏ దిశగా ప్రయాణిస్తుందో, ఎలా సంస్కరిస్తుందో, ఎంతకాలానికి ఎలా స్పందిస్తుందో వేచిచూడవలసిందే. విద్యావంతులు, నిజాయితీపరులు రాజకీయాలలో ప్రవేశించి పరిస్థితులను మెరుగు పరుస్తారని ఆశిద్దాం.

ఆర్థిక వ్యవస్థ వైపు చూస్తే ఇంకా నిరాశ. భారతదేశంలోనే ఒక సోమాలియా ఉంది. ఒక అమెరికా కూడా ఉంది. ఆర్థిక అసమానతల అగాధానికి అంతే లేదు. కొందరు విమానాల విదేశీయాన విలాసాలలో తేలియాడుతుంటే అధికశాతం ప్రజలు ఆహారం, విద్య, వైద్యం, వసతుల లోపాలతో అశుభ్రంతో, అవిద్యతో, ఆకలితో, రోగాలతో జీవచ్ఛవాలుగా బ్రతుకుతున్నారు. అలాంటి వారు ఐదేళ్ల కొకసారి వచ్చే ఓట్ల పండుగలో నోటుకు ఓటేసి ఒక్క రోజైనా అవసరాలు తీర్చుకోకుండా ఎలా ఉంటారు? వీరి బ్రతుకులలో స్వాతంత్ర్యానికి పెద్దగా ప్రాధాన్యం లేదు. రాజ్యాధికార మార్పు పాలకులకున్నంత ప్రాముఖ్యం ప్రజలకు లేదు. ఏ పాలకులు పాలించినా సామాన్య ప్రజలకు పెద్దగా భేదంలేదు. వారికి కావలసింది భద్రత మరియు కనీస సౌకర్యాలు.

ఒక ప్రక్క 70 సంవత్సరాలు భారతదేశంలో అంతర్భాగంగా ఉన్నా కశ్మీర్ ప్రజలు భారతీయులమని భావించే అవకాశం ఉందా? అక్కడ సాయుధ అణచివేత తప్ప భారత జాతీయ భావన ఉన్నదా? వారికి సరియైన రక్షణ కల్పించి భారత జాతీయ జనజీవన స్రవంతిలో భాగస్వాములను చేయలేక పోయాం. అక్కడ భారతీయ చట్టాలు చాలావరకు అమలులో లేవు. అక్కడ పాకిస్తాన్ టెర్రరిస్టుల ప్రభావమే అధికంగా ఉంది. సాక్షాత్తు కాశ్మీర్ శాసనసభలో సభ్యులే పాకిస్తాన్ జెండా ఊపుతూ పాకిస్తాన్ జిందాబాద్ అంటూ నినాదాలిస్తున్నారంటే అక్కడి పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. భారతదేశ ప్రథమ ప్రధాని, భారతరత్న, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్వంత రాష్ట్ర పరిస్థితి అది. సగం కాశ్మీరు భౌగోళికంగా పరాధీనమై మిగిలిన సగం కూడా మానసికంగా పరాధీనంలో ఉంది. సియాచిన్ ప్రాంతంలో 44000 చదరపు కిలోమీటర్ల భూభాగాన్ని చైనా ఆక్రమించింది. ప్రస్తుతం అరుణాచల్‌ప్రదేశ్ కూడా తమదేనంటున్నది. పాకిస్థాన్‌కి సాయం చేయడానికి అమెరికా మరియు చైనా కూడా సిద్ధంగా ఉన్నాయి. ఈ పరిస్థితులలో భారతదేశానికి తనకు తాను రక్షించుకోవడం సాధ్యమేనా.



# 14. భారతదేశంలో అభివృద్ధికి అడ్డంకులేమిటి?

అనేక దేశాలు అనేక సామాజిక, ఆర్థిక, రాజకీయ విధానాల నెంచుకున్నాయి. ప్రపంచంలో కమ్యూనిస్టు దేశాలున్నాయి. ప్రజాస్వామ్య దేశాలున్నాయి. రాచరిక పాలనలో ఉన్న దేశాలు ఉన్నాయి. మతపరమైన దేశాలు కూడా ఉన్నాయి. అవి అన్నీ ఆర్థికంగా ఎదుగుతూనే ఉన్నాయి. దేశ పౌరులకు స్వేచ్ఛా భద్రతలతో గూడిన మంచి జీవితాన్నందించ గలుగుతున్నాయి. ఆయా దేశాలు వారి సార్వభౌమాధికారం గాని, సాంస్కృతిక వారసత్వ సంపదను గాని కోల్పోకుండానే మంచి పరిపాలనందించ గలుగుతున్నాయి. ఈ మధ్య నేను చైనా వెళ్ళి రావడం జరిగింది. కమ్యూనిస్టు దేశమైనా యాంత్రీకరణలో ప్రపంచంలో అగ్రగామిగా ఉంది. పెద్దపెద్ద వ్యాపార సంస్థలకు నిలయంగా ఉంది. ప్రపంచం మొత్తానికి వస్తు తయారీ కేంద్రంగా మార గల సత్తా ఆ దేశానికి ఉందనిపించింది. వ్యాపారాలలో ప్రభుత్వ జోక్యం బహు తక్కువ. షాపులు ఎక్కువ భాగం మహిళలే నడుపుతున్నారు. షోరూములలో సేల్స్‌గర్ల్స్ అత్యంత ఆధునికంగా ఉన్నారు కానీ వారికి కనీస ఇంగ్లీషు పరిజ్ఞానం కూడా లేదు. అందువల్ల వారి సాంకేతిక నిపుణులు విదేశాలకు వలస వెళ్ళే అవకాశం లేదు. విదేశీయులు చైనాలో పనిచేయలేరు. మనదేశంలోనైతే ప్రభుత్వ సదుపాయాలతో వైద్య విద్యనభ్యసిస్తారు. అమెరికా ప్రజలకు సేవ చేస్తారు. ఆపై అక్కడే స్థిరపడతారు. దుబాయి జనాభాలో 20 శాతం మాత్రమే స్థానికులు. 80 శాతం ప్రజలు విదేశీయులే. ఐనా దుబాయి మౌలిక లక్షణాలు చెక్కు చెదరకుండా అక్కడి ప్రభుత్వం చూస్తుంది. 80 శాతం మంది విదేశీయులున్నా వారి ఇష్టానుసారం సాగదు. అలాగే సింగపూరు జనాభాలో కూడా 25 శాతం మాత్రమే స్థానికులు. 75 శాతం విదేశీయులు.

అట్టి దేశాలన్నింటిలోకి మనదేశం ఏ మాత్రం తీసి కట్టుకాదు. ప్రకృతి వనరులున్నాయి. సువిశాల ప్రాంతముంది. సముద్రాలు, పర్వతాలు, నదులు, సరస్సులు ఉన్నాయి. సారవంతమైన భూములున్నాయి. కష్టపడి పని చేసే ప్రజలున్నారు. మంచి వాతావరణ పరిస్థితులు. ఇక్కడి ప్రజలు మంచివారు. చక్కని శరీర సౌష్టవం గలిగిన వారు, తెలివైన వారు. అన్నీ వృధా అవుతున్నాయి. ప్రజలు పేదరికంతో సమస్యల సుడిగుండంలో బ్రతుకుతున్నారు. శిశువు నుంచి పండు ముదుసలి వరకు అన్ని వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో ఉన్న వారు కూడా టెన్షన్‌లోనే బ్రతుకుతున్నారు. చట్టాలు లెక్కలేనన్ని ఉంటున్నాయి. అర్థం చేసుకోలేనంత, అమలు పరచలేంత కఠినంగా ఉంటున్నాయి. కారణం ఒక్కటే. "దక్షుడు లేని ఇంటికి పదార్థము వేరొక చోట నుండి వేలక్షలు వచ్చి చేరినన్ నిలువదు. నీరు నిల్చునే అక్షయమైన గండి పడినట్టి తటాకములోన భాస్కరా" అన్న శతక సూక్తి భారతదేశ విషయంలో ముమ్మాటికి నిజం.

ఈ దేశం నాదని ఏ నాయకుడూ అనుకునే అవకాశం లేకుండా పోయింది. సుమారు 400 పార్టీలుండడంతో కూటముల ఏర్పాటుతో ప్రస్తుత పదవి ఏక్షణంలో ఊడుతుందో తెలియదు. మళ్ళీ ఎన్నికల తర్వాత అధికారం వస్తుందో రాదో తెలియదు. అందువల్ల కుర్చీ మీద కూర్చున్న రోజే నాది. ఎండ ఉండగానే గింజలు ఎండబెట్టుకోవాలన్న చందంగా నాయకులు ప్రవర్తిస్తున్నారు. దీనివల్ల ప్రభుత్వ విధానాల్లో నిశ్చితత్వము, శాశ్వతత్వము లోపించాయి. రాజకీయం క్రీడలా మారిపోయింది. మనం ఎంచుకున్న రాజకీయ వ్యవస్థ ముఖ్యంగా బహుళ పార్టీ వ్యవస్థ వల్లనే ఈ దుస్థితి దాపురించింది.

ప్రభుత్వ వ్యవస్థలో ఇమడలేక, ఎదురు తిరగలేక రైతులు, పేదలు లక్షల సంఖ్యలో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. రైతులే కాదు అనేక మంది ఇతర నిరుపేదలు కూడా ఆత్మహత్యల బాట పడుతున్నారు. అతి సమీప భవిష్యత్తులో చిరు వ్యాపారులు కూడా ఈ జాబితాలో చేరబోతున్నారు. ఉద్రేకపరులైన అనేక మంది యువకులు తుపాకులతో అడవులలోకి పోయి ప్రభుత్వంపై తిరుగుబాటు చేస్తున్నారు. కులాలు, మతాలు సంఘాలుగా ఏర్పడి తమను తాము రక్షించుకొనే ప్రయత్నాలు చేస్తున్నారు. ఒక ప్రక్క దేశం యావత్తూ విదేశీ ఆర్థిక వ్యవస్థ విష కౌగిలిలో నలిగిపోతున్నది. రాజకీయ నాయకులు, అధికారులు మాత్రం తమపని

తాము చక్కబెట్టుకొంటున్నారు. జనజీవన అవసరాలకు మరియు ప్రభుత్వ విధానాలకు పొంతన లేకుండా పోతున్నది. ప్రజలు అనుసరించలేనంత కఠినంగా చట్టాలు ఉంటున్నాయి. న్యాయస్థానాలలో న్యాయం పొందాలంటే జీవితకాలాలు ఆలస్యమౌతున్నది. అందుకే ప్రజలలో శాసనోల్లంఘన ఎక్కువగా ఉన్నది. రాజకీయం ఒక చదరంగపు ఆటగా మారిపోయింది. పదవి సంపాదించుకోవడం దానిని నిలబెట్టుకోవడం అనునిత్యం ఒక సమస్యగా మారిపోయింది. అందువల్ల పాలకులకు ప్రజల గురించి ఆలోచించే సమయం లేకుండా పోయింది. ప్రజాసేవ భోగభాగ్యాలు అనుభవించదగ్గ ఒక అధికారంగా మారిపోయింది. ఈ పరిస్థితి మారాలని ప్రతి ఒక్కరూ కోరుకోవాలి.

చదువులకు, జీవన వ్యాపారాలకు సంబంధం లేకుండా పోతున్నది. బి.యస్.సి. బోటనీ చదువుతున్నారు. వెంపల చెట్టు సిసిల్ ఫెనాసి వర్గానికి చెందిందని, మందార చెట్టును హైబిస్కస్ రోజా సైనిన్సెస్ అంటారని, గోంగూరను హైబిస్కస్ కన్నాబినస్ అంటారని, జిల్లేడు చెట్టు యొక్క ఆకుల ఏర్పాటును వలిత కిసలయ విన్యాసమని తెలుసుకుంటాడు. బ్యాంకు పరీక్షలు వ్రాసి బ్యాంకు క్లర్క్‌గా ఉద్యోగం సంపాదిస్తాడు. తన బాటనీ పరిజ్ఞానం జీవితంలో ఎన్నడూ పనికి రాదు. బ్యాంకు ఉద్యోగంలో చేరేటప్పటికి అతనికి బ్యాంకింగ్ వ్యవస్థ గురించి గాని, అకౌంటింగ్ గురించి గాని, బ్యాంకింగ్ ఖాతాదారులైన వ్యవసాయదారుల గురించిగాని, వ్యాపారస్తుల గురించి గాని ఏమాత్రం పరిజ్ఞానం ఉండదు.

అలాగే దేశంలో ఐదు కోట్ల మందికి పైగా అనేక రకాల వాహనాలు నడిపే వారున్నారు. వారికి అవసరమైన విద్యనందించే వ్యవస్థ భారతదేశంలో ఉందా? లైసెన్సులు జారీ చేసే వ్యవస్థ తప్ప. వాహన చోదకులకు రోడ్డు నియమాలు తెలిస్తే సరిపోదు. ప్రమాదాలు జరిగినప్పుడు తలెత్తే న్యాయపరమైన అంశాలు తెలిసి ఉండాలి. వైద్యశాలలో చేర్పించడం తెలిసి ఉండాలి. కేసు రిజిస్టరు చేయడానికి అవసరమైన విధి, విధానాలు డాక్యుమెంటేషన్ గురించి తెలియాలి. ప్రాథమిక చికిత్స గురించి తెలిసుండాలి. సామాజిక బాధ్యతగా రహదారిపై ఇతరులు ప్రమాదానికి గురైనప్పుడు ఎలా స్పందించాలో తెలియాలి.

వేగము, సాపేక్ష వేగము వాహనాలు ఎదురెదురుగా వస్తున్నప్పుడు ఎలా ఉంటుంది? సమాంతరంగా వెళ్ళేటప్పుడు ఎలా ఉంటుంది? దాని ప్రభావం ప్రమాదంపై ఎలా ఉంటుంది? అన్న విషయాలు తెలియాలి. వాహనాల పరిమాణము, టైరు పరిమాణము, ఇతర వస్తువులను ఢీకొట్టినప్పుడు వాటి పరిణామాలెలా ఉంటాయి వంటి విషయాలు చాలా ముఖ్యం. అలాగే వాహనం గ్రౌండ్ క్లియరెన్స్ ఎంత? వాహన చక్రం యొక్క డయామీటర్ ఎంత అనే విషయం కూడా ముఖ్యం. అలాగే గరిమనాభి, స్థిరత వంటి విషయాలు, అలసట మరియు డ్రైవింగ్‌పై దాని ప్రభావం గురించి కూడా తెలిసి ఉండటం మంచిది. ప్రత్యేకమైన ట్రైనింగ్, అవగాహన చాలా అవసరం. అవి లేకపోగా డ్రైవింగ్ లైసెన్సులు ఎలా మంజూరవుతాయో మనకు తెలుసు.

కోట్లాది కుటుంబాలు కిరాణ వంటి వినియోగ వస్తువుల దుకాణాలు నడుపుకొని జీవనం కొనసాగిస్తారు. ఇందుకు తగిన చదువులేదు. వ్యాపార స్థాపనకు ఎలాంటి కూడళ్ళు ఎంచుకోవాలి? రాగల కస్టమర్ల సంఖ్యను అందాజుగా ఎలా లెక్కించాలి. దానిని బట్టి ఎంత టర్నోవరు ఆశించవచ్చు. బ్రేక్ ఈవెన్ పాయింటు ఎక్కడ ఉంటుంది. అత్యధికంగా ఎంత ఆదాయం రాగలుగుతుంది. జి.యస్.టి., ఇన్‌కంటాక్సు, లేబరు నిబంధనలు, తూనికలు కొలతల నిబంధనలు, ఆహార నాణ్యతా చట్టాలు, ప్రావిడెంటు ఫండు, ఇ.యస్.ఐ. నిబంధనలు, గ్రామ పంచాయితీ లేదా మున్సిపాలిటీల నుంచి అనుమతులకు సంబంధించిన నిబంధనలు, బ్యాంకులో రుణం పొందాలంటే ఎలా, బ్యాంకు రుణ పరిమితి నిబంధనలు, వడ్డీ రేట్లు, ఏ వస్తువులు ముఖ్యంగా ఏ మార్కెట్లలో దొరుకుతాయి. ఎలా నిలువ వుంచాలి, ఎంత కాలం నిలువ ఉంటాయి వంటి విషయాలు అవగాహన చాలా అవసరం. ఇలాంటి అవగాహన లేకనే అనేక మంది వ్యాపారం ప్రారంభించి నష్టపోయి దివాలా తీయడం లేదా ఆత్మహత్య చేసుకోవడం జరుగుతున్నది. పోస్ట్ గ్రాడ్యుయేషన్ చదివిన వారికి కూడా పై విషయాలు వారి చదువు ద్వారా తెలియదు.

అలాగే టూరిజం, హెూటలు వ్యాపారం. ఇలా ఒకటేమిటి? జీవనోపాధి గలిగిన వందల రంగాలున్నాయి కాని మన విద్యా విధానం వాటికి అనుబంధంగా లేదు. ఫలితం నిరుద్యోగం, నాసిరకం వస్తు సేవల ఉత్పత్తి. దేశపు

వెనకబాటుతనం. కోట్లమంది వ్యక్తులు వివిధ వ్యాపారాల్లో సేల్స్ మాన్‌గా పని చేస్తున్నారు. సేల్స్‌మన్‌షిప్‌కు సంబంధించిన చదువుగానీ, ట్రైనింగ్ కాని ఉన్నదా? పోస్ట్ గ్రాడ్యుయేషన్ చదివిన వ్యక్తికి కూడా తన రాజ్యాంగ హక్కులు విధులు బాధ్యతల గురించి తెలియదు. కనీసం విమానాశ్రయంలో చెక్ ఇన్ ఎలా అవ్వాలో కూడా అతని చదువు ద్వారా మాత్రం తెలియదు. రాజ్యాంగమే నేటి వేదం. చట్టాలే పురాణాలు. రాజ్యాంగ విధి విధానాలు తెలియని వారు నాణ్యత గలిగిన పౌరులెలా అవుతారు? అందువల్ల రాజ్యాంగ అవగాహన, పౌరుల హక్కులు, విధులు, బాధ్యతలు, నైతికత, భారతీయ సనాతన చరిత్ర గొప్పదనం పదవ తరగతి లోగా తప్పక పాఠ్యాంశాలుగా పొందు పరచాలి. ఇంటర్‌స్థాయిలో దేశంలో గల మధ్య స్థాయి వృత్తి ఉద్యోగ, వ్యాపారాలు, కళలు గురించి అవగాహన కల్పించాలి. ఏ నేరానికి ఏ శిక్ష ఉంటుందో తెలియజేయాలి. ఆపై గ్రాడ్యుయేషన్ స్థాయి నుంచి స్పెషలైజేషన్ చేయించాలి.

న్యాయ వాదులకు జీవనభృతి కల్పించడానికి, న్యాయమూర్తులకు నిరుద్యోగ సమస్య తీర్చడానికి కాదు న్యాయస్థానాలున్నది. బాధిత ప్రజలకు న్యాయం చేకూర్చడానికే న్యాయస్థానాలు ఏర్పాటు చేయబడ్డాయి. కానీ న్యాయస్థానాలలో కక్షిదారుల పాట్లు చూస్తుంటే బాధేస్తుంది. న్యాయస్థానాన్నాశ్రయించే వారిలో నేరస్తులుంటారు, ఆస్తి పంపకాలకోసం అన్న దమ్ములొస్తారు. ప్రామిసరీ నోట్లపై దావాల గురించి వస్తారు. వారసత్వ ధృవపత్రాల గురించి వస్తారు, అన్యాయం జరిగిన మహిళలు, సామాజిక కార్యకర్తలూ వస్తారు. వారందరినీ నిలబెట్టేది చెట్ల క్రింద లేదా కోర్టుహాలు బైట వరండాలలోనే. వారిలో ముసలివారు, మహిళలు, పసి పిల్లలు కూడా ఉంటారు. ఉదయం 10.30కి వచ్చి నిలబడాలి. సాయంత్రం 5గం.లలోగా ఎప్పుడు పిలుస్తారో తెలియదు. పిలవగానే జనాన్ని తప్పించుకుని ఉరికి న్యాయమూర్తికి కనిపించాలి. ఇంతా కష్టపడి కనిపిస్తే ఏ చర్చాలేకుండా మరుసటి నెల ఫలానా తారీఖు అని ప్రకటిస్తారు. సమయానికి అందుకోలేకపోతే మాత్రం కేసు డిస్‌మిస్ లేదా అరెష్టు వారంటు జారిచేస్తారు. న్యాయవాదుల సమర్ధత పైనే ఆధారపడి ఫలితాలు వస్తాయి.

కక్షిదారులు కూర్చోవడానికి స్థలం ఉండదు. ఫ్యాన్‌లు, టాయ్‌లెట్స్, మంచినీళ్ళు ఉండవు. అంటే కోర్టు విధానంలో మానవ హక్కుల ఉల్లంఘన కూడా జరుగుతున్నదన్న మాట. కక్షిదారులు కోర్టు ఫీజు కోర్టుకు చెల్లిస్తున్నారు. న్యాయవాదుల ఫీజు న్యాయవాదులకు చెల్లిస్తున్నారు. మరి వారికాఖర్మేమిటి? ఆలోచించే నాథుడు లేడు. ఎంతో ఉదాత్తమైన పెద్దమనుషులు కూడా ఖర్మకాలి కోర్టులకొస్తారు. వారికి కూడా ఏ మాత్రం మినహాయింపులేదు. నిలబెట్టి మాట్లాడతారు. అలాంటి వారి ముందు అక్కడున్న న్యాయమూర్తులు, న్యాయవాదులు కూడా చాలా చిన్నవారు. కుర్చీకి విలువ ఇవ్వాలండీ అంటారేమో? వ్యక్తులకు, వ్యక్తిత్వాలకు, వయసుకు విలువ ఇవ్వవలసిన అవుసరం లేదా?

కోర్టులు పెట్టింది ఎవరి కోసం? ప్రజల కోసం. దుష్టులను శిక్షించడానికి, మంచి వారిని రక్షించడానికి. అంటే ధర్మాన్ని కాపాడడానికి. కోర్టుకు రావడం ప్రజలకు ఇబ్బంది కరంగా పరిణమిస్తే కోర్టులు ఏర్పాటు చేసిన ధ్యేయం విఫలమైనట్లే లెక్క. న్యాయం కోరి వచ్చిన నిజాయితీ పరులు కూడా అంతులేని అవమానాన్ని భరించవలసి వస్తున్నది. పైగా ఈ బాధలు ఎంతకాలం? అంటే ఒక జీవిత కాలం. ఎందుకంటే ఒక సివిల్ కేసు పరిష్కారం కావాలంటే ఒక జీవిత కాలం పడుతున్నది. పుట్టింది కోర్టు కష్టాలననుభవించి చావడానికే అన్నట్లు అనిపిస్తుంది. అందువల్లనే ఖబ్జా కోరులు, రౌడీలు, సెటిల్ మెంట్ గ్యాంగులు రెచ్చిపోతున్నారు. అవినీతి పరులు న్యాయ వ్యవస్థ అంటే ఎంతమాత్రం భయపడడం లేదు. మనం తినే పండ్లు కార్బైడ్ వేసి కృత్రిమంగా పండిస్తున్నారని, అది విషపూరిత రసాయనమని దానివల్ల మనుషుల ఆరోగ్యం దెబ్బతినడమే కాక తరతరాలుగా జన్యుపరమైన చెడు మార్పులు కూడా సంభవిస్తున్నాయని, అలాంటి వారు చేస్తున్నపని హత్యకన్నా తీవ్రమైన నేరమని ఆంధ్ర, తెలంగాణ ఉమ్మడి హైకోర్టు అనేకసార్లు ప్రభుత్వాలు పట్టించుకున్న దాఖలాలు లేవు. ఈరోజుకు కూడా కార్బైడ్ వినియోగం యధేచ్ఛగా సాగుతూనే ఉంది.

కక్షిదారులకు, ముఖ్యంగా నేరారోపణ లేని వారిని, నేరారోపణ ఉన్న వారిని విడివిడిగా స్త్రీ పురుషులకు కూర్చునే స్థానం కల్పించాలి. ఫ్యాన్లు, బాత్ రూమ్‌లు, త్రాగునీరు కల్పించ వలసిన అవుసరముంది. ఇవన్నీ ఏర్పాటు

చేయవలసిన బాధ్యత ప్రభుత్వాలదే. లేకుంటే మానవ హక్కుల ఉల్లంఘన జరిగినట్లే భావించవలసి వస్తుంది. సత్వర న్యాయం అందించి తీరాలి. లేదంటే న్యాయాన్ని నిరాకరించినట్లే. ధర్మో రక్షతి రక్షితః అన్నట్లు ప్రభుత్వాలు ధర్మాన్ని రక్షించకపోతే ప్రభుత్వాలను ధర్మం కూడా రక్షించదు. ప్రజలకు న్యాయవ్యవస్థపై నమ్మకం పోతుంది. తిరుగుబాటు వస్తుంది. స్వదేశీనా, విదేశీనా ఏదైనా పర్వాలేదు కాని ఈ ప్రభుత్వాలు కూలి పోయి క్రొత్త ప్రభుత్వాలు రావాలని ప్రజలు కోరుకుంటారు. విసుగు చెంది సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం కోసం ప్రజలు హింసాత్మక పరిష్కారాలనెంచుకునే అవకాశముంది. ప్రభుత్వమే కక్షిదారులుగా ఉన్న అనేక రకాల పన్నుల వివాదాలలో ప్రభుత్వం ఇలాగే ప్రవర్తిస్తున్నారా? నిర్ణీత కాలంలో కేసులు పరిష్కరించి పన్నులు, పెనాల్టీలు వసూలు చేసుకోవడం లేదా? ప్రజలంటే ఎందుకంత చులకన?

న్యాయస్థానాల్లో న్యాయం సాధించుకోవాలంటే ఒక జీవిత కాలం సరిపోవడం లేదు. ఇందుకు మంచి పరిష్కారముంది. అంతర్జాతీయ వాణిజ్య వివాదాలలో ఎవరూ న్యాయస్థానాల నాశ్రయించడానికి వీలు లేదు. తప్పనిసరిగా మధ్యవర్తిత్వం ద్వారానే పరిష్కరించుకోవాలని ఐక్యరాజ్యసమితి తీర్మానం చేసింది. అందుకు తగిన విధివిధానాలను పొందుపరుస్తూ అంతర్జాతీయ మధ్యవర్తిత్వ చట్టాన్ని రూపొందించింది. సభ్య దేశాలన్నీ కూడా ఆ చట్టానికి వీలైనంత దగ్గరగా ఉండే విధంగా జాతీయ మధ్యవర్తిత్వ చట్టాలను రూపొందించుకోవాలని సూచించింది. అందులో భాగంగానే భారత మధ్యవర్తిత్వచట్టం 1996 రూపొందించబడింది. కానీ దానిని ఇంతవరకు అమలు పరచిన దాఖలాలు లేవు. షుమారు 1998 ప్రాంతంలో నల్సార్ యూనివర్సిటీ వారు విజయవాడ బార్ అసోసియేషన్ వారి సహకారంతో మధ్యవర్తిత్వంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లొమా కోర్సు నిర్వహించారు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ద్వారా సర్టిఫికెట్లు అందించారు. అందులో నేను కూడా ఒక సభ్యుడిని. ఆ చట్టాన్ని చిత్తశుద్ధితో అమలు పరిస్తే న్యాయస్థానాలలో ఇలా లక్షల కేసులు పేరుకుపోయే అవకాశమే లేదు. సివిల్ ప్రొసీజరు కోడు సెక్షను 89 ననుసరించి మధ్యవర్తులు మధ్యంతర ఉత్తర్వులు కూడా ఇచ్చే అవకాశముంది. వాటిని కోర్టు ఆర్డరులా అమలు చేసే అవకాశముంది.

ప్రభుత్వాలకు భవనాల ఏర్పాటు ఖర్చు, సిబ్బంది వేతనాల ఖర్చు తప్పుతుంది. కక్షిదారులకు కోర్టు ఫీజులు ఖర్చులు తగ్గుతాయి. సత్వరన్యాయం జరుగుతుంది. మీడియేషన్, రికన్సీలియేషన్ లేదా మధ్యవర్తిత్వ అవార్డు నచ్చకపోతే అప్పీలుకు పోయే అవకాశం ఎలాగూ ఉంది. ఈ విధానంలో ఇరుపక్షాల కక్షిదారుల వాంగ్మూలాలు, సాక్ష్యాలు, వాస్తవాలు మధ్యవర్తిత్వ ట్రిబ్యునల్ వద్దనే సంచితమౌతాయి కాబట్టి అప్పీలులో న్యాయస్థానాలు చట్ట నిబంధనలు, నిర్వచనాలను మాత్రమే పరిగణించడం ద్వారా సత్వరంగా, నాణ్యమైన తీర్పులు ఇవ్వగలుగుతాయి. మధ్యవర్తులుగా సీనియర్ న్యాయవాదులు, వైద్యులు, ఆడిటర్లు వివిధ రంగాల నిపుణులు పనిచేయవచ్చు. అడ్వకేట్ ప్రాక్టీసు లాగానే మధ్యవర్తులు ప్రాక్టీసులు పెట్టుకోవచ్చు. ఎవరు నిజాయతీగా నిపుణతతో తీర్పులు చెబుతారో వారి దగ్గరనే కక్షిదారులు ఎక్కువగా వెళతారు. అప్పీలు అవకాశం ఉండనే ఉంది. ఇప్పుడిదే పనిని రౌడీ గ్యాంగులు సెటిల్‌మెంట్లు రూపంలో చేస్తున్నాయి. దానికన్నా మధ్యవర్తిత్వం నయం కదా. ఎక్కువ శాతం కేసులు కోపతాపాలతో భావోద్రేకంతో వేసుకునేవే. అలాంటివన్నీ మధ్యవర్తి దగ్గర రికన్సిలియేషన్ స్థాయిలోనే ముగిసిపోతాయి.



# 15. యుద్ధ నీతి, రీతి నాడూ, నేడూ ఒకటే

రాజ్య నిర్వహణ తంత్రం ఆద్యంతం అసిధారావ్రతం. రాజ్యపాలన లక్ష్యం సంక్షేమమయితే ఆ ప్రభువుల కీర్తి ఆచంద్రతారార్కం నిలిచి పోతుంది. రాచరిక వ్యవస్థలో రాజ్యసాధన తంత్రంలో భాగంగా భయంకర యుద్ధాలు జరిగేవి. రక్తపుటేరులు ప్రవహించేవి. తలలు తెగి పడేవి. లక్షల ప్రాణాలు గాలిలో కలిసిపోయేవి. ప్రజల, స్త్రీ ధన, మాన, ప్రాణాలు హరించబడేవి. జాతులు జాతులే, కులాలు కులాలే అణగద్రొక్కబడేవి. రాజ్యాధికారం కోసం శత్రువులనే కాదు, స్వంత అన్నలు, తమ్ములు, తండ్రులను కూడా హతమార్చిన సంఘటనలు కోకొల్లలు.

రాచరిక వ్యవస్థ నుండి, విదేశీ పాలన నుండి విడివడి ప్రజాస్వామ్య యుగంలో అడుగు పెట్టాం. యుద్ధ రీతి మారింది కాని యుద్ధనీతి మారలేదు. మారబోదు కూడా. ప్రజాస్వామ్య పోరాటంలో కత్తులు, తుపాకులు, తూటాలు ఉండవు. మాటలే తూటాలు. ఇదొక మానసిక యుద్ధం. పోయేవి పరువులు, పదవులు, పైసలే తప్ప ప్రాణాలు కాదు. ఉద్యమాలలోనైతే ఊపిరిలు కూడా పోవచ్చు. అస్త్రం, శస్త్రం, వ్యూహం, సైన్యం, శిక్షణ, నాయకత్వం అలాంటివన్నీ అప్పుడూ ఇప్పుడూ ఉన్నాయి. ఏ యుగమైనా యుద్ధలక్ష్యం ఒక్కటే. పోరాటమార్గాలు, అస్త్ర శస్త్రాలు, వ్యూహాలే మారినాయి. యుద్ధనీతి ఎప్పుడూ ఒకటే. ఏ యుద్ధం గెలవాలన్నా అస్త్రము, శస్త్రము, వ్యూహము, మంచి సేనాని, సుశిక్షితులైన సైన్యము అనే 5 అంశాలు కావాలి. ఆరవది అదృష్టం. ప్రాథమికంగా బహుజన అంగీకార యోగ్యమైన ఒక నినాదం లేకుండా యుద్ధమే ప్రారంభించకూడదు.

అస్త్రము మంత్రపూతము. ఒక ఆలోచన, ఒక నినాదం. ఇందిరాగాంధీ గరీబీ హటావో అన్నా, దేశ్‌కీ అఖండతా ఔర్ ఏక్తా బనాయి రఖనీహై అన్నా, యన్.టి రామారావు ఆంధ్రుల ఆత్మ గౌరవం అన్నా, కె.సి.ఆర్ జై తెలంగాణ

అన్నా, చిరంజీవి మార్పు, సామాజిక న్యాయం, అవినీతి లేని పాలన అన్నా ఇవన్నీ అస్త్రాలే. అస్త్రానికి అశేష జనానీకాన్ని మంత్రముగ్ధం చేసే శక్తి ఉంది. సమాజం మొత్తాన్ని కదిలించగలుగుతుంది. సమకాలీన సమాజంలో అత్యధికుల మనసుల్లో మెదిలే భావానికి అక్షర రూపం కల్పిస్తే అది ఒక అస్త్రమౌతుంది. ఆచరణ రూపం కల్పిస్తే అది ఒక ఉద్యమమవుతుంది. ఉద్యమ మార్గాలు నిర్దేశించుకుని అహర్నిశం నిజాయితీగా కృషి చేస్తే ఉద్యమ లక్ష్యాలు సిద్ధిస్తాయి. సిద్ధించిన లక్ష్యాలను చిత్తశుద్ధితో స్వార్థం, అహంకారం దరిజేరనీయకుండా నిర్వహిస్తే జీవన సాఫల్యం సిద్ధిస్తుంది. అత్యధికుల మనసుల్లో రగులుతున్న భావమేదో తెలుసుకోవాలంటే ఖచ్చితమైన సర్వేలను నిర్వహించి, విశ్లేషించి, అంచనా వేయవలసి ఉంటుంది. శస్త్రము అనగా, సాధన సంపత్తి అనగా డబ్బు, వాహనాలు, ప్రచార సామాగ్రి వగైరా. ఇవి లేకుండా ఎవరైనా యుద్ధంలో దిగినా నిష్ప్రయోజనమే.

వ్యూహమంటే ఇతర సమూహాలతో, పొత్తులు. ఎవరు, ఎక్కడ అనే నిర్ణయం. ఇక్కడ సమూహాలంటే ఇతర రాజకీయ పార్టీలు, కుల మత సంఘాలు లేదా సారూప్యత మరియు ఐక్యత కలిగిన జన సంఘాలు. యూనిటరి మరియు ఫెడరల్ భారత రాజకీయ వాతావరణంలో వ్యూహం చాలా ప్రాముఖ్యత సంతరించుకొంది. ముఖ్యంగా ప్రాంతీయ పార్టీలు, ఉపప్రాంతీయ పార్టీలు వున్న నేపథ్యంలో వ్యూహం తప్పనిసరి. తాము పొత్తులు కుదుర్చుకుంటూనే ఎదుటి పార్టీని ఏకాకిగా ఉంచడం కూడా వ్యూహంలో భాగమే.

2004లోను, 2009లో కూడా కాంగ్రెసు పార్టీ అధికారంలోకి రావడానికి తెలుగుదేశం పార్టీ వ్యూహాత్మక తప్పిదమే కారణం. 2004లో టి.డి.పి, బి.జె.పి.తో పొత్తు పెట్టుకున్నందు వల్ల కాంగ్రెస్ టి.ఆర్.యస్, సి.పి.యం, సి.పి.ఐ.లతో పొత్తు పెట్టుకోగలిగింది. అలా కాకుండా టి.డి.పి మహాకూటమి ఏర్పాటు చేస్తే కాంగ్రెస్ ఒంటరి అయ్యేది. 2009లో టి.డి.పి. మహాకూటమి ఏర్పాటు చేసింది గాని టి.ఆర్.యస్. పార్టీతో పొత్తు ధర్మం పాటించలేదు. లేకుంటే టి.డి.పి.కి మరో 20-25 సీట్లు, టి.ఆర్.యస్.కు మరో 20-25 సీట్లు అదనంగా వచ్చేవి. కాంగ్రెస్ 2009లో 8 సీట్ల మెజారిటీతోనే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిందని గుర్తుంచుకోవాలి.

2009 లో టి.ఆర్.యస్ కూడా పి.ఆర్.పి.తో పొత్తు పెట్టుకుంటే ఇరుపక్షాల కార్యకర్తలు ఉద్రేకులైన యువతనే కాబట్టి కే.సి.ఆర్, చిరంజీవి ఒక వేదికపైకి వస్తే ఎదురుగా ఎవరూ ప్రచారాలు నిర్వహించలేరు. టి.ఆర్.యస్. పార్టీ 11 సీట్లకు పరిమితం అయ్యే అవసరం వచ్చేది కాదు. కె.సి.ఆర్ సమర్థుడు కాబట్టి పోరాటమార్గం మార్చి, నిరాహార దీక్షతో మరణం అంచుకు చేరి సకల జనుల సమ్మెతో తెలంగాణ సాధించారు. అది వేరే సంగతి. చిరకాల శత్రువు, తెలిసిన చరిత్ర గల వాడిని, తెలంగాణ వ్యతిరేకిని నమ్మి పొత్తు పెట్టుకోవడం తప్పనిసరిగా వ్యూహాత్మక తప్పిదమే. ఫలితం ఊహించడం పెద్ద కష్టం కాదు. అందుకు అనుగుణంగానే తెలుగుదేశం పార్టీ తాను కూడా నష్టపోయి కాంగ్రెస్‌కు అధికారం కట్టబెట్టింది. కే.సి.ఆర్ కూడా త్రిప్పుకొని ఆమరణ దీక్ష ద్వారా టి.ఆర్.యస్. శ్రేణులను, కవిగాయక కళాకారులను, తెలంగాణ అభిమానులను, సానుభూతి పరులను, ప్రభుత్వ ఉద్యోగులను చివరకు సకల జనులను కదిలించి తెలంగాణ సాధించారు. సమయానికి కాంగ్రెస్‌పార్టీ స్పందించకపోయినా, వ్యవహారం ఎక్కడ బెడిసి కొట్టినా కే.సి.ఆర్. మరో పొట్టి శ్రీరాములు అయ్యేవారు. తెలంగాణ ప్రజల అదృష్టం ఆశీస్సులే ఆయనను బ్రతికించాయి.

పేదరికం పోరాటాలకు మూలమయింది. దానిని అధికారసాధన మార్గానికి సోపానాలుగా రాజకీయ నాయకులు వాడుకుంటూ ఇంకా రెచ్చగొడుతున్నారు. ప్రజలలో చైతన్యం చిగురించి రాజకీయ నాయకుల అసలు స్వరూపం బయటపడే వరకూ ఇలా కొనసాగుతూనే ఉంటుంది. ప్రజాస్వామ్యంలో ఓటరే రాజు. ఓటరుకు అంతా తెలుసు, ఓటరు తెలివైనవాడు అనే డైలాగులతో ఓటర్లను బురిడీ కొట్టించి ఓట్లు దండుకుంటున్నారు. అధిక సంఖ్యాక ఓటర్లు బడుగు బలహీన వర్గాలు కాబట్టి వారిని ఆకర్షించేందుకు రాజకీయాలలోను, వనరుల పంపిణీలోను సామాజిక న్యాయం అనే పల్లవిని అన్ని రాజకీయ పార్టీలు ఎత్తుకుంటాయి. బడుగు, బలహీన వర్గాలను సంతృప్తి పరచడం కోసం సమాజంలోని ఇతర అగ్రవర్ణాల వారిని విమర్శించడం, వేధించడం చేస్తుంటారు. తద్వారా ఒకే దెబ్బకు రెండు పిట్టలు రాలతాయి. ఒకటి దళిత, బహుజన, బడుగు, బలహీన వర్గాలను తమవైపు తిప్పుకోవచ్చు, తమకు పోటీగా ఉండే అవకాశమున్న ఇతర అగ్రవర్ణాలను అణగద్రొక్కనూ వచ్చును. అంటే విభజించి

పాలించడం అన్న మాట. ఈ విధానం యుగయుగాలుగా రాజకీయాలలో ఉన్నదే కాని రంగులు మార్చి నిత్య నూతనంగా ప్రయోగిస్తుంటారు.

యుద్ధమంటేనే రాజ్యసాధన. తంత్రం అంటే ఒక వర్గం లేదా ఒక జాతి లేదా ఒక ప్రాంతం ప్రజలపై మరొకరు విజయం సాధించే ప్రయత్నమే. ప్రజాస్వామ్య ప్రక్రియలో అధిక సంఖ్యాకులైన దళిత, బడుగు, బలహీన వర్గాలను తమవైపు ఆకర్షించుకోవడానికి, తమకు పోటీగా ఉన్న జాతిని అన్నివిధాలా బదనాం చేస్తారు. అందులో భాగంగానే కులాల్లో ఒకరిపై ఒకరికి విద్వేషం రగిల్చి రాజకీయ క్రీడ సల్పుతుంటారు. ఇది రాజకీయ లక్షణం. ఇందుకు ఎవ్వరూ మినహాయింపుగాదు. ఒకరు మహిళా శ్రేయోభిలాషిగా, మరొకరు పేద ప్రజల పెన్నిధిగా, మరొకరు రైతు బాంధవుడుగా, మరొకరు రైతు జనోద్ధారకులుగా, ఒకరు ఆంధ్రుల ఆత్మగౌరవం కాపాడే కారణజన్ముడిగా, ఇంకొకరు ధనవంతులను హింసించేవాడుగా, ఒకడు ఉద్యోగులను క్రమశిక్షణలో ఉంచే వాడిగా, ఇంకొకరు ఒక ప్రాంత ప్రయోజనాలు కాపాడే వీరుడుగా, ఇంకొకడు సమాజంలో నీతి, నిజాయితీలను ఉద్ధరించేవాడుగా మరొకరు దళిత, బడుగు, బలహీన వర్గాల జనోద్ధారకుడుగా ముద్రవేయించుకోవాలని ప్రయత్నిస్తుంటారు. ఈ రాజకీయ విషవలయంలో ప్రజలంతా పావులే. ఇష్టం ఉన్నా లేకున్నా ఈ చట్రంలో బందీలు కావలసిందే. ఈ ప్రక్రియలో అనేక మంది వ్యక్తులు, వ్యవస్థలు నలిగి నాశనమవుతాయి. ప్రజలు వివేకవంతులై సంయమనం పాటిస్తే ఈ సామాజిక నష్టాన్ని కొంతవరకు నివారించవచ్చు.

రాజకీయాల ముఖ్య ధ్యేయం రాజ్య సాధనే. సాధించిన రాజ్యాన్ని నిలబెట్టుకోవడమే. సమాజం ఎలా ఉంటే అలానే వారి లక్ష్యానికి ఉపయోగించుకుంటారు. మానవ జాతిపై ఆధిపత్యాన్ని, సంపదపై ఆధిపత్యాన్ని, ప్రకృతి వనరులపై ఆధిపత్యాన్ని, రాజ్యాధికారాన్ని సాధించుకునే క్రమంలో విద్వేషాలు రెచ్చగొడుతు అమానుషంగా, క్రూరంగా ప్రవర్తించే పాలకుల వల్లనే మానవత్వం మంట గలుస్తున్నది. మనుషులంతా ఒక్కటే అన్న వాస్తవాన్ని పాలకులు అంగీకరించరు. ఒక జాతి మరో జాతిపై దండెత్తడానికి మతాన్ని సాకుగా వాడుకుంటారు. మానవులలో ఉన్న అన్ని బలహీనతలను ఉపయోగించుకొని రాజ్యం సాధించటమే రాజకీయ నాయకుల లక్ష్యం తప్ప

సమాజంలోని బలహీనతలను రూపుమాపడం రాజకీయ నాయకుల లక్ష్యం కాదు. ఒక్కమాటలో చెప్పాలంటే సమాజంలోని బలహీనతలను రాజకీయ నాయకులు రెచ్చగొడతారు కూడ. సంఘంలోని కుహనా మేధావులు వారికి పావులుగా ఉపయోగపడతారు కూడా.



# 16. రాజ్యపాలన రీతి, నీతి అన్ని యుగాలలోనూ ఒకటే

త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగంలో కూడా పరిశీలిస్తే రాజధర్మాలు, ముఖ్యంగా కె.సి.ఆర్. పాలన దాదాపు ఒకేలా ఉన్నాయి. ఉదాహరణకు భారతంలో నారదుడు ధర్మరాజును సందర్శించి రాజసూయయాగం చేయవలసిందిగా సూచిస్తాడు. ఈ సందర్భంగా నారదుడు ధర్మరాజునుద్దేశించి, నీ పాలన ఇలా చేస్తున్నావా అని పరామర్శ చేస్తాడు. అలాగే రామాయణంలో శ్రీరాముడు వనవాసంలో ఉండగా భరతుడు ఆయన దర్శనార్థం వెళతాడు. ఆ సందర్భంగా శ్రీరాముడు భరతుడిని నీ రాజ్యపాలన ఇలా చేస్తున్నావు కదా! అంటూ కుశల ప్రశ్నలు వేస్తాడు. వాటిని పరిశీలిస్తే త్రేతాయుగం, ద్వాపరయుగంలో పాలనకు, కలియుగంలో పాలన విధానాలకు చాలా దగ్గరగా పోలికలు ఉన్నాయి. రాజధర్మాలు అప్పటికి ఇప్పటికి ఒకలాగే ఉన్నాయని చెప్పవచ్చు. నన్నయ రచించిన మహాభారతంలో, సభాపర్వంలో నారదమునీంద్రుడు ధర్మరాజుని సందర్శించి రాజసూయయాగం చేయమని ప్రోత్సహించే సందర్భంలో కొన్ని రాజకీయ పరామర్శలు, హెచ్చరికలు ఈ విధంగా చేశారు.

1. మీ వంశాచార ధర్మమార్గంలో ప్రవర్తిస్తున్నావా?
2. ధర్మం తెలిసిన వాడవై ధర్మార్థ కామములకు పరస్పర విఘాతం కలగకుండ కాల విభజన చేసి ప్రవర్తిస్తున్నావుగదా?
3. రాజకృత్యములు దీర్పడానికి యోగ్యులైన వారిని వారివారి నేర్పెరిగి నియమిస్తున్నావు గదా?
4. గొప్పవారిని, శాస్త్రవిధులు తెలిసిన వారిని, అనువర్తకులను మరియు పితృ, పితామహ క్రమమున వచ్చిన విప్రులను మంత్రులుగా నియమించుకున్నావా?

5. రాజుకు విజయ మూలము రాజతంత్రము, మంత్రాంగము. దానిని ధరాజనముల నుంచి గోప్యంగా ఉంచుతున్నావు గదా!
6. నీ సలహాదారుడు చక్కటి రూపవంతుడు, ధీరుడు, ధర్మాధర్మ విశారదుడు, మిక్కిలి అనుభవజ్ఞుడు, సమచిత్తుడునై ఉన్నాడుగదా!
7. నీ పురోహితుడు యజ్ఞయాగాదులందు నేర్పు గలిగి, శాస్త్ర దృష్టి గలిగి, గ్రహస్థితులు తెలిసినవాడై యున్నాడు గదా!
8. దక్షులైన మంత్రులు రాజపుత్రులను మహాధనవంతులుగా చేసి వారితో జట్టు కట్టారుగదా! ఎందుకంటే ధనమెవరికైనా గర్వాన్ని, దుర్విమోహాన్ని కలుగజేస్తుంది.
9. నేర్పరులైన వైద్యులు నిన్నెప్పుడూ అభిమానులై సేవిస్తున్నారు గదా! ఔషధసేవనతో నిరతము మానసిక, శారీరక ఆరోగ్యాన్ని కాపాడు కొంటున్నావు కదా!
10. ధనార్జనాది రాజకార్యములందు నిపుణులు, నీతివర్తులను వినియోగించావు కదా!
11. సేవకులను ఉత్తమ, మధ్యమ, అధములుగా విభాగించి వారికి తగిన పనికి నియోగించి వారి జీతభత్యాలు కాలాతీతం కాకుండా చెల్లిస్తున్నావు గదా! లేనిచో వారు రాజుకు కీడు తలపెట్టగలరు.
12. మంచి సేవకులను గుర్తించి వారిని సన్మానిస్తున్నావు గదా! వారలు నీ కోసం ప్రాణాలైనా అర్పిస్తారు.
13. యుద్ధంలో చనిపోయిన వీరభటుల కుటుంబ సభ్యులకు ఆహార నివాసాది ఇబ్బందులు లేకుండా చూస్తున్నావు గదా!
14. ధన దాహం కలిగిన వారిని, దొంగలను, శత్రువర్గాలకు అనుకూలమైనవారిని, చెడ్డవారిని రాజకార్యములందు నియోగించటం లేదు గదా!
15. ప్రజలకు చోరభయం లేకుండా పరిపాలన చేయాలి. నీ భృత్యులు చోరులనుండి ధనం పొంది వారికి సాయం చేయకుండా చూడాలి సుమా!
16. చెరువులు నీటితో నిండే విధంగా చేస్తున్నావా?

17. చిన్న చిన్న రైతులకు ధాన్యములు, విత్తనాలు మరియు చిన్న చిన్న వ్యాపారులకు అవసరమైన రుణాలు ఇస్తున్నావుగదా!
18. చెవిటి, మూగ, అంధులు, వికలాంగులను, అనాథలను ఆదుకొంటున్నావా?
19. శరణువేడిన శత్రువునైనా ఆదరిస్తున్నావు గదా!
20. రాజు కృతజ్ఞత గలిగి ఉండాలి. సాయంచేసిన వారికి ప్రత్యుపకారం చేయాలి.
21. ఆదాయం నుంచి నాల్గవ వంతు, లేదా మూడవవంతు, అత్యధికంగా సగం కంటే ఎక్కువ ఖర్చు చేయగూడదు.
22. ఆయుధాగారం వద్దను, ధనాగారం వద్దను, సైన్యాధ్యక్షుని గాను పరమ విశ్వాసులను, భక్తులను సమర్థులైన వారిని నియమించావు గదా!
23. గురువులను, వృద్ధులను, శిల్పులను, సాధుజనులను, బంధుజనాన్ని పేదరికం దరిజేరకుండా చూస్తున్నావు గదా!
24. మంత్రులు, బంధువులు, మూలబలమైన రాజపుత్రులు, విద్వాంసులు సంతృప్తులై యుండగా కొలువు తీరుతున్నావు గదా!
25. ఇంటను, బైటను ఉండే శత్రుజనముల నుంచి నిజరక్ష చేసుకుంటూ ఇతర రాజుల కదలికలను చారులవలన తెలుసుకుంటున్నావు కదా!
26. విద్యావంతులైన ముఖ్యులతో లోక వ్యవహారములు చర్చిస్తున్నావు గదా!
27. వార్త యందు జగము వర్ధిల్లుచున్నది. అది లేనినాడు జనులు అంధకారంలో ఉన్నట్లే. అందువలన రాజు వార్తను నిర్వహించవలసి యున్నది.
28. సమాజంలోని వీరులను గుర్తించి సైన్యములో చేర్చుకుంటున్నావా!
29. బహు ధనధాన్యములు గలిగి, ఆయుధ సంపత్తి గలిగి, యోధ వీరులు గలిగి, నిరంతర నీటి సదుపాయం గలిగి గడ్డి, మందులు, ఇంధనములు గలిగి, నీ కోటలు అసాధ్యములై యున్నవి కదా!
30. జితేంద్రియుండవై, దైవబలము గలిగి శత్రువర్గాలను ఎదుర్కొనడానికి సిద్ధంగా ఉన్నావా.

31. ముందుగా సామ, దాన, భేదోపాయములను ప్రయోగిస్తున్నావా?

32. రాజదోషములు పదునాలుగు. 1.నాస్తికత 2. అసత్యమాడుట 3. ప్రమాదముల దరిచేరుట 4. ఆలస్యం అనగా జాగు చేయుట 5. తెలివిలేని వారితో ఆలోచనలు చేయుట 6.క్రోధము 7.దీర్ఘాలోచన 8. దీర్ఘచింత 9. ఎరుక గల వారిని తెలుసుకోక పోవడం 10. ధనముల యందు అనర్థకమైన ఆలోచన 11. నిర్ణయించిన కార్యములు చేయకపోవడం 12. మంతనములను సురక్షితంగా ఉంచకపోవడం 13. శుభకార్యములను చేయకపోవడం 14. విషయవాంఛల యందు దగలుకొనుట అను పదునాలుగు రాజదోషములు దరిచేరనీయవు గదా!

33. రాజుకు సోమరితనం, పగటినిద్ర కూడవన్నది కూడా రామాయణ సూక్తి.



# 17. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర పోరాటం

తెలంగాణ పోరాటం మాత్రం ఎప్పటి నుంచో కలసి ఉన్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని విభజించి అధికారం సాధించటానికి జరిగింది కాదు. సమీప గతంలో కోల్పోయిన తెలంగాణ రాష్ట్రాన్ని తిరిగి సాధించుకోవడానికే జరిగింది. అది తెలంగాణ అస్తిత్వ పోరాటం. మసకబారిన తెలంగాణ ప్రజల ఆత్మగౌరవాన్ని తిరిగి నిలబెట్టడం కోసం, తెలంగాణ భాష, సాంస్కృతిక, సాంప్రదాయాల పరిరక్షణ కోసం మరియు తెలంగాణ వనరుల దోపిడికి వ్యతిరేకంగా మాత్రమే తెలంగాణ పోరాటం సాగింది. నేను ఒక ప్రాంతీయపార్టీ అభిమానినైనా దేశవ్యాప్తంగా ప్రాంతీయ పార్టీలు రద్దౌతాయంటే సంతోషించే వాడినే.

తెలంగాణ ఉద్యమ కారణంగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడటం ఆంధ్రుల అదృష్టం. ఆంధ్రులు అనేక శతాబ్దాల పాటు మదరాసు రాష్ట్రంలో భాగంగా రాజధాని నుండి సుదూరంగా ఉండి చాలా ఇబ్బందులు పడ్డారు. సినిమా రంగంలోను, ఇతర వ్యాపారాలలోను, మద్రాసు నగరంలో వేల కోట్ల రూపాయలు పెట్టుబడులు పెట్టారు. ప్రత్యేకాంధ్ర ఉద్యమంలో అనేక కష్టనష్టాలు భరించి అవన్నీ వదులుకొని రావలసి వచ్చింది. ఆ తర్వాత సంయుక్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో హైద్రాబాదులోనూ అంతే. దశాబ్దాలపాటు అభద్రతా భావంతో బ్రతకవలసి వచ్చింది. చివరకు హైద్రాబాదు కూడా వదులుకొని పోవలసి వచ్చింది. రాష్ట్ర విభజన పుణ్యమా అని ఇప్పటికైనా ఆంధ్రులకు వారికంటూ స్వంత రాష్ట్రం, స్వంత రాజధాని ఏర్పాడ్డాయి. వారి కళ్ళముందే వారి రాజధాని. వారి కళ్ళముందే వారి పిల్లల ఉద్యోగ, వ్యాపారాలు. వారి చేతుల్లోనే వారి అభివృద్ధి. ఆంధ్ర ప్రాంతానికి సారవంతమైన భూములు, అపార జలవనరులు, ఓడరేవులు, భూగర్భ నిక్షేపాలు ఉన్నాయి. కష్టపడే ప్రజలున్నారు. వారి రాష్ట్ర అభివృద్ధికి ఆకాశమే హద్దు. కాకుంటే పది, పదిహేను సంవత్సరాలు పట్టవచ్చు. ఆపై దేశంలో ఎక్కడైనా స్థిరనివాసమేర్పరుచుకొనే, జీవనోపాధులు

సంపాదించుకొనే రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కు ఉండనే ఉంది. సంబంధ బాంధవ్యాలు నెరుపుకోవడానికి రాష్ట్రపుటెల్లలు అడ్డుగోడలు కావు కదా! ఆంధ్ర నాయకులకు, పెట్టుబడి దారులకు విభజన కొంత తాత్కాలిక ఇబ్బంది కలిగించినా సామాన్య ఆంధ్ర ప్రజానీకానికి మాత్రం విభజన వల్ల మంచే జరిగింది.

పట్టుమని పది అసెంబ్లీ స్థానాలు సొంతంగా గెలవని టి.ఆర్.యస్ పార్టీ తెలంగాణను స్తంభింప జేయడం తెలంగాణ వ్యతిరేకులను తెలంగాణలో తిరగనివ్వం అని ధీమాగా చెప్పడం సాహసంతో కూడిన పనే. శ్రీరాముడు కోతులతోనే వారధి నిర్మించినట్టు అత్యల్ప సంఖ్యాకులైన కార్యకర్తలతో ఇతర పార్టీల వారికి దడ పుట్టించడం నిజంగా ఒక మాంత్రిక చర్యే. తెలంగాణ ప్రజలలో తెలంగాణ కావాలన్న వాంఛ బలంగా ఉంది. ఈ సత్యాన్ని గ్రహించారు కాబట్టే బహుశా కే.సి.ఆర్. అంత ధీమాగా ఉద్యమం నడిపించారు. ప్రజాగళాలను కాదు ప్రజా హృదయాలను వినగలిగిన వాడే నిజమైన నేత. కాని, ఎన్నికల్లో ఓట్లు వేయడానికి ఇతర కారకాలు, ప్రేరకాలు చాలా ఉంటాయి. అందువల్లనే తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష ఎన్నికల్లో రుజువు కాలేక పోయింది. టి.ఆర్.యస్ 2009 ఎన్నికల్లో గెలవలేకపోయింది. 2014 ఎన్నికలలో మొత్తం 119 స్థానాలు తె.రా.స. స్వంతంగా పోటీచేయడం వల్లనే తెలంగాణ ప్రభుత్వం ఏర్పడింది.

కేసీఆర్ ఏది చేసినా వినూత్నంగా భారీ ఎత్తున చేయడం అలవాటు. ఏ కార్యక్రమం చేసినా దాని ముందు మహా అని చేర్చవలసి ఉంటుంది. సభ అయినా, సర్వే అయినా, రాస్తారోకో అయినా, నిరాహారదీక్షయినా, జాతీయ జెండా ఆవిష్కరణ అయినా దాని ముందు మహా అని చేర్చవలసిందే. అనేక వైరుధ్యాలు కలిగిన వివిధ కేంద్ర రాజకీయ పార్టీలను ఒప్పించి తెలంగాణ తేవడమంటే అంతకు మించిన మహా రాజకీయ చతురత మరొకటి ఉండదు.

తెలంగాణ సంగీత, సాహిత్య, కళారూపాలను, భాషను, యాసను, పండుగలను, ఆచార వ్యవహారాలను, వృత్తి, ఉద్యోగ, వ్యాపార మరియు వ్యవసాయ రంగాలను తెలంగాణీకరించే ప్రయత్నం మనం గమనించవచ్చు. ఇది సర్వ సహజం, సార్వజనీనం, సమర్థనీయం. ఎందుకంటే తెలంగాణను

ఒక రాష్ట్రంగా గుర్తించడం ద్వారా తెలంగాణ జాతి పునరారంభం అయిందని భావించవచ్చు. అలాగే ఒక ప్రత్యేక జాతికి ఒక ప్రత్యేక ఉనికి, విలువలు, లక్షణాలు ఉండటమూ అవసరం. నేడు తెలంగాణ రాష్ట్రంలో జరుగుతున్నది కూడా అదే.

ఒక మనిషి యొక్క వ్యక్తిత్వం ఇది అనాలంటే ఆ మనిషి అన్నివేళలా, ఆపదలోను, మరణంలోను కూడా ఆ లక్షణాన్ని కలిగి ఉండాలి. ధర్మరాజు అనగానే అబద్ధమాడని వానిగా ధర్మప్రభువుగా స్ఫురణకు వస్తుంది. అలాగే భీముడు అనగానే మహా బలశాలి, గదా యుద్ధనిపుణుడని గుర్తొస్తుంది. దుర్యోధనుడనగానే ఒక అహంభావి అని గుర్తొస్తుంది. కర్ణుడు అనగానే దాన గుణం గుర్తొస్తుంది. అతనికి అంగ రాజ్యాన్ని దానమిచ్చిన దుర్యోధనుడికి ఆ పేరు రాదు. ఎందుకంటే, ఇంద్రుడు వచ్చి కవచ కుండలాలను దానంగా ఇమ్మని కర్ణుడిని అడుగుతాడు. వచ్చినవాడు ఇంద్రుడు, అర్జునుడి పక్షపాతి. తనకు కవచకుండలాలు లేకుండా చేసి యుద్ధంలో చంపాలనే ఉద్దేశంతో వచ్చాడని కర్ణుడికి తెలుసు. అయినా తన స్వీయ లక్షణమైన దాన గుణాన్ని విస్మరించలేదు. అందుకే దానకర్ణుడయ్యాడు. అలాగే బలిచక్రవర్తి. వచ్చిన వామనుడు విష్ణువని తెలుసు. మూడడుగుల దానంతో తనను పాతాళానికి తొక్కుతాడని తెలుసు. గురువు శుక్రాచార్యుడు వారించినా వినకుండా రాజ్యము గీజ్యమున్ సతతమే కాయం బనాపాయమే అంటూ దానమిచ్చేశాడు.

కే.సి.ఆర్ తన జీవితమే తెలంగాణ కొరకు అని తేల్చి చెప్పాడు. తెలంగాణ వచ్చుడో కే.సి.ఆర్ చచ్చుడో అంటూ ఆమరణ నిరాహారదీక్షకు దిగాడు. పదవులను అనేకసార్లు తృణప్రాయంగా త్యజించి యుద్ధంలోకి వెళ్ళాడు. కరీంనగర్ ఎం.పి. పదవికి రెండు సార్లు తానొక్కడే రాజీనామా చేసి తెలంగాణ యుద్ధంలో తానే ముందుండి సైన్యాన్ని నడిపించాడు. అన్నీ చేసిన తర్వాత గాని ఆయనను తెలంగాణ ప్రజలు పూర్తిగా నమ్మలేదు. ఏదైనా లక్షణం జీవితంలో భాగమైతేనే ఆ లక్షణాన్ని అతని పేరుకు ఆపాదిస్తాం. భర్తృహరి సుభాషితాన్ని సంస్కృతంలో రచించాడు. దానిని ఏనుగు లక్ష్మణ కవి తెలుగులోకి అనువదించాడు. అందులో సాధకుడి విధానాన్ని ఎలా వర్ణించాడో చూడండి.

**ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై**
**ఆరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తు లై మధ్యముల్**
**ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.**

అలాగే దేవదానవులు క్షీరసాగర మధనం చేసిన సందర్భాన్ని పురస్కరించుకొని మరొక శ్లోకం కూడా చూడండి.

**తనిసిరే వేల్పులుదధి రత్నముల చేత?**
**వెఱచిరే ఘెర కాకోల విషము చేత?**
**విడిచిరే యత్న మమృతంబు వొడయుదనుక?**
**నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.**

అంటే క్షీరసాగర మధనంలో దేవతలు సముద్ర రత్నములచే సంతృప్తి పడలేదు. భయంకర హాలాహలానికి భయపడలేదు. అమృతం లభించే వరకు ప్రయత్నం విరమించలేదు. అలాగే నిశ్చితార్థం లభించే వరకు నిపుణమతులు ప్రయత్నాన్ని వదలరు అని అర్థం. అందుకే తెలంగాణ సాధకుడిగా కే.సి.ఆర్ చరిత్రలో నిలిచి పోతారనడంలో సందేహం లేదు.



# 18. సమాజంలో మేధావుల పాత్ర మార్గదర్శకం

మేధావులమనుకునే వారు చాలా జాగ్రత్తగా ఇతరులకు ఆదర్శవంతంగా వ్యవహరించాలి. ఎందుకంటే ఇతరులు వారిని అనుసరిస్తారు. అనుసరించేటట్లు చేయగల శక్తి వారికుంటుంది. ఇదే విషయాన్ని భగవద్గీతలోనూ శ్రీకృష్ణుడు చెప్తాడు. *యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః సయత్ప్రమాణంకురుతే లోకస్తదనువర్తతే* అని. అంటే శ్రేష్ఠులు దేనినాచరిస్తారో దానినే ఇతరులు అనుసరిస్తారు. దానినే ప్రమాణంగా స్వీకరిస్తారు అని భావం. *లోకో భిన్నరుచిః* అన్నట్లు ప్రపంచంలో ప్రజలు భిన్న రుచులు గలవారుంటారు. మీరేవాదంతో ముందుకొచ్చినా దానిని మెచ్చే అనుచరులు దొరుకుతూనే ఉంటారు. ఉదాహరణకు అనేక రకాల కుడి, ఎడమల రాజకీయ పార్టీలు, ప్రాంతీయ పార్టీలు, భాషా పరమైన సంఘాలు, మతపరమైన సంఘాలు, ఉగ్రవాద తీవ్రవాద సంఘాలు, హేతువాద సంఘాలు, నడిచే వారి సంఘాలు, నవ్వేవాళ్ళ సంఘాలు, ముసలోళ్ళ సంఘాలు, కుల, ఉపకుల సంఘాలు, ప్రకృతివనరుల రక్షణ సంఘాలు ఇలా ఒకటేమిటి? మీరు ఆలోచించుకోవచ్చు. వేల, వేల సంఘాలు పెట్టే వాళ్ళుంటే చాలు సభ్యులుగా చేరే వారుంటూనే ఉంటారు. అందువల్లనే మేధావులనుకునే వారు సమాజాలను సృష్టించేవారు బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. సమాజానికి ఇది అవసరమా? సమాజానికి మేలు చేస్తున్నామా? కీడు చేస్తున్నామా? ఆలోచించి అడుగేయాలి. ఇందుకు మీకొక ప్రమాణం చెబుతాను.

శ్రేష్ఠులు ఏది ఆచరిస్తే ఇతరులు దానిని ఆచరిస్తారని గీతలో చెప్పాడు గదా. అందువల్ల సామాన్య ప్రజల పని తేలికైపోతుంది. వారు తీవ్రంగా ఆలోచించే బదులు శ్రేష్ఠులైన వారిని అనుసరిస్తే సరిపోతుంది. మరి శ్రేష్ఠులంటే ఎవరు? అంటే, మనోవాక్కాయ కర్మలయందేకత్వం కలిగియుండుట సత్పురుషత్వ ప్రాప్తికి ప్రధమ సోపానమని పెద్దలు చెబుతారు. దీనర్థం చెడు

ఆలోచన చేసి, చెడు మాటను చెప్పి, చెడునే చేసి చూపించేవాడు కూడా ఈ కోవ క్రిందకే వస్తాడని కాదు. సత్యం భూతహితం ప్రోక్తం అని కదా శాస్త్రం. అంటే ప్రాణి కోటికి హితమైన సత్యాన్నే చెప్పాలి. హితమైన వచనాన్నే చెప్పాలంటే, హితమైన ఆలోచనే చేయాలి. హితమైన పనినే ఆచరించాలని వేరుగా చెప్పనక్కర్లేదు.

ఈ విషయంలో రాజుల ప్రవర్తన ఎలా ఉంటుందో మీకొక్క ఉదంతం చెబుతాను. రాజులు చెప్పింది చేయరు. చేసేది చెప్పరు. భారతంలో ఒక కథ ఉంది. భారతంలో కథలు వాస్తవాలా అని నన్ను ప్రశ్నించకండి. ముఖ్యమైన కథ ఒకటి వ్రాసేటప్పుడు లేదా ఒక సినిమా తీసేటప్పుడు అందులో నవరసాలు పండించడానికి అనేక ఉప కథలు ఉంటూనే ఉంటాయి. అవి అందులోని పాత్రలు, సంఘటనలు వాస్తవాలైనా కాకపోయినా అందులోని విషయాలను మనం మన ఆలోచనలకు, అనుభవాలకు అన్వయించుకొని, అనుభూతులలోనికి ప్రయాణిస్తాం. వాటి పరమార్థం కూడా అదే.

పైల మహాముని శిష్యుడు ఉదంకుడు. గురుపత్ని ఆచరించబోతున్న ఒక వ్రతానికి కుండలాలనే దివ్య ఆభరణాలు అవసరమౌతాయి. అవి పౌష్య మహారాజు భార్య దగ్గర ఉన్నాయట. వాటిని తెమ్మని గురుపత్ని కోరగా ఉదంకుడు వెళ్ళి ఆమె వద్ద కుండలాలను అడిగి తీసుకున్నాడు. మీరు మహానుభావులు, మీకివ్వడం కన్నా గొప్ప ప్రయోజనం వీటికేముంటుంది అంటూ ఇచ్చిందట. రాజుగారు ఉదంకుడిని భోజనం చేసి పొమ్మని ప్రార్థించారట. ఇంతవరకు అంతా బాగానే ఉంది కానీ, వడ్డించిన భోజనంలో ఒక వెంట్రుక వచ్చిందట. దానికి ఉదంకుడు కోపించి చూడకుండా అన్నం పెట్టించినందుకు నువ్వు గ్రుడ్డి వాడివై పొమ్మని శపించాడు. అందుకు పౌష్య మహారాజు కూడా కోపించి చిన్న విషయానికి నిర్దయగా పెద్ద శాపమిచ్చావు కాబట్టి నీవు సంతాన రహితుడవౌదువుగాక అని ప్రతి శాపం బెట్టాడట. కోపాలు చల్లారిన తర్వాత ఇద్దరూ శాంతచిత్తులైనారు. శాపాన్నుపసంహరింపమని బ్రాహ్మణుడు రాజు నడిగాడు. అందుకు రాజు ఇలా అంటాడు. బ్రాహ్మణుల పల్కు దారుణాఖండలశస్త్రతుల్యము, హృదయం నవ్యనవనీతం. రాజులయందు ఇది పూర్తిగా విరుద్ధం. మనసు కరకు కరవాలంలా ఉంటుంది. మాట మాత్రం

సుతిమెత్తగా ఉంటుంది. అందువల్ల ఇచ్చిన శాపాన్ని గ్రమ్మరించే శక్తి బ్రాహ్మణుని కుంటుంది గాని క్షత్రియుడికుండదయ్యా అంటాడు. మీరు గమనించండి. ఈ రోజులలో నైనా రాజుల పద్ధతి అలానే ఉంటుంది. మాటలే సుతిమెత్తన. మనసు మాత్రం కరకు కరవాలమే. అందువల్ల శ్రేష్ఠులమనుకుంటున్న నాయకులారా! సంఘ సంస్కర్తలారా! అంతఃకరణతో ఆలోచించండి. సత్పురుషులవలె ప్రవర్తిస్తున్నామా లేదా అని.

సామాన్య ప్రజలు శ్రేష్ఠులను అనుసరిస్తారనుకున్నాం. శ్రేష్ఠులంటే మనో వాక్కాయ కర్మలందు హితైక ఏకత్వం కలిగియున్న వారను కొన్నాం. మరి అట్టి శ్రేష్ఠులు ఎవరి ననుసరించాలి? వారికేది మార్గదర్శకం అంటే ఆత్మ ప్రత్యయమే నిరూపకమని అభిజ్ఞాన శాకుంతలంలో కాళిదాసు వక్కాణించాడు. *ప్రత్యహం ప్రత్యవేక్షత నరశ్చరితమాత్మానం కింసుమే పశుభిస్తుల్యం, కింసుసత్పురిషైరివ.* అనగా అనుదినము మానవుడు తన నడవడిని తాను సమీక్షించుకోవలె. ఏమని? నేను పశువువలె ప్రవర్తిసున్నానా లేక సత్పురుషునివలె ప్రవర్తిస్తున్నానా అని. *ఆహార, నిద్రా, భయ, మైధునాని ఏతత్సమానం పశుభిర్నరాణాం.* మనుషులంటే అంతకుమించి ఇంకేమైనా మంచి లక్షణాలుండాలని భావం.

శ్రేష్ఠులైన వారికి సందేహముదయించినప్పుడు అంతఃకరణయే ప్రమాణమని నిరూపించాడు కవి కాళిదాసు. దుష్యంత మహారాజు మృగయా వినోదార్ధం అడవికెళతాడు. అక్కడ కణ్వ మహాముని ఆశ్రమంలో అత్యంత మనోహరియైన శకుంతలను చూచి మోహిస్తాడు. అంతలోనే విచారించుకుంటాడు. వర్ణాశ్రమ ధర్మాలను కాపాడవలసిన మహారాజును నేను. ఈ ముని కన్యను మోహించడం తప్పు కదా అనుకుంటాడు. అంతలోనే అతను వేటకు బయలుదేరేటప్పుడు కుడి కన్ను, కుడి భుజం అదరడం జ్ఞప్తికొస్తుంది. నా మనసు తప్పు చేయదు. నా మనసు ఈమెపై పడిందంటే ఈమె తప్పక ముని కన్యయై ఉండదని అనుకొన్నాడు. ఇక్కడనే సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః అని సమాధాన పరిచాడు.

భారత రాజకీయ చరిత్ర వేరు, భారతీయత వేరు, హిందూత్వ వేరు, వైదికత వేరు. భారత రాజకీయ చరిత్ర ప్రాంతీయత ఆధారమైనది. భారతదేశాన్ని పరిపాలించిన వివిధ రాజవంశాల చరిత్రనే భారత రాజకీయ చరిత్ర. వారిలో అనేక కులాలు, మతాలు, దేశీయతలు ఉండి ఉండవచ్చు. భారతీయత కూడా ప్రాంతీయత ఆధారమైనదే కాని భారతదేశపుటెల్లల మధ్య వెల్లివిరిసిన సంస్కృతి, సంగీత, సాహిత్య, భాషా, విజ్ఞాన, ఆచార వ్యవహారాల సమాహార స్వరూపమే భారతీయత. అందులోనే కొన్ని సామాజిక విలువలు, నీతి నియమాలు కూడా ఇమిడి ఉంటాయి. అదే ప్రతి భారతీయునికి అంతరాత్మ. అతని అస్తిత్వానికి ప్రతీక.

అలాగే హిందూత్వ అనేది భారతదేశ ప్రజల దైవీ భావనకు సంబంధించినది. ఇది రుషి సంస్కృతిలోను, పురాణేతిహాసాలలోను ప్రతిష్ఠితమై ఉంటుంది. వీటినాశ్రయించే సంగీత, సాహిత్యాది భాషా ప్రక్రియలు పూవు నుండి తావివలె పరిఢవిల్లినై. వైదికత దేశపుటెల్లలు దాటి ప్రసరించిన విజ్ఞాన వీచిక. అది దేశకాలాద్యనవచ్ఛిన్నము. భాషామతాలకతీతము. అది విజ్ఞానానికి సంబంధించినది. ఈ నాలుగింటిని కలిపి ఒకే గాటన గట్టి సెక్యులరిజం పేరుతో సముద్రంలో పారవేయడం సమంజసం కాదు.

ఇక ఆచారాలంటే ఆచరించబడేవి అని అర్థము. సాంప్రదాయాలంటే అనుశృతంగా తరతరాలుగా అందించబడిన మంచి విషయాలని అర్థం. మతం మార్చుకున్నా, ఇంటిపేరు, వంటి పేరు మార్చుకున్నా అన్యమతస్తులు కూడా అంతకు ముందున్న ఆచార వ్యవహారాలనే అనుసరించడం మనం గమనించవచ్చు. ఉదాహరణకు తాళిబొట్టు, గాజులు, నుదుటిబొట్టు, చెవి దిద్దులు, ముక్కు పుడకలు, మంగళ వాయిద్యాలు, మెట్టెలు, వాస్తు, జ్యోతిష్యాలు హిందూమతస్తులే కాక అన్యమతస్తులు కూడా వీటిని తరతరాలుగా నేటికీ అనుసరించడం మనం గమనించవచ్చు.

భారతదేశంలోను, ఆ చుట్టు ప్రక్కల ఉన్న దేశాలలోను ఉన్న అన్ని మతాలకు చెందినవారు ఏదో ఒకరోజున ఏదో ఒక కారణంగా అట్టి మతాలలోకి మారిన వారే. వేషం, భాష, ఆచారాలు మార్చుకోవడమే కాక ఇంటిపేరు, వ్యక్తి పేరు కూడా మార్చుకుంటున్నారు. అలా కనీసం ఇంటిపేరు మార్చుకోకుండా

ఉంటే తెలిసేది వారిలో మన ఇంటి పేరిట బంధువులెంత మంది ఉన్నారో. అలా ఇంటిపేరుతో సహా మార్చుకోవడం వలన యుద్ధాలలోను, మత ఘర్షణలలోను స్వంత బంధువులే ఒకరినొకరు చంపుకుంటున్నామని గుర్తించలేక పోతున్నారు.

అలాగే ఏ కారణం చేత కూడా మరోసారి స్వాతంత్ర్యం కోల్పోయే పని చేయకూడదు. మన మాతృ సంస్కృతి కనుమరుగయ్యే పని చేయకూడదు. ఎంత అందవిహీనంగా ఉన్నా స్వంత భార్యాభర్తలే కాపురం చేయాలి. ఎంత అంద విహీనంగా ఉన్నా స్వంత ముఖాన్నే అలంకరించుకోవాలి. ఎంత అపరిశుభ్రంగా ఉన్నా స్వంత ఇంటినే శుభ్రపరచుకోవాలి. లేకుంటే పుట్టే సంతతి భ్రష్టత్వమైతుంది. మన బ్రతుకు బానిస బ్రతుకవుతుంది. రాజకీయ పార్టీలు కూడా ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకునే రాజకీయాలు చేయాలి. అన్యమతాలను గౌరవించుదాం. స్వధర్మాన్ని వదులుకోవడమెందుకు.

యోగా ఆరోగ్యానికి మంచి ప్రక్రియ. అలాగే ప్రాణాయామం, ధ్యానం. యోగా, ప్రాణాయామములు శారీరక వ్యాయామాలు. ధ్యానం మానసిక వ్యాయామం. అలాగే వేదాలలో ఉన్న ఖగోళ విజ్ఞానం, గణిత విజ్ఞానం, దేవుడొక్కడే అన్న భావన, జన్మ, పునర్జన్మలకు సంబంధించిన భావనలు, భారతీయులుగా జన్మించిన గొప్ప వైజ్ఞానికులు, శాస్త్రజ్ఞుల గురించిన చరిత్రలు, ఉదాహరణకు ఆర్యభట్ట, చరకుడు, అలాగే భారతీయ భాషలకు ఆద్యులైన మహానుభావులు, ఆ భాషలను సుసంపన్నం చేసిన పండిత, కవి, గాయక కళాకారులు, వాగ్గేయకారులు, అలాగే భారతీయ నృత్య, సంగీత సాంప్రదాయాలు వంటి ఈ విషయాలను మొదటి తరగతి నుండే పాఠ్యాంశాలతో చేర్చాలి. భారతీయ బాల బాలికలు యువతీ యువకులు తమ దేశ చరిత్ర, తమ పూర్వీకుల చరిత్ర తెలుసుకుని గర్వపడేలా చేయవలసిన అవసరం ఉంది. భర్తృహరి సుభాషితాలు, వేమన, సుమతీ శతకాలు, సామెతలు, వంటివి హిందూమతపరమైన విషయాలుగా భావించడం తప్పు. అవి యుగయుగాల భారతీయ జీవన విధానంలో వెల్లివిరిసిన భాషా, సాంస్కృతిక, సామాజిక, జీవన, వైజ్ఞానిక సిద్ధాంతాలు. వాటిని ప్రయత్నపూర్వకంగా త్రుంచి వేయవలసిన అవసరం లేదు. వాటికి మతం రంగు పులుమ వలసిన అవసరమూ లేదు.

కుల, మత, ప్రాంత, భాషా విబేధాలు ప్రక్కన పెట్టి భారతీయతకు పట్టం కడదాం. ఇక్కడి వ్యక్తి ముస్లిం ఐనా గల్ఫ్ దేశాలకు వెళితే డ్రైవరు ఉద్యోగం ఇచ్చి సర్వెంట్ గదిలోనే ఉంచుతారు. సంబంధ బాంధవ్యాలు నెరపుతారా? వారి ఆడవాళ్ళవైపు తదేకంగా చూస్తే కొరడా దెబ్బలే. అంతకన్నా ముందుకెళ్ళి ప్రేమించే ప్రయత్నం చేస్తే తప్పనిసరిగా శిరచ్ఛేదమే. ఎందుకంటే నువ్వు ముస్లిమువే కాని ఇండియన్ ముస్లింవి. అలాగే ఇండియన్ క్రిస్టియన్ల పరిస్థితి ఇంగ్లండులో. అందుకే మీ పేరు ముందున్న ఇండియన్ లేదా భారతీయ అన్న పదానికి విలువ తెచ్చుకోవాలి. హిందూ, సిక్కు, జైన్ వంటి మతాలకు కూడా వారి మతం పేరు చెప్పినంత మాత్రాన వారికి సంక్రమించే గౌరవం ఏ ఇతర దేశంలోనూ లేదు. అందువల్ల మనమెవరమైనా ఇండియన్, భారతీయ అన్న పదానికి విలువ తెచ్చుకోవడం తప్పనిసరి. మరొక్కసారి బ్రిటిషు పాలన భారతదేశంలో వచ్చి భారతీయులందరూ క్రిస్టియన్లుగా మారిపోయినా లేదా మరొక్కసారి మొగలాయి పాలన వచ్చి భారతీయులందరూ ముస్లింలుగా మారిపోయినా భారతీయ ముస్లింలకు, భారతీయ క్రిస్టియన్లకు అదనంగా దక్కే గౌరవంగాని, ఒడగూడే మెరుగైన జీవనంగాని శూన్యం.

కాలాను గత సమాజ ప్రవాహంలో విద్వేష విషాలను విరజిమ్మే దుష్టుల నుంచి, కుహనా మేధావుల నుంచి సమాజాన్ని కాపాడుకునే భాధ్యత ప్రజలదే. పాలకులు ఆ పని ఎన్నటికి చేయరు. ఎందుకంటే రాజకీయం వేరు, సంఘ సంస్కరణ వేరు. సంఘ సంస్కరణ రాజకీయ నాయకుల ముఖ్య ధ్యేయం కాదు. ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా ముఖ్యంగా యువతలో కుల, మత, ప్రాంత, భాషా సంకుచిత భావాలు క్రమంగా ప్రాముఖ్యాన్ని కోల్పోతున్నాయి. కానీ రాజ్యాధికార సాధన తంత్రంలో కులమతాలు ఉపయోగపడుతున్నాయి కాబట్టే రాజకీయ పక్షాలు కుల మతాలను సజీవంగా ఉంచుతున్నాయి. కుల, మత, భాషా, ప్రాంత సంకుచిత స్వభావాలను అంతరింపజేయడం సంఘ సంస్కర్తల పని. అది రాజకీయ నాయకుల పని కాదు. సంఘ సంస్కరణ వేరు, రాజకీయ తంత్రం వేరు. రాజ్యాధికారం సాధించి నిలబెట్టుకోవడమే రాజకీయ తంత్రం లక్ష్యం. అభివృద్ధి, శాంతి భద్రతలు, పౌర సౌకర్యాలు, అవకాశం మేరకు సంఘ సంస్కరణలు అన్నీ రాజ్యతంత్రంలో భాగాలే. రాజ్యాధికారం కోల్పోయే

అవకాశమున్న సంఘ సంస్కరణను ఏ రాజకీయ నాయకుడూ చేపట్టడు. అందుకే సామాజిక మార్పులు అత్యంత నెమ్మదిగా సుదీర్ఘకాలంగా జరుగుతూ ఉంటాయి.

సమాజం సంయమనం పాటించడానికి, సహజీవనం సాగించడానికి, కులాల ఎల్లలు చెరిపి వేయడానికి సిద్ధంగా ఉంది. అందుకు రాజకీయాలు మరియు కుటిల సంఘ సంస్కర్తలే ముఖ్య అవరోధం. రాజకీయం కులాలవారీగా ప్రజలను విభజించి పాలించాలని చూస్తుంది. నకిలీ సంఘ సంస్కర్తలు ఏదో ఒక వర్గంపై నిప్పులు చెరుగుతూ విద్వేషం రగిలిస్తూ ఉంటారు. తమకు తెలియకుండానే రాజకీయ పావులుగా మారిపోతారు. ఉదాహరణకు ఒకడు బయలుదేరి దేవుడున్నాడా లేడా అనే అంశం మీద వివాదం లేవనెత్తుతాడు. మరొకడు జ్యోతిష్యం ఒట్టి బూటకం అంటాడు. మరొకడు వాస్తు ఒక వంచన అంటాడు. మరొకడు దేవుడున్నాడుగాని విగ్రహారాధన అవసరమా అంటూ చర్చా వేదిక పెడతాడు. వాస్తవానికి ఇవన్నీ వాడికి అవసరమా. వాడి కుటుంబంలో ఉన్న దురలవాట్లు గురించి ఆలోచించడు. వాడి బంధువులు, మిత్రులు, వాడి చుట్టు ప్రక్కల సమాజంలో ఉన్న సమస్యలు వాడికి పట్టవు. ఆపదలో ఉన్న వారిని ఆదుకుందామా, పరామర్శిద్దామా అన్న కనీస జ్ఞానం ఉండదు. అన్నదమ్ములకు కూడా సాయం చేయడు. దేవుడు ఉంటే ఏంటి? లేకుంటే ఏంటి? ఎవడి పని వాడు చూసుకోవచ్చు కదా. ఇలాంటి వారంతా రాజ్యసాధన ప్రక్రియలో రాజకీయ నాయకులు నాటిన విషబీజ రూపాంతర వృక్ష ఫలాలే. ఆ పిచ్చి తలకెక్కి తిరిగి సామాన్యస్థితికి రాలేని పరిస్థితికి వెళ్లిపోయినవారే.

ఒకడు బయలుదేరి వివాహ సమయంలో తలంబ్రాలు పోసుకోవడం అవసరమా అంటూ చర్చ పెడతాడు. దేశంలో ఏటా కోటి పెళ్ళిళ్ళు జరిగి ఒక్కొక్క పెళ్ళిలో రెండు కిలోల అక్షతలు వాడినా రెండు కోట్ల కిలోలు లేదా 20 వేల టన్నుల బియ్యం ఖర్చవుతాయి. ఆ బియ్యంతో ఎంత మంది పేద వారికి భోజనాలు పెట్టవచ్చంటూ లెక్కలేసి వాడి బుర్ర జెడగొట్టుకొని మన బుర్ర జెడ గొట్టే ప్రయత్నం చేస్తాడు. యురేకా అంటూ ఆర్కిమెడిస్‌లా రోడ్డున పడతాడు. ఇంతటి జాతీయ వృథా అవసరమా అంటాడు. వాస్తవానికి అక్షతల

బియ్యం వృధా కావు. పని వాళ్ళు తీసుకొని ఉపయోగించుకుంటారు. ఐనా జీవితానికొక్కసారి జరిగే వివాహ వేడుకలో వధూ వరుల మానసికానందం కోసం రెండు కిలోల బియ్యం అంటే వంద రూపాయలు ఖర్చు పెట్టడం అంత చెడ్డ విషయమా? ఈ విమర్శకుల దృష్టంతా సాంప్రదాయాలను, సాంప్రదాయ వాదులను విమర్శించడం మీదనే. అనేకమంది ఒక్కొక్క వివాహ ఆహ్వాన పత్రికే వంద రూపాయల ఖరీదయినవి పంచుతారు. లక్షల రూపాయల సెట్టింగులేస్తారు. నెలకు వందకు మూడు నుండి పది రూపాయల వరకు వడ్డీలు గుంజుతుంటారు. పెళ్ళిలో ప్లేటుకు వెయ్యి రూపాయల భోజనం పెడతారు. కాంట్రాక్టర్లుగా, సారా కాంట్రాక్టర్లుగా కోట్ల రూపాయలు అడ్డంగా సంపాదిస్తూ ఉంటారు. రాజకీయాలలో ఉంటూ చేసే అక్రమాలకు, చందాలకు, దందాలకు, భూకబ్జాలకు, బ్యాంకు అప్పుల ఎగవేతలకు అంతే ఉండదు. ఇలాంటి వారిని విమర్శించవచ్చు కదా. వీరు అలా చేయరు. వీరికి వారంతా గొప్పవాళ్లలా కనపడతారు. అవన్నీ వదిలిపెట్టి బ్రాహ్మణులు చెమట చిందించట్లేదు కాబట్టి భోజనం చేయడానికి అర్హులు కారని వీరు ప్రచారం చేస్తుంటారు.

మరొకడు బయలుదేరి నమ్మకాలా, మూఢనమ్మకాలా ఏవి కావాలంటూ చర్చ పెడతాడు. నమ్మకానికి, విజ్ఞానానికి తేడా తెలియని వాళ్లే ఇలాంటి చర్చలు పెడతారు. నమ్మకం అంటేనే పశ్నించకుండా అంగీకరించేదని అర్థం. నమ్మకాలు, మూఢనమ్మకాలని రెండు రకాలు లేవు. ప్రతి విజ్ఞానము పరిమిత జ్ఞానమే. అందుబాటులో ఉన్న జ్ఞానాన్నాశ్రయించి ఏర్పరచుకున్న భావమే నమ్మకం. ప్రతీ విజ్ఞానాన్ని తెరిచి ఉంచిన ఆలోచనతోనే గ్రహించాలి. ఎందుకంటే జ్ఞానం కూడా పరిణామ శీలకమే. అప్పటి వరకు విజ్ఞానమని నమ్మిన భూ కేంద్రక సిద్ధాంతం ఎలా మార్పు చెందిందో మనకు తెలుసు. దానిని తప్పుపట్టి సూర్య కేంద్రక సిద్ధాంతాన్ని బలపరిచిన గెలీలియోకు ఏమి జరిగిందో కూడా మనకు తెలుసు. శాస్త్రాన్వేషణ కూడా ఒక స్థాయిలో గణాంకాల పైనే ఆధారపడి నమ్మకంగా పరివర్తన చెందుతుంది. పొగ త్రాగితే క్యాన్సర్ వస్తుందని ఆధునిక వైద్యులు చెబుతారు. రోజుకి ఎన్ని సిగరెట్లు ఎంతకాలం పాటు త్రాగితే క్యాన్సర్ వస్తుందో కచ్చితంగా చెప్పలేరు. వంద మంది సమవయస్కులను పొగ త్రాగే వారిని, పొగ త్రాగని వారిని పరిశీలించి పొగ త్రాగే వారిలో క్యాన్సర్ వచ్చే

అవకాశం ఎక్కువని ప్రతిపాదిస్తారు. అందువల్ల అన్వేషించి కనుగొన్న విషయాలు కూడా నమ్మకాలే. వాటిని ప్రశ్నించకుండా ఏ వాదులు అంగీకరించినా అవి వారి పరిభాషలో మూఢనమ్మకాలే.

అలాగే కళాకారుల గురించి, క్రీడాకారుల గురించి కొందరు విమర్శ చేయడం నేను విన్నాను. క్రికెట్ ఆట దేశానికి అవసరమా? సినిమా కళాకారులకు, క్రీడాకారులకు కోట్ల రూపాయలు పారితోషకం ఇవ్వవల్సిన అవసరముందా? వాటి ప్రచారానికి ప్రచార మాధ్యమాలు అంతగా అంకితమవడం అవసరమా? అంటూ విమర్శిస్తారు. వారి ఆలోచన ప్రకారం క్రికెట్ బంతి టెండుల్కర్ బ్యాటుకు తగిలితే ఏంటి? తగలకపోతే ఏంటి? ఆ బంతి బౌండరీ లైన్ దాటితే ఏంటి? దాటకపోతే ఏంటి? దానికి ప్రజాజీవితాలకు ఏమైనా సంబంధం ఉందా? కోట్ల మంది ప్రజలు ముఖ్యంగా యువత ఉద్యోగాలకు, విద్యాలయాలకు సెలవు పెట్టి టెలివిజన్లకు అతుక్కుపోతారు. ఎంత మానవ శక్తి, జాతీయ వనరులు, పని దినాలు వృధా అవుతున్నాయి? టెలివిజన్లు రాకముందైతే రేడియోలు చెవికానించుకొని కామెంటరీ వింటూ నడుస్తూ ప్రమాదాలకు కూడా గురయ్యేవారు.

ఒక్కొక్క ఆటగాడికి ఒక్కొక్క కంపెనీ బెంజి, ఆడి, బెంట్లీ కార్లు కూడా బహుమానంగా ఇస్తూ ఉంటారు. ప్రభుత్వం కూడా కొన్ని కోట్ల రూపాయల విలువ చేసే ఇండ్ల స్థలాలు వగైరా బహుమానంగా ఇస్తుంది. ప్రభుత్వ శాఖలలో విద్యార్హతతో సంబంధం లేకుండా పెద్ద పెద్ద ఉద్యోగాలిచ్చి, ఆఫీసుకు వచ్చి పని చేయాల్సిన అవసరం లేకుండా క్రీడలు ప్రాక్టీసు చేసుకొనే అవకాశం కూడా ఇస్తారు. ఇంకా రాజ్యసభలో సభ్యులుగా ఎంపిక చేసి పద్మశ్రీ వంటి బిరుదులతో సత్కరిస్తూ ఉంటారు. సామాన్య ప్రజలు వారి దర్శనమైతే చాలని బారులు తీరతారు. సినిమా కళాకారుల పరిస్థితి కూడా అదే. రోజంతా ఎండలో చొమటోడ్చి కూలిపని చేసేవాడికి రూ.500 కూడా కూలీ ఇవ్వరు. ఒక్క రోజు క్రికెట్‌లో ఆడినందుకు కోటి రూపాలయల పారితోషికమా? ఎంత అన్యాయం అంటూ వాపోతుంటారు. ముఖానికి రంగేసుకొని నాటకాలాడేవారికి రోజుకు లక్ష రూపాయల పారితోషికమా? ఇదంతా పిచ్చిపని అంటాడు. వీళ్ళ దృష్టిలో వారుచేసే పనులు వృధా.

కళలు, క్రీడలు, సాహిత్యం, సంగీతం ప్రాముఖ్యం ఒక్క ఉదంతం పరిశీలిస్తే అర్థమౌతుంది. ఇండియా, పాకిస్తాన్ విభజన సందర్భంగా ప్రజల మార్పిడి జరిగింది. లక్షలాది మంది పాకిస్తాన్‌లోనున్న హిందువులు భారతదేశానికి ప్రయాణమయ్యారు. అలాగే భారత దేశంలోనున్న లక్షలాది మంది ముస్లింలు పాకిస్తాన్‌కు ప్రయాణమయ్యారు. వందల సంవత్సరాలపాటు ఆ ప్రాంతంలో స్థిరనివాసముండి, బంధుమిత్రులను కలిగియుండి, స్థిరాస్తులు, కోళ్ళు, కుక్కలు, గొడ్డు, గోదా కలిగియుండి అవన్నీ వదులుకొని రావడానికి ఎంతటి మానసిక వ్యధ ననుభవించారో మనసున్న వారికెవరికైనా అర్థమవుతుంది. హృదయ విదారక సంఘటన. విభజన సందర్భంగా హిందూ, ముస్లింల మధ్య అల్లర్లు చెలరేగినయి. ఎలాగూ అన్నీ వదులుకొని పోతున్నారు కాబట్టి వారి స్థిర చరాస్తులను ఆక్రమించడం ప్రారంభించారు. రైళ్ళపైన, ఎడ్లబండ్ల మీద, కాలినడకన, కావిళ్ళు మోసుకుంటూ బయలుదేరిన వారి మీద దాడులు ప్రారంభమైనాయి. లక్షల సంఖ్యలో ప్రజల ధన, మాన, ప్రాణాలు మంటల్లో మాడిపోయినాయి. 1947 ఆగస్టు 15వ రోజునే స్వాతంత్ర్యం ప్రకటించుకొని అధికారం చేబట్టాలన్న కోరికతో విభజనని ఆకస్మాత్తుగా అర్ధరాత్రి ప్రకటించడం వల్లనే ఇలా జరిగింది. ఒక ప్లాన్ ప్రకారం ఐచ్ఛిక పౌర మార్పిడి జరిగి ఉంటే ఇంతటి మారణహోమం జరిగి ఉండేది కాదు. ఒక దేశం నుంచి వచ్చేవారు వారు వదులుకున్న స్థిరాస్తులను అక్కడి అధికారుల నుంచి ధృవపత్రం తెచ్చుకుంటే దానికి సమానమైన భూవసతి రెండవ దేశంలో ఇచ్చే పరస్పర అంగీకారం కుదుర్చుకుని, ఒక ప్రణాళిక ఉంటే, అందుకు ఆరు నెలల సమయం ఇచ్చివుంటే బాగుండేది.

ఈ దాడులలో అవయవాలు కోల్పోయిన వారు కొందరు. తీవ్రగాయాల పాలైన వారు కొందరు. ఆకలి దప్పులతో భయాందోళనతో అలసటతో చావు బ్రతుకుల మధ్య స్వదేశం చేరిన వారు కొందరు. భార్యలను కోల్పోయిన భర్తలు, భర్తలను కోల్పోయిన భార్యలు, పిల్లలను కోల్పోయిన తల్లిదండ్రులు.. అనేక వేల మంది వయసులో ఉన్న స్త్రీలను పాకిస్తాన్‌లో పంజాబు సరిహద్దుల్లో సామూహిక మానభంగాలు చేయడానికే చెరబట్టారట. ఆ తర్వాత కొంతకాలానికి నెహ్రూ తదితర భారత జాతీయ నాయకులు వారిని వెనక్కి పిలిపించే ప్రయత్నం

చేస్తే ఆ మహిళలు అందుకు నిరాకరించారట. మానాభిమానాలు పోగొట్టుకొని ఐన వారికి ముఖాలు చూపించలేమని అనేక మంది అక్కడనే బ్రతికి అంతమైపోయారట. ఇప్పటికీ పాకిస్తాన్‌లో హిందువులుగా బ్రతుకున్న వారు రిక్షాకార్మికులుగానో, సఫాయి కార్మికులుగానో, దుర్భర దారిద్ర్యంలో పౌరహక్కులు కూడా లేకుండా దయనీయ స్థితిలో మనుగడ సాగిస్తున్నారు. ఒక దేశంగా కలిసి వున్న భూభాగం విడిపోతేనే ఇంతటి అమానవీయ పరిస్థితులు నెలకొంటే, వేరే దేశం పాలన క్రిందకు భారత దేశం వెళ్ళవలసి వస్తే భారతీయుల బ్రతుకు చిత్రం ఎలా ఉంటుందో ఊహించవచ్చు. ఇంతటి దారుణాలు పాలకుల వల్లనే జరుగుతాయి. అలా జరగకుండా వుండాలంటే అంతర్గత కుమ్మలాటల నాపి దేశద్రోహులనెండగట్టండి. అదే నిజమైన దేశ సేవ.

అలా వచ్చిన షుమారు పదిలక్షల మందిని డిల్లీ నగరం వెలుపల తాత్కాలిక గుడారాలు వేసి ఉంచారట. అంతమందికి తాత్కాలిక నివాసం ఏర్పాటు చేయడం ప్రభుత్వానికి తలకుమించిన భారమే అయిందట. జనరేటర్ల ద్వారా విద్యుత్తు సౌకర్యం, స్నాన పానాదులకు సౌకర్యాలు, వైద్య సదుపాయాలు, దుస్తులు ,భోజనం అన్నీ ఏర్పాటు చేశారట. ఇవేవీ తల్లిదండ్రులను కోల్పోయిన పసిపిల్లల రోదననాపలేకపోయాయి. కుటుంబ సభ్యులను, తోడును, గూడును కోల్పోయిన వ్యధను చల్లార్చలేక పోయనయి. ప్రజాసంఘాలు అన్ని రకాల సేవా సదుపాయాలు, ఓదార్పులు స్వచ్ఛందంగా కూడా చేశారట. అంటు వ్యాధులు ప్రబలి భీభత్స వాతావరణం నెలకొని ఉన్నదట. అప్పుడు ప్రభుత్వం పెద్దపెద్ద తెరల నేర్పాటుచేసి చార్లిఛాప్లిన్ వంటి హాస్య నటుల సినిమాలు ప్రదర్శించారట. ప్రజలు బాధల మధ్యలో కూడా అప్పుడప్పుడు చిరునవ్వు నవ్వారట. ఆటమైదానాలు ఏర్పాటు చేసి పిల్లలతో క్రీడలనాడించారట. తద్వారా పిల్లలు పెద్దలు బాధలు కొంతవరకు మరిచిపోయి నిత్యజీవన వ్యాపారాలలో నిమగ్నమవడం ప్రారంభించారట. ఈ సంఘటన గురించి చదివిన తర్వాత నాకర్థమైంది. కళలు, క్రీడలు మానసికోల్లాసం సృష్టించడంలో ఎంతటి ప్రముఖ పాత్ర పోషిస్తాయో. క్రికెట్ ఆట కీలక సమయంలో ఒక్క షాట్ కొట్టి ప్రపంచ వ్యాప్తంగా షుమారు వంద కోట్ల మందిని హర్షాతిరేకాలలో ముంచెత్తిన ఆటగాడికి ఏమిచ్చినా తక్కువే. దానితో సమానమైన సంతోషాన్ని సృష్టించడం

ఇతర విధాలుగా అసాధ్యం. అందుకే *స్వదేశే పూజ్యతేరాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే* అన్నారు. క్రీడాకారులకు, కళాకారులకు, సంగీత, సాహిత్యవేత్తలకు ప్రపంచ వ్యాప్తంగా అభిమానులుండడం, ఆరాధించడం ఇందుకు ఉదాహరణ.

మధుమేహ వ్యాధి గ్రస్తులు పండ్లు ఆహారంగా తీసుకోకూడదని వైద్యులు చెబుతారు. ఈ మధ్యనే పండ్లలో ఫ్రక్టోస్ అనే పదార్థముంటుంది, అందువల్ల పండ్లు తిన్నా షుగరు పెరగదని ఈ మధ్యనే ప్రచారం జరుగుతున్నది. నేను కూడా ఒక ఇంగ్లాండు పరిశోధనా కేంద్రం వారు 'సీ' విటమిన్ కలిగిన పండ్లు తినటం వల్ల షుగర్ పెరగక పోగా అదుపులో ఉంటుందని తెలియజేసిన ప్రచురణ చదివాను. నా ఇరవై సంవత్సరాల స్వీయ అనుభవం కూడా రసం మామిడిపండ్లు తినడం వల్ల నా షుగర్ లెవెల్స్ పెరగలేదు. అరటి, సపోటా వంటి పండ్ల ద్వారా మాత్రం పెరగటం గమనించాను. అందువల్ల ప్రతి పరిజ్ఞానం మారే వరకు నమ్మకమే. మన తండ్రి ఫలానా అని, మనబిడ్డలు మనబిడ్డలే అని, ఇంటికి చేరే వరకు మన భార్య మన భార్యగానే మిగిలుంటుందని నమ్మకమైనా, మూఢనమ్మకమైనా కలిగి ఉండటమే మంచిది. మరో పది కాలాలు జీవిస్తామని కూడా నమ్మటమే మంచిది. వీటన్నీటికి అనునిత్యం ఋజువుల కోసం ప్రయత్నిస్తే బ్రతుకు బస్టాండే.

ప్రతి పాఠశాలకు ఒక యూనిఫాం ఉంటుంది. అది లేకుంటే చదువు రాదా? అని ప్రశ్నిస్తే అది ఖచ్చితంగా అతి తెలివే. అలాగే ప్రతి సమూహానికి కొన్ని నమ్మకాలు, విధివిధానాలు ఉంటాయి. వాటినాచరించుకోవడం వారికి రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కు. వాటిని ప్రశ్నించి అవహేళన చేయడం రాజ్యాంగ ద్రోహమే. సాటి మానవుల మనోభావాలను కించపరచడం అనాగరిక చర్యే. వీటిని ప్రశ్నించే వాళ్లు పిరికివాళ్లు. ఎందుకంటే వీరు సాత్త్వికులైన వైశ్య, బ్రాహ్మణ మరియు హిందూ మతాలనే ఎంచుకుంటారు. యస్.సి., యస్.టి., బీ,సి., రెడ్డి., మహ్మదీయుల జోలికి వీరు వెళ్లరు. వెళితే ఏం జరుగుతుందో వీరికి స్పష్టంగా తెలుసు. వీరిపై చట్టపరంగా చర్యలు తీసుకొనే అవకాశం తప్పనిసరిగా ఉంటుంది.

విశ్వాసాలే మనిషిని బ్రతికిస్తాయి. సమాజాన్ని నడిపిస్తాయి. గుణాత్మక ఆలోచనా విధానానికి ఆలంబనగా నిలుస్తాయి. అవిశ్వాసం, అనుమానం

ఆందోళన కలిగిస్తాయి. హత్యలకు, ఆత్మహత్యలకు, కృంగదీతకు దారితీస్తాయి. తీవ్రమైన చర్యలకు ప్రేరేపిస్తాయి. ఉదాహరణకు ఒక వైద్యుడు రోగితో అతని రోగం నయమౌతుందని హామీ ఇస్తే రోగం సగం తగ్గిపోతుంది. అలా కాక నువ్వు షుమారు ఆరు నెలల్లో చనిపోతావని లేదా రోగం తగ్గదని నిజం చెబితే నాలుగు నెలల్లోనే నరకం అనుభవించి మరీ చనిపోతాడు. ఒకసారి మా దగ్గరి బంధువు క్యాన్సర్ పేషెంటును నిలోఫర్ అసుపత్రికి తీసుకెళ్ళాను. ఆమె అప్పటికి మూడు సంవత్సరాలనుంచి క్యాన్సర్ వ్యాధితో బాధపడుతున్నది. చెకప్‌కు వెళ్ళినప్పుడల్లా ఆమెతో డాక్టర్ చెపుతూ ఉండేవాడు. మీకు క్యాన్సర్ చాలా బాగా తగ్గింది. నాకే ఆశ్చర్యంగా ఉంది. మీరు ప్రొటినెక్స్ క్రమం తప్పకుండా త్రాగితే ఇంకా బావుంటారు అనే వాడు. ఆవిడ ఆనందానికి అంతుండేది కాదు. మాకు మాత్రం డాక్టర్ మొదటి నుంచి చెపుతూనే ఉండేవాడు. మూడు నుంచి ఐదు సంవత్సరాల వరకే ఆమె బ్రతుకుతారని. ఒకసారి చెకప్‌కి వెళ్ళినప్పుడు పై అంతస్తుకు చకచక మెట్లెక్కుతూ వచ్చింది. డాక్టర్ ఆమెతో గతంలోలానే చెప్పాడు. ఆమె ముఖంలో క్యాన్సర్‌ను జయించానన్న గర్వం కనపడింది. ఆమెకు వినపడకుండ డాక్టర్ నాకు మెల్లగా చెప్పాడు. లింఫ్ నాళాల్లో సెకండరీ పెరుగుదల వచ్చింది, ఇక చాలా కష్టమని. ఆ మాటలు ఎలాగో ఆమె చెవిన పడ్డాయి. అంతే. ముఖం ముడుచుకు పోయింది. ఒక్కసారిగా నీరసపడిపోయింది. పై అంతస్తుకు మెట్లను అవలీలగా ఎక్కి వచ్చిన ఆమె తోడు లేకుండా ఒక్క మెట్టుకూడా దిగలేకపోయింది. మానసికంగా కృంగిపోయి మూడు నెలల్లోనే కాలం చేసింది. అదే విశ్వాసానికున్న బలం, అవిశ్వాసానికున్న బలహీనత. అందువల్ల ప్రజల విశ్వాసాలను విమర్శించి చెడగొట్టే వాళ్ళు సమాజానికి శత్రువులేనని నా అభిప్రాయం.

విశ్వాసాలు, ఆశీర్వచనాలు, ఆచార్యులు, ఆచారాలు, అర్చనా విధానాలు హిందూ, ముస్లిం, క్రిస్టియన్, బౌద్ధ, సిక్కు, జైన వంటి అన్ని మతాలలోను అనాదిగా ఉన్నాయి. అంటే ప్రపంచ జనాభాలో ఇంచుమించు తొంభైతొమ్మిదిన్నర శాతం ప్రజలు ఏదో ఒక విశ్వాసాన్నాశ్రయించి ఉన్నారు. తొంభైతొమ్మిదిన్నర శాతం మంది ఒక ప్రక్క ఉండగా ఎవరో ఒక్కడు వ్యతిరేకంగా ఉన్నాడంటే వాడు తప్పనిసరిగా సంఘ వ్యతిరేక వ్యక్తే. భగవంతుడిని పూజించి ఆచార్యుని

ఆశీర్వాదం పొందిన వ్యక్తి యొక్క విశ్వాసం అతనిని కార్యోన్ముఖుడిని చేసి విజయం వైపు నడిపిస్తుంది. ఓడిపోయినా నిరాశ చెందకుండ ఉండటానికి కర్మ సిద్ధాంతం ఉండనే ఉంది. ఏదైన కార్యం సాధించడానికి సాధనలో *షడ్భాగంతు మనుష్యాణాం సప్తమం దైవ చింతనం* అన్నది శాస్త్రోక్తి. అందువల్ల కార్యం విఫలమైనా ప్రయత్న లోపాన్నో లేదా కర్మ సిద్ధాంతాన్నో ఆశ్రయించి మనిషి అనునయం పొందుతాడు. తిరిగి సంకల్పం చెప్పుకొని పునఃప్రయత్నం చేస్తాడు.

వాస్తవానికి దైవభావన ఒక విశ్వాసం. ఆ విశ్వాసం వల్ల నష్టం లేదు. ఉదాహరణకు ఒక రైలు పట్టాపై అది నేల మీద ఉన్నప్పుడు వంద అడుగుల దూరం క్రింద పడకుండా దానిపై నడవగలం. అదే రైలు పట్టాను యాభై అడుగుల ఎత్తున అమర్చి దానిపై నడవమంటే ఎవరికైనా అసాధ్యమే. కారణమేమిటంటే పట్టా నేలపై ఉన్నప్పుడు పడినా ఏం కాదనే విశ్వాసం, భూమి తనకు అండగా ఉందనే విశ్వాసం. అదే పట్టా యాభై అడుగుల పైన అమర్చినప్పుడు భూమి తనకు అండగా లేదనే భావన. పడితే ప్రమాదమేనన్న భయం. నిత్యజీవితంలో భగవంతునిపై విశ్వాసం కూడా ఇలానే పని చేస్తుంది. భగవంతుని ఆశీస్సులు తనకున్నాయి, భగవంతుడు తనను తప్పక రక్షిస్తాడన్న భావన ధైర్యంగా పని చేయడానికి ఆలంబనగా, విజయం సాధించడానికి సోపానంగా పని చేస్తుంది. మనో ధైర్యాన్ని కలిగించడానికి భక్తి ఒక సాధనం. ఈ విషయం అన్ని మతాల భక్తులకు తెలుసు. నాస్తికులకే తెలియదు.

ఎవరు నమ్మిన సిద్ధాంతాన్ని వారు ప్రచారం చేసుకోవచ్చు. ఇతరులు నమ్మిన సిద్ధాంతాలను తప్పు పట్టాలన్న దుర్బుద్ధి మంచిది కాదు. పరిశోధనలు చేసి ఫలితాలను వెల్లడించడానికి అన్ని రంగాలలో శాస్త్రజ్ఞులు ఉన్నారు. వారి పని వారు చేస్తారు. వారు సైతం ఓపెన్ మైండెడ్ గానే ఉంటారు. మనమెందుకు మూసుకొని ఆలోచించడం. కుక్క చేసే పని గాడిద చేయక పోవడం మంచిది. మనసులు, నమ్మకాల విలువలు వెలకట్టలేరు. అవి చాలా సున్నితమైనవి. మొరటు సుత్తులతో, కరకు కత్తులతో వాటినంతం చేయకండి. ఇదే నా విన్నపం. తల్లీ బిడ్డల మధ్య బంధం శాస్త్రీయ నామమేంటో దానినెలా కొలవాలో కాస్త ఆలోచించండి.

**స్వధర్మే నిధనం శ్రేయః పర ధర్మో భయావహః.** స్వధర్మ నిర్వహణలో ప్రాణం పోయినా మేలే అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు తెలియజేశాడు. ఒక జాతి ఔన్నత్యానికి దాని చరిత్ర, సంస్కృతీ సాంప్రదాయాలు, విజ్ఞానమే ప్రతీక. అదే ఆ జాతి యొక్క ఉనికికి ఆధారం. అది కోల్పోయిన జాతి అంతరించినట్లుగానే భావించాలి. ఒక జాతి అలా తన ఉనికిని కోల్పోయినప్పుడు అందుకు కారణమెవరైనా దాని ప్రభావం మాత్రం జాతి ద్రోహులతో సహా అందరూ అనుభవించవలసే వస్తుంది. గతంలో భారత దేశంలో ఇలానే జరిగింది. ఇప్పటికీ కొందరు దేశ ద్రోహులు అటువంటి పనులు చేస్తూనే ఉన్నారు. ఒక జాతి మరొక జాతిపై విజయం సాధించి అధికారాన్ని నెరపినప్పుడు ఓడి పోయిన జాతి యొక్క చరిత్రను, భాష, సాహిత్య, సంస్కృతి సాంప్రదాయాలను విజ్ఞానాన్ని, అలవాట్లను అన్నింటిని మార్చివేస్తారు. స్థానిక భాషా, సాంస్కృతిక సాహిత్య విజ్ఞానాలు నాశనమై పోతాయి. ఆచార వ్యవహారాలు భ్రష్టుపట్టి పోతాయి. తమ స్వంత విధి విధానాలను ఓడిపోయిన జాతిపై రుద్దుతారు. ఇది ప్రత్యక్షంగా బలవంతంగా జరగవచ్చు లేదా పరోక్షంగా అలాంటి పరిస్థితులు కల్పించడం ద్వారా జరగవచ్చు. రాజుల దండయాత్రలు రాజ్యకాంక్షతో చేసేవే. కాని పాలకుల పోరాటాల మధ్య పౌరులు నలిగి పోతారు. ఆంబోతుల పోట్లాటలో లేగ దూడలు నలిగినట్లు. భారతదేశంలోకి అనేక మతాలు, భాషలు, సాంప్రదాయాలు, నాగరికతలు అలా వచ్చి చేరినవే కదా.

ఒక దేశం ఉనికి కోల్పోవడమంటే ఒకరి పాలన పోయి మరొకరి పాలన రావడం కాదు. ప్రతి దేశానికి, ప్రతి వ్యవస్థకు, కులానికి, మతానికి ప్రాణప్రదమైన విలువలు కొన్ని ఉంటాయి. వాటిలో వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, వారసత్వ విలువలు అనగా చరిత్ర, జీవన విధానాలు, విశ్వాసాలు, విజ్ఞాన భాండాగారాలు, కళా సాంస్కృతిక సాహిత్య రంగాలు ముఖ్యమైనవి. వీటిని వదులుకోకుండా ఏ రాజ్యంలో బ్రతికినా దానిని ఎవరు పరిపాలించినా విశ్వమానవ సమానత్వానికి, సౌభ్రాతృత్వానికి విఘాతం ఉండదు. కాని ఒక్కసారి పరాయి పాలన క్రిందకు వెళితే ఏ దేశ ప్రజలైనా ఆస్తులను, అస్థిత్వాన్ని కూడా కోల్పోయి అవమానభారంతో జీవించవలసి వస్తుందని చరిత్ర చెప్పిన సత్యం. అందుకే తాను ఉంటున్న దేశ సార్వభౌమత్వాన్ని, ఉనికిని, విలువలను ఖననం చేసేవారు,

వారు కూర్చున్న కొమ్మను వారే నరుక్కుంటున్నామని గ్రహించాలి. ఇలాంటి స్వార్ధపరులు శత్రుదేశాలకు తమ మాతృ సామాజిక విలువలు తాకట్టు పెట్టి సాయం చేసినా వారి కుటుంబాలు కూడా ఉనికిని కోల్పోయి పరాయి సమాజాలు అందించే పడుపు కూడు తింటూ బానిస బ్రతుకులు బ్రతకవలసి వస్తుంది. పరాయి సమాజాలు కూడా ఇలాంటి ద్రోహులను గౌరవించరు. దేశపుటస్తిత్వం స్వీయ సనాతన సామాజిక విలువలు వదులుకున్న వారు నికృష్టపు బ్రతుకులు బ్రతకటమే కాక సమాజాన్నంతా పతనపు పాతాళానికి త్రోసి వేస్తారు.

నేను ఫలాన వారి మనువడిని, ఫలాన వారి కుమారుడను అని సగర్వంగా ప్రవర చెప్పుకునే బదులు ఎవరో ఒకరికి పుట్టాను, ఎలాగో ఓలా బ్రతుకుతున్నాను అనవలసి వస్తే దానినే లావారిస్ లేదా బేవార్స్ అంటారు. అలా ఒక వ్యక్తి లావారిస్ అయినా పర్వాలేదు. కాని ఒక జాతి మొత్తం అస్తిత్వం కోల్పోతే ఆ జాతి మొత్తం భ్రష్టత్వం అవుతుంది. చరిత్ర హీన జాతిగా మారి పోతుంది. చరిత్రలో ఇలాంటి జాతి ద్రోహులు చాలా మందే ఉన్నారు. పరాయి రాజులను ఆహ్వానించి స్వదేశీ రాజులను చంపించిన వారున్నారు. అలాంటి వారు వ్యక్తిగతంగా తాత్కాలికంగా లాభపడినా అతని కుటుంబ సభ్యులు, అతని బంధు మిత్రులు, మనుమలు, ముని మనుమలు కూడా పరాయి రాజుల పాదాల చెంత బానిసల్లా, జంతువుల్లా, చరిత్ర హీనుల్లా బ్రతికి చావవల్సిందే. ఇలాంటి వారిని విదేశీయులు కూడా గౌరవించరు.

ప్రజాక్షీర సాగరంలో రాజకీయ పాలక పక్షం, ప్రతిపక్షం ఇరువైపులా చేరి ప్రభుత్వ పరిపాలనా మథనం కొనసాగిస్తారు. క్షీరసాగర మథనంలోలాగనే అమృతముదయిస్తుంది. హాలాహలమూ పుడుతుంది. ఎవరికి వారు అమృతం తాము త్రాగి వైరి వర్గానికి హాలాహలం పంచాలని చూస్తారు. అందులోనే మోహినీ అవతారం వంటి అనేక వంచనలు చోటు చేసుకుంటాయి. ఏది ఏమైనా రాజ్యాధికార సాధక వంచనా తంత్రంలో ఆనాటి నుండి నేటివరకు మద్యం, మగువ, మనీ ప్రముఖ పాత్ర పోషిస్తూనే ఉన్నాయి. హాలాహలాన్ని శివుడిలా దిగమింగవలసినది మీడియా. కాని, అది కూడా మోహినీ పాత్రే

పోషిస్తున్నది. కార్యనిర్వాహక వ్యవస్థ ఎలాగు రాజకీయ వ్యవస్థకు గుమస్తానే. ఇక మిగిలింది ప్రజలు. హాలాహలం మొత్తం వారివంతే అవుతున్నది.

గతంలో యుద్ధాలలో ఓడిపోయిన రాజుయొక్క రాజ్యాన్నీ, సంపదనీ, స్త్రీలను కూడా వశం చేసుకొని శత్రుశేషం లేకుండా కుటుంబ సభ్యుల నందరినీ సంహరించిన సందర్భాలున్నాయి. ఆపై ఓడిపోయిన రాజు తల నరికి కోట గుమ్మానికి కట్టిన సందర్భాలూ ఉన్నాయి. ప్రజలను బానిసలుగా, జంతువులుగా చూసిన సందర్భాలున్నాయి. భారతదేశంలో రాజకీయ పార్టీలు ఎంచుకోదగ్గ నినాదాలు, పార్టీ విధానాలు చాలానే ఉన్నాయి. పెట్టుబడిదారీ విధానమా, సోషలిజమా, ప్రజాస్వామ్యమా, కమ్యూనిజమా, ద్వంద లేదా బహు పార్టీ విధానమా, ప్రెసిడెంటు పాలనా లేదా వారి ఎన్నిక ప్రత్యక్ష విధానమా లేక అప్రత్యక్ష విధానమా. దేశ ఆర్థిక, రాజకీయ, విదేశీ విధాన విషయాలలో విభిన్న దృక్కోణాలు కలిగిన పార్టీలు, ఉండవలసింది పోయి మతానికొక పార్టీ, కులానికొక పార్టీ, ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క పార్టీ, ఆవిర్భవిస్తున్నాయంటే ఇవి ప్రమాద ఘంటికలే. దేశ విచ్ఛిన్నానికి, అస్థిరత్వానికి సూచికలే. కాబట్టి పాలకులారా తస్మాత్ జాగ్రత్త. రాజ్యాధికార సాధన తంత్రంలో భాగంగా ఇలాంటి క్షుద్రమంత్రాల నాశ్రయించకుండా అభివృద్ధి, సంక్షేమం, శాంతి భద్రతలు, దేశరక్షణ వంటి మహా మంత్రాలనెంచుకుంటే మంచిది.

పాలకులలో ఉన్న అనైక్యత, అవినీతి, అసమర్థతలకు వారు భారీగానే మూల్యం చెల్లిస్తారు. కానీ వారితో పాటు ప్రజలు కూడా అనేక అగచాట్లు పడవలసి వస్తుంది. ఉదాహరణకు అనేక రాజ్యాలుగా ఉన్న భారతదేశంలోని రాజులు భోగలాలసులయ్యారు. నిరంకుశ పాలన చేసి ప్రజలకు దూరమయ్యారు. అవినీతి, అక్రమాలకు కొదువేలేదు. ఒక్కొక్కరు మధువుకు, మగువకు బానిసలుగా లొంగిపోయారు. రాజుల మధ్య అనైక్యత, ఈర్ష్య, ద్వేషాలే విదేశీయులకు వరాలుగా మారాయి. ఒకరి సాయంతో మరొకరిని జయిస్తూ చివరికి అందరినీ అంతం చేయగలిగారు. కానీ చరిత్ర నుంచి నేటి పాలకులు పాఠాలు నేర్చుకున్నట్లు లేదు. ఇప్పటికీ అదే అవినీతి, అనైక్యత, అసమర్థత, అదే అహంకారం, అదే భోగలాలస. ఇవన్నీ చూస్తే మరొక సారి స్వాతంత్ర్యం కోల్పోతామేమోననిపిస్తోంది.

ముఖ్యంగా ఈ పుస్తకంలో పాఠకులకు మనవి చేయదలుచుకున్న విషయాలు ఏమిటంటే, మార్పు అనివార్యం. దానిని సమదృష్టితో స్వీకరించండి. ఇతరులను నిందించకుండా సంస్కరణల కోసం మాత్రమే పని చేయండి. సమాజంలోని తప్పొప్పులకు ప్రభుత్వాలనే బాధ్యులు చేయండి. ఈ యుగధర్మం ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్య బద్ధంగా ప్రవర్తించండి. తెరిచిన మనుసుతోనే విషయాల నధ్యయనం చేయండి. సంకుచిత స్వభావాలు వీడి భారతీయతకు, జాతీయతకు పట్టం కట్టండి. మార్పు అనివార్యం, నిరంతరం. అది ఒక్క కులం వల్లనే జరగదు. నిజంగా అలా జరిగిందని భావించినా ప్రస్తుత కర్తవ్యం సంస్కరణే తప్ప కలహించడం కాదు. ఈ మార్పు సామాజిక, సాంస్కృతిక, సాహిత్య, ఆచార వ్యవహారాలలోను, కుల, మత ఆధిక్యతలలోను, ఆర్థిక, రాజకీయ పరిస్థితితులలోను వైజ్ఞానిక పరిశోధనలలోను చివరగా వ్యక్తిగత జీవితాలలోను సంభవించి తీరుతుంది. అసలు ఈ సృష్టి సర్వస్వమూ పరిణామగతమే. కులమతాలకతీతంగా భారతీయతకు పట్టం కట్టండి. కులం కూలిపోతేనేం? కూడి ఉంటే చాలు. మతం మాసి పోతేనేం? మనుషులు మిగిలుంటే చాలు. దేశపుటెల్లలు చెరిగిపోతేనేం? విశ్వ సౌభ్రాతృత్వం వెల్లివిరిస్తే చాలు. ఈ సత్యాలు గమనించిన వారు తాము ఆయురారోగ్యాలతో, సుఖసంతోషాలతో జీవించటమే కాక సమస్త మానవ సమాజానికి సుఖసంతోషాల హేతువు కాగలరు.





## ఈశ్వరప్రగడ హరిబాబు

ఈ పుస్తకం ఒక అతుకుల బొంత. తెల్లవి, నల్లవి, ఎర్రవి, పచ్చవి రంగురంగుల పాతగుడ్డలు అతికించి బొంతనేసినట్లే ఈ పుస్తకంలోని అన్ని అంశాలు కూడా పాతవే. గతకాలంలో ఎప్పుడో ఒకప్పుడు సమాజంకోరి కొని తెచ్చుకుని చుట్టుకున్నవే. నా మనసు మాత్రం సప్త వర్ణాల మిశ్రమంలా ధవళమే. అలాగే అనేక రంగులలాగానే సమాజంలోని అన్ని వర్ణాలను సామాజిక, ఆర్థిక, రాజకీయ సాహిత్య వైజ్ఞానిక విషయాలను ఏర్చికూర్చి నేను నేర్చిన విధంగా నేసి ప్రజల ముందుంచుతున్నాను. ఈ యుగధర్మం ప్రజాస్వామ్యం. ప్రజల విషయ పరిజ్ఞానం పెరిగితేనే నాణ్యమైన నాయకులనెంచుకోవడం ద్వారా తమ దేశాన్ని తీర్చిదిద్దగలుగుతారు. లేకుంటే రాబందులూ, వాటి బంధువులే రాజ్యం చేస్తాయి. అభివృద్ధి ఫలాలనాస్వాదించవలసిన వారు, స్వాతంత్ర్యాన్ననుభవించవలసిన వారు ప్రజలే. అలాగే స్వాతంత్ర్యం కోల్పోతే బానిస బ్రతుకులు బ్రతకవలసిన వారూ, అభివృద్ధి జరగకపోతే పేదరికంలో మ్రగ్గవలసినవారు ప్రజలే. ప్రజల అవగాహనను పెంచే ప్రయత్నమే ఈ పుస్తకం. ఈ అతుకుల బొంతనే భావి భారత బాల బాలికలకు పట్టుపరుపులా పరిణమించాలని నా ప్రగాఢవాంఛ.

ఈశ్వరప్రగడ. హరిబాబు
LL.B., F.C.A
CHARTERED ACCOUNTANT
10-5-64/1, మామిళ్ళగూడెం,
ఖమ్మం - తెలంగాణ - 507001.

**YUGA DHARMAM PRAJASWAMYAM**
*Written by: Eeshwarapragada Haribabu*

Published by: Darshanam Devotional Magazine